# జగత్ సత్యం-బ్రహ్మామిధ్యా

అనే పుస్తకం రాయడానికి
కారకులు, ప్రేరకులు అయిన

వేదాంత విద్యావిశారద

## గుత్తా చలమయ్య గారితో

ఇది నా

పరిచయం

గుత్తా రాధాకృష్ణ
(భౌతికవాది)
పుష్పగిరి-మద్రాసు

# జగత్ సత్యం - బ్రహ్మమిధ్య

అనే పుస్తకం రాయడానికి

కారకులు, ప్రేరకులు అయిన

వేదాంత విద్యా విశారద

# గుత్తా చలమయ్య గారితో

ఇది నా

# పరిచయం

తాత్విక విద్యా విశారద

గుత్తా రాధాకృష్ణ (భౌతికహిత)

పుష్పగిరి

మద్రాసు - 601 301

భౌతికవాద ప్రచురణలు,
పుష్పగిరి.

ప్రచురణ : 1987
ప్రతులు : 1000

వెల : రు. *25-00*

ప్రతులు దొరుకుచోట్లు :
గుత్తా రాధాకృష్ణ (భౌతికహిత)
పుష్పగిరి- మద్రాసు- 601 301

రావూరి అర్జునరావు
గౌరీశంకర పురం
గుడివాడ- 521 301
కృష్ణాజిల్లా.

హేతుశ్రీ - D. No. 5-18-11
ప్యాడిసన్‌పేట, తెనాలి- 522 201
గుంటూరుజిల్లా.

ముద్రణ :
లిబర్టీ ప్రింటర్స్ (న్యూ), చీరాల.

# విశ్వమానవ కల్యాణ భవనం



- జ్ఞాన కేంద్రం -

ఈ భవనం మా స్వగ్రామమైన పెదపులివర్రు శివారు గుత్తావారి పాలెంలో వున్నది. దీనిని మా నాన్నగారు డెబ్బది సంవత్సరాల క్రితం కట్టించారు. ఈ భవనంలో రాజకీయ, సాంఘిక, తాత్విక సంబంధమైన సభలు తరచుగా జరుగుతూ వుండేవి. అంతేకాక అనేక సాంఘిక సంస్కరణ కార్యక్రమాలు జరుగుతూ వుండేవి. మా నాన్నగారు దైవభక్తులుగా వున్న కాలంలో (1930 కి పూర్వం) భక్తికి కేంద్రంగా వుండేది. కాలక్రమంలో అది జ్ఞానానిది కేంద్రంగా మారింది. 1947 వ సంవత్సరం మా రెండవ అన్న రామానుజయ్యగారి కుమార్తె 'భారతి' వివాహ కార్యక్రమ సభకు అధ్యక్షత వహించిన ఆవుల గోపాలకృష్ణమూర్తిగారు ఆ వేదికనుండి మాట్లాడుతూ ఈ విశ్వమానవ కల్యాణ భవనంలో జరుగుతూ వున్న ఈ వివాహం విశ్వమానవ సౌభ్రాతృత్వానికి సహాయకారి కాగలదని అన్నారు. ఈ భవనం విశ్వమానవ కల్యాణ భవనం అనే పేరుని సార్థకం చేసుకున్నది.

# కృతి సమర్పణ

మమతా మమకారాలతో మమ్ములను పెంచి పెద్దవాళ్ళను కావించిన నాన్నగారికి అమ్మగారికి



మా నాన్న చిన నరసయ్య



మా అమ్మ లలితమ్మ

వేదాంత విద్యా విశారద, సదానంద

# గుత్తా చలమయ్యగారు



## "త్వమేవాహం"

త్వమేవాహం అనే వాక్యాన్ని అర్థం చేసుకుని తన వ్యావహారిక జీవితంతో సమన్వయపరచి తన ఆచరణద్వారా ఆ వాక్యానికి ఉత్తమ అర్థాన్నిచ్చిన వ్యక్తి అన్న చలమయ్యగారు. "త్వమేవాహం" అంటే తాత్వికంగా నీవు, 'నేను' ఒకటే అని అర్థం. ఆ అర్థాన్ని తన వ్యావహారిక జీవితంలో నిజం చేసిన సార్థకజీవి అన్నగారు. అందరిని తనలో చూచుకునే తత్వవేత్తలను నేనెరుగుదును. కాని, అన్నగారు తనను అందరిలోను చూచుకునేవారు. అందరిని తనలో చూచుకోవటం సామాన్యదశ, అందరిలోను తనను చూచుకోవటం ఉత్తమదశ. అందరిని తనలో చూచుకోవటంలో స్వార్థం ఏర్పడుతుంది, తనను అందరిలోను చూచుకోవటంలో నిస్వార్థ తత్వం అలవడుతుంది. స్వార్థతత్వం యెవ్వరికి వుండకూడనిది. నిస్వార్థ తత్వం అందరికి కావలసింది. స్వార్థం మనిషిని సంకుచితపరిస్తే నిస్వార్థ తత్వం మనిషి అంతరాన్ని విశాలపరుస్తుంది. అప్పుడే 'త్వమేవాహం' అనే వాక్యం కార్యరూపం పొందుతుంది. అందుచేతనే "త్వమేవాహం" అంటే అన్నగారు గుర్తుకు వస్తారు

# మార్గ దర్శకులు

'మార్గదర్శకులు' అనే డాక్యుమెంటరీ చిత్రంలోనిది ఈ గ్రూపుఫొటో



-సప్తస్వరాలు-

1 సుబ్రహ్మణ్యం (కార్మికుడు) 2 శ్రీనివాసరావు (కవి) 3 రాధాకృష్ణ (సైంటిస్టు) 4 వీరరాఘవయ్య (సైనికుడు) 5 రాజరత్నమ్మ (రాజకీయవాది) 6 చలమయ్య (వేదాంతి) 7 రామానుజయ్య (రైతు). మా అన్నదమ్ములతో కలసి మా అక్కగారు కూడా ఇందులో నటించారు.

దేశానికి రైతు వెన్నెముక అని అంటూ వుండటం వింటూ వుంటాం. అది దృష్టిలో పెట్టుకుని కథ, మాటలు, పాటలు వ్రాసి ఈ డాక్యుమెంటరీ చిత్రాన్ని తయారు చేశారు మా అయిదవ అన్న శ్రీనివాసరావుగారు. వారే ఈ చిత్రానికి దర్శకులు కూడా.

తాత్విక విద్యావిశారద

గుత్తా రాధాకృష్ణ (భౌతికహిత)



## నన్ను గురించి నేను

నన్ను గురించి నేను చెప్పుకోవటం అంటే హాస్యాస్పదంగాను, అతిశయోక్తిగాను వుండవచ్చు. మరి నన్ను గురించి ఇతరులు చెప్పే టంతటి పెద్దవాణ్ణి గొప్పవాణ్ణి కాదు. నేనెలాగూ గొప్పవాణ్ణి కాదు కనుక నా పుట్టినరోజు పండగంటూ నేను చేసుకోవటం లేదు, ఇతరులూ చేయటం లేదు. అందుచేత నా పుట్టిన తేది నాకు తెలియదు, నేను చెప్పలేను. అయినా నాకు అరువది సంవత్సరాల వయస్సు అని చెప్పుకుంటున్నాను కనుక 1927 వ సంవత్సరంలో నేను పుట్టి వుంటాను. నా బాల్యంలో నేనేమీ ఘన కార్యాలు చేయలేదు (నేను బాలకృష్ణను కాదు కనుక) ఆ ఘనకార్యాల కథలు చెప్పటానికి. అయినా నా చిన్నతనంలో నా సమక్షంలో జరిగిన చిన్న చిన్న సంఘటనల గురించిన జ్ఞాపకాల కథలు ఒకటి రెండు చెబుతాను.

# XIII

మా గ్రామ శివారులో ఏడు మాలపల్లెలున్నై. అందులో నివసించే వారు మాలవారు, అంటరాని మానవులు (ఆ రోజుల్లో అలా అనేవారు గనుక అలా అన్నాను, అన్యథా భావించవద్దు). మా యింటికి రెండు ఫర్లాంగుల దూరంలో ఒకపల్లె వున్నది. ఆ పల్లెలో నివసించేవారు మాటున్న పూల, పండ్ల తోటల్లో పనులు చేస్తూ వుండేవారు. వారిలో ఒకతను నేనంటే చనువుగా ఆప్యాయంగా వుంటూ వుండేవాడు. ఒకరోజున తన యింటికి రమ్మని అడిగాడు. నేను సరేనన్నాను. నన్ను వెంట బెట్టుకొని తీసుకవెళ్ళాడు. నన్ను కూర్చోపెట్టటం కోసం ప్రక్క యింటికి పెళ్ళి కుక్కి నులకమంచం తెచ్చి వాల్చి నన్ను కూర్చోమన్నాడు. నేను కూర్చున్నాను. అదొక వింత ప్రదేశ మనిపించింది అక్కడ పరిస్థితులు చూస్తూవుంటే. మా యింటికి అంత సమీపంలోవున్నా ఆ పల్లెకు నేనంతకు ముందెప్పుడూ వెళ్ళలేదు. బహుశా అప్పటికి మా గ్రామవాసు లెవ్వరూ కూడా వెళ్ళివుండక పోవచ్చు. అదొక నిషిద్ధ ప్రదేశమని అనుకుని వుండ వచ్చు.

నన్ను కూర్చోబెట్టి యెక్కడికో వెళ్ళిన అతను కొంత సేపటికి ఒక చిన్నపాత్ర (గ్లాసుకాదు) తో వచ్చాడు. ఆ తెచ్చిన పాత్ర నాకిచ్చి త్రాగండి అన్నాడు యెంతో సంతోషంగా ముఖం పెట్టి. ఏమిటి అన్నాను, పాలు అన్నాడు. నేను త్రాగటానికి ప్రయత్నించాను ఒక గుటక మ్రింగాను ఉప్పుకలిపిన పాలు. పైగా చల్లగా వున్నై. సహించలేదు. త్రాగ బుద్ధి పుట్టలేదు (వెచ్చని పాలలో పంచదార కలిపి త్రాగనేర్చిన వాడు ఆ పాలు రుచించలేదు). కాని, ఆ పాలు నేను త్రాగితే చూచి సంతోషించాలని యెదురు చూస్తూవున్న ఆ అమాయక వ్యక్తి ముఖం చూస్తూ అలాగే త్రాగేశాను (జిహ్వకు ప్రాధాన్యత లేదనుకుంటూ). నేనలా త్రాగటం చూస్తూవున్న ఆ వ్యక్తి ముఖంలో ఆనందం కనిపించింది. ముఖం చేటంతైంది. నేనలా ఆ పల్లెకువెళ్ళి అతని యింట కూర్చోవడం అతను ఇచ్చిన పాలు త్రాగటం చూస్తూవున్న ఇరుగు పొరుగువారు కూడా ముసిముసి నవ్వులతో యేదో చెప్పుకోవటం గమనించాను. నేను అక్కడినుండి వచ్చేసిన తరువాత వారంతా ఒకచోటచేరి ఆ వింత కార్యాన్ని గురించి చెప్పుకున్నారట. కమ్మోరబ్బాయి (దొరగోరబ్బాయి) మన పల్లెకు వచ్చి మన యింటిముందు కూర్చుని మనం ఇచ్చిన పాలు త్రాగటం యెంత చోద్యం,

ఎంత విడ్డూరం అనుకున్నారట. నన్నాపల్లెకు తీసుకవెళ్ళిన ఆ వ్యక్తి ఆ విషయం నాకు చెప్పి నవ్వుకున్నాడు, ఆనందించాడు. తనేదో పెద్ద ఘన కార్యం సాధించాననే తృప్తి అతని మాటల్లో వినపడింది, అతని ముఖంలో కనపడింది.

అలా నేనాపల్లెకు వెళ్ళటం అక్కడ వారిచ్చిన ఆ పాలు త్రాగటం తెలుసుకున్న నాతోటి విద్యార్థులు నన్ను యేదో నేరంచేసిన నేరస్థుడిలాగా చూడటం, ఏదో చెప్పుకుని నవ్వుకుంటూ వుండటం గమనించాను. నాతో సన్నిహితంగా వుండే విద్యార్థులు (స్నేహితులు) నాకు దూరంగా తిరుగుతూ వుండటం గ్రహించాను, అదొక విచిత్రానుభవం. నేనేమి వేరేపల్లెలో వెన్నముద్దలు దొంగలించలేదే! మా (మాల) పల్లెలో మా వాళ్లు యిచ్చిన పాలు త్రాగాను. అదొక పెద్ద నేరమా? అనిపించింది నాకు.

జంతువులను బోనుల్లో బంధించి వాటి స్వేచ్ఛను అరికట్టి వాటిని చూచి వినోదిస్తూ వుంటాం కాని మానవులను ఊరి బయట వుంచి (కులం పేర బంధించి) వినోదిస్తూ వున్నాం, ఇదొక అద్భుతమైన వినోదంకదూ?

నేను పుట్టకముందు పది సంవత్సరాలకు పూర్వం (1917) మా యింట్లో పాలు పితకటానికి ఉపయోగించే చెంబుని అంటుకున్నాడని (హరిజనుడు) అంటు దోషం పోవటానికిగాను ఆ చెంబుని నిప్పుల్లో కాల్చి రెండు అడుగుల లోతు భూమిలో పాతిపెట్టి ఏడు రోజుల తర్వాత దానిని తీసి బూడిదతో తోమి కడిగి అంటు దోషం పోయిందని అనుకుని అప్పుడు ఉపయోగించు కున్నారట ఆ చెంబుని. మా కుటుంబ పెద్దలు ఈ సంగతి చెప్పి నవ్వుకునేవారు (వారి అజ్ఞానానికి). అప్పటికి ఆసంగతి గుర్తించిన మా పెద్దలవల్ల నేను పొందిన లాభం అదే.

మా గ్రామంమధ్య నడివీధిలో పోతురాజుశిల వున్నది. వర్షాలు సకాలంలో వర్షించనప్పుడు వర్షాల నాశించి ఆ శిలపై కొన్ని వందల బిందెల నీరు పోసేవారు మా గ్రామ ప్రజలు. (అలా ఆ శిలపై నీరుపోస్తే వర్షం కురుస్తుందని వారి నమ్మకం). అలా ఊరిబయట రెండు ఫర్లాంగుల దూరంలోవున్న చిన్న చెరువులోకి ప్రవహించేదాకా నీరు పోసేవారు. ఆ కార్యక్రమంలో యెంతో సంఘీభావం కనపర్చేవారు అలా నీరు పోయటానికి, వర్షం కురవటానికి సంబంధం యేమిటని నాకనిపిస్తూ

వుండేది. మరి ఆ గ్రామ ప్రజలకు ఎలా అనిపించేదో నాకు తెలియదు. అజ్ఞాన విషయంలో కలిసికట్టుగా వుంటారు మన ప్రజలు. జ్ఞాన విషయం వచ్చేసరికి భేదిస్తారు. వింత మనస్తత్వాలు! జ్ఞాన విషయమైతే ఆలోచించాలి. అజ్ఞాన విషయమైతే ఆలోచించకనే అనుసరించవచ్చు. అది సులభం కదా!

ఒక రోజున ఆ శిలపై కాలుపెట్టి నిల్చున్నారు మా నాలుగవ అన్న సుబ్రహ్మణ్యం గారు. అది చూసిన మా గ్రామ ప్రజలు సహించలేక పోయారు. శాపమన్నారు, పాపమన్నారు, అపచారమన్నారు, చివరకు ఆగ్రహపడ్డారు. గ్రామానికి కీడు కలుగుతుందన్నారు, ఆ కీడు తొలగటానికి యేదో శాంతి కర్మలు చేయాలన్నారు. అన్నగారు అందు కంగీకరించలేదు. తాత్త్విక జ్ఞానం నుండి వచ్చిన నిబ్బరం, ధైర్యం అనుకుంటాను ఆ రోజుల్లో పెద్ద సంచలనం కలిగించింది ఆ సంఘటన. అకాల వర్షాలవల్ల, అధిక వర్షాలవల్ల మా గ్రామ ప్రజలు చాలా ఇబ్బందులు పడుతూ వుండేవారు. కాని, ఏ సందర్భంలోను ఆ పోతురాజు ఆదుకున్న దాఖలాలేదు.

మాకు వ్యవసాయ పనులు చేసేవారిలో యెక్కువగా హరిజనులే వుండేవారు. మా కుటుంబమంటే యెంతో గౌరవంగా వుండేవారు. మా కుటుంబపెద్దలు కూడా వారి యెడల సానుభూతిగా వుంటూ వారి అవసరాలకు తగినట్లు సహాయ సహకారాలందిస్తూ వుండేవారు. అంతేకాక వారిని కులరీత్యా తక్కువ వాళ్ళుగా చూడకపోవటం అంటరాని వాళ్ళనే భావంతో కాక మామూలు మానవులుగానే చూడటంకూడా ఒక కారణ మనుకుంటాను.

మా తోటలో పనిచేసే వారిలో సత్తులు (సత్యం) అని ఒకతనుండే వాడు. అతను పాము కాటుకి మందువేస్తూ వుండేవాడు. మందు బాగా పని చేస్తుందని, చాలామంది ప్రాణాలు కాపాడాడని చెప్పుకుంటూ వుండేవారు. పొరుగూళ్ళనుండి వచ్చి అతనిని తీసుకువెళ్తూ వుండేవాళ్ళు పాము కాటుకి మందు వేయించుకోవటానికని. డబ్బుమాత్రం ఇచ్చేవాళ్ళుకాదు. తన పని చెడి అలావచ్చి సహాయ పడ్డాడనే ఇంగితం వారిలో వుండేదికాదు. చిత్రమైన మనస్తత్వాలు! స్వార్థ తత్వాలు!!

రోజుకూలి చేసుకునే మనిషికదా! చేస్తూవున్న పని మధ్యలో ఆపి ఆ పనిపై వెళ్ళిపోతూ వుండేవాడు. అలా పని మధ్యలోఆపి వెళ్ళిపోతాడనే

ఉద్దేశంతో అతనిని పనికి పిలిచేవారుకాదు ఇతర రైతులు. ఎవరి స్వార్థం వారిది. అది తెలుసుకున్న మా రెండవ అన్న రామానుజయ్యగారు అతనిని నిరంతరంగా మా తోటలోనే వుండమన్నారు. పనివున్నా లేక పోయినా అలాగే మా తోటలో పనిచేస్తూ వుండేవాడతను. అదికూడా విడ్డూరంగానే వుండేది మా గ్రామ వాసులకు. సహకార స్వభావం సన్నగిలినప్పుడు మనిషిని తన ప్రయోజనాలకు వినియోగించు కుంటారేగాని అతని అవసరాలేమిటని ఆలోచించరు ప్రజలు.

ఒకరోజు అతనిని వెంటబెట్టుకుని తీసుకువెళ్ళి మా గ్రామంలోవున్న లైబ్రరీ హాలులో తన ప్రక్కన కూర్చోబెట్టుకున్నారు అన్నగారు. ఆ పని గ్రామ పెద్దలకు నచ్చలేదు. బ్రాహ్మణ, కమ్మ, కాపు వగైరా పెద్దకులాల వారు కూర్చునే ఆ లైబ్రరీలో ఒక హరిజనుడు కూర్చోవటం అంటే సహించలేక పోయారు. కుల అహంకారం కొండ్రించింది, కాలు దువ్వింది. ఆ పని చేసినందుకు మా అన్నగారిపై విరుచుక పడ్డారు. పెద్ద దెబ్బలాట జరిగే పరిస్థితి యేర్పడింది. అయినా అన్నగారు చలించలేదు. నైతిక బలం అటువంటిది. ఆనాటి ఆ సంఘటనకు కారణం కనిపించలేదు నాకు. కులం పేరుతో మనిషిని మనిషి దూరం చేసుకోవటం నాగరిక మనిపించుకోదు అనిపించింది ఆ చిన్న వయస్సులో నా కెందుకో.

పాము కాటుకి మందు వేయవలసి వచ్చినప్పుడు అతని కులం చూడలేదు. మందు వేయించుకునే వారుకూడా ఆ సమయంలో అతను అంటరానివాడు అనుకోరు. అతను ఆ సమయంలో యెక్కడికో పరుగెత్తి మందుకు కావలసిన మూలికను తెచ్చి దాని రసంతీసే ప్రయత్నంలో నోటితో నమిలి ఆ రసాన్ని మందుగా వాడేవాడు. ఆ సమయంలో పాము కాటుచే ప్రాణం పోగొట్టుకుంటున్న వాని ప్రాణం రక్షించటమే అతని లక్ష్యంగాని అతను కమ్మ కులస్తుడా? బ్రాహ్మణ కులస్తుడా అని ఆలోచించే సంకుచితం అతనికి లేదు.

అందరి మానవులను దేవుడే సృష్టించాడని ఆస్తికవాదం చెబుతుంది. అందరు మానవులు పరిణామంలో వచ్చారని భౌతిక పరిణామ వాదం చెబుతుంది. మొత్తంమీద అందరిని మానవులనే అంటున్నాం. కాని, కొందరు ఊరిబయట, కొందరు ఊరిలోను నివసించటం ఏమిటనిపించేది నాకు.

ఈ వైపరీత్యాలకు కారణం కనిపించేదికాదు నాకు. ఆనాడు అర్థం చేసుకునే వయస్సు కాదేమో ననుకుంటాము. అప్పటికి నాకు ఎనిమిది సంవత్సరాల వయస్సుండవచ్చు నేను మూడవ తరగతి చదువుకునే రోజులవి.

ఆ వయస్సులో జరిగిన ఆ సంఘటనలన్నీ బాగా జ్ఞాపకం వున్నై. ఇప్పటికీ కళ్ళకు కట్టినట్లు కనిపిస్తూనే వున్నై. బలంగా మనసులో ముద్ర పడి వుండవచ్చు. ఆ కారణంగానే వాటిని ఇప్పుడు చెప్పగలుగుతున్నాను. ఒక సంవత్సర కాలంలో జరిగిన సంఘటనలు మాత్రమే ఇప్పుడు చెప్పాను మిగిలినవి మరెప్పుడైనా వీలు కలిగినప్పుడు చెప్పుకుందాం.

నన్ను గురించి నేను వ్రాయాలనుకున్నప్పుడు నేనేమి ఘనకార్యం చేశానని నేను వ్రాయాలి? అనిపించింది. బహుశా ఈ సంఘటనల ప్రభావం నాపై యెలా పనిచేస్తూ వున్నదో యేమో నా చేత యిలా వ్రాయించింది.

ఈ మధ్య మా గ్రామం వెళ్ళినప్పుడు ఆ హరిజన పల్లెకు వెళ్ళాను చూద్దామని, వారిని పలకరిద్దామని. ఆనాడు ఆ ప్రజలు యెలా వున్నారో ఈనాడూ అలాగే వున్నారు. తాటి ఆకుల గుడిసెలు, కుక్కి నులకమంచాలు. యెంత నిబ్బరాన్ని కలిగించింది వారికి మన (మత) తత్వశాస్త్రం అనిపించి చిరునవ్వు నవ్వుకున్నాను. వారిలోకూడా అవాటి ఆ చిరునవ్వు, ఆ పలకరింపు అలాగే కనిపించింది. ఏబది సంవత్సరాలకు పైబడిన ఈ కాల అంతరంలో యెన్నో మార్పులు వచ్చినై. కాని, ఊరి కావలవున్న ఆ పల్లెల్లో ఏ మార్పు కనిపించలే దనిపించింది నాకు.

1925 వ సంవత్సరంలో జరిగిన ఆ సంఘటనల గురించి చెప్పాను. ఆ తరువాత మేము మద్రాసులో వుంటూవున్న సమయం 1975 వ సంవత్సరంలో అంటే నలుబది సంవత్సరాల తరువాత జరిగిన ఒక చిన్న విషయం చెప్పి ముగిస్తాను.

మా అయిదవ అన్న శ్రీనివాసరావుగారి రెండవ కుమార్తె హలం. సినిమాలలో నటిస్తూ బాగా పేరు సంపాదించు కుంటున్న రోజులవి. ఒక రోజు సినీ పత్రికలవారు 'హలం' తో యింటర్వ్యూ చేయాలని వచ్చారు. ఆ యింటర్వ్యూలోని మొదటి ప్రశ్న పేరుని గురించి. 'హలం' అనేపేరు మీ పెద్దలు పెట్టిన పేరా? లేక సినిమావారు పెట్టినవారా? లేక సినిమా రం

గానికి వచ్చిన తరువాత మీరు పెట్టుకున్న పేరా? అని. 'హలం' అనే పేరు మా నాన్నగారు పెట్టినపేరు. మా నాన్నగారు నాస్తిక భావాలు గలవారు కావటంచేత కుల, మతాలను సూచించే పేరు కాకుండా వుండాలని పెట్టిన పేరది అన్నది 'హలం'.

అయినా వారికి అనుమానం తీరలేదు. 'హలం' అంటే అర్థం యేమిటని అడిగారు. 'హలం' అంటే నాగలి అని అర్థం అని చెప్పింది 'హలం'. ఆ తరువాత కులం ప్రస్తావన వచ్చింది ఆ యింటర్వ్యూలో. నాకు కులం లేదు, మానవ కులమే మా కులం అన్నది 'హలం'. అందుకు కొంత ఆశ్చర్యం, మరికొంత ఆశాభంగం కలిగింది వారికి. కారణం పేరులోను, రూపంలోను కులమతాలను చూడాలనుకున్న వారికి ఆ సమాధానంవల్ల 'హలం' కులంగాని, మతంగాని, యేమిటనేది అర్థం కాలేదు. అదే వారి ఆశాభంగానికి కారణం.

అలా అర్థంకాని పరిస్థితులలో ఆ తరువాత 'అలం' అని "హలం" పేరుని మార్చి వ్రాస్తూ వచ్చినవి సినిమా పత్రికలు. అంటే 'హలం' మహమ్మదీయ మతస్థురాలు అనుకుని అలా వ్రాయటం మొదలు పెట్టారు. ప్రతి మనిషిపేరు యేదో ఒక కులానికో మతానికో అంటిపెట్టుకుని వుండాలి, వుంటుంది అనే అహేతుకమైన ఆలోచనే అందుకు కారణం. సినిమా రంగంలో పనిచేసే ప్రతివ్యక్తి అలా అనేక రకాలుగా అడుగుతూనే వుండే వారట. యెలాగైనా 'హలం' కులం, మతం యేమిటనేది తెలుసుకోవాలని.

ఒకరోజు అన్న చలమయ్యగారితో 'హలం' ఈ విధంగా అన్నది. పెదనాన్నా ఈ కులం, మతం అనేది యేమిటి? వీటిమీద వీరికి యెందుకింత వ్యామోహం? సినిమా రంగంలో పనిచేస్తూవున్న వారిలో చిన్న పెద్ద అనే తేడా లేకుండా ఈ కులం పిచ్చివున్నది. పెద్దవాళ్ళ మనుకునే నిర్మాతలలోను, దర్శకులలోను, రచయితలలోను, నటులలోను ఈ కుల అభిమాన, దురభిమానాలు యెక్కువగానే కనిపిస్తూ వున్నై అన్నది 'హలం'. సినిమా రంగంలో పెద్దవాళ్ళ మనుకునే వాళ్లు ఆ రంగంలో పెద్దవాళ్లు కావచ్చు కాని, తాత్విక రంగంలో వాళ్ళు చిన్నవాళ్ళేనమ్మా అన్నారు అన్నగారు. అది విని నవ్వుకున్నది 'హలం'. అప్పుడు నాకనిపించింది నలుబది సంవత్సరాల కాల అంతరంలోకూడా కులం అనే సంకుచిత భావంలో యే మార్పు రాలేదని.

నన్ను గురించి నేను వ్రాయాలను కున్నప్పుడు నా చిన్ననాటి ఆ జ్ఞాపకాలతోపాటు ఈ జ్ఞాపకం కూడా వ్రాయా లనిపించింది. ఇంతకంటే నేనేమి వ్రాయగలను? అనుభవాల జ్ఞాపకాలకంటే మించిన జ్ఞాన మేముం టుంది?

## అన్నగారిని గురించి కొండవీటి

ఎవడురా బ్రాహ్మణుడు? ఎవడురా బ్రహ్మర్షి? ఎవడురా రాజర్షి? అని వజ్రసూచికోప నిషత్తులో ప్రశ్నించాడు. వజ్రమంతటి బిగువు, పదును, శక్తి గలదన్నమాట ఆ నాటి ఆ ప్రశ్న.

అలాగే ఈనాడు ఈ సమాజాన్ని ప్రశ్నిస్తున్నారు చలమయ్యగారు. కులమంటే యేమిటి? మతమంటే యేమిటి? బ్రహ్మమంటే యేమిటి? బ్రహ్మ విద్య అంటే యేమిటి? బ్రహ్మవేత్త అంటే యెవరు?

చతుర్వేదములు చదివినవాడు బ్రాహ్మణుడు కాదు, ఉపనిషత్తులను ఔపాసన (బట్టీ) పట్టినవాడు బ్రాహ్మణుడుకాదు. సదా (నిత్య) గీతా పారాయణం చేసినవాడు బ్రాహ్మణుడు కాదు. శతకోటి రామకోటిని వ్రాసి నంత మాత్రంచేత బ్రాహ్మణుడు కాదు, భక్తుడు కాదు.

ఎవడు సర్వ మానవులను తనతో సరిసమానంగా చూడగలడో అతడు నిజమైన బ్రాహ్మణుడు, బ్రహ్మవేత్త. కులమత భేదబుద్ధి యెవడికి వుంటుందో అతడు బ్రహ్మర్షి కాలేడు, రాజర్షి కాలేడు. అందుచేత ఉన్నత తాత్విక సిద్ధాంతాలను వల్లిస్తూ వున్నంత మాత్రంచేత కించిత్తు ప్రయోజన ముండదు. అటువంటి ఉత్తమ తాత్వికాంశాలను అర్థం చేసుకున్నంత మేరకు ఆచరించినవాడే ఉన్నతుడు కాగలడు.

తత్వానికి నిజమైన అర్థాన్నిచ్చి సార్థకతను కల్పించినవాడు ఉత్త ముడు. తన ఆచరణద్వారా తాను చెప్పే సిద్ధాంతానికి సార్థకతను సమ కూర్చిన ఆదిగో ఈ చలమయ్యగారు అదిగో ఆపైన చెప్పినట్లు ఆ బ్రహ్మ వేత్త కోవలోకి వస్తారు.

చలమయ్యగారు నాస్తికుడా? ఆస్తికుడా? అన్న ప్రశ్న మనకొద్దు. అలాగే శంకరుడుకూడా ఆస్తికుడా? నాస్తికుడా? అనేదికాదు ప్రశ్న, అది

అప్రస్తుతంకూడా. నాస్తికుణ్ణి అంటే చెప్పేది వినేవారుండరు, ఆస్తికుణ్ణి అని చెబితే వినేవారున్నారు గనుక, వినటానికి వస్తున్నారు గనుక అందుకోసం పెట్టుకున్న పేరు, వేసుకున్న వేషం గాని శంకరుడు ఆస్తికుడు అనేదాని కంటే, నాస్తికుడు అనడానికి కొన్ని వందల ఆధారాలు దొరుకుతై. అలాగే కులం, మతం అక్కరలేదని చెప్పినట్లు కొన్ని వందల, వేల ఆధారాలు దొరుకుతై. నేను సేకరించిన ఆధారాలే కొన్ని వందలున్నై. మతస్థులు వ్రాసుకున్న గ్రంథాలనుండే మనకి ఆధారాలు దొరుకుతూ వున్నై. అందుచేత ఈనాడు చలమయ్యగారు చెప్పేది ఆస్తికమా? నాస్తికమా? అనే ప్రశ్న మనకొద్దు. ఈ కాలానికి అవసరమైన, అనుకూలమైన ఆలోచనలు అందులో వున్నై. వారుచెప్పే ఆ మాటలు మనం అర్థం చేసుకుని అందులోని మంచిని గ్రహించి ఆచరించటానికి ప్రయత్నించుదాం. ఎంత మంచి సిద్ధాంతమైనా ఆచరణ లేనిదే అది యెందుకూ పనికిరాదు. ఆచరణ ద్వారానే సిద్ధాంతం యొక్క మంచి చెడ్డలు నిరూపణ కావాలి.

నిజంగా చెప్పాలంటే ఈ కుటుంబం ఒక కులంకాదు, ఒక మతం కాదు, ఒక దేశం కాదు, ఏదీ కాకుండా పోయింది, ఏదని చెప్పటానికి లేకుండా పోయింది. నానాజాతిసమితి అన్నట్లుగా అయిపోయింది. జాగత్త కోసం కాదుకాని విశ్వమానవ కుటుంబం అనే మాటలు వింటూ వుంటాము. కాని, ఇక్కడ ఆచరణ పూర్వకంగా ఈ కుటుంబాన్ని చూస్తూ వున్నాం. అది వారి తాత్విక సమన్వయ జ్ఞానానికి నిదర్శనం అనుకుంటు న్నాము.

అందుచేత సిద్ధాంతం చెబితేనే చాలదు. దానిని ఆచరించడానికి ప్రయత్నించాలి, ఆచరించాలి. ఆచరణ సిద్ధాంతానికి ఊపిరి, సిద్ధాంతం ఆచరణకు పట్టుగొమ్మ, అనేది మనం అర్థం చేసుకుని నడుచుకోవాలి.

(భౌతిక విజ్ఞాన తరగతుల సందర్భంగా కొండవీటి వేంకటకవి గారు అధ్యక్షులుగా వున్న సభలో అన్న చలమయ్యగారు ప్రసంగించారు. ఆ ప్రసంగానంతరం అధ్యక్ష స్థానంనుండి వేంకట కవిగారు చేసిన ప్రసంగం నుండి ఒక భాగం).

# 'పరిచయం' పరిచయం

'అన్నగారితో నా పరిచయం' అన్న యీ గ్రంథానికి పరిచయం రాయండి అని గ్రంథకర్త రాధాకృష్ణగారు కోరినప్పుడు మొగమోటానికి సరే అన్నాను కాని నిజంగా భయమేసింది. ఎందుకంటే, పూసల్లో దారం లాగా, గ్రంథ మంతటా వ్యాపించివున్న అద్వైత తత్వంలో నేనేమీ అందె వేసిన చేతినికాను. అయినా, ఒకసారి రాస్తానన్నాను కనుక, పిల్లి మెడలో గంటకట్టే యీ సాహసానికి పూనుకోక తప్పలేదు.

* * * *

ఆరుగు రన్నదమ్ములలో జ్యేష్ఠుడైన చలమయ్య గారిని కనిష్ఠుడైన రాధాకృష్ణగారు పరిచయం చేస్తున్న కథనమే ప్రధానంగా యీ గ్రంథం. ఇది మన పాఠశాలల్లో బోధించే చరిత్ర ఫక్కీలో జనన-జీవన-మరణాల భోగట్టాగా సాగలేదు. 'మానవజాతి చరిత్ర అంటే భావాల చరిత్రే' అని హెగెల్ అన్నట్లు— ఇక్కడ వివిధ జీవిత రంగాలలో చలమయ్య గారి భావాల చరిత్రకే గ్రంథ రూపం కల్పించారు రాధాకృష్ణగారు. ఈ పుస్తకం చూస్తుంటే బాస్వెల్ ఆంగ్లంలో ప్రతిభావంతంగా రచించిన 'జాన్సన్ జీవితం' గుర్తుకు వస్తుంది దీనిలో చలమయ్యగారి భావాల లోతు పాతులతో పాటు స్వభావంలోని మిట్టపల్లాలు కూడా మనం చూడవచ్చు. రాధాకృష్ణ గారికి తాత్వికగురువు తన సోదరి రాజరత్నమ్మగారే అయినా చలమయ్య గారితో అత్యంత సన్నిహితంగా సంచరించే అవకాశం కలిగినందువల్ల యీ కథనం సారవంతంగా సాగింది. పైగా ఇది రాధాకృష్ణగారి తొలిరచనే అయినా, చేయి తిరిగిన వారి రచనలను సైతం తలదన్ని రసవత్తరంగా రమ్యంగా రూపొందుట విశేషం.

చలమయ్యగారి పరిచయాలు బహుముఖమైనవి. ఆయన ప్రతిభ కూడ బహుముఖమైనదే. సత్య నిర్ధారణకు వాద ప్రతివాదాలే పట్టుగొమ్మ అన్న దృఢవిశ్వాసం వారికి బాగా జీర్ణమై పోయింది. వివాద భీరుత్వమంటే యేమిటో యెరుగరు. అందుకు ఆధారాలు అనేకంగా చూపించారు రాధాకృష్ణగారు. సంభాషణా చాతుర్యం, భావ గాంభీర్యం, తర్క ప్రాచుర్యం చలమయ్య గారికి ఒంటపట్టిన విద్యలు. ఇతరులను ప్రభావితుల్ని చెయ్యటానికే కాదు, తాము ప్రభావితుడు కావటానికి కూడా చర్చలను సాధ

నాలుగా భావించే సద్గుణం మూలంగా ఆయన హేతువాదులకు మార్గదర్శిగా కనిపించేవారు. లేకపోతే తన అద్వైత పీఠంనుంచి చివరి రోజుల్లో 'జగత్తు సత్యం' అని చాటటమంటే సామాన్యమా? అందుకు ఎంత ఆత్మవిశ్వాసం కావాలి? ఎంత సాహసం కావాలి?

అసలు చలమయ్య గారికి అద్వైతం ఒక విశ్వాసంకాదు అది ఆయన నరనరాల్లో జీర్ణించి మనో-వాక్-కాయ కర్మల్ని ప్రభావితం చేసిన తత్వసారం. అందుకే ఆయన ద్వైతాన్ని ధ్వని రూపంగా కూడా సహించేవాడు కాదు. తనకు సహజమైన వ్యంగ్య ధోరణిలో ద్వైతాన్ని ఎలా అపహాస్యం చేసి అద్వైతాన్ని ప్రతిష్ఠించేవారో చూడాలంటే ఈ గ్రంథంలోని 'శిశుపాలుని వధ - నారదుని మొర' అన్న శీర్షిక ఒక నిదర్శనం. అలాంటి ఘట్టాలు అనేకం.

అసలు గుత్తావారిది విచిత్రమైన కుటుంబం. అలాంటి కుటుంబాలు ఆంధ్రదేశంలో ఒకటీ అరా కనిపించక పోవు. కాని యీ కుటుంబానికున్న విశిష్ట గుణాలు మరెక్కడా కనిపించవు. తమ ఘనతను గోరంతలు కొండంతలుచేసి చాటుకోవాలన్న ప్రదర్శనాత్మక బుద్ధి వీరికిలేదు. వేమన భాషలో చెప్పాలంటే 'కదలని గతితో పారే గంగ' లాంటిది యీ కుటుంబం. వీరు ఆరుగు రన్నదమ్ములు స్వతంత్ర భావాలు కలవారు. మూసలో తీసిన కాసులు కారు. చలమయ్యగారు అద్వైత తత్వానికి అంకితమైనవారు; రామానుజయ్యగారు మార్క్సిస్టు, వ్యవసాయ శాస్త్రవేత్త; వీరరాఘవయ్యగారు గాంధేయవాది, కవి; సుబ్రహ్మణ్యంగారు మార్క్సిస్టు, సర్వసమతావాది; శ్రీనివాసరావుగారు నాస్తిక తత్వవేత్త, కవి; ఇక రాధాకృష్ణగారు భౌతికాద్వైత వాదాల సమన్వయకర్త, ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్ హేతువాద సంఘ అధ్యక్షులు. వీరందరూ మనుషుల ఎనుకొనేవారే, మనుషుల్లాగా ప్రవర్తించే వారే, అలా కేవలం సంస్కరణవాదులుగా కాక సాంఘిక విప్లవ కారులుగా పేరెన్నిక గన్నవారే.

వీరిలో చలమయ్య గారిలోనూ, రాధాకృష్ణ గారిలోనూ తత్వజిజ్ఞాస భిన్న కోణాలలో పోటీపడి విలసిల్లింది. ఇద్దరివీ శత్రు శిబిరాలలాగా కని

పించినా, నిజానికి వాటిమధ్య అంతటి శతృత్వంలేదు ఈ శతృత్వ ఆభాస పర్చించే ఇతరుల చత్వారానికి ఫలితమేతప్ప మరేమీ కాదు. ఈ వాస్తవాంశానికి నిదర్శనం యీ గ్రంథ రచన.

* * * *

'జగత్తు సత్యం' అని చలమయ్యగారు ఒప్పుకున్నప్పుడు 'బ్రహ్మ సత్యం' అని రాధాకృష్ణగారు కూడా ఒప్పుకుంటే బాగుండేది అనిపించింది యీ పుస్తకం చదివినాక. 'బ్రహ్మ సత్యం' అన్న వాక్యం వినగానే చాల మంది హేతువాదులకూ భౌతిక వాదులకూ చతుర్ముఖ బ్రహ్మ కళ్లెదుట కనిపిస్తాడు, దానితో భయవిహ్వలు లవుతారు, ఇక గట్టిగా కళ్ళు మూసు కొని 'బ్రహ్మలేడు' 'బ్రహ్మలేడు' అన్న జపం ప్రారంభిస్తారు.

కాని 'బ్రహ్మ సత్యం' లో బ్రహ్మకు వాడబడ్డ సర్వనామం తత్. 'తత్త్వమసి' (తత్+త్వమ్+అసి) అంటే "అదే నీవు అవుతున్నావు" అని అర్థం. అద్వైతంలో బ్రహ్మ 'సః' (అతడు) కాదు; 'సా' (ఆమె) కాదు;'తత్' (అది) మాత్రమే. కాబట్టి ఇక్కడ బ్రహ్మ నపుంసక లింగమైనా కావచ్చు లేదా లింగ రహితం కావచ్చు వేదాంతం బ్రహ్మను లింగ రహితంగానే భావించింది. అందుకే "స్త్రీ నపుంసక పురుషమూర్తియును కాక" అన్న వర్ణనలు చోటు చేసుకున్నై. అంటే అద్వైతంలోని 'బ్రహ్మ' కూ భౌతిక వాదంలోని 'మూల పదార్థా' నికీ తేడాలేదు. అందుకే దానిని 'బ్రహ్మ పదార్థ' మంటారు. ఈ రహస్యం రాధాకృష్ణ గారికి తెలియదని కాదు. తెలిసీ తెలియని ద్వైతులూ, విశిష్టాద్వైతులూ, భౌతిక హేతువాదులూ 'బ్రహ్మ' శబ్దాన్ని తప్పుదారి పట్టించారని వారికి బాగా తెలుసు. అందుకే అపార్థాలకు నిలయంగా తయారైన ఆ పదాన్ని ప్రచారార్థంలో మిథ్యగా కొట్టివేస్తే సబబుగా వుంటుందన్న నిర్ణయానికి వచ్చారు

యథార్థానికి బ్రహ్మమును మిథ్య చెయ్యటం రాధాకృష్ణగారి ఉద్దేశం కాదు. కాని, అద్వైతులు వ్యతిరేకార్థంలో మిథ్య అయిన జగత్తును అన్వయార్థంలో కూడా మిథ్య చేస్తున్నారు కాబట్టి రాధాకృష్ణగారు బ్రహ్మన్ని మిథ్యగా వ్యతిరేకిస్తున్నట్లు స్పష్టమవుతున్నది. అందుకే జగత్తు సత్యమన్నారు. వాస్తవానికి బ్రహ్మ-జగత్తుల మధ్య ద్వైతం లేదు. 'జగత్తు సత్యం-బ్రహ్మ మిథ్య' (75వ పుట) చూడండి, స్పష్టమవుతుంది.

పదార్థ నిర్మితాలైన వస్తువులలో నామరూపాలు వస్తువుకు చెందినవి. నామరూప సహితమైన వస్తువులు ఏ క్షణానసైనా ఆ వస్తువులు కాకుండా (మారి) పోవచ్చు. కాని వాటికి మూలమైన పదార్థం వుంటున్నది. వస్తువుకు స్థిరత్వం వుండదు కనుక ఆ అర్థంలో మాత్రమే అది 'మిథ్య' అవుతుంది. వస్తు మూలమైన పదార్థం స్థిరమైనది కావటంవల్ల అది సత్యమవుతుంది. రాధాకృష్ణగారు జరిపిన యీ భౌతికవాద విచారంలో బ్రహ్మ-వస్తువుల సంబంధం ఎలాంటిదో కేవలం అలాంటిదే అద్వైత విచారంలో బ్రహ్మ-జగత్తుల సంబంధం. కాబట్టి వాటి నియతార్థాలలో "బ్రహ్మ సత్యం-జగన్మిథ్యా" అన్న వాక్యం యథార్థం కాకపోదు. అద్వైతం సత్యానికీ మిథ్యకూ ఇచ్చిన నిర్వచనాలు ఇంచుమించు స్థిరత్వ - చరత్వ భేదాలకు పరిమితాలు మాత్రమే. అయితే స్థిరమైన బ్రహ్మాన్ని తెలుసుకోవాలంటే అందుకు ఆధారం ఆభాసమానమైన చంజగత్తే కనుకనూ, అన్వయంలో బ్రహ్మమూ జగత్తూ ఒక్కటే కనుకనూ చలమయ్యగారు 'జగత్తు సత్యం' అన్న నిర్ణయానికి వచ్చారు. అది అద్వైతంలో ఉచ్చస్థాయి.

మూలమైన (బ్రహ్మ) పదార్థం పంచేంద్రియాల ద్వారా మనస్సుకు "నానావిధానూన రూపక" మైన జగత్తుగా ఎలా ఎందుకు కనిపిస్తుందో ఎవరికీ (వేదాంత వేత్తలకు కానీ, భౌతిక శాస్త్రవేత్తలకు కానీ) అంతు పట్టని విషయం. దీనినే 'మాయ' అనీ, అది అనిర్వచనీయమనీ అన్నారు. మా-యా అంటే 'అది అదికాదు' అని అర్థం. ఏది ఏదిగా మనకు గోచరిస్తున్నదో యథార్థానికి అది అదికాదు అని తప్ప మాయా వాదానికి వేరే అర్థంలేదు. సాంప్రదాయకంగా వున్న రూఢి అర్థాలను కాదని మన కల్పితార్థాలను అంటకట్టి ఆధునికుల మనుకునేవారు అద్వైత తత్వాన్ని అపహాస్యం చేయబూనటం వెకిలి తనమే అవుతుంది.

"అనుభవ వాదం, భావ వాదం అంటూ రెండు మౌలిక వైఖరుల్ని తత్వశాస్త్రం సర్వదా వేరుపరుస్తూనే వచ్చింది. ఈ రెండు దృక్పథాలలో దేనికీ యీ నాటి ప్రకృతి శాస్త్రం విజయం అంట గట్టటం లేదు" అని Atoms and Cosmos లో బెర్లిన్ యూనివర్సిటీ ప్రొఫెసర్ హాన్స్ రీకెన్ బాక్ చేసిన అనుభవ వాద - భావ వాద సంశ్లేషణను పేర్కొంటూ, తన

Science and Philosophy లో ఎమ్. ఎన్. రాయ్ ఇలా అంటాడు: "ఆ విధంగా శాస్త్రం, చెప్పాలంటే, రెండు కాళ్ళమీద నిలుస్తుంది— అనుభవం, అంటే పరిశీలించబడ్డ వాస్తవాంశాలు, ఒకటి; వాటిని సాధారణ సూత్రాలుగా క్రమీకరించటం రెండు. వీటిలో మొదటిది 'బాహ్య ప్రపంచం' నుంచి రాబట్టబడుతుంది; రెండోది శాస్త్రజ్ఞుడు సమర్పించేది ...నిజానికి 'బాహ్య ప్రపంచం' అనేది తప్పుదారి పట్టించే పదం. ఎందుకంటే మన మందరం మన అనుభవం(లోకి వచ్చే) ప్రపంచంలో సంపూర్ణ భాగాలం."

"ఈ ప్రపంచమంతా ద్రష్టయొక్క చర్యచేతనే సృష్టింపబడుతున్న దన్నప్పుడు మరోచోటనుండి ప్రతిచర్య లేకుండా చర్య సంభవం కాదన్న వాస్తవాంశాన్ని భావవాదులు విస్మరిస్తున్నా" రని భావవాద వాస్తవ వాదాలను సమన్వయ పరుస్తూ స్వామి రామతీర్థ కూడా అంటాడు In the Woods of God Realisation, 3వ భాగంలో. శంకరాద్వైతంలోని మాయా వాదంలో జరిగింది యీ సమన్వయమే.

బ్రహ్మ తత్వాన్ని గూర్చి కేనోపనిషత్తు ఇలా అంటుంది: "అది నాకు తెలుసునని నేను చెప్పలేను; నాకు తెలియదనీ నేను చెప్పలేను; తెలియ టాన్నీ తెలియక పోవటాన్నీ అధిగమించి 'అది' వున్నది". అయితే అది వుంటూ, అది అదికాకుండా అగుపిస్తున్నది. ఇదే మాయ, మిథ్య, భ్రాంతి.

భ్రాంతి రెండు రకాలు. ఒకటి – కేవలం మనస్సు కల్పిస్తున్నట్లు కనిపించేది. దీన్ని అంతర్గత భ్రాంతి అనవచ్చు. రజ్జు – సర్ప భ్రాంతిని ఇందుకు ఉదాహరించుకోవచ్చు. చీకట్లో తాడును చూశాను, పాము అని భ్రాంతిపడ్డాను. దీనిలోని విశేష మేమంటే– అక్కడ తాడు కనిపిస్తే పాముండదు, పాము కనిపిస్తే తాడుండదు, అంతర్గత భ్రాంతిలో (కని పిస్తూ) వుండేది ఏదో ఒక్కటే.

రెండోది – బహిర్గత భ్రాంతి. దీనికి ఉదాహరణగా అద్దంలోని నాముఖ ప్రతిబింబాన్ని చెప్పవచ్చు. నా ముఖం వున్నది,అదేసమయంలో దాని ప్రతిబింబం వున్నది, ప్రతిబింబాన్ని పట్టిచ్చే అద్దం వున్నది. ఇక్కడ మూడూ ఒకేసారి వుంటూవున్నై. ఇందులో నా ముఖం (బింబం) యథా

ర్థంగా వున్నది; ప్రతిబింబం యథార్థంగా లేదు, కాని అద్దంద్వారా ప్రతిబింబానికి యథార్థత ఆభాసిస్తున్నది. ప్రతిబింబమే యథార్థమన్న భ్రాంతికిలోనై అసలైన యథార్థ బింబాన్ని విస్మరిస్తున్నాను; లేదా గుర్తించ లేకుండా వున్నాము. ఈ తరహా భ్రాంతిని జగత్తులో దర్శిస్తుంది అద్వైతం.

ముఖ బింబం లాంటిది సర్వవ్యాప్తమైన బ్రహ్మ పదార్థం. అది వివర్తదశ. దాని వర్తదశ జగత్తు. అది ప్రతిబింబం లాంటిది. మాయ ద్వారా బ్రహ్మ జగత్తుగా ప్రతిబింబిస్తున్నది. కనుక మాయ అద్దంలాంటిది. మరి అద్దం మనకు కనిపిస్తున్నది కదా, మాయ కనపడదేమిటి? అనవచ్చు. అద్దం చిన్నది కనుక, దానికి చట్రం వున్నది కనుక, దానిని మనమే అమర్చుకున్నాం కనుక అది కనిపిస్తున్నది. అతి విశాలమైన అద్దం ముందు నిలిస్తే మనకు అద్దం కనిపిస్తుందా? మాయకూడా అలాంటిదే. సర్వవ్యాప్తమై అగోచరమైన బ్రహ్మపదార్థం పంచేంద్రియాలద్వారా మనస్సుకు జగత్తు రూపంలో దర్శన మిచ్చేట్లు చేసే అనిర్వచనీయమైన అదృశ్య సాధనాన్నే 'మాయ' అన్నారు. మరి సర్వవ్యాప్తమై అగోచరమైన (భౌతిక) పదార్థం నానారూపక జగత్తుగా దర్శన మిచ్చేట్లు చేస్తున్న ఉపకరణమేది? దాన్నిగూర్చి భౌతికవాదం ఆలోచించినట్లు కనిపించదు. అద్వైతం ఆలోచించి దానికొక పేరు (లెక్కలలోని X లాంటిది) తగిలించింది. అందులోవున్న ప్రమాదమేమిటో అర్థంకాదు.

అద్వైతం, వ్యతిరేకార్థకంగా, ఏకతా వాదాన్ని ఘంటాపథంగా చాటుతున్నది. కనిపిస్తున్న నానాత్వానికి వివరణగా మాయావాదాన్ని ప్రతిపాదిస్తున్నది. అది ఎంతో హేతుబద్ధమైన ప్రతిపాదన. పదార్థం-మనస్సు, మనస్సు-శరీరం అన్నవాటిలో ద్వంద్వత్వం లేదని ఆధునిక భౌతిక వాస్తవ వాదం స్థాపించింది. పదార్థం, శక్తి అన్నవి విభిన్నాలు కావనీ, ఉన్నది పదార్థ-శక్తి లేదా శక్తి-పదార్థం అనీ ఐన్‌స్టైన్ పండితు డంటాడు. అలాగే దేహ-మనస్సు, మనో-దేహం అని అలెగ్జాండర్ బైన్ వాడిన ద్వంద్వ పదాలు ప్రయోజనకరమైన వంటూ జె. అర్థర్ థామ్సన్ తన Biology and Human Progress లో మనో జీవశాస్త్రాన్ని గూర్చి వివరిస్తాడు.

"యస్తు సర్వాణి భూతాని ఆత్మ న్యే వానుపశ్యతే సర్వభూతేషు చాత్మానం తతో న విజుగుప్సతే" (సర్వ భూతాలను తనలో దర్శించుకొంటూ తనను సర్వ భూతాలలో దర్శించుకొంటూ వుండేవాడు జుగుప్సకు లోనుకాడు) అనటంలో ఈశావాస్యోపనిషత్తు ప్రతిపాదించేది కూడా మనో దేహాల మధ్య అద్వైతం కాదా?

ఇలాంటి అద్వైతాన్నే ఆధునికతత్వశాస్త్రం ద్రష్ట అయిన "నేను" కూ, దృశ్యమైన 'అనుభవ జగత్తు'కూ మధ్య నెలకొల్పు తున్నది. ఇదే ప్రయత్నం శంకరాద్వైతం సమర్థంగా సాగించింది.

o o o o

భారత దేశంలో భావ పునర్వికాసం రావాలంటున్నాం. పూర్వం యీ దేశంలో వికాస ముంటేనేగా పునర్వికాసాని కర్థం. మన బుర్రల్ని బంగారు పంజరాల్లో బంధించుకొని కూర్చుంటే వికాసం మన వద్దకు వచ్చి దర్శన మిస్తుందా?

పాత అంతా బంగారమే అని పట్టుక పాకులాడట మెంత తప్పో పాత అంతా రోతగా భావించి కొట్టివేయటం కూడా అంత తప్పే. పాత కొత్తల లోటుపాట్లను కాలంలోని ముందు వెనకలను బట్టి నిర్ణయించ కూడదు. వాటి నిజానిజాలను బట్టి మాత్రమే నిర్ణయించాలి.

అద్వైతానికి పునాదులు కొన్ని ఉపనిషత్తులలో వున్నై. (ఉదా హరణకు "అయమాత్మా బ్రహ్మ" అన్నసూత్రం మాండూక్యం లోనిది.) దాని కొకరకమైన రూపకల్పన శంకరుని పరమ గురువైన గౌడపాదుని మాండూక్య కారికలోనే కనిపిస్తుంది. ఆయా భావాలను క్రమబద్ధంచేసి ఒక సమన్వయ సిద్ధాంతాన్ని రూపొందించిన ఘనత శంకరునిది. అనేక విష యాలలో అది బౌద్ధ సిద్ధాంతాన్ని పోలివుండటంలో దీనిని "ప్రచ్ఛన్న బౌద్ధం" అన్నారు. అయినా బౌద్ధం పట్ల ఎంతో ప్రేమ ఒలక పోసేవాళ్ళు అద్వైతంపట్ల ఎందుకంత ద్వేషం ప్రదర్శిస్తారో అర్థంకాదు. శంకరుని గూర్చి ప్రచారంలో వున్న కథల ప్రభావం ఇందుకు కారణం కావచ్చు బహుశా.

## XXVIII

శంకరుడు రండాగర్భజనితు డన్న కథ ప్రచారంలో వుంది. అది నిజమే అనుకుందాం. అయితే యేం? ఆయన వాదనా పటిమను పరపంగా ఎదిరించలేని పిరికి పందలు అలాంటి కథలు ప్రచారంచేసి వుండాలి.

అలాగే శంకరుడు బౌద్ధుల్ని గానుగల్లోవేసి తిప్పించాడనటం కూడా. ఆయన 8 వ శతాబ్దారంభంలో వున్నాడు. బౌద్ధం ప్రజా ఉద్యమంగా 5వ శతాబ్దారంభం దాకే సాగింది. దానికి నాయకత్వం వహించి, వృత్తి పనుల వారినీ కళాకారుల్ని పోషిస్తూ వచ్చింది వ్యాపార వర్గం. రోమన్ సామ్రాజ్యం 5వ శతాబ్దారంభంలో పతనం కావటంతో యీ దేశంలో వ్యాపారం స్తంభించింది, అప్పటిదాకా వ్యాపారస్థుల పోషణలో వుంటూ వచ్చిన సామాన్య ప్రజలంతా జీవనభృతి కోసం రాజుల ఆదరణతో భూస్వాములుగా వున్న బ్రాహ్మణ వర్గాన్ని ఆశ్రయించక తప్పలేదు. అలా బౌద్ధం ప్రజా ఉద్యమంగా పతనమై పోయిన నాలుగు శతాబ్దాల అనంతరం శంకరుడు గానుగలలో వేసి తిప్పించ వలసినంత బలంగా బౌద్ధు లున్నా రనుకోవటం వెర్రి. పైగా అద్వైత వాదాన్ని, స్వయం ప్రతిభ వల్లనో చండాల ప్రబోధం వల్లనో సమాజానికి సంధించి సర్వ సమతా వాదాన్ని రూపొందించిన శంకరునికి సర్వసమతా వాదులైన బౌద్ధుల్ని గానుగల్లోవేసి రుబ్బించే టంతటి క్రూరత్వాన్ని అంటగట్టటం దుష్టబుద్ధుల కుట్రగా తోచక మానదు.

కిం గంగాంబుని బింబితోఽంబరమణౌ చండాల వాటీ పయః
పూరే చాంతర మస్తి కాంచనఘటీ మృత్కుంభయో ర్వాంబరే
ప్రత్యగ్వస్తుని నిస్తరంగ సహజానందాను బోధాంబుధౌ
విప్రోఽయం శ్వపచోఽయ మిత్యపి మహాన్ కోయం విభేద భ్రమః

[గంగా జలంలోనూ చండాల వాటికలో జలాశయంలోనూ ప్రతిబింబించిన సూర్యునిలో ఏమైనా భేదం వుంటుందా? బంగారు పాత్రలోనూ మట్టికుండలోనూ ఆకాశం వేరుగా వుంటుందా? నిస్తరంగ సహజానంద సముద్రమైన ఆత్మలో వీడు విప్రుడు, వీడు చండాలుడు అనే భేదం వున్నట్లు ఏమిటి నీ భ్రమ?]

అని సర్వ సమతా వాదాన్ని ఎలుగెత్తి చాటి తన అనుచరుల అగ్రహానికి ఆహుతి కావటానికి వెనుదీయని సాంఘిక విప్లవ కారుడైన శంకరునిలో బౌద్ధవధకు అవసరమైన అమానుషత్వాన్ని నే నీనాడు చూడ లేకుండా వున్నాను. పరకాయ ప్రవేశం చేసిన శంకరుని స్వకాయం అగ్ని వాతపడి కాళ్లు కాలిపోవటం, కాలిపోయిన కాళ్ళు మొలిపించుకోవడానికి శంకరుడు నృసింహ స్తోత్రం రాయటం వంటి కథను ఏమనాలి? కాయమే లేదనే శంకరుడు పరకాయప్రవేశం చేయటాన్ని, 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అని నరనరాల్లో జీర్ణించిన శంకరుడు ఎవడో నృసింహుణ్ణి స్తోత్రం చేశా డనటాన్ని తప్పుగా ఖండించాలనే బుద్ధి కనీసం హేతువాదులకు కూడా లేక పోతే యేమనాలి? ఇలాంటి అసంగత కథలు కల్పించిన వారికి బౌద్ధవధా కథ లాంటివి కల్పించట మొకలెక్కా?

ప్రతాప రుద్రీయం, సారంగధర, కన్యకాశాపం (పద్మ పురాణం) లాంటి కట్టుకథలెన్ని ప్రచారంలో వుండి వాస్తవాలుగా చలామణి కావటం లేదూ? ఎక్కడికో దేనికి? తెనాలి రామకృష్ణుణ్ణి కృష్ణరాయల్ని యీనాడు విడదీసి చూడటం ఎంత కష్టం? రామకృష్ణుడు, పింగళి సూరన, రామరాజ భూషణుడు (భట్టుమూర్తి) అష్టదిగ్గజాలలోని వారు కారని, వారికి కృష్ణ రాయలకీ ఏ విధమైన (సం) బంధం లేదని చరిత్రకారు లేనాడో తేల్చి వేశారు. నాలుగు శతాబ్దాల వ్యవధిలోనే చరిత్ర కింతగతి పట్టితే సుమారు 12 శతాబ్దాల వ్యవధిలో శత్రువర్గాలైన ద్వైతుల చేతిలో శంకరుని కథకు అంతగతి పట్టటంలో ఆశ్చర్యపడ నవసరంలేదు. భావగమన చరి త్రను పరిశీలించి దానిమధ్య సమన్వయ సూత్రాన్ని నెలకొల్పవలసిన ఆధునిక జిజ్ఞాసువులు సైతం కొందరు సంప్రదాయ విశ్వాసాలు కల్పించిన మాయా జాలంలో చిక్కుకొని బయటపడలేక బాధ్యతా రహితంగా ప్రవ చిస్తున్నారు; రచిస్తున్నారు. అది హేతువాదం కాదు, భౌతికవాదం కాదు, మానవవాద మంతకన్నా కాదు.

శంకరుని వేషాన్ని గూర్చికూడా వినవస్తున్న విసుగులను గూర్చి ఒక్కమాట. ఈ విసిరేవారంతా ఇంచుమించు హేతువాదుల మనుకొంటున్న వారే. అయితే యీ వేషం గౌతమ బుద్ధునిదే నన్నది వారికి స్ఫురించక పోవచ్చు. అడ్డబొట్టు అంటారా—శైవ వైష్ణవాల మధ్య వైషమ్యాలు పెచ్చు

రిల్లిన తర్వాతగాని, మారువడకుండా షర్షా గుర్రాలకు వేయించిన ముద్రలలాగా, అడ్డబొట్లూ నిలువుబొట్లూ అవతరించలేదు. శంకరుని అనంతరం ఏ 3-4 శతాబ్దాలకోగాని అవి జరగలేదు. కాబట్టి శంకరుని ముఖంమీద ముద్రలు వేయించినవారు అనంతరం వచ్చిన మాధ్వులే అనాలి. జ్ఞానికి శైవ వైష్ణవాది ద్వైత భావాల ప్రమేయ ముండదు. అంతేకాదు బౌద్ధ ధర్మ ప్రభావంతో తానొక (ప్రచ్ఛన్న) బౌద్ధుడుగా బోడిసత్తితో బాటు కాషాయాంబరాలు ధరించాడేమో కాని, నిజానికి శంకరుడు యీ పై పై వేషాలకు బానిసకాదు. అందుకే ఆయన

జటిలో ముండీ లుంఛితకేశః కాషాయాంబర బహుకృత వేషః
పశ్యన్నపి చ న పశ్యతి మూఢో హ్యుదర నిమిత్తో బహుకృత వేషః

అంటూ కేవలం పొట్టకూటికోసం బహుకృత వేషాలు వేసే వేషధారుల్ని 'చూస్తూకూడా చూడజాలని మూఢులు'గా పేర్కొన్నాడు. శంకరుని వేషధారణపై విసురులు విసిరే వారికి ఇంతకన్నా ఏం చెప్పను?

○ ○ ○ ○

శంకరునికీ శంకరుని అద్వైతానికీ చారిత్రంగా జరిగిన అన్యాయాన్ని రూపుమాపటానికి చలమయ్యగారు ఎంతగా తపనపడ్డారో అంతటి తపనతో రాధాకృష్ణగారు చిత్రించారు శంకరుడు మిగిల్చిపోయిన పనిని 'చలముడు' పూర్తి చేస్తాడని చలమయ్యగారంటే, 'చలముడు' పూర్తి చేయలేని పనిని 'కృష్ణుడు' పూర్తి చేస్తాడని రాధాకృష్ణగారన్నారంటే- ఆయనకు అద్వైతంపైగల పట్టు మనకర్థమవుతుంది. "మేము చిన్నవాళ్ళం (బాలురం)" అన్న శీర్షికలోనే యీ ఆత్మవిశ్వాసం ధ్వనించింది. 'బాలురం' అంటే 'బాల చంద్రులం' అని అనిపించింది నాకు.

'కృష్ణగీత' లో కృష్ణుడు బోధకుడు, అర్జునుడు శ్రోత. కవిరాజు త్రిపురనేని 'బ్రహ్మగీత' లో బ్రహ్మనాయుడు బోధకుడు, బాలుడు శ్రోత. కృష్ణగీతలో మొదటినుంచి తుదిదాకా అర్జునుడు శ్రోతగానే వుండిపోయాడు అంటే మొద్దబ్బాయి అన్నమాట కాని బ్రహ్మగీత లో ప్రబోధం పొందిన బాలుడికి వివేకం వికసిస్తుంది. దానితో ప్రశ్నించే స్థాయినుంచి ఎదిగి ప్రబోధానికి దిగుతాడు. అలాగే ఒక దశలో అన్నగారిని వినటమే కాక,

వారికి వినిపించటాని కుద్యుక్తు లవుతారు రాధాకృష్ణగారు. 'బాలురం' అంటే బాల చంద్రులవలె వివేచనా శీలురం, ఉత్తమ శిష్యులం అని ధ్వనించారన్నమాట.

* * * *

ఈ గ్రంథం అంతంలో అనుబంధాలు రెండున్నాయి. మొదటిది రాధాకృష్ణగారి అన్నదమ్ముల వీరోచిత సాంఘిక విప్లవ చైతన్యానికి అద్దం పట్టుతుంది. దానిపై వివరణ అనవసరం. ముంజేతి కంకణానికి అద్దమెందుకు?

ఇక రెండో అనుబంధం ఎమ్. ఎన్. రాయ్ శత జయంతి సంవత్సర సందర్భంగా నిర్మలమైన మనస్సుతో ఆయన కర్పించిన నీరాజనం. ఈ గ్రంథం 50 వ పుటలో "సమిష్టి జీవుడు" అన్న శీర్షిక క్రింద రాయ్‌ని రామానుజ-మధ్వుల సరసన చేర్చిన లోపాన్ని సవరించుకోటానికి ఇది రచించారేమో అనిపించింది నాకు. అయితే స్వేచ్ఛ అనేది సమష్టి స్వేచ్ఛయేకాని వ్యష్టిస్వేచ్ఛ కాదనీ, వ్యష్టిస్వేచ్ఛ అంటే వ్యష్టి స్వైరమే అనీ, ఆచరణను మినహాయించి కేవలం ఆలోచన మేరకు మాత్రమే వ్యష్టి స్వేచ్ఛకు అర్థం వుండగలదనీ రాశారు రాధాకృష్ణగారు. వ్యష్టుల సముదాయంగా తప్ప సమష్టి ఉనికికి అర్థమేమిటో, వ్యష్టి స్వేచ్ఛల సమాహారంగా తప్ప సమష్టి స్వేచ్ఛమనికి ఎలా సంభవమో నాకు అవగాహన కాని విషయం. పైగా రాడికల్ హ్యూమనిస్టు సూత్రాలలో 3వది స్వేచ్ఛను (వ్యతిరేకార్థకంగా) నిర్వచిస్తూ వ్యక్తి స్థానాన్ని సమష్టికి కొలమానంగా పేర్కొన్నది. సమష్టి సంక్షేమ మన్నది వ్యక్తుల సంక్షేమంయొక్క వ్యాపారమే అని మొదటి సూత్రం చెబుతున్నది. రాజకీయ ఆర్థికాది వివిధ సామాజిక వ్యవస్థల్లో వ్యక్తుల బుద్ధి పూర్వక సహకార సంబంధాలద్వారా సమష్టి ప్రయోజనం సాధించటానికి చక్కని పథకాలు అందిచ్చింది రాడికల్ హ్యూమనిజం. సహకరించ వలసిన వ్యక్తుల బుద్ధి వికాసానికి విద్యయెంత అవసరమో 20 వ సూత్రం నొక్కి చెబుతున్నది. (వైయక్తికంగా వ్యక్తిస్వేచ్ఛ, (సామాజికంగా) వ్యక్తి బాధ్యత విడదీయరానివి కొందరు రాడికల్ హ్యూమనిస్టు ప్రముఖుల ఆచరణలో ప్రకటించే వైఫల్యాలను రాడికల్ హ్యూమనిజానికి ముడి పెట్టటంలో ఔచిత్యం నాకు కనిపించలేదు. వ్యక్తిగత లోపాలు సాధారణ సూత్రాలను బాధించకూడదు. అంతేకాదు. ఎవరి లోపాలకు వారే జవాబుదారులు కాని. ఎమ్. ఎన్. రాయ్ కాదు.

మార్క్సిజానికి పొడిగింపుగా వచ్చిన రాడికల్ హ్యూమనిజాన్ని సమాజ రంగంలోనూ శాస్త్ర రంగంలోనూ వచ్చిన చారిత్రిక నేపథ్యం - దృష్ట్యా అధ్యయనం చేయాలి. రాయ్ మార్క్సిజాన్ని అలాగే అధ్యయనం చేశాడు. చూడండి, 'మార్క్సిజం అంటే ఏమిటి?' (What is Marxism') అన్న తన వ్యాసంలో రాయ్ ఏమన్నాడో: "The historical significance and value of the teachings of Karl Marx is to be found in the fact that they are a coordination, a systematisation and a clear scientific presentation of the entire Product of human thought and human activity during the three or four hundered years that preceded the time of Karl Marx." (కారల్‌మార్క్స్ తనకు పూర్వం మూడు నాలుగు శతాబ్దులపాటు కొనసాగిన మానవ ఆలోచన-మానవ ఆచరణ సర్వస్వాన్ని సమీకరించి, క్రమీకరించి, స్పష్టంగా శాస్త్రీయంగా ప్రతిపాదించాడు. అవే మార్క్స్ బోధలు. ఈ వాస్తవాంశంలోనే కారల్ మార్క్స్ చారిత్రిక ప్రాశస్త్యాన్నీ విలువనూ దర్శించగలం.)

ఆనాడు కారల్‌మార్క్స్ ఏమిచేశాడో అదేవిధమైన పని ఆయన ఆనంతరం వచ్చిన చారిత్రికానుభవాన్నీ శాస్త్రాభివృద్ధినీ దృష్టిలో వుంచుకొని ఒక సామాజిక తత్వవేత్తగా ఎమ్. ఎన్. రాయ్‌కూడా చేశాడు. అందువల్ల రాధాకృష్ణగారు రాయ్‌ని, రాయ్ వాదాన్నీ రాగద్వేషాల కతీతంగా మరికొంత సానుభూతితో అధ్యయనం చేసి మరొకసారి తమ అభిప్రాయం ప్రకటించగలరని ఆశిస్తాము..

* * * *

రాధాకృష్ణగారు తమ ప్రస్తుత నివాసస్థలమైన పుష్పగిరిలో ప్రశాంతమైన నారికేళ వనంలో కూర్చొని ఎంత ఏకాగ్రతతో యీ గ్రంథ రచన చేశారో నేను స్వయంగా ఎరుగుదును అంతటి ప్రశాంత వాతావరణం మనందరికీ లభ్యం కాకపోవచ్చుగాక. రాధాకృష్ణగారి రచన మీరు చదవటం మొదలుపెట్టండి. మీ మనస్సును అదే ఆకట్టుకొంటుంది. మీకు తెలియకుండానే మీలో ఏకాగ్రత సెలవు చేసుకొంటుంది.

ఇంకా నేను మీకూ రాధాకృష్ణ గారికీ మధ్య నిలబడి మిమ్మల్ని విసిగించటం భావ్యంకాదు. కనుక సెలవు తీసుకొంటాను.

చీరాల- 513 155
30-7-1987

- ఎన్. వి. బ్రహ్మం,
మనీషా విద్యా విహార్.

# చివరిమాట

‘జగత్ సత్యం - బ్రహ్మమిథ్య’ అనే పుస్తకం వ్రాసి పూర్తిచేసి రెండు సంవత్సరాలకు పైగా అయింది. దీనిని అచ్చు వేయించుదామని అనుకుంటూ వుండగా ‘అన్నగారితో నా పరిచయం’ అనే ఈ పరిచయ పుస్తకం వ్రాయవలసిన పరిస్థితులు ముంచుకు వచ్చినై. అందుచేత ఈ పుస్తకం ముందుగా మీ ముందుంచుతున్నాము. ఈ పుస్తకం చదవటం ద్వారా ఆ పుస్తకం (జగత్ సత్యం - బ్రహ్మమిథ్య) చదవవలసిన అవసరం అర్థమవుతుందని కూడా భావిస్తున్నాను. అందుచేత ఆ పుస్తకానికి ఈ పుస్తకం పరిచయంగా కూడా ఉపయోగపడగలదని ఆశిస్తున్నాము.

1981 వ సంవత్సరం ‘పుష్పగిరి’ లో నాలుగు వారాలు వరుసగా ‘నాస్తిక చర్చావేదిక’ అనే పేరుతో చర్చా కార్యక్రమం యేర్పాటుచేశాం. ప్రతిరోజు సాయంత్రం ఆరుగంటల నుండి రాత్రి తొమ్మిది గంటల వరకు చర్చలు సాగిస్తూ వుండేవాళ్ళం. ఆ సమయంలో ‘పుష్పగిరి’ లో వున్న యువతీ యువకులతోపాటు వయోధికులు కూడా మంచి ఉత్సాహంగా పాల్గొనేవారు. ఆ సందర్భంలో ఆర్థిక సాంఘిక (రాజకీయ విషయాలు మినహాయించి) తాత్విక సంబంధమైన అంశాలపై సారవంతమైన చర్చలు సాగినవి. అన్న చలమయ్యగారు, అక్క రాజరత్నమ్మగారు కూడా ఆ చర్చలలో పాల్గొని అద్వైత తాత్వికాంశాలపై వివరణ యిస్తూ ప్రసంగించారు. ఆ చర్చావేదిక అక్కడివారిలో యెంతో చైతన్యం కలిగించింది.

సమిష్టి తత్వం, వ్యష్టితత్వం అనేవి తాత్విక దృక్పథం నుండి పరిశీలించి, ఆయా అంశాల ప్రభావం సమాజంపై యెలా పనిచేస్తుంది? అనేది ఒకరోజు ప్రధాన చర్చనీయాంశంగా తీసుకుని చర్చించటం జరిగింది. ఆ చర్చల సారాంశమే ఈ పుస్తక ఉపసంహారంలో ‘స్వేచ్ఛ’ అనే అంశం క్రింద వ్రాయటం జరిగింది.

భౌతిక తత్వం, అద్వైత తత్వం, కళాతత్వం ఈ మూడు తత్వాలు సమిష్టి తత్వాన్ని ప్రతిపాదించినై. ఒక్క ద్వైతతత్వం మాత్రమే వ్యష్టి

తత్వాన్ని ప్రవేశపెట్టి ప్రచారంచేస్తూ వచ్చింది. ప్రపంచ వ్యాప్తంగా ఏ పేరులో వున్నా మొత్తంగా అవి ఈ నాలుగు తాత్వికాంశాల ఆధారం గానే అభివృద్ధి పొందినై. వివిధ రీతులలో వెలుగులోకి వచ్చినై.

వైయక్తిక మనః ప్రవృత్తి వ్యక్తులలో పెరిగితే సమత, మమత సన్నగిలి మానవులమధ్య నీతి తరిగి అవినీతి పెరుగుతుంది. పర్యవసానంగా శాంతి తరుగుతుంది. ఇది నా అభిప్రాయం మాత్రమేకాదు, ప్రముఖ తత్వవేత్తల ప్రగాఢ అభిప్రాయం. దీనిని నేను ప్రచారం చేయాలనే అభిప్రాయం కారణంగా ఆ పనిలో భాగంగా ఈ రచనా వ్యాసంగం ఆరంభమైనది. ఈ పనిలో నాకు భాష కొంత ఆటంకంగా వుంటూ వున్నది. అయినా సమిష్టి తత్వం ప్రచారం చేయాలనే తపన నన్ని పనికి ఉపక్రమింప జేసింది.

ఈ పుస్తక రచన ప్రారంభించిన క్రొత్తలో మిత్రులు బి. వి. నరసింహారావు (బాలబంధు) గారిని కలసి నా రచన చదివి వినిపించాను. భాషా సంబంధమైన లోపాలను సరిచేసి పెట్టవలసినదిగా కోరాను. అందుకు వారంగీకరించి అప్పటికి రచించినంతవరకు చూచి, సరిచేసి నాకు కొన్ని సూచనలుకూడా (భాషా పరంగా) చేసి సలహా నిచ్చారు. ఆ తరువాత రచన పూర్తిఅయిన సందర్భంలో మిత్రులు ఎన్. వి. బ్రహ్మం గారికి చదివి వినిపించాను. వారి సలహామేరకు భాషలోని లోటుపాట్లను సవరించాను. వారుకూడా స్వయంగా చూచి అక్షర సమన్వయం సరిచేసి వాక్యాలకు న్యాయం సమకూర్చారు. ఇది మొదటిదశ.

ఈ పుస్తకం అచ్చుకు ఇవ్వబోయేముందు బ్రహ్మంగారితో సంప్రదించి దీనిని చీరాలలో అచ్చుకు ఇవ్వాలని నిర్ణయించుకున్నాను. దానికి కారణం పుస్తకం అచ్చుపనిలో నాకు అనుభవంలేదు, ప్రూఫులు దిద్దటం మిగిలిన యితర పనులు చూచే బాధ్యతను బ్రహ్మంగారికి అప్పగించవచ్చుననేది నా ఉద్దేశం. నా ఉద్దేశాన్ని బ్రహ్మంగారితో చెప్పాను చెప్పినదే తడవుగా అంగీకరించారు.

ఈ పుస్తకం అచ్చుపని ఆరంభం అయినప్పటి నుండి పని పూర్తి అయ్యేవరకు దీనికి సంబంధించిన పనులన్నీ వారే చూస్తూ వచ్చారు. వారు వారి వైద్య (వృత్తి) పనిలో యెంతో వత్తిడిలోవున్నా యేదో విధంగా తీరిక చేసుకుని ముందు ఈ పనే చూచిపెట్టేవారు. ఇది రెండవ దశ.

ఈ పనిపై నేను చీరాలలో వున్న సమయంలో యెక్కువ రోజులు నా భోజన ఫలహారాల పని బ్రహ్మంగారింటి వద్దనే జరిగిపోతూ వుండేవి. ఈ విషయంలో బ్రహ్మంగారి సతీమణి సీతారామమ్మగారు వారి ఆరోగ్యం సరిగా లేకపోయినా నన్ను వారి కుటుంబ సభ్యునిగానే భావించి నాకా సౌకర్యాలు చూస్తూ చేస్తూ వచ్చారు. ఇటువంటి సహకార సద్భావాలు ఇక్కడ లభించినవి కాబట్టే నా కాలాన్ని మరచి నేనిక్కడ యింతకాలం వుండగలిగాను. నేనిక్కడున్నంత కాలం ఆ కుటుంబ సభ్యులు వరులనే భావమే నాకు కలగలేదు. అలాంటిది వారి సహకారం.

మొదట్లో ఈ పుస్తకానికి పరిచయం యెవ్వరిచేతా వ్రాయించాలని అనుకోలేదు. కాని, తరువాత బ్రహ్మంగారిచేత వ్రాయించాలని అభిప్రాయ పడ్డాను. దానికి కారణం అటు భౌతిక తత్వశాస్త్రంలోను, ఇటు అద్వైత సిద్ధాంతంలోను వారికి పరిచయం వుండటం. వారైతే సమన్వయ దృష్టితో వ్రాయగలరని అనుకున్నాను. అనుకుని ఆ విషయం వారితో చెప్పాను. సరేనన్నారు. అనటమేకాక సకాలంలో వ్రాసియిచ్చారు. అది వారు మన స్ఫూర్తితో వ్రాశారు. నాకు చాలా సంతృప్తి నిచ్చింది. ఈ పరిచయం చదువరులను క్రొత్త ఆలోచనలకు ఆయత్తం చేస్తుందని ఆశిస్తున్నాను.

ఈ పుస్తకం లిబర్టి ప్రింటింగ్ ప్రెస్‌లో అచ్చుకు ఇవ్వాలను కున్నాను. అందుకు కారణం అది మన ప్రెస్, అందులో పనిచేసే వారు మనవారు అనుకోవడం. అలాగే అందులో పనిచేసే వారంతా ఈ పని మనపని అనుకుని పనిచేశారు. కరెంటు సప్లై సరిగావుండీ లేకా, పనివాళ్ళు సరిగావచ్చీ రాకా పని కొంత ఆలస్యంగా జరిగినా మొత్తంమీద అందరి సహకార సమిష్టి కృషివల్ల పని పూర్తిచేసి ఈ పుస్తకాన్ని సక్రమ రీతిలో మన కందించారు. చార్వాకుడు, భగత్‌సింగ్, ప్రసాద్ పరోక్షంగా నాకెంతో సహకరించారు ఇది మూడవదశ.

ఇలా ఈ పుస్తకం రావటానికి యింతమంది సహకారం నాకు లభించింది. అలా వారు మనస్ఫూర్తిగా సహకరించినందుకు ఆనందిస్తున్నాను. అయినా వీరెవరికి కృతజ్ఞతలు చెప్పను. కృతజ్ఞతలు చెప్పి ఆ రోజుతో వారిని మరచిపోలేను. కృతజ్ఞతలు చెప్పటం దుష్ట ఆచారంగా వస్తూవున్న విషయం. అటువంటి ఆచారాన్ని నేననుసరించను. కాని, వారియెడల కృతజ్ఞతగా మాత్రం వుంటాను. ఇదే నాకు సంతృప్తి నిస్తుంది (ఇదికూడా చెప్పనక్కరలేదు అందుకే యిలావ్రాసి వూరుకున్నాను). కృతజ్ఞతలు చెప్పడం మత (అవి) నీతి, కృతజ్ఞత కలిగివుండటం మానవ (నిజ) నీతి.

అసలు ఈ పుస్తకం వ్రాయాలనే సంకల్పం అన్నగారి స్మరంతి సభ జరిగిన సందర్భంలో ప్రసంగిస్తూ వుండగా, వారి అనుయాయుల సూచనమేరకు, నాకు కలిగింది. అంతకుముందు ఈ విషయమై చర్చ వచ్చినప్పుడు యెవరు వ్రాస్తే బాగుంటుంది అనుకున్నాం. చివరకు నన్ను వ్రాయమని అన్నారు. నేను భౌతిక వాదిని, అన్నగారు ఆధ్యాత్మిక వాది, అటువంటప్పుడు యెలా సాధ్యపడుతుంది? పైగా నేను జగత్తు సత్యమంటున్నాను, అన్నగారు బ్రహ్మసత్య మంటున్నారు అన్నాను వ్యంగ్యంగా.

అట్లా అనవద్దు, అయ్యగారుకూడా తమ బోధల్లో జగత్ సత్యమంటూ వచ్చారు. పైగా వారితో మీకున్నంత చనువు, పరిచయం మరెవరికీ లేదు. అందుచేత మీరు వ్రాస్తేనే బాగుంటుంది అని నన్ను ప్రోత్సహించారు. తప్పలేదు సమ్మతించాను.

ఆ మరుక్షణమే దానికి సంబంధించిన ఆలోచన అంతరంలో ఆరంభమయింది ఆ తరువాత ఈ పనిమీద మా తోటలో ఆరుమాసాలు యేకాంతంగా వుండి నా జ్ఞాపకాల గనిని తవ్వటం ప్రారంభించాను. తీస్తూవున్న కొద్దీ వస్తూవున్న ఆ జ్ఞాపకాలను ఇంతవరకు ఆపి మీ ముందుంచుతున్నాను.

చీరాల
(క్యాంపు)
1-8-1987

గుత్తా రాధాకృష్ణ

## ఇందులో........

# ఉపోద్ఘాతము

అయిదవయేట తానుచేసే అక్షరఅభ్యాసానికి, ఆరవయేడో, లేక పదో యేడో తాను చేసే ఆలోచనకు సంబంధంలేదు. అక్షరాభ్యాసం (భాష నేర్వడం) తప్పని సరిగా అందరికి అవసరమే. అలా అభ్యాసం చేసిన భాష ద్వారా తన ఆలోచనలోని భావాన్ని వ్యక్త పరచవచ్చు, విశదపర చనూ వచ్చు. అందుకు భాష తప్పని సరిగా అవసరం. అందుకే భాషను అందరూ నేర్వాలి.

ఆలోచనలను భావాలు, ఆ భావాలను అనుసరిస్తూ భాష వుండాలి. అలాగేవుంటుందికూడా. అలాగే భావంలేనిభాష వుండదు. వుంటేను, అలా వుంటుందంటేను, అది మృతభాషగామాత్రమే వుంటుం . భాషలేని దశలో కూడా భావం వుంటుంది. కాని భావంలేని దశలో భాషవుండదు. అందుకే భావంతో భాష సాపేక్షంగా వుంటుందంటాము.

సంకల్పించే దాన్ని మనసని, విచక్షణ చేసేదాన్ని బుద్ధి అని అంటాము. అయితే సంకల్పించే మనసు, విచక్షణ చేసే బుద్ధి వేరుగాదు. సంకల్పించానిదే విచక్షణ చేయలేము, విచక్షణ చేయనిదే వివేకంరాదు. సంకల్పశక్తి, విచక్షణాశక్తి మానవునికి వున్నవి. ఆ శక్తి అతడిని వివేక వంతుణ్ణి చేస్తుంది. కాని వివేకవంతుడుగానే మానవుడు పుట్టడు.

## వివేక వంతుడు

మానవుడు తాను వివేకవంతుడు కావడానికి తన శరీర నిర్మాణం అనుకూలంగా వున్నది, కాని వివేకవంతుడుగానే మానవుడు పుట్టడు, పుట్టలేదు. అలా పుడతాడు అనుకోవడంలో అర్థంలేదు. అలా వివేకవంతుణ్ణిగా పుట్టించే దేవుడొకడులేడు. అలాంటి దేవుడొకడు వుండి మానవుణ్ణి పుట్టించ లేదు (సృష్టించలేదు). దైవసృష్టివాదులు అలాటి భావం కలిగివుంటారు సృష్టివాదం తప్పని మనం అంటాము గనుక అలాంటి భావం తప్పు.

సంకల్పించే మనసు, విచక్షణ చేసే బుద్ధి తన మెదడులో పనిచేస్తూ వున్నది. కాని మెదడే మనసుకాదు. మనసే బుద్ధికాదు. మనసు సంకల్పిస్తుంది, విచక్షణతో బుద్ధి పనిచేస్తుంది. అంతమాత్రంచేత అవి రెండుకాదు. అవి రెండు అనుకుంటే అది పొరపాటవుతుంది. కాని అది (మెదడు) రెండు రకాల పనిచేస్తుంది.

## మెదడు - దాని ఉపయోగము

మెదడు అందరికి వుంటుంది. అందులోని సంకల్పం అందరికి వుంటుంది. కాని, సంకల్పం మనసుయొక్క ప్రాథమికదశ (దానినే కోరిక అని కూడా అనవచ్చు). అటువంటి సంకల్పశక్తి అందరికి వున్నప్పటికిని దానిని విచక్షణ దశకు అందరు తీసుకుపోరు. అందరికివున్న అటువంటి అవకాశాన్ని (ఆ మెదడుని) ఉపయోగించుకునేది కొందరు మాత్రమే.

అటువంటి వారిలో సంకల్పం (కోరిక) తోనే ఆగిపోయేవారు కొందరైతే, సంకల్పంలోకి వచ్చిన ఆ విషయాన్ని విచక్షణచేసేవారు కొద్దిమంది మాత్రమే వుంటారు. ఆ సంకల్పాన్ని విచక్షణ చేయగలవారే వివేకవంతులు కాగలరు. అలా వచ్చిన వివేకంద్వారా వారేజ్ఞానవంతులు కాగలరు. విచక్షణలేని వ్యక్తి అవివేకిగానే మిగిలి పోతాడు. అటువంటి వ్యక్తి కోరికలకు బానిసయై విచక్షణ కోల్పోతాడు, కోరికలు తీరనపుడు,తాను మానసికమైన బాధలను కోరితెచ్చుకుంటాడు అని అర్థం చేసుకోవాలి.

## సుఖము - ఆనందము

ఇలాంటి బాధల సముదాయమే జీవితంలో దుఃఖానికి కారణం, భౌతిక అవసరాలు తీరనప్పుడు, వాటిని తీర్చుకోవడానికి అవకాశంలేనప్పుడు జీవితంలోకష్టాలుఅనెవి ప్రారంభమవుతై. అవసరాలుతీరడం సుఖం. అవి తీరక పోవడం కష్టం. కష్ట సుఖాలు ప్రకృతి సంబంధంగా వచ్చేవి సహజమైనవి. కాని వాటిని కావాలని సృష్టించే పరిస్థితులు వుంటై. ఆ పరిస్థితుల వెనుక వున్న తాత్విక పరిస్థితులేమిటని ఆలోచించాలి. కాని ఆలోచించే పరిస్థితిలో వారుండరు. వివేకాన్ని వ్యావహారిక విషయాల వరకే

పరిమితం చేసి పరిస్థితులను తనకు అనుకూలంగా ఉపయోగించుకుని ప్రతిభతో జీవించేవారు వ్యావహారిక సుఖజీవులు.

అలా వివేకాన్ని వ్యావహారిక విషయాల వరకు మాత్రమే పరిమితం చేయక తాత్విక విషయంలో సమన్వయ పరచి వివేకాన్ని అభివృద్ధి చేసి విస్తరింప చేయగలవారు తాత్వికులు. అంటే వ్యావహారిక విషయమందు ప్రజ్ఞను, తాత్విక విషయమందు జ్ఞానమును కలిగి వుంటారు. వారే ప్రజ్ఞానులు. అటువంటివారు వ్యావహారిక జీవితం లోని సుఖమును, తాత్విక విషయమందుగల ఆనందమును పొందుతారు. అంటే వ్యావహారిక విషయ సంబంధమైన (వ్యక్తిగత) సుఖమును, తాత్విక పరమైన (సమిష్టి) ఆనందమును పొందుతారు. అదే శాంతి ప్రద మైన జీవితమవుతుంది.

మరి సుఖమని, ఆనందమని అవి రెండు వేరుకాదు. వ్యావహారిక సుఖాన్ని విడిచి, తాత్విక ఆనందమనేది వుండదు. వ్యావహారిక విషయాన్ని తాత్విక సమన్వయంతో చూడ గలగడమే ఆనందం. అందుకే వ్యావహా రికాన్ని విడిచి తాత్వికమనేది వుండదు. తాత్విక పునాది లేనిదే సరైన (సంపూర్ణమైన) వ్యావహారికముండదు. వ్యావహారిక విషయం వరకే తమ ఆలోచనలను పరిమితంచేసుకుని పరిమితమైన ఆ సుఖాలను తమ సొంతం చేసుకోవాలని తాపత్రయపడుతూ వుండే వ్యక్తులు, అలాంటి ప్రయత్నంలో విఫలమైనపుడు, ఆ సుఖాలు వారికి దక్కనపుడు, నిరాశ, నిస్పృహలతో దుఃఖాన్ని అనుభవిస్తూ వుంటారు. ఆ విధమైన వ్యక్తి గత కోరికలే ఆ వ్యక్తి దుఃఖానికి కారణం.

అటువంటి సుఖాలను తన సొంతం (వ్యక్తిగతం) చేసుకోవాలని ప్రతి వ్యక్తి ఆలోచించినపుడు ఆ ప్రయత్నంలో పరస్పరం స్వార్థం అభి వృద్ధి అవుతుంది. అది పరస్పరం ద్వేషానికి కారణమవుతుంది. ఆ ద్వేషమే సమాజంలో అశాంతికి కారణమవుతుంది. మనలోని కృత్రిమమైన అటువంటి కోరికలవల్ల సమాజంలో అశాంతికి మనమే కారణాలను సృష్టించినట్లు కాగ లదు. ఆవిధంగా వ్యక్తి కోరికలు సమాజపరంగా అనర్థాలు కలిగిస్తూవుంటై.

అద్వైతంలో జీవుడుసత్యమవుతాడు, ఆ జీవునితోసాపేక్షరీతిలో 'బ్రహ్మము' సత్యమవుతుంది. అంటే జీవుడు, బ్రహ్మము అని రెండుకాక సాపేక్షంగా రెండు ఒక్కటవుతాయి. అంటే సమిష్టిలో"బ్రహ్మము" వ్యష్టిలోజీవుడుకలసి ఒక్కటవుతారు. వ్యావహారికమందు జీవుడు, తాత్వికమందు 'బ్రహ్మము' తాత్వికాన్ని విడిచి వ్యావహారికముండదు. వ్యావహారికంకాని తాత్విక ముండదు. నగను(వస్తువను) విడిచి బంగారము వుండదు, బంగారం లేక నగ వుండదు.

## అధ్యారోప - అపవాదాలు

అధ్యారోపం విచారిస్తే (సమన్వయంలో) జీవుడు మాత్రమే అర్థ మవుతాడు. అపవాదం(వ్యతిరేకం)వరకే విచారిస్తే సమిష్టిలోని "బ్రహ్మము" మాత్రమే అర్థమవుతుంది. అధ్యారోప, అపవాదాలు (విశ్లేషణ, సంశ్లేషణ) రెండూ తెలిస్తే తత్వం అర్థమవుతుంది. (తత్ త్వమ్ అవుతాను) తత్వం తెలిస్తే (అది నీవవుతావు) "తత్వమసి" వాక్యానికి అర్థం తెలిసినట్లే. తత్, త్వమ్‌ల ఏకత్వం అర్థమైతే "నేను" తెలిసినట్లే. "నేను" తెలిస్తే సమిష్టి జీవుడు అర్థమవుతాడు, సమిష్టి అర్థమైతే అంతా అర్థమైనట్లే.

సమిష్టిజీవుడు తెలిస్తే అద్వైతి అవుతాడు. (అద్వైతంలో రెండవ వాడులేడుగనుక) సమిష్టిజీవుడు అర్థంకాకపోతే ద్వైతిఅవుతాడు(ద్వైతంలో జీవుడని దేవుడని ఇద్దరు వేరైవుంటారు గనుక). అందుకే ద్వైతులకు కర్మ ఫలం వ్యక్తిగతంకాగా, అద్వైతులకు మోక్షఫలం సమిష్టిగా వుంటుంది.

## అన్వయ- వ్యతిరేకాలు

భౌతిక తత్వశాస్త్రంలో వస్తువుకి, పదార్థానికి అభేదం తెలియడానికి అనేక పద్ధతులు అనుసరిస్తూ చెబుతూవుంటాం. అదేవిధంగా ఆధ్యాత్మిక తత్వశాస్త్రంలో దేవునికి, జీవునికి అభేదం అర్థంకావడానికి పద్ధతులు, రీతులు అవసరమైనవి. చెప్పేవిషయం ఒక్కటైనా చెప్పేతీరు, రీతి వేరుగావుంటై. కారణం ఒకేచోట (ఒకేదానియందు) రెంటిని చూడాలి. ఆ రెంటిని ఒకటిగా అర్థంచేసుకోవాలి, అలా అర్థంకావడంకోసమే అనేక పద్ధతులు అవలంబించవలసి వచ్చింది.

సంగీత విద్యలో ఆరోహణ, అవరోహణ అనే స్థాయీభేదాలు వున్నట్లు గానే తత్వశాస్త్రంలో అన్వయము, వ్యతిరేకము (సంశ్లేషణ, విశ్లేషణ) అని రెండు రీతులు వుంటై. అలా ఆరోహణ, అవరోహణ రెండూ కలిసే సంగీత మవుతుంది.

ఆరోహణలో అనగలిగి, అవరోహణ అనలేకపోతే (అవి అర్థంకాక పోతే) అది సంగీతం కాదు, అంటే అది మనకు వినసొంపుగా వుండదు, అందుచేత ఆరోహణ, అవరోహణ అనే స్థాయీబేధాలను సక్రమంగా అర్థం చేసుకుని అనగలిగితే అది సంపూర్ణ సంగీత జ్ఞానమవుతుంది. అప్పుడే సుస్వర సంగీత మవుతుంది.

అలాగే తత్వశాస్త్రంలో అన్వయ, వ్యతిరేకాలు రెండు సాపేక్షంగా అర్థంకాకపోతే సమన్వయం కుదరదు, అన్వయం మాత్రమే అర్థమైతే (అదే సత్యమనుకుంటే) నానాత్వ భిన్నత్వాలకు ఏకత్వం (సమన్వయం) అర్థంకాదు, లేక వ్యతిరేకంలో మాత్రమే తత్వాన్ని అర్థంచేసుకుంటే ఏక త్వానికి నానాత్వానికి వున్న సంబంధం సమన్వయం తెలియక తికమక పడతారు, ఆ దశలోనే కేవల అస్తిత్వభావం అభివృద్ధి అవుతుంది.

అలాగే అద్వైతంలోని అధ్యారోప, అపవాదాల సమన్వయం తెలిస్తే తత్వమ్ (తత్, త్వమ్) పూర్తిగా తెలిసినట్లు, అపుడే జీవ, బ్రహ్మములకు సాపేక్ష అస్తిత్వం అర్థమవుతుంది అంటే జీవ, బ్రహ్మములకు అభేదం అర్థమవుతుంది. అలా అర్థంకాకపోతే సమన్వయం కుదరక జగత్తు మిథ్య అనుకుంటాము. అద్వైతులలో చాలామంది కేవలం వ్యతిరేకంలోనితాత్వి కాంశాలు మాత్రమే అర్థం చేసుకోవడంవల్ల బ్రహ్మ సత్యం జగత్తు మిథ్య అనడం జరుగుతూ వున్నది, నానాత్వ, భిన్నత్వాలకు సమన్వయంగాని అందుకుగల కారణాలుగాని అర్థంకావు, అలా ఏ ఒక్కదానిని మాత్రమే అర్థంచేసుకుంటే అది పూర్తి (పూర్ణ) తత్వం కాదు. అందుచేత నిరపేక్ష భావంకలిగి కేవల అస్తిత్వభావం స్థిరపడుతుంది. అట్టివారు ద్వైతులవు తారేగాని అద్వైతులు కానేకారు.

## పాలకులు - పాలితులు

పాలకులు (రాజరికంలో రాజులుగాని, ప్రజాస్వామ్యంలో అధికారులు గాని) ప్రజ్ఞతో ప్రజలను పీడించి, బాధించి వ్యావహారిక సుఖజీవులు కావచ్చు. సమాజంలో వారు ప్రత్యేక వ్యక్తులుగాను కనిపించవచ్చు, గుర్తించబడవచ్చు. అటువంటివారిని దైవాంశసంభూతులుగా (దేవుని అంశంనుండి పుట్టినవారుగా) చెబుతూవచ్చారు ద్వైతులు. అటువంటి పాడుభావమే భారత, భాగవతాది గ్రంథాలనిండా చూడవచ్చు.

భక్తిచేసే ప్రతిభక్తునికి ఆ భక్తి ఫలితం వ్యక్తిగతంగా ఆ వ్యక్తికే లభిస్తుంది, వీరి దృష్టిలో ఉత్తమ, అధమజీవులని రెండురకాలు. అధమ జీవులు భక్తిద్వారా ఉత్తమ జీవులుకావచ్చును. (పుట్టవచ్చును). ఉత్తమ జీవులు వారి పూర్వజన్మ సుకృత ఫలితంగా ఈ జన్మలో ఉత్తమ జీవులుగా పుట్టవచ్చును, ఆ ఉత్తమ జీవులు ఈ సమాజంలో ఏ దుర్మార్గపు పనులు చేసినా, ఏ విధమైన నీచానికి పాల్పడినా అదంతా వారి దృష్టిలో దైవకార్యమే (దైవలీలలే).

కాని అద్వైత దృష్టిలో ఉత్తమ, అధమ జీవులని రెండు రకాలు లేవు, జీవులంతా ఒకే స్థాయిగలవారే, అందుకే వ్యక్తిగత జీవులు కాక సమిష్టి జీవుడే జీవుడు. ఆ జీవునియందు పైన చెప్పిన తారతమ్యాలు వుండవు. రాజరికపు రాజులు దైవాంశ సంభూతులైతే ఆ రాజ్యంలోని సామాన్యజీవులంతా ఏ అంశంనుండి పుట్టారనేది చెప్పరు వారు. కాని అద్వైత సూత్రంప్రకారం జీవులంతా దైవస్వరూపాలేగనుక వారికి బంధం లేదు, ఆ కారణంగా వారికి మోక్షం కొరకు ప్రత్యేకంగా ప్రయత్నం చేసే సమస్యేలేదు, మోక్షం సిద్ధించేవున్నదిగనుక ప్రయత్నపూర్వకంగా పొందె మోక్షం లేదు.

## మానవుడి స్వాతంత్ర్యము

అలాగే భౌతికతత్వశాస్త్రంలో మానవులంతా పరిణామంలో వచ్చిన జీవులే గనుక వారు ఏ దైవభావానికి బానిసలుకారు, కానక్కర లేదు.

వారికి స్వతస్సిద్ధమైన స్వేచ్ఛ వున్నది. ఆ విధమైన స్వేచ్ఛ తనకున్న దని తాను గుర్తించడమే జరగాలి. అలా గుర్తించనంత కాలం తాను మానసికంగా బానిసే (అస్వతంత్రుడే). తనకు వున్న ఆ స్వేచ్ఛ తానుగా పొందేదేగాని ఇతరులు ఇచ్చేది కాదు. ఇతరుల ద్వారా పొందే స్వేచ్ఛ, స్వతస్సిద్ధమైనదికాదు, శాశ్వతమైనది కాదు. అలా ఇతరులు స్వేచ్ఛ ఇస్తే ఆ ఇచ్చిన వారు పోగానే ఆ ఇచ్చిన స్వేచ్ఛ కూడా పోతుంది. అందుచేత స్వేచ్ఛ అనేది ఇచ్చి పుచ్చుకునేదికాదు. అది తానుగా (జ్ఞానం ద్వారా) తన స్వేచ్ఛను గుర్తించాలి.

## జ్ఞాని - ప్రజ్ఞాని

వ్యావహారిక, తాత్విక విషయాలను సమన్వయంతో (సాపేక్షంగా) చూచిన వాడే తత్వవేత్త, అతడే ప్రజ్ఞాని. వ్యావహారిక తాత్విక విషయాల్ని సమన్వయంతో విచారించి, (ఆలోచించి) చూచిన వానిలో ప్రజ్ఞ (ప్రతిభ) జ్ఞానం (సమన్వయం) వున్నదన్న మాట. ప్రజ్ఞాని జ్ఞాని కావడంచేత (ప్రజ్ఞ, జ్ఞానము) సాపేక్ష స్థితిలోవుండి ఎదుటి వానిని తనకు వేరుగా చూడక తనలోనే (తానుగానే) చూచుకుంటాడు. అలా చూడగలగడంచేత ఎదటి వ్యక్తికి సంబంధించిన సంపదను (శ్రమశక్తిని) తాను పొంది (దోచుకుని) దానివల్ల తాను సుఖించాలనుకోడు. అదే వ్యావహారిక ప్రతిభ (ప్రజ్ఞ) కు, తాత్విక సమన్వయానికి (జ్ఞానానికి) వున్న తేడా. అందుచేత మనలోని నిరపేక్ష భావంతో అభివృద్ధి అయిన వైయక్తిక మనోభావాన్ని విడిచి సాపేక్ష భావంతో (సమిష్టి భావంతో) జీవించడానికి అలవాటు చేసుకోవాలి. మనిషిలో సమిష్టి భావం ముందు అలవడితే పరస్పరం సహకార భావం పెంపొందుతుంది. అలా సమిష్టి, సహకార భావాల మధ్య జీవనం సుఖ జీవనమవుతుంది. అదే జ్ఞానానికి నిదర్శనం. జ్ఞానం లేని వ్యక్తుల మధ్య సుఖ జీవనం ఎలా సాగుతుంది? అందుకే జ్ఞానం అన్నిటికంటే అవసరమైనది.

## సాపేక్షం

'సాపేక్షమంటే యేమిటి? దాంతో మనకేమి పని వచ్చింది? అయినా అది అందరికి అర్థమయ్యే విషయమా?' అని అందరు అనుకోవడం జరుగుతూవుంటుంది. సాపేక్ష మనే పేరు కొత్తది కావచ్చు. దానిని

సిద్ధాంత పరంగా అర్థంచేసుకుని ఇతరులకు చెప్పలేక పోవచ్చు. కాని సాపేక్ష మనేది మన నిత్య జీవితంలో ప్రతి మనిషి ప్రతి క్షణము అనుభవిస్తూవుండే సత్యవిషయం.

అన్నదమ్ములు - అన్నవున్నాడు అంటే అతడితో కూడా తమ్ముడు సాపేక్షంగా వున్నాడని అర్థం. తమ్ముడు లేకుండా అన్నకాలేడు ఏ వ్యక్తి. అక్క, చెల్లెండ్రు - చెల్లెలు అన్నాము అంటే ఆమెకు అక్క సాపేక్షంగా వున్నదనే గదా అర్థము. భార్యా, భర్తలు - భర్త సాపేక్షంగా లేనిదే భార్య వుండదు. అలాగే భార్య లేనిదే భర్త వుండడు. భార్యలేని పురుషుని భర్త అనము. అలాగే భర్త లేని స్త్రీని భార్య అనము. స్నేహితులు - ఇద్దరు వ్యక్తులు సాపేక్షంగా వుంటేనే స్నేహము అంటాము. ఇద్దరు వేరువేరుగా వుంటే స్నేహితులు కారు. అది స్నేహము కాదు. ఉచ్ఛ్వాసలో సాపేక్షంగా నిశ్వాస కూడా వుంటుంది. అలా అవి సాపేక్షంలో వున్నప్పుడే ప్రాణము అనే వ్యవహారం వుంటుంది. ఇలా నిత్య జీవితంలో ప్రతి సంఘటన సాపేక్ష రీతిలోనే వుంటుంది. వ్యావహారిక విషయంలో సాపేక్షం ఇలా వుండగా ఇక తాత్విక విషయంలో అది ఎలావుంటుందో చూద్దాం.

## తత్వశాస్త్రంలో సాపేక్షం

అజ్ఞానాన్ని పారదోలింది విజ్ఞానం. విజ్ఞానం విశ్వరహస్యాలను వివరిస్తుంది. స్థల, కాలాలు నిరపేక్షంగావుంటై అని ఆధ్యాత్మిక తత్వవేత్తలు అనుకున్నారు. అది అవాస్తవమని ఆధునిక విజ్ఞాని "అయిన్‌స్టీన్" విశదపరిచాడు అందువల్ల ఆధ్యాత్మిక తత్వసూత్రాలు అసత్యాలుగా అర్థమై పోయినవి. నిరపేక్షమైనది ఏదీ విశ్వంలో వుండదనేది ఆధునిక విజ్ఞాన శాస్త్రం నిర్ధారణ చేసిన విషయం.

పదార్థంతో చలనం సాపేక్షం. పదార్థ చలనాలతో ప్రదేశ కాలాలు సాపేక్షం. వస్తువుతో పదార్థం సాపేక్షం. పదార్థంతో శక్తి సాపేక్షం. మేనుతో "నేను" సాపేక్షం. మేనుతో ఇంద్రియాలు సాపేక్షం. ఇంద్రియాలతో మనసు సాపేక్షం. మనసుతో సంకల్పం, సంకల్పంతో విచక్షణ, విచక్షణతో బుద్ధి సాపేక్షం. అలా పరస్పరం అంతా సాపేక్షమే. వస్తువు వున్నది అంటే

ప్రక్కనే లేకుండా వుండడం (ప్రదేశం) కూడా వున్నది. లేకుండా వుండడం, కలిసే వుండడం అవుతుంది. ప్రదేశంలేనిదే వస్తువుండదు. వుండడానికి వీలుకాదు. వస్తువు లేనిదే ప్రదేశం ఉనికిలో వుండదు (అర్ధంకాదు). కాలంలో సంఘటన జరుగుతుందనేదితప్పు. సంఘటన జరగటంతోనే కాలమనేది ప్రారంభమవుతుంది. అందుచేత ప్రదేశ కాలాలు, పదార్ధ చలనాలు అనే నాలుగు మితుల మధ్యవిశ్వంవున్నది అనేది రుజువు కావడంతో విశ్వానికి దైవం కారణమనే ఆధ్యాత్మిక సూత్రం అంతర్ధానమైనది. అది గుర్తించడం కోసమే ఈ వివరణఅంతా.

## పిండాండ - బ్రహ్మాండవ్యాఖిలం

ఇలా సాపేక్ష సూత్రాలు అభివృద్ధి అయి, ఆధ్యాత్మిక సూత్రాలు అసత్యాలు కావడంతో ఆధ్యాత్మిక వాదులు తమ వాదంలోనే సాపేక్షం అంతా చెప్పబడివున్నదని అనడం ప్రారంభించారు. కాని సాపేక్ష సూత్రం వారి నిరపేక్ష (కేవల) దైవ అస్తిత్వభావానికి పూర్తిగా వ్యతిరేకమనేది గుర్తించలేదు. వ్యావహారిక తాత్విక విషయాలను సమన్వయ పరిచేది సాపేక్ష సూత్రం కాగా, వాటిని వేరువేరుగా చెప్పింది ఆధ్యాత్మికవాదం.

వ్యావహారిక తాత్విక విషయాలను అలా సమన్వయం చేసుకోగలిగినవాడే జ్ఞాని అని తెలుసుకున్నాం. అట్టి జ్ఞానికి ద్వయీభావంవుండదు. జీవుడు, దేవుడు నిరపేక్ష మనుకుంటే ద్వైతమని, జీవ బ్రహ్మములను సాపేక్షంగా అర్థంచేసుకుంటే అద్వైతమని తెలుసుకున్నాం. పిండాండమందు జీవుడు, బ్రహ్మాండమందు బ్రహ్మము వున్నారనుకోవడం ద్వైత వాదం. పిండాండ బ్రహ్మాండములు వేరుకాదు, అవి రెండు సాపేక్షంగా ఒకటేననేది అద్వైత సిద్ధాంతం.

బ్రహ్మాండమందు బ్రహ్మముగా వున్నదే పిండాండమందు జీవుడుగా వున్నడనుకుంటే అవి రెండు రెండుగా వేరైనవా? అలా వేరైన (ఆత్మ, పరమాత్మ) ఆ రెంటిని (కలిపి) ఐక్యముచు చేయాలా? అలా చేస్తే వారు ఐక్యమవుతారా? అలా ఆ రెంటిని ఐక్యముమ చేయు ఈ మూడవ వాడెవడు? తత్, త్వమ్‌ల వివరణ చెప్పేవాడెవడు? అలా చెప్పినదానిని అర్ధంచేసుకునే దెవడు?

## వ్యావహారిక జీవుడు - వ్యావహారిక జీవితము

వ్యావహారిక జీవితమును మాత్రమే ప్రతిభావంతంగా సాగిస్తూ ఇదే సత్యమనుకునేవాడు జీవుడు. వ్యావహారిక, తాత్విక సమన్వయంతో (ప్రజ్ఞాని) అతడే బ్రహ్మము (ఉత్తమ మానవుడు), సమిష్టి జీవుడు. అదే అద్వైతం. జ్ఞాన, ప్రజ్ఞానములు రెండు కాదని తెలియడమే అద్వైత జ్ఞానము. నిజమైన అద్వైత జ్ఞానము కలిగిన క్షణమే వ్యావహారిక జీవుడని, తాత్విక జీవుడని భేదభావం వుండక జీవితాన్ని సుఖవంతం చేసుకుంటాడు. జీవితం బుద్బుదప్రాయమని, జన్మరాహిత్యమే జీవితధ్యేయమని అనుకునే ద్వైతబుద్ధి ఏ కాలానికీ ఏ తాత్వికసూత్రానికీ సమన్వయం కుదరనిది. అది ఈ కాలానికి అసలే పనికిరానిది.

## అద్వైతము - అపకారము

అద్వైత సిద్ధాంతం పేరుతో శంకరుడు దేశానికి తీరని (తాత్వికంగా) అపకారం చేశాడని అంటూవుండటం తరచు వింటూవుంటాం. కాని నా దృష్టిలో అద్వైతాన్ని కాదని ద్వైతం చెప్పిన మధ్వాచారే తాత్విక జగత్తుకి చేసిన అపకారం అధికమని, అపారమని. దానికి కారణం శంకరాచార్య జ్ఞాన మార్గం చెబితే మధ్వ దానిని కాదని భక్తి మార్గం ప్రవేశ పెట్టి తద్వారా మనిషిని జ్ఞాన శూన్యుణ్ణి చేశాడు. అంత కంటే అపకారం మరే దుంటుంది?

## భక్తి జ్ఞానానికి శత్రువు

అందుచేత భక్తి అనే మహా ప్రవాహంలో జ్ఞానం అనే నౌక మునిగి ముక్కలై పోయింది. భక్తి దామాషా యెంత పెరిగితే ఆ దామాషాలో జ్ఞానం తరుగుతుంది గదా? జ్ఞానం యెంతగా తరిగితే ఆ దామాషాలో నైతిక విలువలు తరిగిపోతూ వుంటై గదా? నైతిక విలువలు తరిగిన వ్యక్తుల సమాజం అంటే ఎలావుంటుందో మనం చూస్తూనే వున్నాం కదా? సమాజంలో నైతిక విలువలు తరగడానికి తాత్విక పరిజ్ఞానం తరగడమే, కారణమనేది ముందు తెలుసుకున్నాం.

తాత్వికంగా ద్వైవభావం, వ్యావహారికంగా వైయక్తిక భావం మానవుణ్ణి అజ్ఞానంలో వుంచుతూ వున్నది. భక్తిభావం వదలనిదే జ్ఞానం అవసరం తెలియదు. జ్ఞానం రానిదే భక్తిభావం పోదు. పిచ్చి కుదరడమూ, పెండ్లి జరగడమూ అనే సామెతగా వున్నది. కాని పిచ్చి కుదుర్చుకుని పెండ్లి చేసుకోవడమే మంచిదనేది మన అభిప్రాయం. అంటే జ్ఞానం సంపాదించడంద్వారా భక్తిభావం దానంతటదే పోతున్నది. 'విధియై మది వెల్లుమ్' అనే సామెత తమిళంలో వున్నది. అంటే విధి అనేదానిని బుద్ధితో జయించవచ్చు ననేది అర్థం. జ్ఞానంద్వారా అన్ని శక్తులను అధిగమించ వచ్చు ననేది దాని తాత్వికార్థం. జ్ఞానంయొక్క ప్రాధాన్యతను ప్రక్కకు పెట్టి భక్తి పేర అజ్ఞానాన్ని అభివృద్ధి చేసుకున్న మన సమాజం దాని విష ఫలితాలను అనుభవిస్తూ వున్నది.

## అభేద భావము

అద్వైత సూత్రాలుగాని, సాపేక్ష సూత్రాలుగాని సిద్ధాంతరీత్యా అభేద భావాన్నే చెప్పినవనేది ముందు తెలుసుకున్నాం. భక్తి జ్ఞాన యోగ సాధనాల ద్వారా దానిని (ఐక్యతను) సాధించవచ్చు ననుకోవడం అజ్ఞానం. అదికాదు అద్వైతమంటే. అవి రెండు కాదని తెలియడమే నిజమైన అద్వైతం. కాని అద్వైతంలో ద్వైతం చేర్చడంవల్ల అభేదభావం అర్థం కావలసినచోట భేదభావమే అర్థమవుతూ వచ్చింది.

మహాకాశంనుండి ఘటాకాశంగాని, జలమునుండి బుద్బుదంగాని, బంగారంనుండి నగగాని, పదార్థంనుండి వస్తువుగాని వేరుకానట్లే దాని నుండి ఇది వేరు కాలేదు. ఇదే అది అని, అదే ఇది అని, ఇది అది ఒకటేనని తెలియడమే నిజమైన (విచక్షణా) అద్వైతము. అజ్ఞానము వలన అవి వేరని (రెండని) భావించాం. ఆ కారణంగా భేద బుద్ధి పెరిగింది. దానికి ఇది వేరని, దీనికి అది వేరని అనుకుంటూవచ్చాం. జ్ఞానంవల్ల అవివేరు (రెండు) కాదని తెలుసుకున్నాం. ఇటువంటి అభేద భావం తాత్వికంగా అర్థం చేసుకున్న వ్యక్తులు (జ్ఞానులు) తమ వ్యావహారిక జీవితంలోకూడా వర్గ, వర్ణరహిత (అభేద) జీవన విధానాన్ని అలవరచుకుంటారు. అదేకదా మనకు కావలసింది.

అద్వైతంలోగాని, ద్వైతంలోగాని, భౌతికంలోగాని తాత్విక విష యంలో మాత్రం సమధర్మ సూత్రాలు వల్లెవేస్తూ, అభేద సిద్ధాంతాలు చెబుతూ వ్యావహారిక జీవితంలో భేదబుద్ధి కలిగి జీవించే వ్యక్తులు తమ జీవితంలో ఏమి సాధించలేక నిరర్థక (వ్యర్థ) జీవులై జీవిస్తూవుంటారు.

## పీడిత ప్రజలు

అలాంటి సమయంలోనే ఆ వ్యక్తి ఆలోచనకు దూరమై వివేకాన్ని కోల్పోయి కోరికలను సాధించు కోవడానికి దైవభక్తుడు కావడమో, కాక పోతే దౌర్జన్య చర్యలకు దిగడమో చేస్తాడు. దైవం అన్నీ ఇస్తుందనే భావాన్ని, నమ్మకాన్ని ఆస్తికవాదం కల్పించింది గనుక దైవభక్తుడు అవుతాడు. ఎలాగైనా తన కోరికలు తీర్చుకోవాలని చూస్తాడు. ఆ దశలో తాను జీవిస్తూవున్న పద్ధతి తప్పని తెలుసుకునే స్థితిలో వుండడు, చేస్తూ వున్న పని తప్పని తెలుసుకోలేడు.

పీడిత సమాజంలో (వర్గ వ్యవస్థలో) దోపిడి అనేది సర్వ సాధార ణంగా సాగుతూ వుంటుంది. అది సాధారణమైన వృత్తిగా మారిపోయింది. (ఒకరిని ఒకరు దోచుకోవడం ఈనాడు సామాజిక ధర్మమైపోయింది) దాని వల్ల దారిద్ర్యము, దగా, మోసము, అవినీతి పెరిగిపోయినై.

## ప్రవృత్తి గుర్తించని పదార్థశక్తి

లేని దేవుడు వున్నాడని అనుకోవడంవల్ల వున్న జీవుడు సరిగా అర్థం కాలేదు. దైవంమీద నమ్మకంతోను, ఆ దైవశక్తి మీద విశ్వాసంతోను మానవ (జీవుని) శక్తిని మరిచాడు, ఉన్న పదార్థశక్తిని గుర్తించక, లేని పరాశక్తిని నమ్ముకున్నాడు. అందువల్ల తాను శక్తిహీనుడైనాడు. తనను (ఆత్మను) మరచి పరమాత్మను తలచి సదా ఆ తలపుతోనే సతమతమవుతూ చివరకు తాను అధ్వాన్నపు స్థితిలో అంతమవుతున్నాడు. జన్మరాహిత్యమే జన్మకు వచ్చిన (తన) జీవుని జీవితధ్యేయ మనుకొని అదే తన జీవిత పరమావధి, పరమార్థము అనుకొని అందుకు జన్మ రాహిత్యానికి మార్గాలు (లేకపోయినా) వెదుకుతూ వుంటాడు. అలాంటి ఆధ్యాత్మిక భావవైరుధ్యాల మధ్య బలవంతపు జీవితం సాగిస్తూ వుంటాడు. (ప్రవృత్తిలోవున్న తప్పు వల్ల).

ఏ ప్రవృత్తి నుండి తాను తనవృత్తిలో అవినీతికి అక్రమాలకు దిగజారు తున్నాడో ఆ ప్రవృత్తిలో ముందుగా (అతనిలో) మార్పురావాలి. ఈ మనఃప్రవృత్తికి ఆ వైయక్తిక ప్రవృత్తి కారణం. పైన చెప్పబడిన అహేతుకమైన ఆ తాత్విక సూత్రాలు అందుకు ప్రధాన కారణం. అందుచేత ఆ కారణాలను ప్రవృత్తిరీత్యా సమూలంగా నాశనం చేయనిదే కార్య రూపంలోవున్న ఈ వృత్తిలో మార్పురాదు.

అలా అవినీతి చోటుచేసుకుని అది స్థిరపడటంవల్ల దానికి అలవాటుపడి జీవించే పరిస్థితి యేర్పడింది. అటువంటి పరిస్థితిలో యేవ్యక్తి కూడా మానసిక సంతృప్తి కలిగి వుండడు, ఒకవిధమైన కృత్రిమ ప్రవృత్తికి (ఉద్వేగానికి) అలవాటుపడి జీవిస్తూ వుంటాడు. ఆ కారణంగా ప్రతిక్షణము భయ, భ్రాంతులమధ్య పరాధీన మనస్కుడై జీవిస్తూవుంటాడు. ఆ కారణంగానే తన జీవితంపై తనకు నమ్మకం కుదరదు. ఆధ్యాత్మిక భావవాదం అజ్ఞానపు (తాత్విక) సూత్రాలు తన జీవితానికి సమన్వయం చేసుకోలేకను ఇటు భౌతిక తాత్విక సూత్రాలను అర్ధం చేసుకోలేక పోవడంతోను మానవాతీత శక్తులపై నమ్మకం పెంచుకుని తద్వారా తన (మానవ) శక్తిని గుర్తించలేడు. అటువంటి హీనపరిస్థితి ఏర్పడుతుంది. ఈ మొత్తం కారణాల కారణంగా వాస్తవాన్ని గుర్తించలేని అజ్ఞాని అవుతున్నాడు. ఇది పీడిత సమాజ పరిస్థితి. పీడించే (దోపిడి) వర్గానికి ఈ పరిస్థితే కావాలి. అపుడే వారి దోపిడీని ఎదిరించే వారుండరు.

## విశ్వ మానసము - విశ్వాత్మ

ప్రవృత్తిరీత్యా తాను తన తప్పుని గుర్తించనపుడు తాను తన వృత్తిలో చేస్తూవున్న అక్రమాలుగాని, అవినీతిగాని తప్పులేదనుకుంటాడు. అందుకు మరొక కారణంకూడా వున్నది. ఒక ప్రక్కన మానసిక వారసత్వాన్ని (జన్మ పరంపరను) అంగీకరిస్తూనే మరొకప్రక్క విశ్వ మానసం యొక్క అంశంగానే తన మనసు పనిచేస్తూ వున్న దనుకోవడంవల్ల తన మనసుకి ప్రత్యేక (స్వతంత్ర) అస్తిత్వం వున్న దనుకోవడంలేదు. అలా తన మనసుని విశ్వాత్మ (విశ్వ మానసం) అనేదానికి తాకట్టు బెట్టుకొని తాను అస్వతంత్రుడవు తున్నాడు. అందువల్ల తాను చేస్తున్న పనికి తాను

కారణం కాదనుకుంటున్నాడు. తాను నిమిత్తమాత్రుడ ననుకుంటున్నాడు. అలా తాను మానసికంగా బానిస కావడంవల్ల తన మనసుతో తాను ఆలోచించలేక పోతున్నాడు. తత్ ఫలితంగా తన అనేక మానసిక దుర్గతులకు తానే కారణమవుతున్నాడు. ఆ కారణంగానే తన జీవితంలో తాను సమన్వయం సాధించలేక పోతున్నాడు. జీవితంలో సతమత మవుతున్నాడు. చివరకు తాత్వికరీత్యా తెలియనివాడుగాను అవుతున్నాడు. జీవితంలో చిక్కుల పాలవుతున్నాడు.

## పరస్పర వైరుధ్యాలు

ఆధ్యాత్మిక వాదంలో వచ్చిన పరస్పర వైరుధ్యాలు, (ద్వైత, అద్వైత) సిద్ధాంతాలు. మతంలో వచ్చిన (శైవ, వైష్ణవ) వైరుధ్యాలు, ఆ వైరుధ్యాలవల్ల వారిలో వచ్చిన భేదాలవల్ల వారిమధ్యన కలతలు, కొట్లాటలు ఆ మతాన్ని యెంతగా నీరస పరిచినవో, యెంత నీచంగా చూడ బడినవో అర్థం చేసుకుంటే అర్థమవుతుంది. వారిలో సమన్వయంలేని వాటి (వైరుధ్యాల) సిద్ధాంత, రాద్ధాంతాల ప్రయోజనం యెలాంటిదో అవి సమాజానికి యెందుకు దూరమైనవోకూడా అర్థమవుతుంది. (పనికిమాలిన సిద్ధాంతాలని కూడా),

## భేదాభిప్రాయాలు

మౌలిక సిద్ధాంత భేదం లేని వ్యక్తులమధ్య (తాత్వికులమధ్య) సామాన్య (లౌకిక) విషయాలు చర్చకు వచ్చినప్పుడు స్వల్ప వైరుధ్యాలు కనిపించవచ్చు. భేదాభిప్రాయాలు వుండవచ్చు. కాని ప్రధానమైన తాత్విక సూత్రాలు అర్థమైన ఆ వ్యక్తులమధ్య సమన్వయం వుండాలనేగాని వైరుధ్యంతో కూడిన భేదాభిప్రాయాలు వుండకూడదు. అటువంటి వాటికి తావుండరాదు. ఏమైనా చిన్నచిన్న విషయాలయందు అభిప్రాయ భేదాలు వచ్చినా కొంత సౌమనస్యంతో ఆలోచించి సమన్వయం సాధించవచ్చును. అలా కాకపోతే మనం సాధించగలిగేదేమి వుండదు.

## ఆలోచించే స్వేచ్ఛ

కనుక ఈ చిక్కులనుండి బయట పడాలంటే ఆలోచించే స్వేచ్ఛ తనకున్నదనే గుర్తింపు తనకు కలగాలి. విశ్వమానసము (దైవమనసు) తన మనసు మీద ఆధిపత్యం చేయడంలేదని ముందు గుర్తించాలి. (అసలటువంటి దైవమన సనేది లేదు. వుంటుందనేది అబద్ధం) ఉన్నది ఒకటే మనసు. అదే తన మనసు (జీవమనసు). దైవమనసు (పరమాత్మ) జీవ మనసు (దేహాత్మ) అని రెండులేవు. ఉన్నది ఒకే ఒక జీవాత్మ మాత్రమే అని గుర్తించాలి, అలా గుర్తించితే తాను స్వేచ్ఛా జీవుడవుతాడు. తద్వారా స్వేచ్ఛా సంకల్పానికి, స్వేచ్ఛా ఆలోచనకు అర్హుడవుతాడు అదే స్వేచ్ఛ అంటే. అటువంటి స్వేచ్ఛను ఎవరైతే గుర్తిస్తారో వారే నిజమైన స్వేచ్ఛా జీవులు, స్వేచ్ఛా ఆలోచనాపరులు.

అందుచేత ఆలోచించే స్వేచ్ఛ వ్యక్తులకు వున్నదని గుర్తించాలి, అలా గుర్తించి ఆలోచించినవిషయం ఆచరించాలి. ఆలోచనలకు ఆచరణకు సమన్వయం కుదిరినపుడు స్వేచ్ఛా ఆలోచనలు తాత్విక రూపం దాల్చి వాస్తవ జీవితానికి ఉపయోగపడగలవు. అలా స్వేచ్ఛగా ఆలోచించిన వారి ఆలోచనా ఫలితంగానే నేడు విశ్వమంటే ఏమిటి? దానిలో మానవుని మను గడ ఎలాంటిది? దానిని ఎలా అనుకూలంగా మలచుకోవాలనేది అర్థమైనది.

ఆ ఉద్దేశంతోనే (ఆ అవసరంతోనే) ఈ పరిచయం వ్రాయడ మైనది. ఏ సమస్యకైనా సమన్వయమే పరిష్కారానికి మార్గంగాని సమ న్వయ రహిత సిద్ధాంతాలు ఏకరవుపెట్టి సాధించేదేమి వుండదు. సమన్వయ రహితమైన ఆలోచనలు (సిద్ధాంతాలు) నిరపేక్షమై నిరర్థకమై పోగలవు.

## నిర్వాణము, జీవన్ముక్తి, స్వేచ్ఛ

తాత్విక దృష్ట్యా ఈ మూడు ఒకే విధమైన భావం కలిగివుంటై. బుద్ధుడు ఆర్థిక, సాంఘిక, పరమైన సామాజిక (లౌకిక) సమస్యలకు, జనన మరణ సంబంధమైన (తాత్విక) విషయాలకు మనో వికలుడైనాడు. కాని వ్యావహారిక విషయానికే ఆలోచనలు పరిమితం చేయడంవల్ల కార్య

కారణ సంబంధమైన తాత్విక విషయాలలో తగిన సమన్వయం ఆలోచించ లేక పోయాడు. ఆ ఫలితంగా సమస్యకు శాశ్వత పరిష్కారం చెప్పలేక పోయాడు. చెప్పినంత వరకు అది వ్యక్తిగతంగా అర్థం చేసుకోవడం వల్ల (ఆయన అనుయాయులు) సంఘపరంగా (సమిష్టిగా) అది నిలబడలేదు. "నిర్వాణము" (బుద్ధుడు చెప్పిన తాత్విక సూత్రం.) సమిష్టి సూత్రం.

అటువంటి ఆ సమిష్టి సూత్రాన్ని ఆధ్యాత్మిక ద్వైత వాదంలో చెప్పబడిన కర్మఫలితం, మోక్షం లాగానే వ్యక్తిగతం అనుకోవడంవల్లను, శంకరుడు చెప్పిన జీవన్ముక్తి అనేది యమ్. ఎన్. రాయ్. చెప్పిన "స్వేచ్ఛ" అనేది కూడా వ్యక్తి గతంగానే అర్థంచేసుకోవడం వల్ల వాటి ప్రయోజనం (పరిమితమై) తక్కువగా అంచనా వేయడంవల్లను వాటికి గల తాత్విక విలువలు తగ్గిపోయినవి.

వ్యావహారిక రంగంలో (లౌకిక జీవితంలో) వ్యక్తిగతంగా చెప్పు కునే విషయాలు తాత్విక రంగంలో వ్యక్తిగతంగా చెప్పడానికి వీలుకాదు. చెప్పినా సమన్వయం కుదరదు. వ్యక్తిగత ఆస్తి అనేది ఎలాంటిదో అలాం టిది కాదు నిర్వాణము జీవన్ముక్తి, స్వేచ్ఛఅనేవి. వ్యావహారికరంగంలో (లౌకిక జీవితంలో) వ్యక్తిగత ఆస్తి (సంపద) ని వ్యక్తులే స్వంతం చేసు కుని అనుభవించడం ఎలాంటిదో తాత్విక రంగంలో నిర్వాణము మోక్షము (జీవన్ముక్తి), స్వేచ్ఛ అనేది కూడా ప్రవృత్తి రీత్యా వ్యక్తి గతమైనవుడు స్వార్థాన్నే సూచిస్తూ వుంటుంది. కాని వాటిని ప్రతిపాదిం చిన తాత్వికుల దృష్టిలో అవి వ్యక్తిగతాలు కావు అనేది దూరదృష్టితో ఆలో చించే వారికి అర్థంకాకపోవు.

ముక్తి అంటే అజ్ఞానాన్ని విడుచుట, మోక్షము అంటే జ్ఞానమును పొందుట. అజ్ఞానాన్ని విడవడమంటే ఒక వ్యక్తి అజ్ఞానమనికాదు. జ్ఞానం పొందట మంటేను ఒక వ్యక్తి జ్ఞానం పొందటంకాదు. శంకరుడు చెప్పిన మోక్షం అనేది కూడా సమిష్టిదే. జీవుడు సమిష్టి జీవుడు కావడంచేత మోక్షం కూడా సమిష్టిదే అవుతుంది. వైదిక మతం (ద్వైతం) చెప్పినస్వర్గ, మోక్షా లను శంకరుడు తన తాత్విక సూత్రం ద్వారా ఖండించాడు.

## సమిష్టి జీవుడు

జీవుడు అంటే సమిష్టి జీవుడే. ఆ జీవుడికి బంధంలేదు అంటే. మోక్షం సిద్ధించే వున్నదని అర్థం. అది సమిష్టి మోక్షం. అసలు శంకరుని

దృష్టిలో సమిష్టి, వ్యష్టి అని రెండు లేవు, అంతా సమిష్టే, (పిండాండమందు జీవుడని, బ్రహ్మాండమందు బ్రహ్మమని రెండుగా చెప్పలేదు) వున్నదంతా బ్రహ్మమే (జీవుడే). ఆ సమిష్టి బ్రహ్మమునకు బంధంయెప్పుడొచ్చింది మోక్షం ప్రత్యేకంగా పొందటానికి? అందులకే కాపు, 'నబంధం నమోక్షం' అన్నారు. ఇది కాదని ఏ అద్వైతి అంటాడు? అంటే అతడు అద్వైతికాలేడు. అందుచేత సంప్రదాయ వేదాంతుల వ్యష్టి జీవుని బంధంగాని, మోక్షంగాని శంకరుని తాత్వికాంశం కాదని గుర్తించాలి. అలా గుర్తించడం అందరికి మంచిది.

## బుద్ధుడు - శంకరుడు - యమ్. ఎన్. రాయ్.

"బుద్ధుని" కాలంలో బుద్ధుడు నిర్వాణము అన్నాడు. అజ్ఞానం విడచి దానినుండి స్వేచ్ఛపొందమన్నాడు. శంకరునికాలంలో "శంకరుడు" జీవన్ముక్తి అన్నాడు, అంటే బంధం అనే భావం నుండి స్వేచ్ఛను (మోక్షమును) పొందమన్నాడు. మార్క్సు కాలంలో "మార్క్సు" వర్గ రహితం కావాలన్నాడు. (వ్యక్తి దోపిడినుండి) వ్యక్తి వ్యష్టి అర్థికవిధానం నుండి స్వేచ్ఛ పొందాలన్నాడు. అలాగే "యమ్. ఎన్. రాయ్." పైన చెప్పిన వాటన్నిటినుండి (ఆర్థిక, సాంఘిక, రాజకీయ, మానసిక) స్వేచ్ఛ కావాలన్నాడు. అంటే వారి వారి కాలాల్లో వారి వారి పరిధిలో అందరూ వారి తాత్విక దృక్పథం నుండి ఏదో ఒక రూపంలో స్వేచ్ఛ కావాలన్నారు. అయితే ఆ స్వేచ్ఛ వ్యక్తి పరంగా ఏ వ్యక్తి పొందేదికాదు. అందుచేత అది సమాజపరంగా (సమిష్టిగా) పొందవలసిందే. అంటే అది అందరికి సంబంధించినది కావడం చేత అది సమిష్టిదేనని అర్థంచేసుకోవాలి. వ్యక్తి స్వేచ్ఛతో సమిష్టి స్వేచ్ఛ, సమిష్టి స్వేచ్ఛతో వ్యక్తి స్వేచ్ఛ సాపేక్షంగా వుండవలసిందే గాని అవి నిరపేక్షం కాకూడదు. అలాంటి స్వేచ్ఛ సమాజంలో శాంతి నివ్వదు, అశాంతికే మూలమవుతుంది. (అది నేడు అనుభవంలోని విషయం.)

## నిర్వాణము

నిర్వాణము అంటే విడుచుట. దేనిని విడుచుట? అజ్ఞానమును విడుచుటయే నిర్వాణము. అజ్ఞానమునువిడిచి జ్ఞానమును పొందుటయే నిర్వాణం

అంటే అది సమిష్టిదే అవుతుంది. సంఘపరంగా దానిని పొందటమే నిర్వాణం (సంఘం శరణం గచ్ఛామి). స్వేచ్ఛ దానికి పర్యాయపదం.

## స్వేచ్ఛ

స్వేచ్ఛ (యమ్. ఎన్. రాయ్) అంటే ఆర్థిక, సాంఘిక, రాజకీయ, మానసిక, తాత్విక బానిసత్వమునుండి బయటబడడం (వాటిని పొందటమే) స్వేచ్ఛ. అదే నిజమైన స్వేచ్ఛ అటువంటి స్వేచ్ఛ యే ఒక్కరికి మాత్రమేసంబంధించినది కాదు. అది మొత్తం సమాజపరంగా సమిష్టిగా పొందవలసిందే. అలా మొత్తం సంఘపరంగా పొందే స్వేచ్ఛయే నిజమైనస్వేచ్ఛ. అలాకాక వ్యక్తులు వ్యక్తిగతంగా పొందే స్వేచ్ఛ సంఘానికి దూరమై (వ్యక్తిగతమై) స్వార్థానికిదగ్గరై దోపిడికి దారి తీస్తుంది. మానసికంగా (నియంతృత్వం) వ్యక్తి ఆధిక్యతా భావం పెంచుతుంది.

సమిష్టిభావం సన్నగిల్లినపుడు మనిషిలో మమతా మమకారాలు సన్నగిలి పరస్పరం సహకారమనేది నశిస్తుంది. సమిష్టి తత్వం పెరిగిన వ్యక్తుల మధ్యనే సహకార తత్వం కూడా పెరుగుతుంది. అలా తాత్వికంగా సమిష్టి తత్వం లేనపుడు సహకార తత్వం వుండదు. అదే ఈనాటి మన వ్యవస్థలోని దోషం.

ఆ తరువాత భౌతిక విజ్ఞానం (శాస్త్రము లేక సైన్సు) అభివృద్ధి కావడం, తాత్విక విషయాన్ని పరిమితమైన అర్థంలో (హద్దుల్లో) కాక విశ్వవ్యాప్తంగా సమన్వయపరచి ఆలోచించడం, అర్థంచేసుకోవడం జరిగింది. అటువంటి తాత్విక సమన్వయావశ్యకతతో పాటు దానిని సామాజిక పరంగా కూడా సమన్వయ పరచి చూడడం తప్పని సరి అయినది. అలా సమన్వయ పరచి చూచినదే నిజమైన తత్వశాస్త్రం అవుతుంది. ఏ ఒక్క అంశాన్నో తీసుకుని విశ్లేషించి, వివరించినంత మాత్రంచేత అది తత్వశాస్త్రం కాదు, కాలేదు.

అంతవరకు (అంటే భౌతిక తత్వశాస్త్రం అభివృద్ధి కానంతవరకు) వ్యక్తిగతంగా చెప్పబడుతూ వున్న వ్యావహారిక విషయంగాని, తాత్విక సంబంధమైన విషయంగాని సమిష్టి పరంగా చెప్పడానికి మార్పుకో వలసి

వచ్చింది. వ్యక్తులు లేనిదే సమిష్టి (సమాజం, లేక సంఘం) లేదనేది గుర్తించినా, వ్యక్తుల, వ్యక్తిగత ప్రయోజనాలు (మోక్షం, స్వర్గం) లాంటి ఆధ్యాత్మిక (పారమార్థిక) ప్రయోజనాలు గాని, భౌతిక సంపద (వస్తువుల) నుండి పొందే సుఖ, సౌఖ్యాలుకూడా వ్యక్తి పరంగానే ఇంతకు ముందు తత్వశాస్త్రం ఆలోచించడం జరిగింది. అందుచేతనే అది లోప భూయిష్టమైనది. ఆ కారణంగానే అది సమాజ ప్రయోజనానికి దూరమైనది.

## భౌతిక తత్వ శాస్త్రము

ఆ లోపాన్ని గుర్తించి భౌతిక తత్వశాస్త్రంలో (విజ్ఞానరీత్యా) వచ్చిన మార్పులవల్ల ఏవిషయాన్ని వ్యక్తిగతంగా (విడదీసి) చూడడానికి వీలుకాని (వీలులేని) పరిస్థితి ఏర్పడింది. ఆ దృక్పథంతోనే ఆలోచించవలసి వచ్చింది. అలా తత్వశాస్త్రాన్ని అభివృద్ధి (మార్పు) చేసిన వారిలో కారల్ మార్క్స్, లెనిన్, మావో, యమ్. ఎన్. రాయ్, లాంటివారు ముఖ్యులు ప్రముఖులు. వారు తత్వశాస్త్రాన్ని పైన చెప్పినట్లుగా సామాజికపరంగా సమన్వయ పరచి ఆలోచించారు, తర్కించారు. ఆ సారాంశాన్ని చెప్పారు. తత్వశాస్త్ర మంటే కారణ, కార్య సంబంధాలను విశ్లేషించి, పరిశీలించి వివరించడం వరకే సరిపెట్టడంతో సరిపోదు. వాటిని అర్థంచేసుకున్న మేరకు కార్యాచరణకు సిద్ధాపడాలి, మనిషిని సిద్ధంచేయాలి.

మానవుని సుఖశాంతుల కోసం కావలసిన మార్పులను మనం చేసుకోవాలి. చేసుకోవచ్చు అనేదే తత్వశాస్త్ర ప్రయోజనంగా వారు గుర్తించారు. వారు గుర్తించిన ఆ అవసరాన్ని మనకు గుర్తింపజేశారు. ఇక్కడ (వారిలో) వ్యష్టి వాదమా? సమష్టి వాదమా? అనేది తలెత్తి చర్చనీయాంశంగా మారింది. ఆలోచించే వ్యక్తులు, ఆచరించే వ్యక్తులు వేరు, వేరుగా వుండరు, వుండటానికి వీలులేదు. వుండకూడదు. ఏ కొద్ది మందో (మేధావులు అనబడేవారు) మాత్రమే ఆలోచిస్తారు. ఆలోచించాలి అనేది కాదు, అందుచేత అందరు ఆలోచించాలి.

అలాకాక ఆలోచించే వర్గ మొకటి, ఆచరించే వర్గ మొకటి వేరై వారిరువురిలో ఎవరు అధికులు, ఎవరు అధములు అనేది చోటుచేసుకుని

తద్వారా వారి మధ్యన సంఘర్షణ రావచ్చుననేది చారిత్రికానుభవమే. బ్రాహ్మణ, క్షత్రియులమధ్య, పూజారులు, ప్రజలమధ్యవచ్చిన వైషమ్యాలకు కారణం అదే. అందుచేత ఆలోచించే హక్కు (స్వేచ్ఛ) అందరికి వుండాలి, వున్నది, అది సహజమైన స్వేచ్ఛ. ఆలోచించడానికి వ్యక్తికి స్వేచ్ఛ వున్నది. కాని, అలా ఆలోచించే విషయం వ్యక్తిగతంగా వుండదు. ఆలోచించే మనిషితోనే ఆలోచించే సమస్య కూడా చేరే వుంటుంది. అందుచేతనే ఆలోచించే స్వేచ్ఛ అతనికి వుండాలి ఆలోచించే మనిషొకచోట, ఆలోచించే సమస్య మరొక చోట వుండదు. (అలావుంటుందనుకునేది మత, ద్వైతభావము) అంతేకాక సమస్య వ్యక్తిగతంగానూ ఉండదు, దానిపరిష్కారము (మార్గము) వ్యక్తిగతంగానూవుండదు. ఇది ఆధునిక విజ్ఞానం ద్వారా రుజువైన తాత్వికసత్యం. అటువంటి భౌతిక తత్వశాస్త్రం ఆధారంగా మనం, మన సమస్యలకు పరిష్కారమార్గం ఆలోచించాలి. ఇంతగా భౌతిక తత్వ శాస్త్రం అభివృద్ధి అయినా కూడా దాని విలువలు గుర్తించలేని వ్యక్తుల ఆలోచనలకు కాలదోషం పట్టింది. ఆ గుర్తింపుని ఆవశ్యకతను తెలియజేసేదే ఈ పరిచయ పుస్తకం.

వైజ్ఞానిక సాంకేతికాభివృద్ధి కారణంగా వస్తూత్పత్తి సాధనాలలో వచ్చినమార్పులు, తద్వారా వుత్పత్తిలో వచ్చిన అభివృద్ధికి సంబంధించిన మార్పులు, ప్రయాణ సాధనాలలో వచ్చిన మార్పులు, ఇతర రంగాలలో వచ్చిన (తీసుకురాబడిన) మార్పులవల్ల ఏ విషయాన్ని, ఏ విధంగాను విడదీసి ఆలోచించడానికిగాని, చూడటానికిగాని వీలుకాదు. అలా వీలుకాని పరిస్థితి వచ్చింది. ప్రతిది సాపేక్షంలో సమన్వయంతోనే చూడాలిగాని విడి, విడిగా విడదీసి చూడలేము, అంటే మనం అర్థంచేసుకోవలసింది అంతా సమిష్టిగానే వుంటుందని. దానికి భిన్నంగా వుండదని. ఉంటుందని యెవరైనా అనుకుంటే అది తాత్విక సమన్వయం కాదు. వైజ్ఞానిక విషయం (విశ్లేషణ) వరకే తెలుసుకుంటే భౌతిక తత్వవేత్త కాలేడు. విశ్లేషణతో పాటు సంశ్లేషణ కూడా తెలియాలి. వస్తురూపంలో సంశ్లేషణలో వున్న పదార్థాన్ని విశ్లేషణ ద్వారా అర్థంచేసుకోవాలి. అదే సమన్వయం అంటేను, తత్వం అంటేను. అలా సమన్వయంతో అభివృద్ధి అయినదే నిజమైన తత్వ

శాస్త్రమవుతుంది. విజ్ఞాన రీత్యా (సైన్సు ద్వారా) విశ్లేషించుకో లేని తత్వ శాస్త్రం తత్వశాస్త్రం కాదు. అటువంటి తత్వశాస్త్రం సమన్వయం కుదరక మనకు ఉపయోగపడదు.

## తత్వశాస్త్రము అంటే ఏమిటి?

ఈనాటికిని తత్వశాస్త్రం అంటే ఏమిటి అని అడిగేవారున్నారు. ఈ పరిస్థితి యిలాగేవుంటే ఏనాటికైనా ఇలాగే అడిగేవారుంటారు. తత్, త్వమ్ కలసి తత్వం అయినది, తత్ అంటే అది. త్వమ్ అంటే నీవు. తత్వశాస్త్రము అంటే అది ప్రకృతికి (పదార్థానికి) నీకు (జీవునికి) వున్న సంబంధాన్ని తెలియ జేసేది అని అర్థం.

విజ్ఞాశాస్త్రం (రసాయన విశ్లేషణ) చదవడం ద్వారా పదార్థ తత్వం తెలుస్తుంది. ఖగోళశాస్త్రం చదవడం ద్వారా విశ్వరూపం అర్థమవుతుంది. జంతుశాస్త్రం చదవడం వల్ల జీవపరిణామ తత్వం తెలుస్తుంది. శారీరక శాస్త్రం చదవడం ద్వారా శరీర ధర్మాలు, లక్షణాల తత్వం తెలుస్తుంది. మానసిక శాస్త్రం చదవడం ద్వారా మనోతత్వం అర్థమవుతుంది. ఇక సాంఘికశాస్త్రం, ఆర్థికశాస్త్రం, చదవడం ద్వారా సామాజిక, ఆర్థిక సంబంధాల తత్వం తెలుసుకోవచ్చు.

ఇలా ఎన్ని శాస్త్రాలు విడి,విడిగా చదివినా అర్థంచేసుకున్నా పాండిత్యమో, ప్రావీణ్యతో సంపాదించినా, పొందినా వీటి అన్నిటి మొత్తం సారాంశాన్ని సమన్వయ పరచుకోలేక పోతే తత్వ శాస్త్రం తెలిసినట్లు కాదు.

శాస్త్రం చదవడం దానిని తెలుసుకోవడం వరకే పరిమితమైనవారు శాస్త్రజ్ఞులేగాని, తత్వవేత్తలు కాలేరు. అందువల్ల అటువంటి వ్యక్తులు సుఖము, ఆనందం తద్వారా పొందే మానసిక ఆనందం పొందలేరు.

శరీరానికి అందులోవుండే కర్మేంద్రియాలకుగలసంబంధం, కర్మేంద్రియాలకు, జ్ఞానేంద్రియాలకుగలసంబంధం, జ్ఞానేంద్రియాలకు, మనసుకిగల అనుబంధం, మనసుకి, బుద్ధికి (జ్ఞానానికి) గల సంబంధం, జ్ఞానానికి ఆనందానికి గల అనుబంధం, తాత్వికంగాఅర్థమైతేనే తత్వశాస్త్రం అర్థమై

నట్లు. అది సంపూర్ణంగా అర్థంకావడానికి పైన చెప్పిన శాస్త్రాలన్నీ చదివి అర్ధంచేసుకోవలసిందే. అలా అర్థం చేసుకున్న ఆ శాస్త్రాలను సమన్వయం చేసి అర్థంచేసుకుంటే అది తత్వ శాస్త్రమవుతుంది. శాస్త్రాలను చదివినవాడు సుఖపడతాడుగాని ఆనందమనేదెరుగడు. తత్వశాస్త్రం అర్థం చేసుకున్నవాడు భౌతిక సుఖముల ద్వారా ఆనందమును, తద్వారా మానసిక శాంతిని అనుభవిస్తాడు. (ఏమి తెలియనివాడు అన్నీ అనుభవిస్తాడు కాని, ఏది ఏమిటో తెలియదు, తెలియకుండా అనుభవించేది అనుభవం కాదుగదా?).

నిన్ను గురించి (లేక నన్ను గురించి) తెలుసుకుంటే, అంటే నీ, నా గురించి అనగా "నేను" ని గురించి తెలుసుకుంటే (ఆత్మ విచారణ చేస్తే) అంతా (సర్వం) తెలిసినట్లేనని అదే ఆనందానికి మార్గమని ఆధ్యాత్మిక వాదులు చెబుతూవుంటారు. కాని, అంతమాత్రంచేత ఆనందమనేది పొందనూలేరు, ఎవరు పొందనూ లేదు. అది తెలిస్తే నే అంతాతెలియడము కాదు, అందుచేత ఇక తెలియవలసింది లేకుండానూ పోదు.

"నేను" ని గురించి మాత్రం తెలుసుకుంటేనే సరిపోదు. "నేను" కి కారణమైన "మేను" సంగతి 'మేను' కి కారణమైన ప్రకృతి (పదార్థం) గురించి తెలియవలసింది మిగిలే వుంటుంది. అందుచేత తెలియవలసింది తెలిసే వరకు సుఖము, ఆనందము అనేది అందుబాటులోకిరాదు. అది తెలియకుండా అనుభవించేది సుఖము కాదు, అందువల్ల ఆనందమురాదు.

సమాజంలో అందరూ జీవించడం లేదా? అని అడగవచ్చు, కాని జీవించడం వేరు, సుఖంగా జీవించడం వేరు. సుఖంగా జీవించడం వేరు, ఆనందంగా (అనుభవించడం) జీవించడం వేరు. అది వ్యక్తుల మధ్య విషయం (వ్యక్తిగతం) కాని ఆనందంగా, శాంతిగా జీవించడమనేది సమిష్టి విషయం. అది వీటన్నిటి సమన్వయంతోనే సాధ్యమవుతుంది. అదే తత్వశాస్త్రం సాధించే గొప్ప విషయం.

ప్రకృతికి (భౌతిక పదార్థ శక్తికి) భిన్నంగా యేశక్తి లేదని, వున్నదంతా పదార్థ శక్తేనని గుర్తించినవాడు భౌతిక వాది. పదార్థేతరమైన (పరాశక్తి) దైవశక్తి ఒకటున్నదని భావించి నమ్మినవాడు ఆధ్యాత్మిక

భావవాది. ఈ రెండు వాదాలలోను ప్రధానమైన (మౌలిక)భేదం వున్నది. ఆ భేదాన్ని సక్రమ పద్ధతిలో అర్థంచేసుకోకపోతే తన ఆలోచనలలోను, తన నిర్ణయంలోను, స్పష్టతవుండదు. అందుచేత తన ఆచరణలో నిజాయితీ నైతికత లోపించి ఊగిసలాట మనస్తత్వంతోనే జీవితకాలమంతా అస్థిరంగా సాగిపోతూవుంటుంది. అందుకే తత్వశాస్త్రంలో స్పష్టత కావాలంటున్నాం.

ముప్పై, నలభై సంవత్సరాలు భౌతిక వాదిగా మెలిగి ఆ పద్ధతిలో వ్యాసాలు, పుస్తకాలు వ్రాసి ప్రసిద్ధి పొందిన గోపీచంద్, కొడవటిగంటి, లాంటి ప్రసిద్ధ రచయితలు తమ చివరికాలంలో అంతవరకు తాము తెలుసుకున్న సిద్ధాంతంపై నమ్మకం కుదరక ఆధ్యాత్మిక వాదంపై మోజు పెరిగి దానివైపు మొగ్గి ఆ ఫలితంగా స్పష్టతలేని రచనలు చేసి అభాసు పాలైనారు. అందుకు కారణం తత్వశాస్త్రంలో సమన్వయం (అన్వయం) తెలియక పోవడమే. తత్వశాస్త్రం చదువుకుంటూ పోతేనే సరిపోదు. దానిని సమన్వయ పద్ధతిలో తర్కించడం చర్చించడం చేస్తూ వుండాలి. అలా కానపుడు సమన్వయం కుదరక (అర్థంకాక) సందిగ్ధంలో పడతాం, చిక్కుల పాలవుతాం.

ఏది సత్యమైనదో, ఏది వున్నదో, అంటే ఏది మనకు అనుభవంలోనికి వస్తూవున్నదో దానిని గురించి వివరించేదే (విశ్లేషించేదే) తత్వశాస్త్రం. అయితే దైవం సత్యమని అనుకున్న కారణంగా ఆ దైవాన్ని గురించి ఊహించి ఆ ఊహను ఆధారం చేసుకుని ఆలోచించి (అనుభవంలోనికి రాకపోయినా) వివరించిందే ఆధ్యాత్మిక తత్వశాస్త్రం, లేక ఆధ్యాత్మిక భావవాదం. (భావమే ప్రధానం, ప్రాథమికం అనుకునేది భావవాదం) సత్యశోధనకు ఊహామాత్రపు టాలోచన మాత్రమే చాలదు. అందుకు అనుభవంతో కూడిన విశ్లేషణావకాశాలు కూడా వుండాలి. కావాలి.

జగత్తే సత్యమని, పదార్థమే (ద్రవ్యమే) అందుకు కారణమని ఆలోచించి, పరిశోధించి, విశ్లేషించి, వివరించినదే భౌతిక తత్వశాస్త్రం. ఇది అనుభవంలోకి (ఇంద్రియాలకు, మనసుకి కూడా) వచ్చే విషయం. (పదార్థమే ప్రాథమికం, అదే ప్రధానం) కనుక అది సత్యాన్వేషణకు నిలుస్తుంది. తద్వారా సత్యం అర్థమవుతుంది. ఇలా భిన్న రీతులలో అభి

వృద్ధి చెందిన ఆలోచనా విధానాలలోని మౌలిక సూత్రాల భేదాలను అర్థం చేసుకోవడానికి వీలుగా "జగత్ సత్యం - బ్రహ్మ మిధ్య" అని తాత్వికాం శాలతో కూడిన పుస్తకం వ్రాయాలని సంకల్పించిన సందర్భంగా కొద్ది మంది పరిచయస్థులతో (తాత్వికాభిలాషగల వారితో) ఈ విషయం ప్రస్తా వించడం జరిగింది. అందుకు వారి ప్రోత్సాహం లభించింది.

అలా లభించిన ప్రోత్సాహం వల్ల కలిగిన ఉత్సాహంతో ఆ పుస్తకం (జగత్ సత్యం - బ్రహ్మమిధ్య) వ్రాయడం ప్రారంభించాము. దానికి కూడా ఇది పరిచయంగా భావించవచ్చు. దైవందిన జీవితాలకు తత్వ శాస్త్రంతో సంబంధం యేమిటనేది కూడా ఒక ప్రశ్నగా వున్న ఈ సమ యంలో కఠినమైన తాత్వికాంశాలు అర్థం చేసుకోవడం కష్టమనేది సామాన్య మానవుల అభిప్రాయం. పైగా చదువుకున్నవారిలో దాని కోసం కాలం వృధాచేయడం దండగ అనే అభిప్రాయం కూడా ప్రబలంగా వున్నది. అది విచారకరమైన విషయం.

అందుచేత సామాన్యులకు దాని అవశ్యకతను తెలియ చెప్పి అది సులభంగా అర్థమయ్యే రీతిలో దానిని వివరించిచెప్పాలనేదే నా ఉద్దేశం. కఠినమైన తాత్వికాంశాలను సులభంగా అర్థమయ్యేటట్లు చెప్పడమంటే కొంచెం కష్టమే మనకు. అమలులోవున్న భాష అందుకు కొంత కారణంగా (అవరోధంగా) వున్నది. మన విద్యాలయాలలో బోధించే భాషలో తాత్విక సంబంధమైన పదాలు చాల తక్కువ. ఆ కారణంగా మనం చెప్పబోయే తాత్విక విషయానికి సరైన అర్థమిచ్చే పదం (అర్థమయ్యేపదం) దొర కదు. గ్రాంధికమైన (గ్రంధస్థ) భాష వాడితే సామాన్యులకు అర్థంకాదు. గ్రామ్య (వాడుక) భాష వాడాలనుకుంటే సరైన పదం దొరకదు. అధ్యా త్మిక తత్వశాస్త్రమంతా సంస్కృతంలో వున్నది. అధునిక భౌతిక శాస్త్ర మంతా ఇంగ్లీషులో వున్నది, మన భాషలో యేమున్నది? ఏదీ లేదు.

తాత్వికంగా భారతదేశం గొప్పదని (గప్పాలు) చెప్పుకుంటే సరిపో తుందా? హిందూమతానికి లోతైన తత్వశాస్త్రం వున్నదని గప్పాలు కొట్టు కునే మనం ఇక్కడ తాత్వికంగా చెప్పబడే సిద్ధాంతాలకు, వ్యావహారికంగా వున్న ఆచరణకు గల తారతమ్యం అర్థం చేసుకుంటే అర్థం కాగలదు దాని

గొప్పతనమేమిటని. అందుచేత అలా అర్థంచేసుకోవలసిన అవసరముందని గుర్తించాలి.

తాత్విక సిద్ధాంతాలకు, మతపరమైన బోధలకు సంబంధం లేకుండా పోయింది. అందుచేతనే అది ప్రజలకు సంబంధం లేకుండా దూరమై పోయింది. తాత్వికరీత్యా పొందిన జ్ఞానం, ఆచరణరీత్యా శూన్యమైనది. సిద్ధాంతాలను నమ్మకాలుగా మార్చి, ఆలోచనకు తావులేకుండా చేశారు. సంప్రదాయాలను ఆచారాలుగా మార్చి, ఆచారాలకు మనిషిని బద్ధుణ్ణి చేసి మార్పుని, లేక వాస్తవాన్ని అంగీకరించని, అర్థంచేసుకోలేని మూర్ఖుణ్ణి చేశారు.

మార్పుని అంగీకరించని మతం (లేక మనస్తత్వం) అటు భౌతిక తత్వశాస్త్రంలో వచ్చిన అభివృద్ధిని గాని, ఇటు ఆధ్యాత్మిక తత్వశాస్త్రంలో చెప్పబడిన జ్ఞాన మార్గాన్ని గాని, ప్రజలకు అందుబాటులోకి రానివ్వక వారిని అజ్ఞానంలో వుంచుతూవున్నది. మానవ (మానసిక) అభివృద్ధికి ఇది అంతరాయ మవుతూ వున్నది.

సిద్ధాంతం నమ్మకంగా మారినా, సంప్రదాయం ఆచారంగా మారినా సమాజంలో ప్రగతి లోపిస్తుంది. ఆ పరిస్థితినే మతం (పరోక్షంగా) కల్పిస్తూ వుంటుంది. అందుకు సంస్కృతి అనే ఒక పెద్ద అగాధం (అగడ్త ను) మన ముందు వుంచుతుంది. దానిని దాటలేక (దాదనలేక) మనం అజ్ఞాన పు బాటను వదలి జ్ఞాన బాటను నడవలేక పోతున్నాం. అజ్ఞానపు ముళ్లబాట మీద నడుస్తూవున్నాం. పైగా ఇదే సరైన బాట అని కూడా అనుకుంటు న్నాం. దానినే అనుసరిస్తూవున్నాం. సమర్థిస్తూవున్నాం.

దైవం నిరాకారమని నిర్ధారణ (తాత్వికంగా) చేసుకున్న తరువాత దైవ విగ్రహాలకు పూజలు చేయడం, దైవం నిర్గుణమని అర్థంచేసుకుని కూడా ఫలితాన్నాశించి భక్తి పేరుతో పూజలు చేయడం పరస్పర విరుద్ధ మైన ఆచరణ భాగం కదా? ఈనాడు అవి మరింత పెరిగి పోవడం చూస్తూ వుంటే ఆశ్చర్యం, ఆందోళన కలుగుతూ వున్నవి. మన తాత్వికస్థాయిని చూస్తూవుంటే అభివృద్ధి చెందిన తాత్వికదశనుండి ఆచరణ యెంత వెనుక బడి వున్నది తెలుస్తూ వున్నది. అందుకు కారణం ప్రజలలో తాత్విక జిజ్ఞాస లోపించడమే, జ్ఞాన ప్రబోధం జరగక

పోవడమేనని అర్థంచేసుకోవాలి. తాత్విక విషయాలను ప్రజలకు బోధించి వారిని జ్ఞానవంతులను చేయవలసిన బాధ్యత మత ప్రవక్తలపైన స్థానిక గురువులపైన వున్నది.

కాని వారికే ఆ జ్ఞానం లోపించిన కారణంగా వారు బోధించే బోధలో జ్ఞానమేముంటుంది అజ్ఞానం తప్ప? మాకు మత వైష్ణవగురువుడుండేవారు. నా చిన్నతనంలో మా ఊరు వచ్చారు మత ప్రచారం కోసం. ఏనుగులు, గుర్రాలతో బాటు తగిన శిష్య బృందం వారివెంట వుండేవారు. వారికి దిన భత్యం (బిచ్చం) గా బియ్యం, వుప్పు, పప్పులతో సహా వంట సరుకులు (కట్టెలతో సహా) పండ్లు, కూరగాయలు పంపుతూ వుండేవారు నాన్న గారు.

మా నాన్నగారు నిజాయితీగల భక్తులని ముందు చెప్పాను గదా రోజూ భక్తి కార్యక్రమాలు జరిగిపోతూ వుండేవి గురువుగారి సమక్షంలో (వారు వున్నంత కాలం ప్రత్యేక పూజలు ఏర్పాటు చేయబడినవి). ఒక రోజు తాత్విక విషయాలు చర్చకు వచ్చినవి (కావాలని మా అన్నగారు ఆ విధమైన చర్చను కల్పించారు). ఆ సందర్భంలో వారిని దైవం వున్నదని చెబుతూ వున్నారు గదా, ఆ దైవం వున్నట్లు యెలా చెప్పగలరు? అని మా అన్నగారు అడిగారు ఆ వచ్చిన గురువుగారిని. తిరుపతి వెంకన్నే అందుకు నిదర్శనం (దైవం వున్నట్లు) అని సమాధానం చెప్పారు ఆ (అజ్ఞాని) గురువుగారు.

దైవం నిరాకారమని, నిర్గుణమని తెలిసి కూడా మీరిలా చెప్పడమేమిటి? తాత్వికరీత్యా చెప్పబడినవిషయాలను వదిలేసి దైవాన్ని (ఆకారం గల) సాకార (గుణంగల) సగుణుడని చెప్పి ప్రజలను తాత్వికంగా మోసం చెయ్యడం కాదా? ఈ విధంగా చెప్పడం ప్రజలను తాత్వికంగా అజ్ఞానంలో వుంచడంకాదా? ఇది తాత్విక నేరం కాదా? అని ప్రశ్నించారు అన్నగారు. తాత్విక పరిజ్ఞానం లేని కారణంగా ఆ ప్రశ్నలకు సరైన సమాధానం చెప్పలేదు ఆ గురువుగారు. తాత్విక వివరణ ఇవ్వలేని ఆ గురువులు (మానసికంగా దెబ్బతిని) తాత్వికంగా సంకుచితులై తలలు వంచుకున్నారు. దైవ నిరూపణ అంతకు దిగజారిం దన్నమాట.

తాత్త్విక శూన్యులైన మీరు (అజ్ఞానులు) మాకు గురువులు కారని (కాలేరని) ఆ అర్హత మీలో లేదని చెప్పి ఈనాటితో మీకు పంపే దిన భత్యాలు (కొన్ని వందల రుపాయల విలువగలవి) ఆపు చేస్తున్నామని అన్నారు, అవి అందుకునే అర్హత సంపాదించి రండని కూడా అన్నారు. మరి కొన్ని రోజులు సాగవలసిన వారి మతప్రచార కార్యక్రమం ఆపుజేసి ఆ రోజే తరలి వెళ్ళిపోయారు భక్త బృందంతో సహా మా ఊరు వదలి, మళ్లీ తిరిగి రాలేదు. అలావుంటుంది మత గురువుల జ్ఞానం. (జ్ఞానం సంపాదించి గురువులైనవారు కాదు, వారసత్వంగా వచ్చిన గురువులు వారు).

నా చిన్ననాటినుండి, నాకు కలుగుతూ వచ్చిన తాత్త్విక సందేహాల నివృత్తికి, నేను అనుసరించిన విధానాల రీతినుండి, నేను సాధించిన విషయ సేకరణ యెలాంటిది? అందుకు నేను అనుసరించిన విధానమేమిటి? మా అన్నగారితో ఆధ్యాత్మిక, భౌతిక తత్వశాస్త్రాల చర్చలు యెలా సాగినవి? వాటి సారాంశమేమిటి? అనేది ఈ 'పరిచయం'లో మీకు పరిచయం చేస్తున్నాను.

ఆధ్యాత్మిక (భావవాద) తత్వశాస్త్రానికి మా అన్నగారు ప్రతినిధిగా వాదం చేస్తూ వుండేవారు. నేను (భౌతిక తత్వశాస్త్రాభిలాషిగా) వారి వాదాన్ని వ్యతిరేకిస్తూ వుండేవాడిని, అందుకు ఫలితంగా కొంత వివరణ, విశ్లేషణ జరిగేది. అలా ప్రారంభమైనది నా విషయ సేకరణ.

తాత్త్విక జిజ్ఞాస పెరగని వేదకాలంలో సాకార సగుణ దైవాన్ని ఊహించారు, తత్ ఫలితంగా దైవాన్ని విగ్రహ రూపంలోవుంచి వాటికి ఆరాధన చేస్తూ వచ్చారు. తాత్త్విక జిజ్ఞాస పెరిగిన (ఉపనిషద్ కాలం) తరువాత సాకార - సగుణ దైవం నిరాకార-నిర్గుణ దైవంగా నిర్ధారణ జరిగింది, నిరాకార- నిర్గుణ దైవానికి విగ్రహం అక్కరలేదు. ఆరాధన అవసరంలేదు. కాని జరిగిందేమిటి? జరుగుతున్నదేమిటి? ఇది తాత్త్వికంగా పతనస్థితికాదా?

ఈనాడు మనం అనుసరిస్తూవున్న అనేక విషయాలు సంప్రదాయం అనే పేరుతో అమలులోవున్నవే గాని వాటికి గల కార్య కారణ సంబంధాలను గురించి ఆలోచించం, అటువంటి ఆలోచన మనం చేస్తే మనం

సంప్రదాయమనుకుంటూవున్న విషయాలు అవి నిజంగా సంప్రదాయాలు కావని (పైగా దుస్సంప్రదాయాలని) అర్థంచేసుకోగలం. దానికి కొంత తాత్విక దృక్పథంకావాలి. కాని, తాత్విక దృక్పథం మనం ఏనాడో వదలి వేశాం గదా? అందువల్ల మన మెదడులు తుప్పుపట్టి, మనసులు బూజు పట్టి మన ఆలోచనలకు హేతు దృక్పథం నశించింది. అహేతుకమైన దాన్ని (తాత్వికంగా కానివ్వండి, వ్యావహారికంగా కానివ్వండి) ఎదిరించి నిలదీసి అడిగే తాహతుని కోల్పోయాం. డూ, డూ, బ స వ న్న లం (ఎద్దులం) మరియు మొద్దులంగా మారిపోయాం.

ఇక "అద్వైతము" అంటే యేమిటి? అని అడిగేవారు చాలామంది వున్నారు, అద్వైతం అనే పదానికి అర్థం తెలియనివారు వున్నారు. ద్వైత అద్వైతాలకు భేదం తెలియని అజ్ఞాన దశలో వున్నాం (హిందువులం అని సగర్వంగా చెప్పుకునే మనం). అసలు మన కెప్పుడు తాత్విక విషయాలు చెప్పారు గనుక అవి తెలియడానికి (భక్తి దశలోవుంచి, ముంచి మనలను అజ్ఞాన దశలో వుంచారే తప్ప)?

ఆర్యులు మన దేశానికి వలస రాకుండా వుంటే ఇక్కడ తత్వశాస్త్రం యే విధంగా వుండేది? ఆర్యుల రాకతో భారతీయ త త్వ శా స్త్ర ం యే విధంగా తారుమారైనది? భారతీయ తత్వ శాస్త్రమని ఇప్పుడు మనం చెప్పు కుంటూ వున్నది నిజంగా భారతీయ తత్వశాస్త్రమేనా? (అసలది తత్వ శాస్త్రమా? భావవాదమా?) అసలు తత్వ శాస్త్రమంటే యేమిటి? పుక్కిటి పురాణాలే తత్వ శాస్త్రమా? శాస్త్రమనే దానికి నిర్వచనం ఏమిటి?

బ్రహ్మ సూత్రాలు, ఉపనిషత్తులు, భగవద్గీత (ప్రస్థానత్రియం) లో చెప్పబడిన విషయాలు ఎంతవరకు శాస్త్ర ప్రమాణాలకు నిలిచేవి? బదరీనాథ్ (ఉత్తర ప్రదేశ్), పూరి (ఒరిస్సా), ద్వారక (గుజరాత్), శృంగేరి(కరాణ టక) లలో పెట్టిన అద్వైత పీఠాలు ఏమి బోధిస్తూ వున్నవి? అక్కడ నిజ మైన జ్ఞాన (అద్వైత) బోధ సాగుతున్నదా? లేక అజ్ఞాన (ద్వైత) బోధ సాగుతున్నదా? ఎవరు ఈ విషయాలు పట్టించుకుంటున్నారు? ఎవరికి ఆ విషయాలలో ఆసక్తి వున్నది? అలా ఆసక్తిని కోల్పోయిన మనం తత్వ శాస్త్రాన్ని ఏ విధంగా అర్థం చేసుకోగలం? ఆచరణకు ఏది ఉపకరిస్తుంది? ఏది ఉపకరించదు?

# కార్య కారణ సంబంధాలు

అందుచేత ప్రదేశ కాలాలు మనకు అర్థమై అవి మనకు స్వాధీనమై వాటితో సంబంధ పడిన మన జీవితం వ్యష్టి జీవితం కాదు. ఆ కారణంగా సమిష్టి జీవన విధానం అలవరచుకోవడం తప్పనిసరి అయినది. అది కాదనలేని సత్యం. కాదనుకున్నా వీలుకాని (అర్థంకాని) వాస్తవ మది. ఆ వాస్తవాన్ని విడిచి అవాస్తవమైన (ఆచరణకు సాధ్యంకాని) ఆలోచనలు చేయడం అనుచితమే కాక వ్యర్థం కూడా.

సాపేక్షమైన సంఘ జీవితం కాదని, స్వార్థపరమైన వ్యష్టి జీవితం కోరడం తగదు. వ్యక్తికి వ్యక్తిగతంగా ఆలోచించే స్వేచ్ఛ వున్నప్పటికిని ఆలోచించబడిన సమస్యలు సమిష్టిగానే వుంటవనేది పైన తెలుసుకున్నాం. అలా తెలుసుకుని కూడా దానికి భిన్నంగా ఎవరైనా కోరుకున్నట్లైతే ఆ వ్యక్తులకు తాత్విక సమన్వయం కుదరలేదని, అర్థంకాలేదని మనం తెలుసుకోవాలి.

ఒక కార్యానికి (సంఘటనకు) అనేక కారణాలు వుంటై. అదే విధంగా ఒక కారణంనుండి అనేక విధాలైన సంఘటనలు (కార్యరూపంలోను) చూడవచ్చు. కారణ కార్యాలన్నీ ఒకే పదార్థం యొక్క పరిణామ ఫలితాలే, రూపాలే. అందుచేత కారణ కార్య సంబంధాలు హేతుబద్ధాలు. హేతుబద్ధమైన కార్య కారణ సంబంధాలే సమిష్టిలోని విశ్వానికి కారణం.

అలాకాక ప్రతి సంఘటనకు దైవ సంకల్పమే కారణమని నమ్ముతూ వుండడంవల్ల కార్య కారణ సంబంధమైన విశ్వ రహస్యాలుగాని, దాని సహజ పరిణామ తత్వంగాని అర్థంకాలేదు. అందుచేతనే నమ్మకమే మూలంగాను, విశ్వాసమే శాశ్వతంగాను పునాది చేసుకున్నది ఆధ్యాత్మిక వాదం. ఆ మూలంనుంచే శివుని ఆజ్ఞలేనిదే చీమైనా కుట్టదు అనేది తాత్వికాంశంగా మిగిలి పోయింది. అలాదైవ ఆజ్ఞాను సారమే సంఘటనలన్నీ జరుగుతూ వుంటై అనుకున్న కారణంగానే ఆ సంఘటనలవల్ల వచ్చే బాధలు భరిస్తూ వచ్చారే గాని వాటినుండి తప్పించుకునే ప్రయత్నం చేయలేదుమతస్థులు. కాకపోతే ఆ బాధలకు కారణమని తామునమ్ముతూ వచ్చిన ఆ భగవంతుణ్ణి ప్రార్థిస్తూ వచ్చారు వారు.

# జాగ్రితలో జాగ్రత్త

జగత్తు మిథ్యా సత్యం. (నానాత్వ, భిన్నత్వాలుగా) ఆ మిథ్యా సత్యం నుండి (దాని ద్వారానే) నిజ సత్యాన్ని (వున్నదాని) స్వరూపాన్ని తెలుసుకోవడమే తాత్వికం. అదే నిజమైన తత్వశాస్త్రం. సత్యమెప్పుడూ సాపేక్షమే గాని అది నిరపేక్షం కానేకాదు అయితే ఏది దేనితో సాపేక్ష మనేది జాగ్రిత్తగా ఆలోచించాలి. అలా ఆలోచించే మనిషికి మాత్రిమే అది అర్థమవుతుంది. జాగ్రతలో (మేల్కొని) వున్నా ఆలోచించని (అజాగ్రత్త) మనిషికి (అన్వయం అర్థంకాదు, సమన్వయంకుదరదు) నిరపేక్షమైన (కేవల) సత్యం (దైవం) సత్యమవుతుంది. దైవం సత్యమనుకుంటే మానవుడు అసత్యమవుతాడు అనుకున్నాం కదా, అదే మత (ఆధ్యాత్మిక) భావం. అందుకే జాగ్రతలో జాగ్రతలేని మానవుడు తానే దేవుడైనాడు అన్నాను. దేవుడు, జీవుడు (మానవుడు) సత్య మనుకుంటే రెండూ రెండు సత్యాలై ద్వైత మవుతుంది. ద్వైతంలోని ఆ లోపాన్ని గుర్తించిన శంకరుడు అద్వైతాన్ని చెప్పవలసి వచ్చింది. (జీవుడే దేవుడని చెప్పింది అద్వైతం) మానవుడు కల్పించుకున్న దేవుణ్ణి మళ్లీ మానవుడే రద్దుచేసుకున్నాడు. అదొకరీతిలో తాత్వికాభివృద్ధిగానే గుర్తించవచ్చు. ఆ కాలంలో, ఆ దశలో అంతవరకు ఆ మానవుడు ఆలోచించాడు అంటే అదే ఆలోచన పునాదిగా ఈనాడు మనం మరికొంత ఆలోచించ వచ్చునుగదా?

# దుర్గతి

మనకు తాత్విక దుర్గతిని (అజ్ఞానాన్ని) కలిగించిన తాత్వికఅంశాలు మనకు అన్ని విషయాలలోను దుర్గతినే కలిగిస్తూ వచ్చినవి. అందుచేత జాగ్రితలో తాను దేవుడుగాను, స్వప్నంలో తానే దయ్యంగాను, సుషుప్తిలో తాను యేమి కాకుండాపోవడం అన్యాయం కదా? (అంతకంటే మానవుడికి వేరే దుర్గతి అనేది యేమివుంటుంది?) ఇన్ని అవస్థలలోను ఇన్ని రకాలుగా మారిపోవడానికి తన మనసుకు తాను పట్టించుకున్న గతే (దుర్గతే) కారణం. ఆ గతి నుండి తనను తాను రక్షించుకోవాలంటే (అన్ని అవస్థలలోను తాను, తానుగానే వుండాలంటే, మిగలాలంటే) చేయవలసింది తానుగా తనను గురించి ఆలోచించడం జరగాలి. దానినే

జాగ్రితలోని జాగ్రిత్త అంటున్నాము. అందుకే ఈ వివరణఅంతా. అదే మనం చేయాలి,అదే మనకుకావాలి, అప్పుడే మనంమనకు అవరించిన దుర్గతినుండి తేరుకుని సహజమైనగతిలో వుండగలం. మానవుణ్ణి దుర్గతిలో ముంచాలన్నా మంచిగతిలో(స్థితిలో)వుంచాలన్నా తత్వవేత్తలచేతుల్లోవున్నది. అలా మనం ఆలోచించడం మానివేస్తే జరిగేది మనం దుర్గతిలో వుండడమే. (మనలను దుర్గతుల పాలుచేసిన తత్వవేత్తలే మనకు దాపురించారు). అందువల్ల ప్రతి వ్యక్తి తత్వవేత్త కావాలి, తద్వారా ప్రతి వ్యక్తి వ్యక్తిత్వం గల వ్యక్తి కావాలి అటువంటి వ్యక్తికి ఏ దుర్గతి పట్టదు.

## పరాకు

మనం మేల్కొని (జాగ్రతలో) వున్నప్పుడు కూడా చాలా విషయా, లలో పరాకు చిత్తగిస్తూ వుంటాం. (మనసుని మన స్వాధీనంలో వుంచక దేనిమీద కేంద్రీకరించక) ఒకటి చూస్తూ మరొకటి అనుకుంటాం, ఒకటి వింటూ మరొకటి అర్థంచేసుకుంటాం ఒకటి చెప్పబోయి మరొకటి చెబు తాం. చూస్తూనే నడుస్తూ వుంటాం కాని కాలికి ఎదురు దెబ్బ తగులు తుంది. అంటే చూస్తున్నట్లుంటాం కాని, చూడం. తాడుని చూస్తాం పామని భ్రమ (భయ) పడతాం, ఎండమావిని చూస్తాం నీరని తలు స్తాం. ఉన్నది ఒకటైతే అది మరొకటిగా అనుకుంటాం, మన నీడను చూచి మనమే భయపడతాం. భయపడవలసిన చోట భయపడం, భయంలేని చోట భయాన్ని కల్పించుకుంటాం. వచ్చాడు అనబోయి వస్తాడు అంటాం, వచ్చాను అనబోయి వస్తాను అంటాం. వెళతాను అనబోయి వెళ్లాను అంటాం, నేడు అందామనుకుని నిన్న అంటాం, అలా పరాకులో భూత వర్తమాన. భవిష్యత్ కాలాలను మరుస్తాం. పెట్టిన చోట వస్తువును మరుస్తాం పెట్టని చోట వెదుకుతాం. అలా పరాకు వల్ల వెతికినంత సేపు ఆ వస్తువు దొరకదు వున్నచోటు తెలియదు. వెదకడం మానిన తరువాత అది వున్నచోటు తెలుస్తుంది. ఈవిధంగా పరాకు అనేది దైనందిన జీవితంలో ప్రతివ్యక్తికి సర్వసాధారణమైపోయింది.

అప్పు తీసుకుంటాం అవసరానికి, కాని అది అప్పని మరుస్తాం. అప్పు చేయ గూడదని అనుకుంటాం కాని, అప్పు యెక్కడ దొరుకు తుందా అని ఆలోచిస్తాం, అన్వేషిస్తాం. అలా పరాకుతో అప్పులు

చేస్తాం చివరకు తిప్పల (అప్పుల) పాలవుతాం. ఇలా అనేక దైనందిన జీవిత (లౌకిక) సమస్యలమధ్య మనం పరాకు చిత్తగిస్తూ సతమతమవుతూ వుంటాం. జీవితానికి సార్థకం యేమిటని గుర్తించం కాని జీవిస్తూ వుంటాం. మనసుని మన స్వాధీనంలో వుంచక (పరాధీనం చేసి) చివరకు చిత్త స్వాధీనం లేకుండా పోతాం. మనసున్న మంచి మనిషిగా మనం మిగలం.

అయితే పరాకనేది వ్యావహారిక విషయాలలో అయితే ఫరవాలేదు, కొంచెం నష్టపడతాం. అందు వల్ల కొంచెం కష్టపడతాం. కాని, పరాక నేది తాత్విక విషయంలో కూడదు, ఒకసారి పరాకుగా వున్నాం అంటె అది మనలను చివరి వరకు చిక్కులలో వుంచి వెంటాడుతూ విసిగిస్తూనే వుంటుంది. వున్నది వున్నట్లు అర్థంకాదు. లేనిది వున్నట్లు అనిపిస్తూ భ్రమను కలిగిస్తూ వుంటుంది. దానివల్ల సత్యం బోధపడదు, అర్థంకాదు, ఆ కారణంగా అసత్యం సత్యమై కూర్చుంటుంది. అసత్యం అర్థంకాదుగదా? అందువల్ల జీవితమంతా అసత్యంగానే గడిచి పోతుంది. తాత్విక పరాకు వల్ల అంత ప్రమాద మున్నది.

## స్వ స్వరూప సాక్షాత్కారం

అందువల్ల మనం ఏ విషయంలోను పరాకుగా వుండక హేతువుని ఆధారంచేసుకుని ఆలోచించాలి. దానివల్ల విచక్షణ చేయగలస్థాయిలో మనసు పనిచేసి బుద్ధిమంతమైన నిర్ణయం చేయగలుగుతాం. ఆ కారణంగా వున్నది వున్నట్లు అర్థమవుతుంది ఆ కారణంగా నిజ జాగ్రితలోని నిజాన్ని నీ వెరుగగలవు. అదే నిజమైనఎరుక. అదే స్వ స్వరూపావగాహన మంటేను, స్వ స్వరూప సాక్షాత్కార జ్ఞానమంటేను. అది సహజ జ్ఞానం, పొందవలసిన, పొంద తగిన జ్ఞానం. "నేను" అన్నా, నీవు అన్నా మనం అన్నా అంతా ఒకటే. అలా తాత్వికంగా నిన్ను నీ వెరగడం (నన్ను నేనెరగడం) ద్వారా సంఘ దృష్టి యేర్పడి నీ తోటివానిని గూడా నీ వెరిగిన వాడవై వానిని గూడా నీలాగానే (నీలోనే) చూచుకుంటావు. "త్వమేవాహం" (నీవే నేను) అంటె అర్థం అదే అనేజ్ఞానం నీకు (నాకు) వస్తుంది, అందుకే "ఆత్మానాం విద్ధి" (నిన్ను నీవు తెలుసుకో) అన్నారు పెద్దలు.

అని అంటూ వుండేవారు అన్నగారు. అలాంటి తాత్విక సమన్వయంలో మనకు ఆక్షేపణ వుండదు, మనిషిని మనిషిగా గుర్తించడానికి యే రూపంలో వున్న తాత్విక సూత్రమైనా అందరికి ఆమోద యోగ్యమేకదా? స్వరూప మన్నా, స్వస్వరూపమన్నా అది తాత్వికంగా ఒకటే.

## ఆధిక్యతా భావం - న్యూనతా భావం

ఆలాంటి తాత్విక జ్ఞానంవల్ల మనలో ఆధిక్యతా (సుపీరియారిటీ) భావంగాని, న్యూనతా (ఇన్‌ఫీరియారిటీ) భావంగాని వుండక అందరి యెడల సమతా భావమే కలిగి వుంటాం. (ఆధిక్యతా భావం ప్రదర్శించే వారి అంతరంలో న్యూనతా భావం చోటుచేసుకుని వుంటుంది) ఎవడైతే ఇతరులను న్యూనతగా (హీనంగా) చూస్తూ తన ఆధిక్యతను తాను ప్రదర్శిస్తూవుంటాడో అతడే తనలో తాను న్యూనతాభావానికిలోనై తనలో తాను కుంచించుకుపోతూవుంటాడు. తద్వారా సంకుచితుడై పోతూవుంటాడు. మనిషి అంటే మనసు. ఆ మనసు యెంత విశాలమైనదైతే ఆ మనిషి అంత పెద్ద (గొప్ప) వాడు. మనసనేది పుటకతో వచ్చేది కాదు. అది పెంచుకుంటే పెరుగుతుంది, లేకుంటే పెరగనంటుంది.

ప్రాక్ చేతనంలో తాను వ్యష్టి ఆలోచన చేస్తాడు. అందుచేత అతనిలో ఆధిక్యతా భావం, అందులోనే న్యూనతా భావం చోటుచేసుకుని అభివృద్ధి అవుతూ వుంటుంది. అధో చేతనంలో వ్యష్టి, సమిష్టి ఆలోచనలు వచ్చి న్యూనతా ఆధిక్యతా భావాల సంఘర్షణ వస్తుంది. చేతనావస్థలో వ్యష్టి ఆలోచనలు అభావంచెంది (అంతరించి) సమిష్టి (నూతన) భావం పుంజుకుంటుంది. అలా న్యూనత, ఆధిక్యతా భావాల సంఘర్షణ అంతమొంది సమతా భావం చోటుచేసుకుంటుంది.

## మానసిక త్రికం

ప్రాక్ చేతనమని, అధోచేతనమని, చేతనమని మూడు, మూడుగా వేరుగా వుండవు ఒకే మనసు దశలవారీగా పనిచేస్తూ పరివర్తన చెందుతూ వుంటుంది. దీనికి సంకల్ప (ప్రాథమిక)దశ, విచక్షణ (మాధ్యమిక) దశ,

బుద్ధి (ఉన్నత, ఉత్తమ) దశ అని పనిచేస్తూవున్న దశలను వివరించుకో వచ్చు. అనగా ఒకే మనస్సుకిగల స్థాయీభేదం మాత్రమేనని గుర్తించాలి

ప్రాక్ చేతనం, అధోచేతనం, చేతనం (చైతన్యం) ఈ మూడు (మానసికత్రికం) దశలను సమన్వయ పరచి సహకార చింతన (ఆలోచన) చేసి వ్యవహరించినపుడు మానసికమైన ఆరోగ్యం కలిగి వుంటాం. అందుచేత మనలోని న్యూనతా భావం నశిస్తుంది. సమతాభావం పెరుగుతుంది. సంతృప్తి కలుగుతుంది అసంతృప్తివుండదు. ఆ కారణంగా ఉద్వేగం పొందక, సద్వివేకంతోనే వ్యవహరిస్తాం ఆ దశకు మానసికంగా యెదిగిన మానవుడు సంతృప్తికర మైన జీవితం సాగిస్తాడు. అదే సంపూర్ణ జీవితానికి పునాది. కేవలం అనుభూతి మాత్రమే జీవితంకాదు. ఆలోచనకు ఉద్వేగం అటంకం. ఉద్వేగాన్ని సంతృప్తి పరిచే అనుభూతిలోనే ఆగిపోక ఆలోచనకు అయత్తుడైన మానవుడు విషయ పరిజ్ఞానంతో సంతృప్తుడవుతాడు.

## మనో విశ్లేషణ

అజ్ఞాన పూరితమైన మతభావాలు మనకు కలిగించిన పారవశ్యదశ నుండి అభివృద్ధి అయినదే అనుభూతి అనేది ఆలోచనతో సంబంధంలేని ప్రత్యేక (కేవల) అనుభూతి అనేది భక్తిభావంనుండి అభివృద్ధి అయింది. అలాకాక మానసిక విశ్లేషణ ద్వారా మతం కల్పించిన కే.ల అనుభూతి (భ్రాంతితో కూడినది) మనలను మత్తులో వుంచుతుంది. మనో విశ్లేషణ మనం యెంతగా అభివృద్ధి చేస్తామో అంతగా మనలోని మత్తు వదిలి (భ్రాంతి తొలిగి) స్పష్టమైన అవగాహన కలుగుతుంది. అంటె స్పష్టమైన సత్యం అర్థమవుతుంది. స్వేచ్ఛ కలుగుతుంది. (వున్న స్వేచ్ఛ అర్థమవుతుంది) తద్వారా తాత్విక తృప్తి కలుగుతుంటుంది. వ్యావహారిక విషయమందు తృప్తి పొందని మానవుడు తాత్విక విషయమందు తృప్తి పొందలేడు. తాత్విక తృప్తిని సంపాదించినా మళ్లీ వ్యావహారికం మిగిలే వుంటుంది. అందుచేత అసంతృప్తి అనేది మిగలని సంతృప్తిని సాధించాలి. మనోవిశ్లేషణవల్ల మన ప్రవర్తనమీద మనకు అదుపు వుంటుంది గనుక మనం ఏమవుతామోననే భయం మనకు వుండదు. మన ప్రవర్తన మన

అధీనంలో వుంటుంది. అందువల్ల మన భవిష్యత్తు మన స్వాధీనంలో వుంటుంది. అందుకే మనోవిశ్లేషణ మనకు అవసరం అంటున్నాను.

## ఈశ్వరేచ్ఛ

మనకు తాత్వికంగా కల్పించబడినదే ఈశ్వరేచ్ఛ, దైవేచ్ఛ అనే భావం. మనం తాత్విక పరిజ్ఞానం పెంచుకుంటే మతం కల్పించిన భ్రాంతి తొలగిపోతుంది. తద్వారా భ్రాంతి జనిత భావం అంతరిస్తుంది. మన విచక్షణ వల్ల ఆ భావం తొలగి పోతుంది గనుక (కల్పించుకున్న భ్రమనుండి వచ్చిన పరిస్థితి అది) మనకు స్వతంత్రేచ్ఛ మిగులుతుంది. స్వతంత్రేచ్ఛ (స్వేచ్ఛ కలిగివుండడం) సహజమైనది. ఈశ్వరేచ్ఛ కృత్రిమమైనది. కల్పించబడినది. (లేనిది వున్నట్లు అనిపించేది) భ్రమను కలిగించేది, భ్రమలో వుంచేది. ఆ భ్రమ తొలగితే సహజమైన స్వేచ్ఛ మిగులుతుంది.

## స్వతంత్రేచ్ఛ

స్వతంత్రేచ్ఛ సహజమైనది గనుక యిచ్ఛా పూర్తికి అవకాశం వుంటుంది. ఈశ్వరేచ్ఛ కృత్రిమమైనది, కల్పించ బడినది గనుక అది మనకు యిచ్ఛా పూర్తికి తోడ్పడదు, పైగా మన స్వతంత్రేచ్ఛా భావానికి వ్యతిరేకం. ఈశ్వరేచ్ఛను నమ్మినవాడు స్వతంత్రేచ్ఛను కోల్పోతాడు. స్వతంత్రేచ్ఛను కోరుకున్నవాడు ఈశ్వరేచ్ఛను నమ్మడు. ఈశ్వరేచ్ఛను విడిచినవాడే స్వతంత్రేచ్ఛను కలిగివుంటాడు. అతడే అందుకు అర్హుడు. ఈశ్వరేచ్ఛా భావం, స్వతంత్రేచ్ఛా భావం పరస్పర విరుద్ధ భావాలు. మానవుడు స్వతంత్రేచ్ఛను సహజంగా కలిగివున్నాడు. దానిని గుర్తించిన మానవుడే స్వేచ్ఛా మానవుడు.

## అంతరంలో దాగిన వాంఛలు

అచేతనంలో దాగిన వాంఛలు (కోరికలు) తీరనిస్థాయిలో మనసులో మిగిలి (దాగి) మనలను బాధిస్తూ వుంటై, మనసు కల్పించిన సంకల్పాలను విచక్షణ చేయక వదలి వేస్తే వచ్చే పరిస్థితి అది. ఆ పరిస్థితిలో అవి (కోరికలు) అక్కడ మనసులో దాగి (గుప్తమై వుండి) వాటిని తీర్చు

కోవడం కోసం మనం తప్పు దారులను (దొంగదారులను) వెదుకుతాం. ఇలా వ్యక్తమయ్యే మనలోని ప్రవర్తన మనకు సరియైనదిగానే వుంటుంది. అప్పుడు మన కట్టుబాట్లను, మన సంఘ నియమాలను (మతం కల్పించిన పాపభీతిని మరచి) ఆచార సంప్రదాయాలను ఎదిరించి మన కోరికలను మనం తీర్చుకోవడానికి ప్రయత్నిస్తాం. పాప పరిహారార్థం పద్ధతులు (మత సంప్రదాయంలో) వున్నవి గనుక భయపడం. నిర్భయంగా ప్రవర్తిస్తాం. అలా ఈ వ్యవస్థలో కోరికలు తీరక పోతే ఈ వ్యవస్థను మార్చుకుంటాం. అది సాధ్యపడనపుడు (చేతకానపుడు) ఆ అవస్థను మార్చుకుని (స్వప్నంలో) ఆ కోరికలు తీర్చుకుంటాం. ఇలా ఈ వ్యవస్థలో తీరని కోరికలు అలా ఆ అవస్థలో (స్వప్నంలో) తీర్చుకునే అవకాశం మనకు వున్నది గనుకనే ఈ వ్యవస్థను మార్చుకునే మనస్తత్వం మనకు రాలేదు. అంతరంలో దాగిన మంచి, చెడ్డ వాంఛలు తీర్చుకునే స్వప్న వ్యవస్థ (అవస్థ) మనకు సుఖంగా వున్నది. అందుకనే మంచి కోరికలు తీర్చుకునే మంచి వ్యవస్థకోసం కృషిమానేశాం.

## స్వానురాగం

అలా అవస్థలోకి (స్వప్నంలోకి) మారి కోరికలు తీర్చుకోవడం వ్యక్తిగత కోరికలకు సంబంధించిన విషయం. స్వానురాగం యెంతగా పెరిగితే అంతగా వ్యక్తిగత కోరికలు పెరుగుతూ వుంటై. వ్యక్తిగత కోరికలు స్వానురాగం (స్వాభిమానం) అనేప్రవృత్తినుండి అభివృద్ధి అవుతూవుంటై. వ్యవస్థను మార్చి కోరికలు తీర్చుకోవడం సమిష్టి విషయమవుతుంది. అవస్థలోకి మారి కోరికను తీర్చుకోవడం వ్యక్తి (వ్యష్టి) గతమవుతుంది. కోరికలు అనేవి రెండు రకాలు. అవసరాలకు (నిత్య జీవితానికి) సంబంధించినవి గాను, కేవలం ఉద్వేగానికి, ఆనందానికి (కృత్రిమ భోగానికి) సంబంధించినవిగాను వుంటై. అవసరాలకు సంబంధించిన కోరికలు సమిష్టిగాను, ఉద్వేగానికి సంబంధించిన కోరికలు వ్యక్తిగతంగాను తీర్చుకోవచ్చు. ఉద్వేగానికి సంబంధించిన కోరికలు వ్యక్తిగతమైనవి గనుక వ్యక్తులు విచక్షణ ద్వారా వాటిని అధిగమించవచ్చు. అవసరాలకు సంబంధించిన కోరికలు సమిష్టివి (అందరివి). అందువలన వాటిని అందరుకలిసి (సమిష్టిగా) సాధించుకోవచ్చు.

ఈ వ్యవస్థలో స్వాభిమానం (దురభిమానం అని కూడా అనవచ్చు) పెంచుకున్న మనం (వ్యక్తులం) ఆధిక్యతా భావానికి లోను గావడం చేత ఇతరులను న్యూనతా భావంతో చూడడం అలవాటు చేసుకున్నాం. తన ఆధిక్యతను ప్రదర్శించే పద్ధతులు, ఇతరులను న్యూనత పరిచే రీతులు అన్ని రంగాలలోను అభివృద్ధి చేసుకున్నాం. ఆ విధంగా ఆధిక్యతా భావాన్ని (న్యూనతా భావంలో వుంటూ) ప్రదర్శించి ఆనందించే ప్రవృత్తిని అలవాటు చేసుకున్నాం.

## స్వాభిమానం

తన సుఖమే సుఖమని, అదే తనకు ముఖ్యమని, తన వారి సుఖమే తనకు ముఖ్యమనుకుని, తన ఆనందమేఆనందమని, అదే తనకుముఖ్యమను కునే,వ్యష్టి(వ్యక్తి) గత ఆలోచనాప్రవృత్తివల్ల మనిషి ఇతరులసుఖం, ఇతరుల (సమిష్టి) ఆనందంతో తనకు నిమిత్తంలేదనే ప్రవృత్తితోవ్యవహరిస్తూ వుంటాడు, పైగా ఇతరుల సుఖాన్ని ఆనందాన్ని చూచి ఓర్వలేని తనం చోటుచేసుకుని తద్వారా తన సుఖాన్ని, ఆనందాన్ని కూడా కోల్పోతూ వుంటాడు. అంటే సుఖమంటే ఏమిటి? ఆనందమంటే ఏమిటి? అనేది నిర్ణయించుకోలేక పోతున్నాడన్నమాట. స్వార్థమనేది యెప్పుడైతే అభివృద్ధి అయినదో అపుడే అసూయ అనేది కూడా పక్కనే పెరుగుతూ వుంటుంది. అంతరంలో దాగిన స్వార్థ చింతనే బాహ్యంలో అసూయగా బహిర్గతమవుతూ వుంటుంది. చివరకు అసూయ ద్వేషంగాను, ద్వేషం కలహంగాను మారి అది అశాంతికి కారణమవుతుంది. అలా వ్యక్తిలో ప్రారంభమైన అశాంతి సమిష్టి (సంఘం) పరంగా వ్యాప్తమవుతుంది. అది అంటువ్యాధిలాగా అందరికి అంటుకుంటుంది.

వ్యక్తుల వ్యక్తిగత ఆలోచనా విధానం నుండి వచ్చినదే ఆధ్యాత్మిక (దైవ) భావం, దైవ ఆరాధనా భావం. ఆరాధనా తత్వమే భక్తి (దాస్య) భావానికి కారణం. అటువంటి భక్తిలోని వ్యక్తుల సమిష్టి భావమే మత తత్వం. మత తత్వం అభివృద్ధికావడంతో వ్యక్తులకు స్వేచ్ఛాభావం సన్నగిలింది, నశించింది.

అటువంటి మత తత్వంనుండిగాని, దైవ ఆరాధనా తత్వంనుండిగాని వ్యక్తి స్వతంత్రాలోచన చేయలేడనేది తెలుసుకున్నాం. అందువల్ల మత తత్వంలోని సమిష్టి తత్వంగాని, దైవతత్వంలోని వ్యష్టి మనస్తత్వంగాని, మానవాభివృద్ధికి అటంకమే. దైవాన్ని నమ్మిన వ్యక్తి స్వేచ్ఛాసంకల్పం కోల్పోతాడనేది ముందు తెలుసుకున్నాం. అతడు దైవ సంకల్పమే తన సంకల్పంగా భావించి సంచరిస్తూ వుంటాడు. వ్యక్తిలోవుండే దైవ ఆరాధనా భావం (వ్యక్తి ప్రయోజనం కోరేది) పరిమితమైన ప్రయోజనంతో కూడినది కావడంచేత విస్తృతమైన (సమిష్టి) ఆలోచన చేయలేడు. అటువంటి ఆలోచన చేయడమంటేనే తనకు ఇష్టం వుండదు. (కష్టంగా కూడా వుంటుంది). అటువంటి ఆలోచన తనకు భారంగాను (బాధగాను) వున్నట్లు కూడా భావిస్తాడు. ఆ కారణంగానే తాను (తనుగానే) తనలోకి కుంచించుకు పోతూవుంటాడు. అందే సంకుచితుడై పోతూ స్వార్ధం అనే పద్ధతికి లొంగి పోతాడు.

అలా మనసులో ఏర్పడిన సంకుచిత భావం దైనందిన జీవితంలో ప్రత్యక్షమవుతూ వుంటుంది స్వార్ధ చింతన, దుష్ట ప్రవర్తన వల్ల తాము సమిష్టినుండి వేరై తానొక విధమైన ఒంటరి తనాన్ని అనుభవిస్తూ వుంటాడు. మానసికమైన ఒంటరితనం కంటే జీవితంలో బాధాకరమైన దేముంటుంది?

## సంకుచిత మనస్కులు

అలా సంకుచితులైన వ్యక్తులు వ్యక్తిగత స్వార్ధ చింతనతోపాటు వ్యక్తిగతమైన ద్వేషబుద్ధిని పెంచుకోవడం వల్ల పరోపకార తత్వంగాని, సహకార స్వభావంగాని వారికి వుండదు. అంతరంలో ద్రోహచింతన అవరించి వుండటంచేత ఏ వ్యక్తితోను వారు సహజరీతిలో వ్యవహరించలేరు. అటువంటి వ్యక్తులు స్వేచ్ఛలో వుండే ఆనందంగాని, దాస్యంలోవుండే బాధగాని గుర్తించలేరు. అటువంటివారు దేశాన్ని దాస్యంలో వుంచడానికి కూడా వెనకాడరు. భావ దాస్యానికి బద్ధులై బ్రతుకును (భారంగా) సాగిస్తూ వుంటారు. అందుచేతనే మతంలో వుండే వ్యక్తికి ఆ మత దాస్యంలో వుండే

బాధ తెలియదు. అది మనసుకు తట్టదు. (అటువంటి వ్యక్తుల ప్రవృత్తి లోనే మన దేశ దాస్య చరిత్ర ఇమిడి వున్నది). అన్ని దాస్యాల కంటే మత దాస్యం (అంటే భావదాస్యమే) ప్రమాదకరమైనది. కాని అట్టివారు అజ్ఞాన కారణంగా మత బంధనాలనుండి బయట పడలేరు, బయటపడాలనే ఆలోచనే చేయరు.

## మత్తుమందులాంటి మతసూత్రాలు

మత దాస్యంలో వుండేవాడు స్వతంత్రమైన ఆలోచనే తప్పను కుంటాడు. ఆ దాస్య భావంలోనే తనకు పరమావధి వుందని భావిస్తాడు. ఆ కారణంగానే తన అవధిని తాను మరుస్తాడు. అలాంటి మరపును కలిగించెదే మతం. అదే మతం మత్తు అంటె, మందువల్ల వచ్చే మత్తు శరీరాన్ని బండబార్చి, మొద్దుతనం కలిగిస్తుంది. కాని, మతం కలిగించే (అజ్ఞానం) మత్తు మనసుని బండబార్చి మనిషిని (ఆలోచనలను) నిద్రపుచ్చుతుంది.

## స్వేచ్ఛా ప్రవృత్తి

మతం కల్పించిన హద్దులు దాటి (వదలి) ఆలోచించిన మనిషికి ఆ విషయం అర్ధంకాగలదు .అలా ఆలోచించినవ్యక్తులే వ్యక్తిత్వంగల వ్యక్తులు కాగలరు. మత ప్రవక్తలు మనిషిని ఆలోచనకుదూరంచేసి మనిషిని, మనిషి కాకుండా చేయడానికే అంకితమై పోయారుగాని మనిషిని మనిషిగా మార్చడానికి అంకితం కాలేదు. అటువంటి అవసరం గుర్తించిన వారే భౌతికవాదులు. ఆలోచించే స్వేచ్ఛ మనిషికి వున్నదన్న సంగతి మరచిన మనిషికి ఆ స్వేచ్ఛ నీ కున్నదనే గుర్తింపు కలిగించడమే నేటి కర్తవ్యం. వ్యక్తంలో లేని వ్యక్తుల సమూహమే మతం, వ్యక్తం కలిగిన వ్యక్తి మతం కల్పించిన హద్దుల్లో వుండడు, వుండలేడు. అందుచేత అవ్యక్త (అజ్ఞాన) దశలో వుండే వ్యక్తులే మతానికి కావాలి. అటువంటి వ్యక్తుల కోసం మతం కల్పించే తాత్విక సూత్రాలు గజిబిజిగా వుండి అవి మనిషికి అర్ధంకాక గందరగోళ పరుస్తూ వుంటై. అటువంటి తాత్విక సూత్రాలు అర్ధంకానిచోట అడగలేక (ప్రశ్నించలేక) అడగడం మానుకుంటాడు, అడగడమే తప్పను కుంటాడు. పైగా అడిగితే పాపమనుకుంటాడు. అటువంటి

పరిస్థితులలో ఇక తెలిసేదెపుడు? తెలుసుకునేదేమిటి? వాస్తవమైన సూత్రాలు అర్థమైతే మతం మరణిస్తుంది. మతం మరణిస్తే మనిషి మనిషిగా మిగులుతాడు. అవి అర్థం కానంతవరకు మాత్రమే మతం మనగలుగుతుంది. మనిషి మిగలని మతంకావాలో మతం లేని మనిషి కావాలో మనం తేల్చుకోవాలి.

## చీకటిలో ఇక వుండొద్దు

మానవుడు తెలియ వలసింది తెలియనంతవరకు మతంలో (అజ్ఞానంలో) వుంటాడు. మతంలో వున్నంతకాలం తెలియవలసింది తెలియదు. అందుకే 'మతంలోని మానవుడా, రా ముందుకు, వెలుగెంతో వున్నది. చీకటిలో (అజ్ఞానంతో) ఇకవుండొద్దు' అంటున్నాను. మనిషికి మతం అవసరం లేదు. (మత తత్వానికి మానవత్వానికి పరస్పరం వ్యతిరేకం). కనుక మానవత్వంగల మనిషి మిగలాలంటె మతాతీతమైన (భౌతిక పరిణామ తాత్విక దృక్పథం గల) సమసమాజం కావాలి. మతపరమైన ఆలోచనలు ఆదిమానవుని ఆలోచనలు మాత్రమే. మానవుణ్ణి నైతిక విలువల మధ్య వుంచడానికి ఆరంభమైన మతం చివరకు నైతిక విలువలు అంటే యేమిటో తెలియని మానవుణ్ణి రూపొందించింది. అదే ఈనాటి మతానికి నిర్వచనం. ఆ విషయం గుర్తించనంతకాలం నూతనఆలోచనలురావు. నూతనఆలోచనలు రానంతవరకు మానవుడు మానసికంగాబద్ధుడే(దాసుడే)అందుకే శంకరుడు అంటాడు: 'జీవుడు బద్ధుడు కాడు. అజ్ఞానంచేత తానుబద్ధుడనని అనుకుంటు న్నాడు. తానుబద్ధుడుకాదని తెలియడంమాత్రమే జరగాలిగాని బంధంపోవ డానికి చేయవలసింది యేమీలేదు' దీన్నే మనం మన భాషలో మానవుడు స్వేచ్ఛా జీవి అంటాం,

## లేనిది పరాశక్తి - వున్నది భౌతికశక్తి

నీవు కల్పించుకున్న దేవునికి నీవు భయపడ నవసరంలేదు. నీవు సృష్టించుకున్న మతానికి నీవు బద్ధుడవు కానక్కరలేదు, నీవు శక్తిమంతుడవు. నీ శక్తిని నీవు గుర్తించు. నీలో వున్నది, నాలో వున్నది ఒకే శక్తి. అదే భౌతిక (పదార్థ) శక్తి. అది మన అందరి (సమిష్టి) శక్తి. భౌతిక

శారీరక శక్తి నుండి శ్రమ శక్తి, ఆ శ్రమశక్తి నుండి వస్తూత్పత్తి వస్తూ వున్నది. పదార్థ శక్తి నుండి మనోశక్తి, ఆ మనోశక్తి నుండి వైజ్ఞానిక శక్తి వస్తూవున్నది. ఆ విజ్ఞానం ద్వారా పదార్థ శక్తి అర్థమవుతున్నది. కనుక శరీర శక్తి, మనోశక్తి కలిస్తే సర్వశక్తి మంతమైనది నీ శక్తి.

## శ్రమ - శక్తి

ఆ శక్తి మూలంగా సర్వసంపద నీ ద్వారా ఉత్పత్తి అవుతుంది. కనుక నీవు సర్వశక్తి మంతుడవు. ఆ శక్తి ఆ సంపద సమిష్టిదే గాని వ్యక్తిది (వ్యష్టిది) కాదు. ఆ సర్వసంపద నీది, నాది, అంటే మనది. అలా గుర్తించడమే నిజమైన గుర్తింపు. అలా గుర్తించి, తదను గుణంగా నడుచుకోవడమే వివేకం. ఆ గుర్తింపు రానంత వరకు మనం తాత్వికంగా అనాగరికులమే. నీ, నా అనే భేద బుద్ధి మనకు మానసిక శాంతినివ్వదు. జీవితంలో శాంతినివ్వని సిద్ధాంతం నిజ సిద్ధాంతం కానేరదు.

## అభేద బుద్ధి

అందువల్ల అటువంటి అభేద బుద్ధి ముందు మన భావంలో రావాలి. (భావవిప్లవంరావాలి. పాత భావాలను అభావం చేయగల భావ బలం కావాలి). అటువంటి అభేద భావాన్ని (తాత్వికంగా) కలిగించేది అద్వైత మొక్కటే ననే దృఢ విశ్వాసం కలిగి వుండేవారు అన్నగారు. అంతే గాక ద్వైత సిద్ధాంతమే భేద భావాన్ని ప్రచారం చేసిందని వైయక్తిక మనో ప్రవృత్తిని అభివృద్ధి చేసిందని అనేవారు. అందుకు (అలా అన్నందుకు) నాకేమి అభ్యంతరంలేదని నేను అనే వాడిని. కాని తాత్వికంగా అభేదం చెప్పడం వరకే ఆగిపోయింది అద్వైతం. వ్యావహారికంగా సమన్వయం చెప్పలేదు గదా అని కూడా అనే వాడిని నేను. అది నిజమే ననే వారు అన్నగారు.

అందుచేత మనం మరికొంత ముందుకు వెళ్లి మన భౌతిక తత్వ శాస్త్రం సాధించిన తాత్వికాంశాల ద్వారా అటువంటి అభేద భావాన్ని గుర్తించి ఆ గుర్తింపు ద్వారా అన్ని రంగాలలోను అభివృద్ధిని సాధించ

వలసిన అవసరమెంతైనా వున్నది. ప్రత్యేకమైన తాత్వికఅభేదం చెప్పడం మాత్రమే సరిపోదు. దానిని వ్యావహారిక విషయంలో కూడా సమన్వయ పరిచి చూచినపుడే మేలు జరుగుతుంది, కీడు తొలుగుతుంది.

## సమన్వయం

సమన్వయం కుదిరితే ఏ తత్వశాస్త్రం నుండి అనుకూలమైన అంశం దొరికినా మనం స్వీకరించవచ్చును. సమన్వయం కుదరని తాత్వికాంశాల వల్ల ప్రయోజనం వుండదు. సమన్వయంలో సమయస్ఫూర్తిని సాధించవచ్చు. దేనికైనా సమయస్ఫూర్తిలేనిదే సాంఘిక జీవనం దుర్లభమవుతుంది. మంచి తత్వశాస్త్రం అనే దానికి నిదర్శనం - దానిని ఆధారంచేసుకున్న సమాజం సుఖ, శాంతులతో ప్రశాంతంగా వుండడమే. మన తత్వశాస్త్రం గొప్పదని గప్పాలు చెప్పుకుంటే మనకు ఒరిగేదేమీ వుండదు. దాని గొప్పతనం సమాజంమీద కనపడాలి కదా?

## దాస్య ప్రవృత్తి

మన ప్రయోజనాలకోసం మనం దైవాన్ని ప్రార్థించడమనేది మన తత్వశాస్త్రం మనకు నేర్పింది. వ్యావహారిక, తాత్విక ప్రయోజనాలన్నీ దైవం వల్ల తీర్చుకోవచ్చుననే భావం ప్రబలమైనది. అన్నిటితో పాటు భక్తుడు తన ఆధిక్యతను నిలుపుకోవడంకోసం దైవ సహాయం అర్థిస్తాడు, దైవాన్ని ప్రార్థిస్తాడు. (ప్రజలచే ఎన్నుకోబడిన ప్రధాన మంత్రి లేదా ముఖ్యమంత్రి లాంటి ప్రజానాయకుడు తనమీద, తన ప్రజలమీద నమ్మకం లేక తన అధికారాలను నిలుపుకోవడానికి దేవాలయాలచుట్టూ, జాతకాలు చూచేవారి చుట్టు తిరిగినట్లు) అటువంటి పర దైవసహాయం కోసం యెప్పుడైతే ఆశించడం ప్రారంభించాడో అపుడే తన స్వేచ్ఛను తాను కోల్పోతాడు.

స్వేచ్ఛను కోల్పోయిన వ్యక్తి వ్యక్తిత్వాన్ని కోల్పోయి దాస్య (బానిస) మనస్తత్వభావం ఏర్పరచుకుంటాడు. దానిని పెంచుకుంటాడు. వ్యక్తి స్వార్థం అందులో యిమిడి వుంటుంది. స్వార్థ ప్రవృత్తికి అలవాటు పడిన వ్యక్తికి దాస్య ప్రవృత్తి కూడా అలవాటైన కారణంగా ఆ దాస్య

ప్రవృత్తి అతడిని బాధించినట్లుండదు. అందువల్ల అది అతనికి అలవాటుగా మారిపోతుంది. ఒక దానికి అలవాటుపడ్డ మనిషి అవసరంలేని అలవాట్లకు బానిస అవుతాడు. అటువంటి అలవాట్లవల్ల మానసికంగాను శారీరకంగాను మనిషి కృశించి పోతాడు.

కొందరు భావాలకు అలవాటుపడతారు. అది భావ దాస్యం. కొందరు కొన్ని విషయ సుఖాలకు అలవాటు పడతారు. (కొందరు జిహ్వకు, కొందరు గుహ్యానికి అలవాటు పడతారు). ఏదైనా అలవాటు అనేది దాస్య (బానిస) ప్రవృత్తికి దారి తీస్తుంది. అందుచేత ఏ విధమైన దాస్య ప్రవృత్తి అయినా అది వ్యక్తికి వ్యక్తిత్వాన్ని మిగల్చదు. అలా అలవాటు చేసుకున్న దాస్య ప్రవృత్తి నుండి తాను చేస్తూవున్న తన వృత్తిలో అవినీతి చోటుచేసుకుంటుంది. తనకు తెలియకుండానే ఆర్థిక, సాంఘిక రంగాలలో అవినీతి పెరుగుతుంది. వ్యక్తి స్వార్థమే ప్రధానం కావడంవల్ల సమిష్టి (సంఘ) ప్రయోజనం మరుస్తాడు ఆ మరపులో వ్యక్తి తన స్వార్థంకోసం ఏదైనా చేస్తాడు. ఏదోచేయగూడని పని తాను (వృత్తిలో) చేస్తూవున్నా ననే స్పృహ తనకు వుండదు.

## అహంకారం

భక్తుడు అది అంతా తనకు తన దైవం ఇచ్చిందని అనుకుంటాడు. అందువల్ల ఆ దైవంమీద మరింత భక్తిని పెంచుకుంటాడు. ఆ దైవాను గ్రహం కోసం నానా తంటాలు (తిప్పలు) పడతాడు. అలా దైవం మీద భక్తి పెరగడంతో ఆదామాషాలో అజ్ఞానం పెరుగుతూ వుంటుంది. నేను మంచి భక్తుడను నేను మంచి నీతిమంతుడను అనుకుంటూ తనమీద తనకు అభిమానం (స్వానురాగం) పెంచుకుంటాడు. మంచి భక్తుడని, ధర్మాత్ము డని అందరు అనుకోవాలని (అప్రయత్నంలో) భక్తి తాపత్రయంలో కృత్రిమమైన ధర్మకార్యాలు ప్రారంభిస్తాడు. అందువల్ల తనలో తనకు (అహానికి) తెలియకుండానే అహంకారం (అజ్ఞానం) పెరుగుతుంది. ఆ కార ణంగా జ్ఞానం తరుగుతుంది. ఆ పరిస్థితిలో అహం (నేను) తెలియబడదు. సమష్టి "నేను" తెలియక వ్యష్టి 'నేను' పై వ్యామోహం పెరిగి అహంకారం పెరుగుతుంది. "అహం" నశించాలి అని చాలామంది అంటూవుంటారు.

అలా అనడం వింటూవుంటాం. "అహం" అంటే యేమిటి? అ హం కా ర ం అంటే యేమిటి? అనేది తెలియకుండానే అలా అంటూవుంటారు. "అహం" జ్ఞానంవల్ల తెలియబడుతుంది. అహంకారం అజ్ఞానంవల్ల ఆరంభమవుతుంది.

## "అహం" అర్ధంకావాలి

'అహం' అంటే 'నేను'. అది తెలియక 'అహం' నశించాలి అంటూ వుంటారు. "అహం" నశించాలి అనడం అంటే "నేను" (తాను) నశించా అని అనుకోవడమే అవుతుంది. తాను (నేను) నశించాలని ఏ మూర్ఖుడు అనుకుంటాడు అని మనం అంటాం కాని, అలా అనుకునేవారి అజ్ఞానం అలాంటిది. అయితే "అహం" తెలిసినవాడు (జ్ఞాని) "నేను" నశించను (చావను) అంటాడు. అది జ్ఞానానికీ, అజ్ఞానానికివున్న (అగాధం) తేడా, అందుకే "అహం" అర్ధం కావాలంటున్నాను. "అహం" అర్ధంకానివాడు తనను తానే చంపుకుంటాడు (తన మరణానికి తానే కారణమవుతాడు).

## "అహం" అర్ధంకావాలి, అహంకారం నశించాలి

"అహం" అంటే "నేను" అని అర్థం తెలిసింది. ఇపుడు "నేను" సమిష్టి నేనా? వ్యష్టి నేనా? అనేది అర్ధం కావాలి. "నేను" అనేది (తాత్వికార్థంలో) సమిష్టి భావాన్నే సూచిస్తూ వుంటుంది. సమిష్టి "నేను" అర్థమైతే వ్యష్టి "నేను" దగ్గర పేచీరాదు, వుండదు. అహంకారం అంటే అది తన మేనుతో కూడిన వైయక్తిక మనోప్రవృత్తిని తెలియజేస్తూ వుంటుంది. స్వానురాగం, స్వాభిమానం (దురభిమానం) లో చేరి, అది వ్యక్తిలో వ్యక్తమవుతూ వుంటుంది.

అందువల్ల అటువంటి భావం సమిష్టి భావం నుండి వ్యక్తిని దూరం చేస్తుంది, వ్యక్తి ఆధిక్యతా భావాన్ని పెంచుతుంది. అటువంటిభావం అజ్ఞానంతో కూడినది గావున అది (అజ్ఞానం) నశించాలి. అహంకారం నశించనపుడు స్వానురాగం తనపై స్వారీ చేస్తూ వుంటుంది. "నేను" (అహం) అనేది తన మేనుతోనే పరిమితమై వుండక మనసుతో కూడినదై (సంబంధపడి) వుంటుంది. ఆ మనసనేది సాధారణస్థాయిలో అందరికి వుంటుంది.

దానిని ఉన్నత స్థాయికి (తాత్విక స్థాయికి) అభివృద్ధి చేసుకుంటే నీ నా భేదం దానికుండదు. అటువంటి భేదరహితమైన "నేను" కి (అహానికి) అహంకారంవుండదు. మేనే "నేను" అనే అజ్ఞానభావనే అహంకారానికి కారణం. అటువంటి అహంకారం నశించాలి. అహంకారం నశించడమంటే అజ్ఞానం నశించడమేకదా? అటువంటి అహంకారం నశించినపుడు స్వాను రాగం (స్వాభిమానం) వుండదు. స్వాభిమానం ఎంతగా తరుగుతుందో అంతగా వ్యక్తులలో సామరస్యం పెరుగుతుంది. వ్యక్తులలో సామరస్య భావం ఎంతగా పెరుగుతుందో ఆ దామాషాలో వారిలో సహకార భావం అంతగా పెరుగుతుంది. అంతగా సమిష్టి (సామాజిక) తత్వం వారిలో చోటు చేసుకుంటుంది. అది మంచి సమాజానికి మంచి సూచన గదా?

## ఇది ఇలా ఎందుకు చెప్పవలసివచ్చింది?

ఈ విషయం ఇంతగా యెందుకు చెప్పవలసి వచ్చిందని మీరడగ వచ్చు. ఈ "నేను" అనేది అందరూ, అన్ని సందర్భాలలోను వాడుతూనే వున్నారు. కాని, అది ఎవరికి ఎలా అర్థమైనది? కొందరి దృష్టిలో వ్యష్టి గాను, మరి కొందరి దృష్టిలో సమిష్టిగాను అర్థమవుతూవున్నది. అసలు ఈ "నేను" అనేది తాత్విక సంబంధ మైనదా? వ్యావహారిక సంబంధమై నదా? అనేది కూడా ప్రశ్నగా మిగులుతూనే వున్నది అందువల్ల ఎవరికి ఎలా అర్థమైతే వారు అలా వ్యవహరిస్తారు అనేది మరోప్రశ్న. తాత్వికంగా "నేను" సమిష్టి అనేది అర్థమైతే వ్యావహారికంగా (లౌకికంగా)కూడాదానిని సమన్వయపరిచి వ్యవహరించవచ్చు. తాత్వికులు,వ్యావహారికులు,పండితులు, పామరులు అనే తారతమ్యం లేకుండా ఈ "నేను" అనే దానిని వాడుతూనే వున్నారు. బుద్ధ, శంకర, రామానుజ, మధ్వ మొదలుగాగల పూర్వ తాత్వి కులు - మార్క్స్, లెనిన్, మావో, యమ్. ఎన్ రాయ్, మొదలుగాగల ఆధునిక తాత్వికులు - ఈ "నేను" అనే దానిని వారి, వారి తాత్విక రీతుల నుండి వారు యెలా వివరించారు అనేది ఒక్కసారి సమీక్ష చేసి చూచిన ట్లైతే "నేను" అనేది వ్యష్టి దృక్పథమా? సమిష్టి దృక్పథమా? అనేది విజ్ఞు లకు అర్థంకాకపోదు. అందువల్ల మనం ఈ "నేను" ను సరిగా అర్థంచేసు కుని మన సమాజాన్ని మనమెలా మార్చుకోవాలో, తీర్చిదిద్దుకోవాలో ఆలోచించవచ్చు.

## సమిష్టిజీవుడు

"నేను" అనేది సందర్భాన్నిబట్టి వ్యష్టి, సమిష్టి అర్థాన్నిస్తుంది. సమిష్టి అర్థంలో వాడినపుడు ఉన్నతమైన (విశాలమైన) దిగాను, వ్యష్టి అర్థంతో వాడినపుడు పరిమితమైన (సంకుచితమైన) దిగాను వుంటుంది. జీవుడు సమిష్టి జీవుడైనందువల్ల "నేను" కూడా సమిష్టిదే అవుతుంది. జీవులు వ్యష్టి జీవులు అనుకుంటే "నేను" కూడా వ్యష్టిదే అవుతుంది. జీవుడు సమిష్టి జీవుడు అనుకున్నవారు అద్వైతులు. జీవులు వ్యష్టి జీవులు అనుకున్నవారు ద్వైతులు.

సోక్రటీసు, బుద్ధుడు, మార్క్సు, మావో, లెనిన్ లాంటి తాత్వికులు జీవుణ్ణి, సమిష్టి జీవుడుగానే భావించారు. అలాగే నిర్వచించారు. రామానుజుడు, మధ్వలాంటి ఆధ్యాత్మిక తాత్వికులు, యమ్. ఎన్. రాయ్ లాంటి భౌతిక తత్వవేత్తలు జీవుల్ని వ్యష్టి జీవులనే భావించారు. ఆ దృక్పథం నుంచే వారి వారి తాత్విక సూత్రాలను సూత్రీకరించారు. ఆ తాత్విక సూత్రాలనుండి సామాజిక సూత్రాలను చెప్పారు.

## ద్వైతంలో "నేను"

"నేను" స్వర్గమునకు వెళతాను అంటే అది వ్యష్టి "నేను". "నేను" స్వర్గమునకు వెళ్లుటకు (చేరుటకు) కర్మకాండ (యజ్ఞయాగాదులు) చేస్తాను అంటే అది వ్యష్టి "నేను" భావాన్ని సూచిస్తుంది. "నేను". వైదిక కర్మలు (పూర్వజన్మలో) చేసిన ఫలితంగా ఈ జన్మలో వాటి ఫలితాలను అనుభవిస్తున్నాను. అంటే అది వ్యష్టి "నేను". అటువంటి భావం వైదిక పరమైన ద్వైతం అవుతుంది.

## అద్వైతంలో "నేను"

"నేను" (జీవుడు) బద్ధుడను కాను, ఆ కారణం చేత "నేను" మోక్షం పొందియే వున్నాను. (మోక్షం సిద్ధించే వున్నది) అంటే అది సమిష్టి "నేను"కి అర్థం. బంధంలేదు (బానిసకాదు) కనుక మోక్షం తేచ్చేది వచ్చేది (ఒకరిచ్చేది) కాదు. జీవుడికి ఎప్పుడూబంధంలేదు. అందువల్ల

మోక్షం అక్కరలేదు (జీవుడికి స్వేచ్ఛ ఒకరిచ్చేదికాదు). బంధ, మోక్షాలు వ్యష్టిపరంగా (అద్వైతంలో) చెప్పబడలేదు. అంతా సమిష్టిమీదనే (నేను మీదనే) చెప్పబడినది. (స్వేచ్ఛ కూడా సమిష్టిగానే చెప్పబడినది. ఒకరిచ్చే స్వేచ్ఛ, ఒకరి ద్వారా పుచ్చుకునే స్వేచ్ఛ - అది స్వేచ్ఛ కాదు, కాలేదు) ఇదే అద్వైతం. అదే అద్వైతంలో "నేను"కు నిర్వచనం. (ఇది ఉపనిషత్ కాలానంతర తాత్విక చింతనా ఫలితం)

## భౌతికంగా "నేను"

"నేను" ఒక వస్తువుని అనుభవించాను, ఆనందించాను, అనుభూతి చెందాను అంటే అది వ్యక్తి గతం. (అనుభూతి వ్యక్తిగతం) వ్యక్తికి సంబంధించిన విషయం. "నేను" ఒక వస్తువుని ఉత్పత్తి చేయడానికి సంబంధించిన ఆలోచన చేశాను అంటే అది వ్యక్తిగతం. అలా ఆలోచించిన విషయం ఆచరణలో పెట్టడం సమిష్టికి సంబంధించిన విషయం. ఆలోచన నుండి, దానిద్వారా వచ్చిన ఫలితానికి సంబంధించినఅనుభవం, ఆనందం సమిష్టి అనుభూతికి కారణమవుతుంది.

## పరార్థం

వ్యక్తిగతమైన ఆలోచనలు సమిష్టిపరమైన ఆచరణతో సమన్వయం కుదిరినప్పుడు దాని ఫలితానికిసంబంధించిన అనుభూతి (సమిష్టి ఆనందాను భూతి) సమిష్టిదవుతుంది. నా కోసం (వ్యక్తి కోసం) అనేది స్వార్థమవు తుంది. మన కోసం (సమిష్టి) అనేది నిస్వార్థం, పరార్థం (పరమార్థం) అవుతుంది. అర్థికాన్ని (సంపదను) వ్యక్తిగతంగా అనుభవించినపుడు (వాడుకున్నప్పుడు),అనుభవించవచ్చు అని చెప్పినపుడు స్వార్థమవుతుంది అదే సంపద అందరికి ఉపయోగపడినపుడు పరార్థ మవుతుంది. (అంత కంటే పరమార్థం లేదు గనుక). తన కోసం అనేది స్వార్థం, వ్యక్తిగతం, అందరి కోసం అనేది పరార్థం సమిష్టిపరం. నా కోసం అనే "నేను" కి, అందరి కోసం అనే "నేను" కి ఆ విధమైననిర్వచనం చెప్పుకున్నప్పుడు ఆ రెండు అభిప్రాయాలలోని భేదం సులభంగా అర్థమవుతుంది.

"నేను" స్వేచ్ఛను కోరుతున్నాను అంటే అది వ్యక్తిగతం. "నేను" స్వేచ్ఛను కలిగివుంటాను అంటే అది సమిష్టి విషయమవుతుంది. నా కోసం "నేను" స్వేచ్ఛను కోరితెచ్చుకుంటాను అంటే అది వ్యష్టి (వ్యక్తి) గతం.

అందరికోసం "నేను" కలిగించేది (తెలుసుకునేది) సమిష్టికి సంబంధించిన స్వేచ్ఛా విషయం. స్వేచ్ఛను వ్యక్తులు కలిగివుంటారా? సమిష్టిని (సమాజాన్ని) కాదని వ్యక్తులు స్వేచ్ఛ కలిగి వుండటానికి వీలు వుంటుందా? అనే సూక్ష్మమైన తాత్విక భేదాన్ని గుర్తించ గలిగితే ఈ "నేను" అనేది సమిష్టి "నేను" గానే అర్ధమవుతుంది. అప్పుడు ఇంతగా చర్చించ వలసిన అవసరం వుండదు.

సామ్యవాదులకు, సామ్రాజ్య వాదులకు, మతవాదులకు, మతోన్మాదులకు, కవులకు, కళాకారులకు, తత్వం తెలిసినవారికి, అది తెలియని వారికి ఈ "నేను" ఎలా అర్ధమవుతూవున్నది? అనేది అంతు పట్టని విషయం. అది అంతుపట్టకపోయినా అందరం దానిని వాడుకుంటున్నాం.

ఈ "నేను" సమిష్టిగా అర్థమైతే దాని ప్రయోజనం యెలావుంటుంది? అది వ్యష్టిగా అర్ధమైతే వచ్చే ఫలితం ఎలావుంటుంది? అనేది అర్ధంకావడం కోసమే ఈ ప్రయత్నమంతా. ఈ విషయం పాఠక మహాశయులు అర్ధం చేసుకుంటే ఇదంతా చదవవలసి వచ్చినందుకు బాధపడరని అనుకుంటూ, ఒకవేళ చదువుతూ వున్నంతసేపు బాధపడుతూనే చదివినా ఇది చదవడం పూర్తి అయిన తరువాత మాత్రం బాధోపశమనం కలుగుతుందని ఆశిస్తున్నాను.

"నేను" సులభంగా అర్ధంకాను (కాదు). అర్ధంకాని దశలోనే ఆధ్యాత్మిక వాదులు ఇంతవరకూ చెబుతూ వచ్చారు. (వారికి అర్ధమైనది కూడా అంతవరకే). అందుచేత అర్ధంకాని ఆ 'నేను' (లేక ఈ "నేను") పండిత, పామరులనుకూడా బాధిస్తూవున్న విషయమే (నేను వ్రాసిన 'జగత్ సత్యం-బ్రహ్మమిథ్య' అనే పుస్తకంలో నేనంటే ఏమిటి? వివరించబడింది. అది చదివి ఈ అర్ధంకాని 'నేను' ని అర్ధంచేసుకుంటారని ఆశిస్తున్నాను).

మేను (శరీరం) లేనిదే "నేను" (మనసు) వుండదు. కాని 'నేను' లేని మేను 'నేను' కాదు. మేను 'నేను' కలిసివున్న నేనే నిజమైన 'నేను'. మేను వున్నచోటనే "నేను" వ్యక్తమవుతుంది అని భౌతికవాదం చెబుతుంది. కాని ఆధ్యాత్మికవాదం మేను లేకపోయినా 'నేను' అస్తిత్వం కలిగివుంటుం

దని చెబుతుంది. అటువంటి భిన్న అభిప్రాయాల మధ్య ఈ 'నేను' సతమత మవుతూవున్నది. ఆలా సతమతంకాని సమ్మతమైన అభిప్రాయం కోసమే ఈ వివరణ అంతా అవసరమైనది.

## అచేతనావస్థ

అచేతనావస్థ (చైతన్యరహితస్థితి) లో హేతుబద్ధమైన ఆలోచన లుండవు. అంతా అహేతుకంగా (క్రమరహితంగా)ను అయోమయంగాను, గజిబిజిగాను వుండి క్రమ పద్ధతిలో ఆలోచించ నివ్వవు. చేతనావస్థ (చైతన్యం) లో ఆలోచనలు క్రమాభివృద్ధి జరిగి హేతువు ద్వారా తాను సంఘ జీవినని గుర్తిస్తాడు. (తాను అంటే సమాజంలో విడదీయరాని ఒక భాగమైన వ్యక్తే తాను). అందువల్ల తన కోరికలు (అవసరాలు) తాను వ్యక్తిగతంగా కాక సంఘపరంగా (సమిష్టిగా) తీర్చుకోవాలని చూస్తాడు. అలా తన అవసరాలు తీర్చుకున్నప్పుడు అది నీతి బద్ధం అవుతుందే గాని స్వార్థ తత్వంకాదు. (అన్యాయ పద్ధతికాదు). నీతి, అవినీతి అనేది సమిష్టి వ్యష్టి అనే దాని మీద ఆధారపడి వుంటుంది.

అందుచేత మన ఆలోచలు అచేతనావస్థ (తెలియని దశ) నుండి చైతన్యావస్థ (తెలుసుకునే దశ) వైపుకు పరివర్తన చెందుతూ వుంటై. అంటే వ్యష్టి ఆలోచన నుండి సమిష్టి ఆలోచనకు మనం తాత్వికంగా పెరిగామన్నమాట. ఒకసారి సమిష్టి ఆలోచన దశకు పెరిగిన మానవుడు మళ్లీ వ్యష్టి ఆలోచన చేయలేడు. ఆలా చేయడమంటే తన తాత్విక పరివర్తనలో తిరోగమనం సాగుతూవున్నదన్నమాట.

## సామాజిక (సమిష్టి) భావం

విద్య, విజ్ఞానం సామాజికంగానే వ్యక్తి పొందగలడు గాని సమాజానికి దూరంగా (వ్యక్తిగతంగా) వుండి పొందలేడు. అందుచేత "నేను" అనే సమిష్టి భావం (తాత్వికంగా) కలిగితే వ్యష్టి ఆలోచనలు వ్యక్తి చేయడు. వ్యక్తుల్లో వుండే వ్యక్తిగత కోరికలు సమిష్టిలోని వ్యక్తులకు వుండవు వ్యక్తులలోని వ్యక్తిగతమైన కోరికలు వ్యక్తిని (మనిషిని) ఉద్వేగానికి ఉసిగొలుపుతూ వుంటై. అంతరంలో దాగిన ఉద్వేగాల సముదాయమే

వ్యక్తిలో ఉద్రేకాలకు కారణమవుతూ వుంటుంది. మనలో దాగిన ఉద్వేగాల అణచివేతకు మనం అనేక సాధనాలను కనుగొంటూ వుంటాం. ఎన్ని సాధనాలను కనుగొన్నా, ఉద్వేగాల బారినుండి మనం తప్పించుకోలేక వ్యావహారిక జీవితంలో ఉద్రేకాలను పెంచుకుని, ఉక్రోషాలను కల్పించుకుని కృత్రిమమైన (నికృష్టమైన) జీవితాన్ని గడుపుతూ వుంటాం. సమిష్టి "నేను" అర్థమైతే (ఆ జ్ఞానంవస్తే) అసలు ఉద్వేగాల మూలస్థానమే అంతరిస్తుంది.

## కళ అనేది వ్యక్తిగతం

కళ అనేది వ్యక్తిగతం. కళ ద్వారా పొందే అనుభూతి వ్యక్తిగతం. శాస్త్రం అనేది సమిష్టి విషయం. శాస్త్రం సత్య శోధనకు సంబంధించిన విషయం కావడంవల్ల సత్యం సమిష్టిదేఅవుతుంది. సత్యాన్వేషణలో ఏ వ్యక్తి ఏ ఆలోచన చేసినా అది సమిష్టి ఆ లో చ నే అవుతుంది సమిష్టి దృష్టిలేని వ్యక్తుల కోరికలుగాని, ఆలోచనలుగాని సంఘ (సా మా జి క) పరంగా వుండక పోవడం చేత ఆ కోరికలు వెర్రితలలువేసి సమాజంలో అధమ స్థాయి పరిస్థితులను కలిగిస్తూవుంటై. సమాజంలోని వ్యక్తుల మధ్య వుండవలసిన ఉత్తమ సంబంధాలను (నైతిక విలువలను) పాడుచేసి వ్యక్తుల మధ్య వుండవలసిన మమతానురాగాల స్థానంలో అసూయా ద్వేషాలను రగిలిస్తూ వుంటై.

## అందరి సమస్య

ఆకలి అనేది అందరి సమస్య. కామ మనేది కొందరి సమస్య. అది వ్యక్తిగత సమస్య (అది వ్యక్తిగతంగా తీర్చుకోవచ్చు). ఆకలి (ఆర్థికం) సమస్య సంఘపరంగా (సమిష్టిగా) తీర్చుకోవలసిందే. కళలద్వారా పొందే అనుభూతి (కళారసికత) ని వ్యక్తిగతంగా తీర్చుకోవచ్చును. జీవిత సుఖాలను, జీవితకాలం కోల్పోయిన వ్యక్తుల (పీడితుల) సమస్యలు సమస్యలు కాదని వాటిని వదలివేసి, ప్రియసిని కోల్పోయిన ప్రియుని సంగతే ముఖ్యమని ఆ సంగతిని మాత్రమే ఆలోచిస్తామంటే సరిపోతుందా? అదొక వ్యక్తిగత సమస్య. దాని పరిష్కారం వ్యక్తిగతమే.

సమిష్టి సమస్యను పక్కకు తోసి వ్యక్తిగత సమస్యను ముందుకు లాగి దానిని పట్టుకుని పీకులాడితే సరిపోతుందా? సమిష్టిని కాదని (ద్వేషించి) వ్యష్టిని (వ్యక్తిని) కావిలించుకోవడం(ఆరాధించడం) ఉన్నత తాత్విక లక్షణం కాదు.

పేదలను గురించి, పీడితులను గురించి, ఆకలిని గురించి, ఆర్థికాన్ని గురించి ఆలోచించడం మానేశారు అంటే అందుకు కారణం సమిష్టి 'నేను' అర్థంకాలేదన్నమాట. 'నేను' అనేదానిని వ్యక్తిగతంగా అర్థంచేసుకుని దానికి సంబంధించిన ప్రవృత్తిని పెంచుకుని ఆ ప్రవృత్తి రీత్యా తాను వ్యవహరిస్తున్నాడు అంటే అంతరంలో దాగిన వైయక్తిక కోరికల ప్రభావం నుండి తప్పించుకోలేక పోతున్నాడన్నమాట.

ప్రేయసీ ప్రియులను గురించి వారి ప్రేమను గురించి వ్రాస్తేను, వారి యెడబాటును గురించి, వారి విరహ(తాపాన్ని) వేదనను వ్రాస్తేను, చదివితేను ఆకర్షణ, తద్వారా అనుభూతి వుంటే వుండవచ్చునేమో కాని అది సామాజిక సమస్య కాదు. వ్యక్తిగత అనుభూతులకు (లేక బూతులకు) ప్రాముఖ్యం ఇవ్వడమంటే మళ్లీ మనం రాచరిక వ్యవస్థను కోరుకుంటున్నా మన్నమాట. మానవుణ్ణి గురించి, మానవుడి సమస్యలనుగురించి వ్రాయడం మానేసి, దేవుణ్ణి గురించి, దేవుడికి చేసే పూజా పునస్కారాది భక్తి కథ లను గురించి వ్రాశారు గనుకనే మన గత కాలమంతా అంధకారమయంగా (అజ్ఞానమయంగా) సాగిపోయింది.

అటువంటి కథలు వ్రాసి, చదివి మనం భక్తి పారవశ్యదశలో (అవ్యక్తానుభూతులు) పొందవచ్చు. కాని అది మనలను నిద్రపుచ్చుతుందే గాని మేల్కొలిపి ఆలోచింప జేయదు. మనం ఈనాడు కోరేది ఆ దశకాదు. (అది అజ్ఞానపు దశ) కాని ఈనాడు మనం విజ్ఞాన దశలో వున్నాం. ఆ విజ్ఞానాన్ని (సైన్సుని) మనం జ్ఞానం సంపాదించడానికి వినియోగించు కుని ఆ జ్ఞానం ద్వారా మనలో దాగివున్న వైయక్తిక ప్రవృత్తిని అధిగ మించి వ్యవహరించగలిగితే మనలో దాగిన ఉద్వేగ తత్వం అంతరించి సద్వివేకం సమకూరి అందరి యెడల ఆదరాభిమానం పెరిగి నీ నా భేదం తొలిగి అంతా మనమే, అంతామనదే (సమమే) అనే సమతా భావం కలిగి

అంతా సామరస్యంతోను, సహకారంతోను, ఆలోచించి, చివరకు సమిష్టి జీవనం సాగించగలం. అదే మనలక్ష్యం.

"నేను" సైతం ప్రపంచాగ్నికి సమిధనొక్కటి ఆహుతిచ్చాను అని శ్రీ శ్రీ అన్నాడు. అలా అన్న శ్రీ శ్రీలోని "నేను" సమిష్టి నేనే. (శ్రీ శ్రీ కవిత్వం - మిర్యాల రామకిృష్ణ) అలాంటి తాత్విక దృష్టికలవారు కవులైనా కళాకారులైనా, తాత్వికులైనా (జ్ఞానులైనా) వైజ్ఞానికులైనా (శాస్త్రజ్ఞులైనా) వారు శారీరకంగా (మేనురీత్యా) మ ర ణిం చి నా వారు వారి భావాల రూపంలో (నేను రూపంలో) జీవించే వుంటారు. ఆ విధంగా మనకు ప్రత్యక్షమవుతూ వుంటారు. మనకు ఉత్తేజాన్ని కలిగిస్తూవుంటారు.

అలా ఆ రూపంలో వారు మనకు మిగిలారు గనుకనే వారిని గురించి (వారి భావాలను గురించి) ఇపుడు మనం మళ్లీ చర్చించుకుంటున్నాం. అలాంటి వారిలో మా అన్నగారొకరుగా ఎన్నో తాత్విక విషయాలు సమ న్వయ పూర్వకంగా వివరించారు. ఏదో కాలంనాటి తత్వవేత్తలను గురించి ఆ తత్వవేత్తలు చెప్పిన తాత్వికాంశాలను గురించి మనం ఈ కాలంలో ఇంతగా చెప్పుకుంటున్నామంటే వారి తాత్వికాంశాలలోని విషయాలు మనకు ఎంతో కొంత సమన్వయానికి వస్తున్నవి గనుకనే. (సమన్వయం కుదరని తాత్వికాంశాలు చెప్పినవారు చరిత్రలో శాశ్వతంగా మిగలరు) సమన్వ యానికి వచ్చే తాత్వికాంశాల మొత్తాన్ని మనం మళ్ళీ సమన్వయం చేసు కుని ఈ కాలానికనుకూలమైన తత్వశాస్త్రంగా రూపొందించుకోవాలి. అటు వంటి ఆలోచనా విధానం నుండి వచ్చినదే ఈ నా (అన్నగారితో) పరి చయం.

ఈ 'పరిచయం' అనే పుస్తకం మీరు వ్రాయడం వల్లగాని, మేము చదవడంవల్లగాని ప్రయోజనమేమిటని అడిగారొకాయన. ఆ ప్రయోజన మేమిటో తెలియడానికే ఈ ఉపోద్ఘాతం వ్రాయవలసి వచ్చింది. ఇది వ్రాసిననాడు చదివిన మీకు కొన్నివేల సంవత్సరాలుగా మనలో (మన మనసులో) దాగివున్న (తాత్విక) చీకట్ల తెరలు తొలిగి వెలుగు (జ్ఞాన) కిరణాలు ప్రవేశించి మన జీవిత విధానానికి దారి చూపగలవని ఆశిస్తు న్నాను.

# అన్నగారితో నా
# పరిచయం

అద్వైత తాత్వికాంశాలను అర్ధంచేసుకోవడం కష్టమనేవారున్నారు. అద్వైతతాత్వికాంశం అనిర్వచనీయం (నిర్వచించలేనిది) అనేవారున్నారు. అద్వైతం అంటే రెండూలేవనేవారున్నారు. అద్వైతం మిథ్యా (లేదనే) వాదం చెప్పిందని, అది వైరాగ్యాన్ని బోధించిందని, తద్వారా వ్యావహారిక జీవితంపై విరక్తిని కలిగించిందని చెప్పేవారు కొందరున్నారు. మరి కొందరు మతం కోసం దానిని శంకరుడు ప్రచారంచేశాడని అంటున్న వారు వున్నారు.

నిజంగా ఈ అభిప్రాయాలన్నీ తప్పేననీ అద్వైతంపై అన్యాయంగా అటువంటి అభాండాలు వేసి ప్రచారం (ద్వైతులు) చేశారనీ అన్న (చలమయ్య)గారు అంటూవుండేవారు. పైన చెప్పబడిన అభిప్రాయాలకు భిన్నమైన అభిప్రాయాలతో అద్వైత సిద్ధాంతాన్ని ప్రచారం చేయడమేగాక అది ఆర్థిక, సాంఘిక, రాజకీయ, మానసిక రుగ్మతలకు (తాత్విక) మందని కూడా వారు అంటూ వుండేవారు. అద్వైతం అర్ధంకాదనేది సామాన్యంగా అందరూ అమకునే అభిప్రాయం.

అటువంటి జటిలమైన ఆ తాత్వికాంశాలను అర్ధంచేసుకోవాలనే ఆకాంక్ష నన్ను ఆ విషయమై అన్నగారిని ప్రశ్నింపజేసింది. ఆ ప్రశ్నలో పైన చెప్పిన అభిప్రాయాలపై తన అభిప్రాయం తెలుసుకోవాలనేది నా అభిప్రాయం. నా అభిప్రాయం తెలుసుకున్న అన్నగారు తన అభిప్రాయం ఇలా చెప్పడం ప్రారంభించారు.

అద్వైతం చెప్పేతీరులో చెబితే అర్థంచేసుకోవడం కష్టంకాదనీ, కాని, దానిని చెప్పే పద్ధతిలో, తెలిసే తీరులో చెప్పేవారేలేరనీ అన్నారు. మీరు చెప్పే పద్ధతి కూడా అటువంటిదేనా అని నేనన్నాను. నేనన్న ఆ మాటకు నవ్వి నేమ కూడా అలాగే అందరిలాగనే చెబితే నా ప్రత్యేకత, నా విశేషం ఏముంటుంది అన్నారు.

మీరు చెప్పే తీరేమిటో నేను తెలుసుకోవచ్చునా అని నేనడగడంతో దానిలోని (అద్వైతంలోని) తాత్వికాంశాలను వివరించారు. అద్వైతమంటే రెండూ లేవని అనుకోవడం తప్పనీ. అద్వైత మంటే రెండు కాదని మాత్రమే అర్థంచేసుకోవాలనీ అన్నారు. అద్వైతంలో చెప్పబడిన "మిథ్య" కు లేదు అని కాదు (లేదు అంటే శూన్యవాదమవుతుంది) అది అట్లా నీవు చూస్తూవున్నట్లు నీవు అనుకుంటూ వున్నట్లు లేదని అర్థం అన్నారు.

అద్వైతం వైరాగ్యాన్ని బోధించిందనుకోవడం పొరపాటనీ పైగా అది అందరిని కార్యోన్ముఖులను గావించిందనీ (యుద్ధం చేయనని, చేయ లేనని ఆయుధం పారవేసిన అర్జునుడిచే మళ్లీ ఆ యుధం పట్టించి యుద్ధం చేయించింది అని అన్నగారి ఉద్దేశం) అద్వైతం మతం కోసం కాదనీ మతాతీతమైనది ఆ సిద్ధాంతమనీ, శంకరుడు మతాన్ని వ్యతిరేకించా డనీ, అద్వైతం అర్థమైతే మతాతీత మానవ సమాజాన్ని అది ఆశించిందని అర్థంచేసుకోవచ్చు ననీ అన్నారు. (అలా అద్వైతంలో చెప్పబడివుందో లేదో అనేది మనకు అప్రస్తుతం. కాని, అద్వైతంలోని తాత్వికాంశాలను అన్నగారు సమన్వయంచేసి చెప్పేతీరు మనకెంతవరకు సమ్మతం? మనంకోరే సామ్యవాద, సమసమాజ ఆశయానికి ఆ సమన్వయసూత్రాలు ఎంతవరకు ఆచరణ యోగ్యాలనేది ఈ పరిచయం ద్వారా మనం అర్థం చేసుకోవచ్చును). భౌతిక, ఆధ్యాత్మిక తాత్వికాంశాలలోగల భిన్న భావ నలు, అందులోని అభిన్నభావనలు మనం యెలా అర్థంచేసుకోవచ్చును? ఆ రెండు తాత్వికాంశాలలోని మౌలిక సూత్రాలు ఎలా భేదిస్తూవున్నవి? అనేది కూడా ఈ పరిచయ ఉద్దేశం.

అన్నగారిని తాత్విక చింతనకు దారితీసిన (మానసిక) కారణాలు (పరిసర) పరిస్థితులు, వారి వ్యక్తిగత జీవిత విశేషాలు, కుటుంబ పరిస్థి తులు కూడా తెలుసుకోవడం అవసరం, ఆ ఉద్దేశంతోనే క్లుప్తంగా ఆ విష యాలను వివరించి ఆ తరువాత వారితో నేను ఏ తాత్విక విషయాలలో ఎక్కడ ఎలా ఎందుకు భేదించినది, ఎక్కడ ఏకీభవించినది కూడా చెబు తాను. అదికూడా ఈ పరిచయంలో ముఖ్యమనే అనుకుంటున్నాను.

అంతేకాక వారు నాతో ఏ తాత్వికాంశంతో చర్చించి సమన్వయా నికి వచ్చింది కూడా చెబుతాను. అలాగే వారు ఇతరులతో ఎలా చర్చించింది

వారి అద్వైత సిద్ధాంతాన్ని ఎలా సమన్వయ పరుస్తూ, సమర్ధించుకుంటూ వచ్చింది కూడా వివరిస్తాను. నా సమక్షంలో జరిగినవి, నా పరోక్షంలో జరిగినవి (వారు, ఇతరులు) చెప్పగా విని తెలుసుకున్న విషయాలు (ఆసక్తిని కలిగించే అంశాలు) వివరించడం అవసరమని భావించాను. వారి జీవిత కాలంలో అనేకవేల మందితో చర్చించి, వాదించి వుంటారు. అనేక సభలలో ప్రసంగించి వుంటారు. ఆ చర్చల, వాదాల, ప్రసంగాల సారాంశ విషయాలన్నీ ఇక్కడ చర్చించడం, వివరించడం నాతరంకాదు. నేను చేయలేనంత పెద్దపని ఆ పని. కాని వారితో పరస్పర భిన్నాభి ప్రాయాలుగల వ్యక్తుల మధ్య జరిగిన ప్రధాన చర్చల సారాంశాన్ని మాత్రమే మీ ముందుంచుతున్నాను (అంతవరకే మనకు ముఖ్యం) నేను ఇబ్బందిపడి మీకు ఇబ్బంది కలిగించడం ఇష్టంలేక,

వారు మాట్లాడే మాట తీరులో వ్యంగ్యం, హాస్యం వుండేవి. కొద్దిగా శృంగారంకూడా కలగాపులగంగా వస్తూవుండేది. ఏది, ఎప్పుడు మాట్లాడినా తాత్విక సంబంధంలేని మాటంటూ వుండేది కాదు. క్రొత్తగా వారి ప్రసంగం విన్న వారికి ఇదేమిటి, ఇక్కడ ఇలాంటి తాత్విక సభలలో ఇలాంటి (బూతు) విషయాలు మాట్లాడుతున్నారు అనే సందేహం కలిగేది. కాని ప్రసంగం కొంత ముందుకు సాగిన తరువాత గాని అర్థమయ్యేది కాదు అందులోని తాత్వికార్థం. తాత్వికార్థంలేని వ్యర్థ వాక్యమే వుండేది కాదు వారు ఉపయోగించే వాక్యాలలో.

సరే ఆ విషయాలన్నీ ముందు చదవబోయే దాన్లో తెలుసుకుంటారు. ఇక ముందుగా వ్యక్తిగత జీవితం, వారి వ్యక్తిత్వం కుటుంబ పరిస్థితి (చరిత్రను) చూద్దాం. మా కుటుంబ చరిత్రను నేను వ్రాస్తున్నాను గనుక అది అతిశయోక్తిగా అనుకుంటారేమో ననే భయం (సంకోచం) కూడా నన్ను బాధిస్తూవున్నది. అందువల్ల వాస్తవాలలోని అతి ముఖ్య వాస్తవాలను మాత్రమే (జరిగినవి జరిగినట్లు) మీ ముందుంచుతాను. అలాగే మీరు చూడగలుగుతారు, ఒక్కొక్కసారి వాస్తవ విషయాలు కూడా చెప్పుకోవడానికి ఎబ్బెట్టుగా వుండి) వీలుగాని పరిస్థితులు కూడా వుంటై. అటువంటి విషయాలుచెప్పినప్పుడు అతిశయోక్తులుగానూ అనిపించవచ్చు,

చెప్పిన విషయాలు అర్థంకాకనూ పోవచ్చు. సొంత ప్రచారమని (సొంత డబ్బా) స్వప్రయోజనం కోసమని కూడా అనిపించవచ్చు, అనుకోవచ్చు. అటువంటి ప్రచారం మా గురించి మేము చేసుకున్నందువల్ల మాకు (మా కుటుంబానికి) గాని వాకు గాని ఒరిగేది వచ్చిపడేది (లాభించేది) యేమి వుండదు (ఎన్నికలలో నిలబడి వోట్లు అడగడంలాంటిది కాదిది. అంతేకాక ఆ పని చేయబోమని కూడా హామీ ఇస్తున్నాను) అందువల్ల సంతృప్తి మాత్రమే మిగులుతుంది.

అందువల్ల వున్నది వున్నట్లుగానే చెప్పడం జరిగింది. అలా చెప్పడంవల్ల వచ్చే సంతృప్తి (మానసిక ఆనందం) దేనివల్లరాదు. రాని (లేని) తృప్తికోసంవున్న సంతృప్తిని వదులుకునే(చంపుకునే) మనస్తత్వం మాకు (నాకు) లేదు. అందుకు కారణం తాత్వికరీత్యా పొందిన జ్ఞానం (అనుభవమని కూడా చెప్పవచ్చు). ఆ విషయం చెప్పక తప్పదు, చెప్పకుండా తప్పలేదు.

అన్నగారి మొదటి భార్య (సుందరమ్మ) భారతీరంగా (ఎన్. జి. రంగాగారి భార్య) తో కలిసి స్వతంత్ర పోరాటంలో పాల్గొని జైలుకి వెళ్లారు. అక్కడ అనారోగ్య కారణంగా అకాల మరణం పొందారు. రెండవ భార్య (విశాలాక్షి) కి గల సంతానంలో (16, 18, 20 వయస్సు వచ్చిన మగపిల్లలు ప్రమాదవశాత్తు మరణించారు. అటువంటి పరిస్థితులలో తాము సంపాదించుకున్న (అద్వైత) జ్ఞానం వారికి అండగా వున్నది గనుకనే ఆ దంపతులు అటువంటి దుఃఖాన్ని దిగమ్రింగి తేరుకుని మళ్లీ మామూలు మనుషులుగా మన మధ్య తిరగ గలిగారు.

చాలామంది తత్వవేత్తలు తమ తమ భార్యల వల్ల తాము మానసికంగా బాధింపబడ్డారు. (ఆయా తత్వవేత్తల మానసిక స్థాయిని అందుకో లేని వ్యక్తులవల్ల తత్వవేత్తలకు ఇబ్బందులు తప్పలేదు) భర్తల మానసిక స్థాయిని అర్థంచేసుకోలేక, ఆ తాపతుని అందుకోలేక, ఆచరణలో వారితో ముందుకు సాగలేక, సహకరించని భావ్యలతో ఇబ్బందుల పాలైనారు వారు.

అలా ఇబ్బందుల పాలైన తత్వవేత్తల చరిత్రలు చదివాం, విన్నాం. (సోక్రటీస్, రామానుజుడు అటువంటివారిలో ముఖ్యులు) తమ తమ భార్యలవల్ల (శిష్యులవల్ల కూడా) వారు పడిన మానసికవ్యధ (వధ) సామాన్యమైనదికాదు. ఆ విషయం తెలిసిన అన్నగారు అటువంటి ఇబ్బం దులు తనకు రాకూడదనే ఉద్దేశంతోనే వదినగారికి తత్వబోధలు వినిపించి ఆమెను కూడా తన తాహతుకు (తాత్వికంగా) పెంచుకుని, (వదినగారు కూడా అద్వైత పూర్ణ బోధావగాహనకలవారే) తద్వారా తామిరువురు తాత్వి కంగా (ఒక్కరై) వ్యావహారికంగా ఏకమై అభేదబుద్ధితోనే జీవించారు. అందరికి (సామాన్యులకు) అటువంటిది సాధ్యపడే విషయంకాదు. కాని, వీరికి సాధ్యపడింది. అందుకు వారు ధన్యులు. ఆ విషయం వారితో నేను అనేక సార్లు అంటూవుండేవాడిని. మా యెడల నీకువున్న అభిమానం, గౌరవం నీకు అలా అనిపిస్తూ వున్నదని వారనేవారు. అటువంటిది వారి వ్యక్తిత్వం.

అన్నగారి మొదటి భార్య సుందరమ్మ. వారికి స్వరాజ్యం అనే పేరు గల కుమార్తె వుంది. (స్వరాజ్యం కోసం ఆ దంపతులిరువురు స్వతంత్ర పోరాటంలో పాల్గొనే రోజుల్లో పుట్టిన ఆ బిడ్డకు స్వరాజ్యం అని ముద్దుగా పెట్టుకున్న పేరది). స్వరాజ్యం వచ్చేదాక ఆ తల్లి బ్రతికి వుండలేదు. ఆ బిడ్డను చూచుకునే అవకాశం ఆమెకు దక్కలేదు.

ఆ మొదటి భార్య అలా మరణించడంతో అన్నగారు రెండవ వివాహం చేసుకున్నారు. రెండవ భార్య విశాలాక్షి. వారికి భానుమతి అనే కుమార్తె, నరసింహారావు అనే కుమారుడు వున్నారు(మిగిలారు). కె. వర హరి (స్వరాజ్యం భర్త) కె. ఆనందరావు (భానుమతి భర్త) ఇద్దరు మంచి సంస్కరణ భావాలు, రాజకీయ పరిజ్ఞానం, తాత్వికాభిలాష గల వ్యక్తులు.

అన్నగారు తమ 76వ వయసులో గూడా (1980 వరకు) స్వయంగా కష్టపడి వ్యవసాయం చేస్తూవుండేవారు. అలా స్వయం కృషితో స్వతంత్ర జీవితం గడిపారు. (విశ్రాంతి నెరుగని, కోరని అవిశ్రాంత జీవి) అటు వంటి ప్రశాంత జీవితం వారిది.

స్వతంత్రపోరాట కాలంలో పోలీసు లాఠీ దెబ్బలతోను, చిత్రహింసల తోను వారి జీవితం ప్రారంభమైనది. సాంఘిక విప్లవం చేపట్టడంతో అనేక విమర్శలకు గురైనది. (ఆయన సంస్కర్త కావడం చేత సనాతన సంఘ దృష్టిలో సంఘవిద్రోహి)నాటకాలు స్వయంగాఆడి, ఆడించిన కళాభిమాని, సినిమాలలోనటించి ఆ మోజుకూడా తీర్చుకుని అభిమానులమెప్పులు సంపాదించుకున్నారు. తాత్వికరంగంలో ఎదురులేని విజయంసాధించారు. (అనేక సిద్ధాంత చర్చా సభలలో విజయం సాధించారు) అద్వైత సిద్ధాంత వక్త గాను, ప్రవక్తగాను పేరు పొందారు. అద్వైత సిద్ధాంతాన్ని విచక్షణా ద్వైతం అనే పేరుతో ప్రచారం చేసి అద్వైతానికి కొత్త మెరుగులు (కొత్త నిర్వచనాలు) దిద్దారు.

వేదాంత విద్యా విశారద అనే అర్హత (బిరుదు) ను పొంది, సదానంద అనే సార్థక నామంతో (ఆ నామాన్ని సార్థకం చేసుకుని ఆనందం అంచులు జూసి, దానికి నిర్వచనం చెప్పి, దానిని సొంతం చేసుకుని, అందులో తాదాత్మ్యం పొంది) సదా ఆనందంతో జీవించిన సార్థక జీవి సామాన్యజీవి. వారి జీవితం మరొకరికి ఆదర్శం కావాలనేదే వారి జీవిత లక్ష్యంగా వుండేది.

వేష భాషల్లో అద్వైత సన్యాసిగా కనిపించినా, వారు వారి భావాల్లో బౌద్ధబిక్షువుగా అర్థమయ్యేవారు, మరణభయంతో(మరణించనిమార్గం తెలుసుకోవాలని) అద్వైత విచారణ ఆరంభించినా, ఆ విచారణ వల్ల మరణ భయం పోతుండేగాని మరణాన్ని తప్పించలేమని గుర్తించారు. ఆ తరువాత మెట్టుగా మోక్షాన్ని కాంక్షించి దానిని పొందడంకోసం ఆ విచారణ కొనసాగించారు. ఆ ఫలితంగా మోక్షం కొత్తగా పొందేది కాదని అది జీవుడు (తాను) సహజంగా పొందే (సిద్ధించే) వున్నాడని అర్థంచేసుకున్నారు. అలా అద్వైత విచారణలోని ఆరంభ కాలంలోని ఆశయంనుండి ఆలోచనలు వేరై క్రమంగా మారుతూ చివరకు అద్వైత సూత్రాలను సమాజపరంగా (మానవ విలువలకు ప్రాధాన్యం ఇచ్చి) సమన్వయ పరచి చెప్పే స్థితికి పరివర్తన చెందారు. చివరి కాలంలో వారి ప్రసంగాలు భౌతిక తత్వశాస్త్రానికి అనుగుణంగాను, సమన్వయానికి పరిపోతూను వుండేవి.

## మా కుటుంబ విషయం

అన్నగారి వ్యక్తిగత జీవితం అలా వుండగా మా కుటుంబ విషయం ముందు తెలుసుకుని, తరువాత మళ్లీ అన్నగారిలోని వ్యక్తిత్వం, తాత్విక చింతనకు దారితీసిన పరిస్థితులు, ఆ తరువాత వారిలోని తాత్విక పరిణామం పరిశీలించుదాం.

లలితాంబ, చిననరసయ్య మా తల్లిదండ్రులు. మేము ఏడుగురు అన్నదమ్ములం. మాకు ముగ్గురు అక్క చెల్లెండ్రు వున్నారు. మాది గుంటూరుజిల్లా రేపల్లె తాలూకా, పెదపులివర్రు శివారు, గుత్తావారిపాలెం. మా ఇంటిపేరు గుత్తావారు. మా వృత్తి వ్యవసాయం. ప్రవృత్తిని గురించి చెప్పబోతున్నాను.

మా నాన్నగారు వైష్ణవ భక్తులు (అంటే మా మతం శ్రీవైష్ణవం). నిజాయితీగా నమ్మి భక్తి చేస్తూ వుండేవారు. మా నాన్నగారికి వున్న దైవభక్తిని ఆధారంచేసుకుని పూజారి వర్గం ఆర్థికంగా మా కుటుంబాన్ని పీడించి (దోచి) వారి ప్రయోజనాలను గడుపుకుంటూ వుండేవారు. ఆర్థికంగా పిండి పిప్పిచేశారు మా కుటుంబాన్ని. ప్రతి చిన్న విషయానికి పురోహితుడు వచ్చి వర్జ్యమని, వారమని, ముహూర్తమని చెబుతూవుండేవారు. పూజ, పునస్కారాలు మొదలు పెట్టించి ఆ పేరుతో వారికి కావలిసిన దినభత్యాలు సగౌరవంగా పొంది తీసుకుపోతూ వుండేవారు. అది వారి దైనందిన కార్యక్రమంగా జరిగిపోతూ వుండేది. (మాకు దినగండంగా గడుస్తూ వుండేది).

ప్రతి సంవత్సరం వ్రతాల పేరుతో అన్న, వస్త్ర, ఫల, పత్ర, పుష్ప దానాలు చేయిస్తూ వుండేవారు. అంతేకాక సంతర్పణలు (అన్నదానాలు) సత్ఫలితాలనిస్తాయని చెప్పి (నమ్మించి) ప్రతి సంవత్సరం ఆ పేరుతో కొన్నివేల రూపాయలు ఖర్చుచేయిస్తూ వుండేవారు. పురాణ కాలక్షేపమని, హరికథా కాలక్షేపమనిచెప్పి ప్రోత్సహిస్తూ వాటిని ఆ కులం (బ్రాహ్మణుల) వారిచేత ఏర్పాటు చేయిస్తూ భక్తి పేర వారు భుక్తిని గడుపుకుంటూ వుండేవారు. (అలా వారి భుక్తి కోసం యేర్పాటు చేసుకున్న భక్తి కార్యక్రమాల

వల్ల వారు గౌరవ మర్యాదలు పొందుతూ, అందుకు సాయపడే వారిని హేళనగా, చులకనగా చూస్తూవుండేవారు).

పౌరాణిక గ్రంథాలలోని పురాణ (కల్పిత) కథలను వినిపిస్తూ ఆ యా భక్తులు, ఆ యా దశలలో చేసిన భక్తి ప్రభావంవల్ల వారు ఏ విధంగా కడతేరినది చెబుతూ వుండేవారు (ఎవ్వడూకడతేరలేదనుకోండి) అలా కల్పించిన కథలు చెప్పి నాన్న గారిని అందుకు (భక్తికార్యక్రిమాలకు) ప్రోత్సహిస్తూ వుండేవారు పురోహిత వర్గీయులు. ఆ కథలు వింటున్న కొద్ది భక్తిభావం పెరిగి అందుకు అయ్యే ఖర్చులు కూడా లెఖ్ఖచేయకుండా వారు చెప్పిన వ్రత, క్రతు విధానాలను క్రమం తప్పకుండా పాటిస్తూ అనుసరిస్తూ వుండేవారు నాన్నగారు.

భక్తి కథలు వింటున్నప్పుడు మనకు ఒక విధమైన వూపు, ఆవేశం (మైకం) వస్తుంది. అలాంటి వూపు మనలో వచ్చే విధంగా ఆ కథలు వ్రాయబడి, ప్రచారం చేయబడినవి. అవి వినడం ద్వారా మనకు కలిగిన ఆవేశంలో (అజ్ఞానంలో) మన కష్ట నష్టాలను లెఖ్కచేయకుండా వాటిని అనుసరిస్తూవుంటాం.

మా నాన్నగారు సామాన్యమైన చిన్న రైతు కుటుంబంలో పుట్టారు. పదిహేను ఎకరాల (మెట్ట) పొలం మాత్రం వుండేది. కాని వ్యవసాయం ఆధునిక పద్ధతుల ననుసరించి (క్రొత్త విషయాలు తెలుసుకుంటూ వాటిని అనుసరిస్తూ) చేస్తూ వుండేవారు.

అలా ఆధునిక పద్ధతులలో వ్యవసాయంచేస్తూ వున్నందువల్ల ఆదాయం బాగా వచ్చేది. బత్తాయి, నారింజ, నిమ్మ, జామ వగైరా పండ్ల తోటలే కాక కొబ్బరితోట కూడా పెంచి తద్వారా మంచి ఫలసాయం పొందేవారు. మాగాణి భూముల్లో వరికోతలు కాగానే దున్నించి(వేసవిలో) వంగ, బీర, బెండ, కాకర వగైరా కూరపాదులు పెట్టించి శ్రమ అనుకోకుండా వాటిని పోషించి పెంచి అదనపు ఆదాయం తీస్తూ వుండేవారు. (ఆయిలు ఇంజన్లు, కరెంటు మోటార్లు రాని, లేని రోజుల్లో చేతిబోత మీద ఆధారపడి ఆ పంటలు అలా పండించేవారు. అందుకు చెప్పవలసివచ్చింది).

కాలం వృథాకానివ్వక తెల్లవారక ముందే నిద్రలేచి వ్యవసాయపు పనులు స్వయంగా చూచుకుంటూ కష్టపడి (కృషి నినమ్మి) చేసుకుంటూ వుండేవారు. ఆ వృత్తి మీద వారికి మంచి పట్టు వుండేది. అన్ని వృత్తులకు ఆ వృత్తే ఆధారమని విశ్వసించి, మనస్సంతృప్తితో ఆ వృత్తిని చేస్తూవుండేవారు. వృత్తి దైవం లాంటిది అనుకునే వారు. దైవంమీద నమ్మకంతో భక్తిని ఎంత నిజాయితీగా చేస్తూవుండే వారో, అలాగే చేస్తూవున్న వృత్తిమీద కూడా అలాంటి నమ్మకం, విశ్వాసం వుంచి అంతటి నిజాయితీగానే వృత్తిని చేస్తూవుండేవారు. వృత్తిలో నిజాయితీగా వుండడమంటే ఈ రోజుల్లో సాధ్యపడే విషయంకాదు. నిజాయితీగా వుంటే తగినంత సంపాదన కూడా వుండదు కారణం అటువంటి పరిస్థితులలోనే వున్నవి ఈనాడు వృత్తులన్నీ (ఒక్క వ్యవసాయవృత్తి తప్ప), నిజాయితీలేని వృత్తిని చేయడమంటే నిజంగా మానవత్వాన్ని మంటగలపడమే అవుతుంది. సంపాదించడంకోసం వ్యక్తిత్వాన్ని చంపుకుని, సంపాదించడమే పరమావధిగా భావించే ఈ వ్యక్తుల మధ్య వ్యక్తికి (వ్యక్తిత్వానికి) విలువే వుండదు, అలాంటి మిథ్యా విలువలు మానవుణ్ణి మానవుడిగా వుంచక మానవత్వానికి దూరంగా తీసుకుపోతూవుంటై.

## మా నాన్నగారి వ్యక్తిత్వం

ఏ వ్యక్తి అయినా తనకు మంచిదని తోచిన (తెలిసిన) దానిని అనుసరించి, ఆచరించాలి అపుడే ఆ వ్యక్తి వ్యక్తిత్వంగల వ్యక్తి కాగలుగుతాడు. వ్యక్తిగా గుర్తించబడి గౌరవించబడతాడు. ఏ సిద్ధాంతమైనా ఆచరణదగ్గరే దాని మంచి చెడ్డల నిర్ధారణ కాగలదు. (ఆచరణకు అనుకూలంకాని సిద్ధాంతం అది సిద్ధాంతం కానేరదు) తాను మంచిదని నమ్ముతూ ఇతరులకు ఆ సిద్ధాంతం యొక్క మంచితనాన్ని ఔన్నత్యాన్ని చెబుతూ అదే సిద్ధాంతాన్ని తాను అనుసరించకుండా, ఆచరించకుండా వున్నాడు అంటే ఆ సిద్ధాంతం తనకే మంచిదికాలేదన్నమాట (మంచిదని మనస్ఫూర్తిగా గుర్తించలేదన్నమాట), తనకు మంచిది కాని సిద్ధాంతం, తాను ఆచరించని సిద్ధాంతం (ఆచరించలేని సిద్ధాంతం) ఇతరులకు చెప్పడమంటే ఇతర వ్యక్తుల వ్యక్తిత్వాలను ఆ వ్యక్తి గుర్తించలేదన్నమాట. అంటే ఆ వ్యక్తులను మానసికంగా కించపరుస్తూ, పరోక్షంగా అగౌరవ పరుస్తున్నాడన్నమాట.

మా నాన్నగారు తన ఆలోచనకు మంచి అనుకున్న దానిని నిస్సందేహంగాను, నిజాయితీగాను అనుసరించేవారు, ఆచరించేవారు. అటువంటి ఆచరణలో వచ్చే పచ్చ కష్టాలను కూడా లెక్కచేసేవారుకాదు. అలా ఆచరించడం ద్వారా వారికి అది మానసిక సంతృప్తినిచ్చేది. (తాను చేస్తున్నది తనకు తృప్తినిచ్చిందంటె అంతకంటే కావలసిందేముంటుంది? (మనిషికి ప్రధానమైనది మానసిక సంతృప్తే కదా?)

అలా తన వ్యక్తిత్వాన్ని తాను నిలుపుకుంటూ, ఇతరుల వ్యక్తిత్వానికి విలువ నిస్తూ, గౌరవిస్తూ వుండేవారు. అందువల్ల సమకాలిక సమాజంలో వ్యక్తం (జ్ఞానం) గల వ్యక్తిగా వారిని అందరూ గుర్తించి గౌరవిస్తూ వుండేవారు

కొందరు గౌరవంకోసమని మంచి పనులు చేస్తూ వుంటారు. మరి కొందరు మంచి పనులు చేయడం ద్వారా గౌరవం పొందుతూ వుంటారు. గౌరవం కోసమని మంచి పనులు చేసే మనిషికి మంచి అంటే ఏమిటో తెలియదు మంచి చెడ్డలను నిర్ణయించుకునే తాహతు వుండదు. అందుకు కావలసిన విచక్షణా పరిజ్ఞానం (తాత్వికంగా) అతనికుండదు. ఆ కారణంగా ఇతరులు మంచి అనుకునేదానిని విని, తాము మంచిదనుకుని దానిని అనుసరిస్తూ వుంటాడు (మంచి కోసం కాదు తన గౌరవం కోసం). కాని మంచి పనులు చేసి గౌరవంపొందే మనిషికి మంచిఅంటే ఏమిటో తెలుసు (తెలుసుకుంటాడు గనుక). అందుచేత తనకు తెలిసిన మంచితనంమీద తాను స్థిరమైన అభిప్రాయం కలిగివుంటాడు. ఆ కారణంగా దానిపై నమ్మకం, విశ్వాసం స్థిరపడుతుంది. కనుకనే దానిని ఆచరిస్తాడు. అదే వ్యక్తిత్వం అంటే. వ్యక్తత అంటే జ్ఞానం కనుక జ్ఞానం వస్తే వ్యక్తిత్వం స్థిరపడుతుంది. జ్ఞానంలేని (రాని) వ్యక్తి వ్యక్తిగా స్థిరపడలేదు. వ్యక్తిగా స్థిరపడిన వ్యక్తిలో స్వేచ్ఛాభావం పుంజుకుంటుంది. స్వేచ్ఛను గుర్తించి, గౌరవించే వ్యక్తి ఇతరుల స్వేచ్ఛను అరికట్టాలనుకోడు. అటువంటి వ్యక్తిగా మా నాన్నగారు చెప్పుకోదగ్గవ్యక్తి.

వ్యక్తం (జ్ఞానం) గల వ్యక్తులకు, అవ్యక్తం (అజ్ఞానం) లేని వ్యక్తులకు అదే వ్యత్యాసం. అంటే వ్యక్తంగలవ్యక్తి మానసికంగా స్వతం

తుడు. మానసికమైన దాస్యాన్ని వ్యక్తిత్వంగల వ్యక్తి అంగీకరించ లేడు. అజ్ఞానంలోని వ్యక్తి మానసికంగా అస్వతంతుడు. అందుచేత అతడు వ్యక్తిత్వంలేని వ్యక్తి. వ్యక్తిత్వమే "స్వేచ్ఛ"కు నిదర్శనం. వ్యక్తిలోని స్వేచ్ఛా పిపాసే వ్యక్తిని వ్యక్తంలో వుంచుతుంది అందుకే "స్వేచ్ఛ" అనేది జ్ఞానంతో మాత్రమే పొందగలుగుతాం.

అటువంటి స్వేచ్ఛాతత్వం కారణంగానే స్వతంత్రపోరాట కాలంలో రాజకీయ స్వేచ్ఛకోనం (రాజకీయ బానిసత్వంభరించలేక) అనేక త్యాగాలు చేసి పోరాటాలు సాగించారు. స్వాతంత్ర్య పోరాటకాలంలో (విదేశ వస్త్ర బహిష్కరణ అనేదికూడా స్వాతంత్ర్యపోరాటంలో ఒక భాగం) ఖద్దరుధారణ చేసి ఆ పోరాటానికి ప్రోత్సాహమిస్తూ వుండేవారు నాన్నగారు. తాను చేయ గలిగింది చేస్తూ ఇతరులు చేస్తున్నదానికి అన్నివిధాల సహాయ, సహ కారాలు అందిస్తూ వుండేవారు. మా గ్రామంలో బాలగంగాధర్ తిలక్ పేర గ్రంథాలయ స్థాపనకు కృషిచేసిన ప్రముఖులలో నాన్నగారొకరు. విద్యా విషయాలపై ఆసక్తిగల వ్యక్తి.

మా పెద్ద అన్న చలమయ్యగారు స్వతంత్రపోరాటంలో భాగమైన వ్యష్టి సత్యాగ్రహం, ఉప్పుసత్యాగ్రహం పోరాటాలలో పాల్గొని జైలుకు వెళ్ళారు. ఆ పోరాటంలోనే మా వదిన (చలమయ్యగారి భార్య) సుంద రమ్మగారు, మా రెండవ అన్న రామానుజయ్యగారు కూడా అదే సమ యంలో జైలుకు వెళ్లడం జరిగింది.

అటువంటి పరిస్థితులలో కూడా మా నాన్నగారు ఎంతో నిబ్బరంగా వుండి తమ కార్యక్రమాలు తాము నిర్వహిస్తూ పై కార్యక్రమాలకు ప్రోత్సాహమిస్తూ వుండేవారట. ఇంతవరకు నా పరోక్షంలో (నేను పుట్టక ముందు) జరిగిన విషయాలివి. (చెప్పగా విని తెలుసుకున్న విషయాలు) సొంతంగా ఇటుకరాయినితీసి బర్మాపైగావు టేకు కలప తెప్పించి మూడు అంతస్థుల భవనం ఆ కుగ్రామంతో కట్టించారు (కాలక్రమంలో ఆ భవనం విశ్వమానవ కళ్యాణ భవనం అనే పేరుని సార్ధకం చేసుకున్నది). అనేక తాత్విక, రాజకీయ, సాంఘిక చర్చలకు అది నిలయంగా వుండేది. అంతే కాక అనేక సాంఘిక సంస్కరణ కార్యక్రమాలు, కులాంతర వివాహాలు

కూడా ఆ భవనంలో జరుగుతూవుండేవి అనేక పూల, పండ్ల చెట్ల మధ్య (ఒక ఎకరం విస్తీర్ణంలో) వున్న ఆ భవనం అనేకమంది యాత్రికులకు వినోదయాత్రాస్థలంగా వుండేది ఆ రోజుల్లో.

మాకు చివరి ఆస్తిగా అదేమిగిలింది. దానిని అమ్మి శేష ఋణ విముక్తులమై మేము 1947 జూన్ నెలలో మద్రాసు చేరాం. అనాటి అక్కడి సాంఘిక, ఆర్థిక పరిస్థితులలో ఆ ఊరు విడిచిరాక తప్పలేదు. అక్కడ వుండి చేయగలిగిందిలేదు. ఏదైనా చెయ్యగలిగినచోటు, చెయ్యవీలున్న చోటు వెతుక్కోవలసి వచ్చింది. ఆ పరిస్థితులలో అలా మేము తమిళనాడులో ప్రవాసాంధ్రులంగా స్థిరపడవలసి వచ్చింది.

అంతవరకు మా కుటుంబ విషయాలు అలావుండగా అన్నగారి వ్యక్తిగత జీవితం, వారు తాత్విక రంగంలోకి రావడానికి గల కారణాలు, కారణాల పూర్వరంగం ఎలాంటిదనేది తెలుసుకోవడం కూడా అవసరమని భావిస్తున్నాను. అందుచేత ఆ విషయాలు క్లుప్తంగా వివరిస్తాను.

## అన్నగారు - వ్యక్తిత్వం

సగటు తలసరి ఆదాయం కంటే అధికంగా అనుభవించకూడదనే ఉద్దేశంతో చాలా నిరాడంబర జీవితం గడిపేవారు అన్నగారు. అనాటి సగటు తలసరి ఆదాయం అణాకాని అని లెక్కలు తేల్చిచెప్పినవట. (అణాలు, కానులు అములులోవున్న కాల మది). రెండు కానులు అర్ధణా, నాలుగు కానులు ఒక అణా. అర్ధఅణాతో కొబ్బరికాయ, అర్ధఅణాతో శనగలు (నానబెట్టి తినడానికి) ఒక కానీతో బెల్లం కొని తిని జీవించేవారు. బట్ట కూడా చాలతక్కువ (మోకాళ్ల వరకు) కట్టుకుని, చిన్న తువ్వాలు మాత్రమే పైనకప్పుకుని కాలంగడిపేవారు. అది ( ఆ పద్ధతి) కొందరికి ఎబ్బెట్టుగా వున్నట్లు కనిపించినా తన నిర్ణయాన్ని తాను మార్చుకోకుండా (ఒక నిర్ణయానికి వచ్చిన తరువాత ఏ పరిస్థితులలోను ఆ నిర్ణయాన్ని మార్చుకునే వారుకాదు) అదే విధమైన నిరాడంబర జీవితాన్నే గడుపుతూ వచ్చారు. అది ఆనాడు వారికి సంతృప్తినిచ్చిన జీవిత విధానం. అందుచేతనే ఆ జీవిత విధానాన్ని అనుసరించి జీవించారు. ఎవరు ఏమనుకున్నా లెక్క చేయకుండా అలా జీవించారు.

# తాత్త్విక చింతనకు దారితీసిన కారణాలు

స్వతంత్ర పోరాటకాలంలో పెద్ద అన్న (చలమయ్య) గారు రెండవ అన్న (రామానుజయ్య) గారు జైలుకి వెళ్ళడంవల్ల వ్యవసాయ పనులు కుంటుపడడం, ప్రభుత్వంవారు జప్తులని, జరిమానాలని విధించడం. పెద్ద తుఫాను (1936) వల్ల పండ్లతోటలు పడిపోవడం, అదేసమయంలో ధరలు పూర్తిగా పడిపోవడం కారణంగా మా కుటుంబం ఆర్థిక ఇబ్బందులకు గురి కావలసి వచ్చింది.

మా పెద్ద వదిన (సుందరమ్మ) గారు జైలులో అస్వస్థులై మరణిం చడం, మా మూడవ అన్న నారాయణరావుగారు (21వ ఏట) వ్యవసాయ పనులు చూచుకుంటూవున్న సమయంలో హఠాత్తుగా అస్వస్థులై మరణిం చడం అనే కారణాలు మా కుటుంబంలో కొంత మానసిక ఆందోళనకు దారి తీశాయి. (తాత్త్విక చింతనకు కారణమైనాయి).

నిజ భక్తులకు ఇదేమి శోధన అనే ఆందోళనతో ఆలోచన కలగడం, ఈ దుఃఖ నివృత్తికి మార్గంలేదా అనే సందేహం మా తలిదండ్రులకు కల గడం, అటువంటి (తాత్విక) విషయాలకు పరిష్కారమేమిటనే నిరంతర మైన తపన ఇవన్నీ తాత్విక చింతనకు దారితీశాయి. మా మత (వైష్ణవ) గురువులను కలిసి ఆ విషయమై సంప్రదించడం, దానికి వారు పరైవ (హేతుబద్ధమైన) సంతృప్తికరమైన సమాధానం చెప్పలేకపోవడంజరిగింది. అన్ని బాధలకంటే దుఃఖబాధ (తాత్వికంగా కల్పించబడినదే) బాధాకర మైనదిగదా.

అదే సమయంలో మా పెద్ద అన్నగారు జైలునుండి విడుదలై రావడం, అద్వైత సిద్ధాంత బోధకులను సంప్రదించడం జరిగింది. జనన మరణ సమస్యలను అద్వైత విచారణవల్ల అర్థంచేసుకోవచ్చునవనే అభిప్రా యం కలగడం, ఆ విచారణకు కావలసిన, తగిన బోధకుని (గురువుని) నిర్ణయించుకుని ఆ విద్యకోసం వారిని (సంప్రదాయబద్ధంగా) ఆశ్ర యించడం జరిగింది.

కొడాలి రత్తయ్యబాబుగారి వద్ద ఉపదేశంపొంది ఆ విద్యను క్షుణ్ణంగా అభ్యసించారు (మా నాయనమ్మ, నాన్న, అమ్మ, అక్క, అన్న

గారు ఆ విద్యను అభ్యసించినవారిలో ముఖ్యులు). ఆ గురువుగారు అద్వైత బోధను చక్కని తెలుగులో ఉపమాన, ఉపమేయ సహితంగా అందరికి అర్థమయ్యేతీరులో చెబుతూవుండేవారు. వారు మాకు గురువులు కావడంచేతనే ఈ విద్య మాకు ఇంతగా అబ్బిందని అంటూ వుండేవారు. రత్తయ్యబాబుగారి మాటలు రతనాల మూటలు అనికూడా తరచు అంటూ వుండేవారు అన్నగారు.

ఇంగ్లీషు పాఠశాలలను బహిష్కరించి, జాతీయ పాఠశాలలను నడిపించడం జాతీయపోరాటంలో భాగంగా ప్రచారం జరుగుతూవున్న రోజులలో 'వేదాశ్రమము' అనే పేరుతో వేద పాఠశాలను ప్రారంభించి మా తండ్రి (చిననరసయ్య)గారు నడుపుతూ వుండేవారట కాలక్రమంలో అది వేదాంత (అద్వైత) విద్యాపీఠంగా మారి తాత్విక చర్చా వేదికగా అభివృద్ధి చెందింది.

ఏబది సంవత్సరాలకుపైగా మా కుటుంబం (నాన్నగారి కాలం నుండి) తాత్విక సంబంధమైన చర్చలు (భక్తిమార్గం వదలి) చేస్తూ వున్నది. ముఖ్యంగా మా పెద్ద అన్న చలమయ్యగారు, మా పెద్ద అక్క రాజరత్నమ్మగారు బాగా కృషిచేసి అనేక తాత్విక (అద్వైత) చర్చా వేదికలు నిర్వహిస్తూ వచ్చారు. 1935 లో ప్రారంభించిన 'వేదాశ్రమం' ద్వారా అనేకమంది అద్వైత విద్యాభ్యాసం చేయడానికి వీలు కలిగింది. ఆ పీఠంనుండి అనేకమంది ప్రముఖుల ప్రసంగాలు ఏర్పాటు చేశారు. అనేక చర్చా వేదికలు నిర్వహించడం జరిగింది ఆ కారణంగా మా కుటుంబంలోని ప్రతివ్యక్తికి ఎంతో కొంత అద్వైత తాత్వికాంశాలను అర్థంచేసుకోవడానికి అవకాశం కలిగింది. మా కుటుంబానికి అదొక ప్రత్యేక అవకాశమనే చెప్పవచ్చు.

## మరణ భయం

వ్యావహారిక కష్టాలువచ్చినప్పుడు దైవ పరీక్షగా భావించి ఆ కష్టాలను భరిస్తాడు భక్తుడు. కాని, తాత్విక సంబంధమైన (జనన, మరణ) చిక్కులు వచ్చినప్పుడు తట్టుకోలేడు, ఆవేదన పడతాడు, ఆలోచిస్తాడు. పరిష్కారమార్గాన్వేషణలో జిజ్ఞాస (తాత్వికంగా) పెరుగుతుంది. తద్వారా కొంత మానసిక శాంతి లభిస్తుంది (పరిష్కారం లేకపోయినా).

మరణమంటే యేమిటి ? మరణం "మేను"కా ? "నేను"కా ? జన్మించినవాడు మరణించక తప్పదా ? జనన మరణాలకు కారణమేమిటి ? వాటిని నిర్దేశించినవాడెవడైనావున్నాడా ? మరణం సహజమా ? అసహజమా ? దీనిని తప్పించే మార్గంలేదా ? ఇటువంటి విషయాలకు తత్వశాస్త్రంలో సమాధానం దొరకుతుందా ? నేనంటే ఏమిటి ? మేనంటే ఏమిటి? వాటికిగల కార్య, కారణ సంబంధాలను ఎలా అర్థం చేసుకోవచ్చును ? కారణంలేని కార్యంవుంటుందా ? కారణజ్ఞానం కలిగితే కార్యం ఏమవుతుంది? అనేటటువంటి ఆలోచనలో తాత్విక విషయాలు ఆసక్తిని కలిగించిన కారణంగా (దుఃఖ నివృత్తికి) అన్వేషణ ఆరంభమైనది. తాత్విక సభలకు వెళ్ళడం, స్వయంగా తాత్విక సభలు నిర్వహించి జరిపించడం జరుగుతూ వుండేవి. ఆధ్యాత్మిక తాత్విక విషయాలు ఒక పద్ధతిలో వుండక పరస్పర విరుద్ధాల సముదాయం కావడంవల్ల అది అంత సులభంగా వంటబట్టను. విరుద్ధాంశాలను భేదించగల వారికే అది అర్థమవుతుంది.

అద్వైత విచారణవల్ల మరణభయం పోతుందేగాని, మరణాన్ని తప్పించలేమని గుర్తించారు. మరణం మేనుకేగాని 'నేను'కు కాదు. జనన మరణాలు ప్రకృతి సహజాలు. ఏది పుట్టుతున్నదో అది మరణించకతప్పదు. (పునరపి జననం పునరపి మరణం). ఏది పుట్టదో (పుట్టలేదో) అది చావదు. ఏ పదార్థం కారణంగా వస్తువు పుట్టి నశిస్తుంది. కాని ఆ పదార్థం నశించదు (చావదు) అది పుట్టలేదుగనుక. అదే విషయం, అదేసూత్రం ఇక్కడ కూడా వర్తిస్తుంది.

ఏది జన్మించినదో అది శరీరం (దేహం). అది నీవు కాదు. అది పుట్టుతున్నదిగనుక మరణించక తప్పదు. అందుచేత జనన మరణాలు నీకు (ఆత్మకు)లేవు. అటువంటి నీవే (జనన మరణ రహితుడవైన) నీవని తెలిస్తే (ఆ జ్ఞానం నీకు వస్తే) జనన, మరణ భయం నీకు పోతుంది. ఆ జ్ఞానం నీకు రాకపోతే (అజ్ఞానంలోనే నీవుంటే) ఆ భయం నిన్ను పట్టి పీడిస్తూవుంటుంది. ఆ భయమే నీ మరణానికి కారణమవుతుంది. ఆనాటి అద్వైత విచారణవల్ల అలాంటి తాత్వికాంశాలు అర్థంచేసుకునే అవకాశం మా కుటుంబ పెద్దలకు కలిగింది.

అలా తాత్వికంగా స్వతంత్రులైన మా పెద్దల ఆలోచనా విధాన పర్యవసానంగా అనేకమైన మార్పులు మా కుటుంబంలో వచ్చినై. తాత్విక

దృక్పథం బాగా బలపడిన కారణంగా వ్యావహారిక సంబంధమైన జీవితంలో (నైతిక ప్రవర్తనలో) మార్పులు రాసాగాయి.

ఏదైనా ఒక తాత్వికాంశం అర్థమయితే మరొక తాత్వికాంశం అర్థం చేసుకోవడానికి వీలవుతుంది. అది ఒక మెట్టుగా మరొక మెట్టు ఎక్కడానికి వీలవుతుంది. ఆ తాత్విక పునాదులమీదనే నాకు భౌతిక తత్వశాస్త్రం అభివృద్ధి చేసుకొనే వీలు చిక్కింది.

అలా అద్వైత విచారణ సాగినకొలది భక్తి (ద్వైత) భావం అభావంచెంది ఆ స్థానంలో అద్వైత (జ్ఞాన) భావం స్థిరపడసాగింది. ఆ సిద్ధాంతం బలపడినకొద్దీ పరోక్షభావం బలహీనపడి అపరోక్షభావం బలపడసాగింది. అలా అపరోక్షభావం స్థానం ఏర్పరచుకున్నది. పరోక్షభావం తప్పని తెలియడంతో దైవ భావం (దేవుడున్నాడనే భావం) అభావం చెందింది. దైవభావం అభావం చెందడంతో దైవ ప్రార్థనలు అవసరం లేదని తెలిసింది. దైవ ప్రార్థనలు అక్కరలేదని తెలియడంతో విగ్రహారాధన అవసరం లేకుండా పోయింది. ఆ కారణంగా వైదిక పౌరోహిత్యం కల్పించిన మంత్ర తంత్రకాండను పూర్తిగా విసర్జించడం జరిగింది. మతపరమైన ఆచార (అనాచార) సంప్రదాయ (దుస్సంప్రదాయ) బంధనాల నుండి బయటపడి సర్వ స్వతంత్రులైనారు మా కుటుంబ పెద్దలు. ఆ మార్పు సామాన్యమైనదేమీకాదు. ఆ మార్పువల్ల మరికొంత ముందుకు (తాత్వికంగా) సాగడానికి వీలు కలిగింది. అలవాటుపడిన భావాల దాస్యం నుండి ఆలోచించే దశకు అభివృద్ధి కావడానికి ఆనాటికి అద్వైత విచారణ అవసరమైనది.

అలా ఆ దశకు యెదిగిన దశలో మాలో కొందరు భౌతిక తత్వశాస్త్రం వైపుకు, మరికొందరు ఆధ్యాత్మిక తత్వశాస్త్రం వైపుకు తమ తమ ఆలోచనలను సాగించి అభివృద్ధి చేయసాగారు. అలా భిన్నమైన తాత్వికాంశాల పరిశీలనలో వచ్చిన సమన్వయ దృక్పథంనుండి ఆచరణకు సంబంధించిన ఆలోచనలు అభివృద్ధికావడంతో ఆచరణ భాగంలో ఏకాభిప్రాయం సాధించి ఆచరించడానికి సాధ్యపడింది.

ఆచరణకు అనుకూలించని తాత్విక భాగాలను మా ఆలోచనలనుండి విడగొట్టి, ఆచరణకు అనుకూలించే భాగాలను (అది ఏ తత్వశాస్త్రంనుం

డైనా) మాత్రమే స్వీకరిస్తూ వచ్చిన ఆలోచనా విధానం నుండి వచ్చినదే ఈ మా కుటుంబఆచరణభాగం. మాలో కొందరు ఆధ్యాత్మికవాదులుగాను, మరికొందరు భౌతికవాదులుగాను ఆ యా తత్వశాస్త్రాలపై పూర్తిగా మొగ్గు చూపినవారైనప్పటికిని సాంఘిక సంస్కరణలకు సంబంధించిన ఏ రూపం లోని ఆచరణభాగం వచ్చినా ఏ విధమైన భేదాభిప్రాయం లేకుండా ఆచరిస్తూ వచ్చాం. అలా ఆచరణలో ఏకాభిప్రాయంతో వ్యవహరించడానికి కారణం ప్రధానంగా తాత్విక సమన్వయమేనని చెప్పడానికి సంతోషిస్తు న్నాను. అదే తాత్విక సమన్వయానికి నిదర్శనం.

అలా అన్నగారి అద్వైత తాత్విక ఆలోచనలు, మా భౌతికదృక్పథం నుండి వచ్చిన ఆలోచనలు ఆ విధమైన సాంఘిక సంస్కరణలకు కారణ మని చెప్పడం అతిశయోక్తి కాదనుకుంటాను. ఆ విధమైన సంస్కరణలు 1932 వ సంవత్సరంలో ప్రారంభమైనవని చెప్పవచ్చు.

మా నాన్నగారి కాలంలో వారే అంటరానితనం అనే సాంఘిక అవి నీతిని (దురాచారాన్ని) ఉద్దేశపూర్వకంగా వదిలేశారు. అస్పృశ్యత అనేది తాత్విక దృక్పథంనుండి విశ్లేషించి, విసర్జించి అప్పటివరకు సంప్ర దాయమని పాటిస్తూవున్న ఆ దుస్సంప్రదాయాన్ని ఒక్క తలంపుతో మన (మానవ) ఆచారంనుండి దూరం చేశారు. ఆనాటి నుండి అస్పృశ్యత (అంటరానితనం) అనేది మనసులో కూడా తలచలేదు. అది వారి అద్వైత విచారణ ఫలితంగా పొందిన జ్ఞానంద్వారా వచ్చిన ఆచరణభాగం. ఆనాడు మాకు వున్న మూడు మంచి నీటి తోటబావులను, మా యింటి దగ్గరవున్న మంచినీటి (చేతి) పంపుని కూడా ఆనాడు అంటరాని వారుగా భావించ బడుతూవున్న వారికి వారి అవసరాలకు నీరుతోడి వాడుకునే హక్కుని కల్పించారు.అలాప్రారంభమైనది ఆనాటి సాంఘికసంస్కరణఆచరణభాగం.

అందువల్ల మా గ్రామంలో మా కులస్థులమధ్య (అప్పటికి మేము 'కమ్మ' కులస్థులం, ఇప్పుడు కాదనుకోండి) తీవ్రమైన సంచలనం ఏర్ప డింది. (కులం కట్టుబాట్లు కూలిపోయినవని) ఆ కారణంగా మా కుటుం బంపై కక్షకట్టి, మమ్ములను సాంఘికంగా బహిష్కరించి హింసపెట్టాలని

చూచారు. కాని, అప్పటికే తాత్వికచింతనా సక్తులైన మా కుటుంబ పెద్దలు ఆ సాంఘిక కట్టుబాట్లను ధిక్కరించి, యెదిరించి (బయటపడి) సర్వస్వతంత్రులైనారు. అజ్ఞానంలో ఏర్పాటుచేసుకున్న మత కుల హద్దులు, స్వార్థపూరిత సంకుచిత స్వభావాలని వారి తాత్విక జ్ఞానం ద్వారా గుర్తించి వాటిని నిర్దాక్షిణ్యంగా వదిలేశారు.

అంతవరకు అలా అభివృద్ధి అయిన మా పెద్దలను నేను అనుసరిస్తూ (తాత్వికంగా) పెరిగి పెద్దవాడనైనాను, అందుచేత నాకుగాని మా అన్నదమ్ములు, అక్కచెల్లెండ్రుకుగాని కుల, మత పరమైన సంకుచిత భావాలులేవు. అటువంటి అశాస్త్రీయమైన సాంఘిక భావాలకు దూరంగా వుంటూ మా కార్యక్రమాలు మేము మామూలుగా (సంతోషంగా) సాగిస్తూ వచ్చాం. అటువంటిది ఆ తాత్విక పరిణామం. సంఘ నియామాలను, మత కట్టుబాట్లను కాదని నిలబడగల మానసికధైర్యం తాత్విక పరిజ్ఞానం వల్ల మాత్రమే కలుగుతుందని చెప్పడానికి మాత్రమే పై విషయాలను చెప్పవలసివచ్చిందని పాఠకులు గ్రహిస్తారని తలుస్తాము.

స్వతంత్రపోరాటకాలంలో మా కుటుంబం పూర్తిగా (ఆ పోరాటంలో పాల్గొన్న కారణంగా) ఆర్థికంగా చాలా ఇబ్బందులకు గురైన దని ముందు చెప్పాను. అయినా మా ఆలోచనలలోను ఆశయాలలోను కించిత్తైనా వెనుకంజలేక, పదండి ముందుకు అనే భావంతోనే రాజకీయ సాంఘిక పోరాటాలలో మనస్ఫూర్తిగానే మేము పాల్గొంటూ వచ్చాం.

అలా ఆర్థిక ఇబ్బందులు వచ్చినపుడు వృత్తిలో మార్పులు చేసుకోవలసిన పరిస్థితి వస్తుంది కాని, అలా వృత్తిని మార్చుకుని ఏదోవిధంగా బ్రతకాలనే దానికి పిత్రవృత్తి అంగీకరించలేదు. వ్యవసాయ వృత్తిని మాని, ఇతర వృత్తులను చేపట్టవలసిందిగా మిత్రులు, మా శ్రేయోభిలాషులు మమ్ములను వత్తిడిచేస్తూ వచ్చారు. అలాంటి పరిస్థితులలో కూడా ఉత్తమమైన ఆ వ్యవసాయవృత్తిని వదలక ఆ వృత్తిలోనే మళ్లీ ఆర్థికంగా స్వయంపోషక మయ్యాం. అంతవరకు కొంత కష్టపడవలసివచ్చింది. అయినప్పటికిని పట్టుదల వదలక, ఆ వృత్తినే చేస్తువుండటానికి కారణం

అది ప్రవృత్తికి సంతృప్తి నిచ్చే వృత్తి కావడమే. ఆర్థికంగా నిలజడేందుకు కొంతకాలం పట్టినా (ఇబ్బందులు పడినా) ఇప్పుడు ఆ విధమైన ఇబ్బందులులేవు. కేవలం శ్రమ వల్లనే (శ్రమతోనే) సాధించ వచ్చుననే మనో ధైర్యంతోను, నిబ్బరంతోను ఆ ఇబ్బందులను అధిగమించగలిగాం. ప్రవృత్తికి సంతృప్తి నిచ్చే ఆ వ్యవసాయ వృత్తినే ఇప్పుడూ చేస్తూ వున్నాం.

## జగత్‌సత్యం - బ్రహ్మమిధ్య

అటువంటి పరిస్థితులలో ఒకరోజున 'జగత్‌సత్యం - బ్రహ్మమిధ్య' అని పుస్తకం వ్రాయదలచానని మా అన్న (వ్యావహారిక నామం గుత్తా చలమయ్య, సార్ధకనామం సదానంద, తాత్వికార్హత వేదాంత విద్యా విశారద) గారితో అన్నప్పుడు 'జగత్ సత్య' మని వ్రాయి, అభ్యంతర మేమి వుండదు కాని, బ్రహ్మమిధ్య అనడందేనికి అని ప్రశ్నించారు.

మీరు బ్రహ్మసత్యమని అంటూ జగత్ మిధ్య అని యెందుకు అన వలసి వచ్చింది? అని నేను ప్రశ్నించాను. దానికి సూటిగా సమాధానం రాలేదు. జగత్తనుకున్నా బ్రహ్మమనుకున్నా ఉన్నది ఒక్కటేగాని రెండు లేవు అని మాత్రం అన్నారు. అది అద్వైత తాత్వికార్థంలో బాగానేవున్నది. మరి మీరు జగత్తునే సత్యంగా చెప్పవచ్చునుగదా? జగత్తుమిధ్య అనడ మెందుకు? బ్రహ్మము సత్యమనడ మెందుకు అని మరో ఉప ప్రశ్న వేయ వలసివచ్చింది.

'జగత్తు అనిత్యంగాను, నానాత్వంగాను తోస్తూవున్నదిగదా? ఆ కారణంగా జగత్తు సత్యమని యెలా చెప్పగలం' అన్నారు. అలా తోస్తూ వున్నదేగాని (అజ్ఞానంవల్ల), వాస్తవంగా అలా లేదని వేసడంతో తాత్విక సంబంధమైనచర్చలు సారవంతంగాసాగినై. ఆధ్యాత్మికభౌతికతత్వాలుభిన్నమైనవా? అభిన్నమైనవా? అనేది ఆనాటి ప్రధానమైనచర్చనీయాంశమయింది.

ఆధ్యాత్మిక తత్వశాస్త్రమని చెప్పబడేది శాస్త్రబద్ధమైన తత్వశాస్త్రం కాదు. ఏదైనా అస్తిత్వంలోవున్నది అంటే అది కొన్ని శాస్త్ర ప్రమాణాలకు

నిలవాలి. కాని అస్తిత్వంలో లేని (అసత్య) విషయాలపై చర్చసాగించింది గనుకనే అది ఆధ్యాత్మికభావ (ఊహామాత్రపు) వాదమైనది. అశాస్త్రీయమైన విషయాలు తత్వశాస్త్రంలో చేర్చరాదని, వుండరాదని నే నన్నాను.

తాత్విక సంబంధాలు తెలుసుకుని తదనుగుణమైన గడపడం తెలిసి వుండాలి. అలాకానిచో జీవితాలు దుఃఖపూరితాలు కాగలవు. కాని ఏ విధమైన (ఆధ్యాత్మిక భౌతిక) తాత్వికాంశం ఏ విధమైన జీవితానికి దారి తీస్తుంది? ప్రాతినిధ్యం వహిస్తుంది? అన్నది ప్రధానం కదా? భిన్న రీతుల్లోని ఆయా తాత్వికాంశాలపై ఆసక్తికరమైన చర్చలు సాగుతూ వుండేవి. మా అన్నగారు ఆధ్యాత్మిక తత్వశాస్త్రానికి ప్రతినిధిగా వాదాన్ని సాగిస్తూ వుండేవారు. భౌతికతత్వశాస్త్రాన్ని పోటీగా నిలబెట్టి, ఆ వాదాన్ని (ఆధ్యాత్మికవాదాన్ని) ఖండిస్తూ వుండేవాణ్ణి నేను. అలా ప్రారంభమైన చర్చలు ఒక్కొక్కరోజు చాలా తీవ్రస్థాయికి చేరేవి. ఎవరి వాదనను ఎవరు వదులుకునేటట్లు?

## మా వూరి గ్రంథాలయం

మా వూళ్లో (పెదపులివర్రులో) పెద్ద గ్రంథాలయం వుండేది. బాల గంగాధరతిలక్ పేర ఆ గ్రంథాలయం స్థాపించి అభివృద్ధి చేసిన వారిలో మా నాన్నగారొకరని తెలిసి సంతోషించాను. ఆనాడు అది మంచి ఉన్నత స్థాయిలో నడపబడుతూ వుండేది. కాని ఈనాడు ఆ గ్రంథాలయం పతనావస్థలో వున్నదని తెలిసి చింతించాను. కాలంలో వచ్చిన మార్పు వ్యక్తులలో (వ్యక్తిగతంగా) కనిపించడంలేదు. ఆ కారణంగానే ఆ గ్రంథాలయానికి ఆ స్థితి పట్టింది. మా వూరనే కాదు, చాలా గ్రామాలలోని గ్రంథాలయాల పరిస్థితి అలాగే వున్నది.

ఆ గ్రంథాలయంలో మంచి (ఆధ్యాత్మిక భౌతిక) తాత్విక గ్రంథాలుండేవి. మంచి వైజ్ఞానిక వ్యాసాలతో కూడిన పత్రికలు వస్తూవుండేవి. వాటిని తెచ్చి మేము (అన్నదమ్ములం) చదివి (ఉమ్మడిగా) చర్చిస్తూ వుండేవాళ్లం. వాటిలోని విరుద్ధాంశాలపై గంటల తరబడి విశ్లేషణ సాగేది. సమన్వయం కుదిరేదికాదు. ఆ పూటకు చర్చ అసంతృప్తిగానే ఆగిపోయేది మళ్లీ మరోరోజూ మామూలే.

జాతీయ పోరాటంపై ముమ్మరంగా చర్చలు జరిగే కాలమది. గాంధీగారి రాజకీయం వారి నిరాహార వ్రతాలు, సుభాస్‌చంద్రబోసు తీవ్రరాజకీయాలు, యమ్. ఎన్. రాయ్ క్రొత్త రాజకీయం, గాంధీ,పి. సి. జోషి లేఖలు, గాంధీ-గోరా వార్తాచర్చలు, రెండవ ప్రపంచ యుద్ధం, అందులో స్టాలిన్ - చర్చిల్ - రూజ్‌వెల్టుల యుక్తి ప్రయుక్తులు, హిట్లరు - టోజో, ముసోలినీల ఆవేశకావేశాలు వగైరాలతో కూడిన వార్తలు దిన పత్రికలలో ప్రముఖంగా వస్తూవుండేవి. వాటిని చదివి చర్చిస్తూవుండేవాళ్లం. చదవడం సమిష్టిగా సాగినా అభిప్రాయాలు వ్యక్తపరచడంలో ఎవరి వ్యక్తిత్వం వారికుండేది. తమ తమ అభిప్రాయాలను తెలియజేయడంలో స్వేచ్ఛ వుండేది.

ఇతరమైన తాజా వార్తలు, రాజకీయ సాంఘిక వార్తలు యెలా వున్నా ప్రధానమైన తాత్విక చర్చలు జరుపుతూ దైనందిన జీవితానికి, అందులోని కష్ట సుఖాలకు తాత్విక విషయాన్ని సమన్వయంచేసి చూస్తూ వుండడం జరిగేది. తాత్వికసంబంధం లేని దైనందిన జీవితం వుండదు గదా? ఆ విషయంలో అందరి అభిప్రాయం ఒక్కటిగానే వుండేది.

విశ్వమంటే ఏమిటి? అదెలా అర్ధమవుతుంది? జగత్తన్నా, విశ్వమన్నా ఒకటేనా? ఆధ్యాత్మిక వాదులు జగత్తనే దానికి చెప్పబడిన లక్షణాలేమిటి? భౌతిక తత్వశాస్త్రంలో విశ్వం అంటే ఎలా నిర్వచించబడినది? జగత్తు ఇలా నానాత్వంగా ఎందుకు తోస్తూవున్నది? ఇది ఒకరి చేత సృష్టించబడినదా? అలా సృష్టించబడితే ఆ సృష్టించినవాడెవడు? అలా సృష్టించినవాడు ఎక్కడవుండి దేనితో దీనిని సృష్టించాడు? సృష్టి పదార్ధంవల్ల (పరిణామంలో) జరిగిందా? సృష్టి జరిగితే సృష్టి జరగకముందు ఏమివున్నది? అనేటటువంటి జటిలమైన తాత్విక విషయాలు చర్చకు వచ్చి ఆ విషయంపై తీవ్రమైన అభిప్రాయభేదాలను వ్యక్తపరచటం జరుగుతూ వుండేది. కాని ఏదో ఒక విధంగా తన వాదనను బలవంతంగా మా మీద ప్రయోగించి తన ఆధిక్యతను (వాదంలో) ప్రదర్శిస్తూ వుండేవారు అన్నగారు. వాస్తవం కాకపోయినా వాదనాబలం వారికి బాగా తోడ్పడేది. (వాస్తవాన్ని తెలుసుకోవడానికి అది కొంత అవరోధంగా వుండేది వారికి).

# కర్మ సిద్ధాంతం

కర్మ సిద్ధాంతం ఆధ్యాత్మిక తాత్వికాంశంలో భాగమైనది. (పూర్వ జన్మలో చేసిన యజ్ఞయాగాది వైదిక క్రతువుల ఫలితాలు ఈ జన్మలో అనుభవిస్తారనేది) దైనందిన జీవితానికి అంటగట్టి, కర్మ ఫలితాల (ఖూచిని) భయాన్ని కల్పించి శ్రమ ఫలితాన్ని శ్రమచేసేవాడు అనుభ వించకుండా (అడగకుండా) చేశారు. శ్రమ (ఈ జన్మలో చేసిన పని లేక కర్మ) పై తన దైనందిన జీవితంపై నమ్మకం లేకుండా చేసింది ఆధ్యా త్మిక వాదం అని నేనన్నాను. కర్మఫలితాలు యెవరైనా అనుభవించక తప్పదుగదా? అన్నారు అన్నగారు. మీరు (ఆధ్యాత్మికవాదులు) చెప్పే కర్మ సిద్ధాంతం తప్పని అది శాస్త్ర విరుద్ధమని దానిని భౌతిక తత్వశాస్త్రం అంగీకరించదని నేనన్నాను. ఆధ్యాత్మిక వాదానికి ఒక కర్మసిద్ధాంతం భౌతిక వాదానికి ఒక కర్మ సిద్ధాంతం వుంటుందా? అలాగైతే వారి కర్మ వేరు, వీరి కర్మ వేరు అని రెండు వాదాలకు రెండు కర్మలు వుండాలిగదా? అన్నారు అన్నగారు. అవును కర్మ అనేది పదరీత్యా ఒకే అర్ధంవున్నా వారి వారి సిద్ధాంతాలలో కర్మ అనే దానికి వేరు వేరు అర్ధాలు వున్నవి. అందుచేతనే అవి రెండు వాదాలైనవి అని నేనన్నాను.

ఆధ్యాత్మిక వాదంలో చెప్పబడినట్లు కర్మలు (అంటే వైదిక కర్మలు) పూర్వజన్మకు సంబంధించినవి కర్మ అంటే వారి దృష్టిలో పని (శ్రమ) కాదు కదా? అందుచేత భౌతిక వాదులు ఆ కర్మను అంగీకరిం చరు. వీరి దృష్టిలో కర్మ అంటే పని (శ్రమ) అని అర్థం. ఈ శ్రమకు ఈ జన్మలోనే ఫలితం వుంటుంది. (వీరి దృష్టిలో మరు జన్మలేదు గనుక) అందుచేత కర్మ అనేది వారి వారి భావాల్లో వేరు వేరు అర్ధాన్నిచ్చేదిగా వున్నది. కనుక కర్మ అంటే పని (శ్రమ) కాదు. పని అంటే కర్మ కాదు. దైనందిన జీవితానికి కర్మ ఫలితాలను అంటగట్టి శ్రమ ఫలితాన్ని శ్రమ చేసేవాడు అనుభవించకుండా చేశారు. శ్రమపై తన దైనందిన జీవితం ఆధారపడివున్నదనే జ్ఞానం అతనికి లేకుండా చేసింది మీ ఆధ్యాత్మిక వాదం అని నేనన్నాను. అప్పటికి వారు అనుకునే భావాలకు నా భావాలకు సిద్ధాంత పరమైన వైరుధ్యం అర్థం చేసుకుని ఆ విషయం ఆనాడు చర్చిం

చడం మానేసి ఆలోచించడం ప్రారంభించారు అన్నగారు. ఈ జన్మలో చేసిన పని (శ్రమ) పై తన దైనందిన జీవితం ఆధారపడివున్నదనే భౌతిక తాత్వికాంశం అన్నగారికి నచ్చడం ఆ దృక్పథంతో ఆలోచించడం అనేది వారు సంతృప్తిని కలిగించిన ఆనాటి ప్రధాన అంశం.

ఈ విషయం అర్థం చేసుకోవడం అంత కష్టం కాదు. కాని, మనకు సంప్రదాయంగా చెప్పబడుతూవున్న సృష్టివాదం (ద్వైతం) మన ఆలోచనల మీద దెబ్బతీస్తూవున్నది. అందుచేత మన ఆలోచనలు మన ఆచార అలవాట్లను దాటి ముందుకు సాగవు. దయ్యాలు, భూతాలు, మంత్రాలు, తంత్రాలు, దైవనమ్మకాలతో చేస్తూవున్న పూజా పునస్కారాలు తత్వ శాస్త్రంలో భాగంగా భావించబడి అవే తత్వశాస్త్రమనుకుని వాటిని నమ్మి వాటిని తూచా తప్పకుండా అనుసరిస్తూ వుండటమే తమ కర్తవ్యంగా భావించడంచేత శాస్త్రబద్ధమైన తత్వశాస్త్రాభిలాష సన్నగిల్లింది. ద్వైతం తీసుకు వచ్చిన ఈ ఆచార సంప్రదాయాలు మీ అద్వైతంలో చేర్చుకుని, అదే అద్వైతమని చెప్పుకుంటూ వుండడం ఎంతవరకు సమంజసమని అంటూ వుండేవాళ్ళం. తత్వశాస్త్రంలో వీటికి ఏ విధమైన సమాధానం దొరుకుతుంది? ఏ విధంగా వీటిని నిర్వచించగలం? హేతువుకాని (కార్య కారణ సంబంధంలేని) ఇటువంటి అంశాలు తత్వశాస్త్రానికి అపకారంచేస్తూ వున్నవని అర్థంలేని ఇటువంటి అంశాలను వదిలేసి సిద్ధాంతాన్ని (అద్వైతాన్ని) సంస్కరించి చెప్పవచ్చును గదా? అని అంటూ వుండేవాళ్లం మేము (చిన్నవాళ్లం).

## పురోహిత వర్గం

భక్తి దశలో జరిపే వ్రతాలు, పూజలు, అన్న వస్త్ర ఫల పుష్ప పత్రి దానాలు తాత్విక జిజ్ఞాస పెరగడంతో ఆగిపోయినై. పురోహిత వర్గం ఈమార్పుని అంగీకరించలేకపోయింది. భక్తి ఆపితే పాపమన్నారు, దోషమన్నారు. కీడు సంభవిస్తుందని, ఏడుతరాల వరకు ఆ కీడు నుండి తప్పించుకోలేరని అన్నారు. హేతులద్వారా హితోపదేశాలు చేయించారు. పతీ పతుల మధ్య ఆ నెపంతో చీలికలు కల్పించాలని చూచారు. చివరకు మతం

పేర ఆదేశాలు అందజేయాలని కూడా చూచారు. కాని అప్పటికే అవ్యక్త (భక్తి) దశనుండి వ్యక్తదశకు (జ్ఞానదశకు) ప్రయాణం సాగించిన మా కుటుంబపెద్దలు వారు చూపెట్టిన భయానికి భయపడక స్థిమితంగా వున్నారు. ఆ మార్పు ఆనాడు పెద్ద సంచలనం కలిగించింది. పరిసర సమాజంలో ముఖ్యంగా పురోహితవర్గంలో ద్వేషంగా మారింది. ఆ మార్పు వారి భుక్తి కోసమని కల్పించుకున్న ఆచార సంప్రదాయాలు సామాన్య ప్రజల యోగక్షేమాలకోసం కాదనేది ఆ ప్రజలు గుర్తిస్తే వారికి బ్రతుకు తెరువుండదు. వారి బ్రతుకు తెరువుకోసం ఇతరులను అజ్ఞానంలో వుంచ డమనేది తలచినపుడు - తన బ్రతుకుకోసం ఏదైనా మానవుడు చేస్తూ వున్నాడు అంటే అది వారు నేర్పిన విద్యయే అనిపించేది.

దేవాలయం పవిత్రమైనదని అంటున్నారుగదా? దానిపైన బూతు బొమ్మలెందుకు? దానిపైన బూతు వుండటమే పవిత్రమా? బూతే పవి త్రమా? పవిత్ర అపవిత్రాలకు నిర్వచనమేమిటి? అనే ప్రశ్నలు పరంపరగా వస్తూవుండేవి. కొన్నిటికి అన్నగారు తాత్వికంగా సమాధానంచెబుతూవుండే వారు. కాని చెప్పే సమాధానంలో సత్య అసత్యాలు(తాత్వికంగా)కలిసేవుం డేవి (సత్యంభాగం తక్కువ, అసత్యంభాగం యెక్కువగా వుండేది).

## ఉమామహేశ్వర పండిట్

మా వూరి గ్రంథాలయ వార్షికోత్సవాలు ఉత్సాహంగా జరుపుతూ వుండేవారు మా వూరి ప్రజలు. ఒక సంవత్సరం ఆ వార్షికోత్సవ సభకు మాడపాటి హనుమంతరావుగారు అధ్యక్షులుగాను, ఉమామహేశ్వరపండిట్, పాతూరి నాగభూషణం తదితరులు ఉపన్యాసకులుగాను వచ్చారు. సభకు అధ్యక్షత వహించిన హనుమంతరావుగారు వెళ్ళవలసిన రైలు బండికి టైము అయినదని పాతూరి నాగభూషణంగారిని అధ్యక్షులుగా కూర్చో బెట్టి వారు వెళ్ళిపోయారు.

పాతూరి నాగభూషణంగారి అధ్యక్షతన ఆనాటి సభ చాలా రసవత్త రంగా సాగింది. నాగభూషణంగారు సహజంగా సంస్కరణ భావాలుగల

వ్యక్తి, నిజాయితీ సంస్కారం గలవ్యక్తి. అటువంటి వ్యక్తి అధ్యక్షులుగా వున్న సభలో సభ్యత తెలియని వ్యక్తి ఉపన్యసించడం కష్టంగానే వుంటుంది. ఆనాటి ఉపన్యాసకులలో ముఖ్యులు ఉమామహేశ్వరపండిట్, (ఉపన్యాస చక్రవర్తి, హిందూ మతోద్ధారక బిరుదాంకితులు) మంచి ఉపన్యాసకులుగా పేరుండేది ఆ రోజుల్లో ఆయనకు. "మనుధర్మనూత్రాలు, నైతిక విలువలు" అనేది ఆనాటి ఉపన్యాసాంశం. మను ధర్మము అంటేనే అది మానవ ధర్మం కాదని, మత ధర్మమేనని మన అభిప్రాయం. మనుధర్మమంటేనే ఉమామహేశ్వరపండిట్‌గారికి పూనకం వచ్చేది. దానిని గురించి ప్రసంగించేటప్పుడు పరవశంచెందేవాడు. వ్యక్తిత్వాన్ని కోల్పోయే వాడు, అవ్యక్తం ఆవహించేది, చెప్పేదానికి అర్థం వుండేదికాదు. వ్యర్థంగా ప్రసంగాన్ని సాగించేవాడు. అడిగితే కోపం వచ్చేది, అడగకుండావుంటే హద్దులు దాటేది ప్రసంగధోరణి. తన మతంకోసం తాను ఆహుతి కావాలనే వాడు.

మతం అనేసరికి ఒక విధమైన వీరావేశంవస్తుంది. వ్యక్తుల మరణంతో (ఆత్మాహుతితో) మతం నిలుస్తుందని అనాడు తలపోసిన కుమారిల భట్టు అనే మతదురభిమానినుండి ఈనాడు జరిగే సంఘటనలవరకు మనిషి లోని ఆ మతావేశమే కారణమనేది గుర్తించగలం. ఉమామహేశ్వర పండిట్ కూడా ఆ కోవకు చెందినవాడేనని ఆ రోజు ఆ ఉపన్యాసం విన్న తరువాత అర్థంచేసుకున్నాము.

హిందూమతాన్ని గురించి, మనుధర్మశాస్త్రాన్ని గురించి పొగడ్తలు ప్రారంభించాడు, అంతవరకైతే మనకు ఆక్షేపణ వుండదు. కాని, పుట్టుకతోనే ప్రతి వ్యక్తి పాపిగా పుడతాడని, అందులో, స్త్రీ జన్మ నీచాతి నీచమైనదని వారికి (స్త్రీలకు) ఈ జన్మలో మోక్షాధికారంలేదని ఎన్నో పాపాల ఫలితమే స్త్రీ జన్మ అని ప్రారంభించాడు తన సహజధోరణిలో. అప్పుడు మా అక్క రాజరత్నమ్మగారు ఆక్షేపణ తెలియజేస్తూ, ఆ ప్రసంగాన్ని ఖండిస్తూ చీటీ వ్రాసి అధ్యక్షులవారికి అందజేసింది. అధ్యక్షులు (పాతూరి నాగభూషణంగారు) అందుకు అనుమతి యిస్తూ మాట్లాడవలసిందిగా అక్కగారిని ఆహ్వానించారు.

ఆ సందర్భాన్ని పురస్కరించుకుని మా అక్కగారు ఆ సభలో మాట్లాడారు, మనుధర్మశాస్త్రంలోని దుర్మార్గపు నీతిని వివరిస్తూ అదెలా ధర్మశాస్త్రం కాదో విశ్లేషించి చెప్పారు. హిందూ మతానికి ఆధారభూతమైన ఆ అధర్మ శాస్త్రాన్ని విమర్శించేవారు ఎదుటబడేటప్పటికి వారు స్థిమితాన్ని కోల్పోయి నట్లైనది.

హిందూ అంటే అర్థం యేమిటని ఆ పదం ఎక్కడవున్నదని అడిగారు అన్నగారు. ఒక వేదంలో 'హిం' మరొక వేదంలో 'దు' వున్నదని అవి రెండు కలిసి "హిందూ" అయినదని సమాధానం చెప్పారు. అదెలా వీలవుతుంది? ఎక్కడెక్కడోవున్న రెండు అక్షరాలు ఎలా కలుస్తూవున్నవి? అని సభలోని వారడిగారు. సముద్రంలోని ఉప్పు అడవిలోని ఉసిరి కాయ కలిస్తే ఊరగాయ కాలేదా? అది బాగాలేదా? అలాగే అదీను అన్నారు ఆ భాషా పండితుడు.

హిందూ అంటే అర్థం ఏమిటని అడిగారు అన్నగారు. "ప్రతి పదానికి అర్థం వుండాలని లేదు. అలాగే హిందూ అనే పదానికి మన భాషలో అర్థం లేదు" అన్నారు (ఉన్న అర్థం తెలుసో తెలియదో మనకు తెలియదు).

హిందూ అంటే దొంగ (పారసీక భాషలో)అనీ అందుచేత హిందూ మతం దొంగ మతమనీ, వారు దొంగలనీ అన్నారు అన్నగారు. (ఆనాడు దోచుకోవడానికి వచ్చిన దోపిడి దారుల పరంపరలోని వారు) దొంగలని అన్నగారనడంతో సభలోని వారంతా గొల్లున నవ్వి కరతాళధ్వనులతో అన్నగారి అభిప్రాయంతో ఏకీభవించినట్లు ప్రవర్తించారు.

"ఓమ్" అనే అక్షరంలో అన్నీ వున్నవని (అ. ఉ. మ) అన్నారు గదా? "ఓమ్" చెడి అకార, ఉకార, మకారములైనవా? (బ్రహ్మ చెడి జగత్తైనదా?) అని తాత్విక సంబంధమైన ప్రశ్న వేయడంతో ముక్కోపి అయిన ఆ పండితుడు తన ఉపన్యాసాన్ని మధ్యలో ముగించి, మూడు రోజులు జరగవలసిన తన భక్తి ప్రచార కార్యక్రమాలను రద్దుచేసుకుని

వూరు విడిచి వెళ్ళిపోయాడు. పురాణ కాలక్షేపంతో భక్తిమార్గాన్ని ప్రవేశ పెట్టి, మతాన్ని ప్రచారం చేస్తూవున్న ఆ వ్యక్తి మా వూళ్లో తాత్విక ప్రశ్నలు వేయగల తాహతు గల వారున్నారని గ్రహించిన తరువాత క్షణం వుండలేకపోయాడు.

## శూద్రులా హిందువులా ?

శూద్రశబ్దానికిగల అర్థం దస్యులు, దాసులు, దాసి పుత్రులు(లంజ కొడుకులు). హిందూ శబ్దానికి అర్థం దొంగఅనిగదా! అంటే హిందుమతంలో శూద్రులుగా చెప్పబడుతూవున్నది (హిందువులు) దొంగలంజాకొడుకులు అని అర్థంవస్తుందిగదా! మనం హిందూ దాసులం అని సగర్వంగా చెప్పుకుంటున్నామంటే మనలను యేవిధంగా భావదాసులను చేశారు అనేది అర్థం చేసుకోండి. ఇటువంటి భావ దాస్యం నుండి మనం బాగుపడే దెప్పుడు? అందుకు మార్గాలేమిటి? అనేది అందరూ ఆలోచించదగ్గవిషయం. తాత్విక విషయ శూన్యమైన చెత్త (భక్తి) ఉపన్యాసాలు మతాన్ని పోషించగలవేగాని జ్ఞానాన్నివ్వవు అని అన్నగారన్నారు.

స్త్రీలను నీచంగా చిత్రించి, కామదృష్టితో వారిని చూచి, వర్ణించి సంతానాన్నిచ్చే యంత్రంగా భావించి, వారు పురుషులతో సరిసమానమైన వ్యక్తులు (జీవులు) కాదని, పటకతో వారిది నీచజన్మ అని, స్వర్గ మోక్షాలకు వారు అర్హులు కారని వ్రాసుకున్న ధర్మశాస్త్రాలలాంటి (అధర్మ) శాస్త్రాలు యే పాటి ధర్మశాస్త్రాలని ప్రశ్నించారు. అవి మతంకోసం (మతదురభిమానంతో) వ్రాసుకున్నవేగాని మానవులకోసం మానవత్వంతో వ్రాసినవి కావని వివరించారు. ఏక పక్షంగా వ్రాసుకునే ఏ సూత్రాలైనా అవి ఒక పక్షంవారికి వర్తించే సూత్రాలే కాగలవు గాని, సర్వపక్షాలకు సరిపోయే సమాన సూత్రాలు కాలేవు, కాలేదు.

ఆనాటి రాత్రి "బౌద్ధ విప్లవం" అనే చారిత్రిక బుర్రకథ చెప్పి చరిత్రప్రకారం ఆర్యులరాక, హిందూమత పుట్టుపూర్వోత్తరాలు, చాతుర్వర్ణ సిద్ధాంత ఆవిష్కరణ వగైరా విషయాలను వివరించి చెప్పాము. (త్రిపుర నేని రామస్వామిగారి పుస్తకాల భావాల ననుసరించి బ్రహ్మానందస్వామీజీ

వ్రాసిన బుర్రకథ అది) ఆనాటి ఆ అభిప్రాయాలను మా గ్రామ ప్రజలు మనస్ఫూర్తిగా అంగీకరించి, ఆదరించారు. ఆ విధమైన చైతన్యం ఆనాడు వారిలో వున్నదంటే అందుకు కారణం మా గ్రామంలోని ఆ గ్రంథాలయమే కారణమని చెప్పక తప్పదు.

ఆ తరువాత ఆ గ్రంథాలయం పతనావస్థ చెందడంతో ఆ గ్రామంలోని ప్రజలకు మానసిక స్తబ్ధత ఏర్పడినట్లైనది. పురోహితవర్గం ద్వేషంతో కావాలని ఆ గ్రంథాలయానికి ఆ గతి పట్టించారు. ప్రజలను అజ్ఞానంతో వుంచడానికి ఏదైనా చేయదగుదురు వారు.

ఈ మధ్య మా గ్రామం వెళ్ళిన సందర్భంలో ఆ గ్రంథాలయం విషయం తెలుసుకుని మళ్ళీ దానిని పునరుద్ధరించి పూర్వ దశకు దానిని అభివృద్ధిచేస్తే బాగుంటుందని అక్కడి మా పాత మిత్రులను కలిసి సంప్రదించాను. ఏదైనా కొంత నిధిని సమకూర్చి, పెద్దవారిని పిలిపించి ఉపన్యాసాలు ఏర్పాటు చేసి ప్రజలలో ఉత్సాహాన్ని కలిగించడం ద్వారా ఆ పని చేయవచ్చునని చెప్పాను. కాని అక్కడి వారు ఏ మాత్రము ఉత్సాహము చూపించలేదు సరిగదా, మంచి పని జరగడానికి ప్రజలు ముందుకు రారని యేదో ఒక విధంగా అడ్డుతగులుతారని చెప్పారు. నాకు చాలా ఆశ్చర్యం కలిగింది నేటి పరిస్థితికి. రాజకీయ పార్టీలు పెరిగిన కారణంగా గ్రామంలో సఖ్యత, ఐక్యత తరిగిందని వారన్నారు. మా గ్రామంలోనే కాదు—ఈ పరిస్థితి అన్ని గ్రామాలలోను ఈనాడు మనం చూడవచ్చు.

ఆనాడు సభాముఖంగా జరిగిన పరాభవంవల్ల పగబట్టిన ఉమామహేశ్వరపండిట్‌గారు మా వూరి పూజారి వర్గంతో కలిసి కావాలనే ఆ గ్రంథాలయానికి ఆ దుర్గతి పట్టించడమేగాక, మా గ్రామ ప్రజలలో వుండే సమైక్యతను విచ్ఛిన్నంచేసి విభజించి పాలించు అనే వారి దుర్మార్గపు నీతిని అనుసరించి వారి ఆశయాన్ని నెరవేర్చుకున్నారనిపించింది నాకు.

## అద్వైత సభలు

ప్రతినెల మా వూళ్లో (మాయింట్లో) ఒక సభ జరిగేది. రెండు మూడు వందలకు తక్కువకాని సంఖ్యలో హాజరయ్యేవారు భక్తులు (జిజ్ఞాసువులు)

ఆ అద్వైత సభలలో ప్రముఖులు ప్రసంగాలుచేస్తూ వుండేవారు. ఒక్కొసారి విషయం తీవ్రస్థాయిలో చర్చించబడేది. భోజనాల సమయంలో కూడా సందేహనివృత్తి కోసం అడిగే సందేహాలకు స మా ధా నా ల రూపంలో చర్చలు సాగేవి. ఏదైనా సందేహానికి సరైన సమాధానం రాకపోతే జరుగుతూవున్న భోజన కార్యక్రమాలు మధ్యలో ఆపి ఆ విషయాన్ని చర్చించేవారు. ఆ సందేహానికి సరైన సమాధానం వ చ్చే వ ర కు (సమన్వయం కుదిరే వరకు) చర్చసాగేది. (ఒకనాటి రాత్రి సమావేశంలో అటువంటి సమస్యమీద చర్చసాగి తెల్లవారుజాము నాలుగు గంటలకు గాని ఆ కార్యక్రమం పూర్తి కాలేదు) విషయ జిజ్ఞాస అలా వుండేది ఆ రోజుల్లో అనే విషయం అర్థంకావడంకోసం ఆ విషయం చెప్పవలసి వచ్చింది. తెలుసుకోవాలనే తాపత్రయం, తెలియదగిన విషయంపై ఆసక్తి వుండాలి, అప్పుడే ఆ విషయం తెలుసుకోగలుగుతాము. అట్టి ఆసక్తిని తనకు తానుగా పెంచుకుని విద్యనార్జించాలి.

అప్పట్లో నేను (చిన్నవాడిని) ఆ సభలకు గౌరవ ప్రతినిధిగా (సభ్యత్వంలేదు) మాత్రమే హాజరయ్యేవాడిని. నాకున్న తాత్వికాభిలాషకు నన్ను ఉత్సాహపరుస్తూ వుండేవారు పెద్దలు. నేను చేస్తూవున్న విమర్శలకు సదభిప్రాయంతోనే నన్ను ప్రోత్సహిస్తూవుండేవారు. అదొక మంచి సంప్రదాయం వారిలో వుండేది. (తాత్విక సంస్కారం నుండి వచ్చిన ఉత్తమ లక్షణమేమో ననుకుంటాను) అలా కాలంజరుగుతూవున్నది. కాలక్రమంలో నాకు వయస్సు కొంత పెరిగినది. (సాపేక్షంగా బుద్ధికూడా మరి కొంత గినది). ఒక సందర్భంలో అన్నగారిలా అన్నారు. సం(వదా ఈ విద్యను (అద్వైతాన్ని) అభ్యసించరాదా? అని. నా కభ్యంతరంలే నే సన్నాను. తక్షణమే మా అక్క రాజరత్నమ్మ (వేదాంత విద్యారత్న గారి వద్ద సంప్రదాయబద్ధంగా విద్యాభ్యాసం ఆరంభించాను. ప్రారంభించినంత వేగంగా ఆ విద్య నభ్యసించడానికి నాకు వీలుకలుగలేదు. (ఆర్థికంగా బాగా దెబ్బతినివున్న కారణంగా జీవించడానికి కావలసిన ఆర్థికాన్ని సమకూర్చుకోవడంతోనే సమయం సరిపోయేది. జ్ఞానం సంపాదించడానికి ఆర్థికం యెంత ప్రధానమో తెలిసొచ్చింది).

ఈ విద్య (అద్వైతం) లో నేను రాణిస్తానని అన్నగారి ఉద్దేశం. ఆ విషయం అప్పుడప్పుడు అంటూ వుండేవారు. కాని నాకు మాత్రం ఆ విద్యవరకే పరిమితమై అంతవరకే ఆగిపోవాలని లేదు. పైగా సంప్రదాయకమైన ఆ తాత్విక చర్చలలో కొంత అసంతృప్తి వుండేది. పరస్పరం వైరుధ్యాలు విరుద్ధమైన (సమన్వయంలేని) విషయాలు ఆ ప్రసంగాలలో వస్తూవుండేవి. మనసులో ఏదో చెప్పలేని, చెప్పవీలుకాని సంచలనం నాలో కలుగుతూ ఆనందానికి అటంకం కలుగుతూవుండేది.

ప్రశ్నించగూడదనే సంప్రదాయం ప్రశ్నను ఆపుచేస్తూవుండేది. కాని ప్రశ్నించకుండా వుండలేని ప్రవృత్తి బలం కావడంచేత సంప్రదాయాన్ని భేదించి ధిక్కరించి ప్రశ్నించడం జరిగేది.

భౌతిక తత్వశాస్త్రమందు అప్పటికే నా కున్న పరిచయంతో ఆధ్యాత్మిక తాత్వికాంశాలను విమర్శచేస్తూ విశ్లేషించి సమన్వయభావంతో ప్రయత్నించి చూస్తూ వుండడం జరిగేది. కాని అందులో వ్యతిరేకార్థాలే ఎక్కువగా వస్తూవుండేవి. అంతకంటే ముందుకు వెళ్లేవీలు కలిగేదికాదు.

అన్నగారు యెంతో కొంత సమన్వయంచేసి చెప్పేవారు. కాని నాకు సంతృప్తి కలిగేది కాదు. విరుద్ధమైన ద్వైత, అద్వైత విషయాలను కలిపి చెప్పుకోవలసిన అవసరంలేదని నా కనిపించేది. అదే విషయం నేను తరచు హెచ్చరిస్తూ వుండేవాడిన్ని, ఆ విషయ ప్రసక్తి వచ్చినప్పుడు చిరునవ్వుతో మౌనం పాటించేవారు. కాని, వారి ఆలోచనలలోకూడా అటువంటి భావం క్రమంగా అభివృద్ధి కాసాగినది. క్రమంగా వారి ప్రసంగాలలో ద్వైత భావాలు అంతరించి స్పష్టమైన అద్వైత భావం స్థిరపడింది. (అద్వైతంలో ద్వైతం చేర్చి అభివృద్ధి చేసిన సాహిత్యమే మన సాహిత్యమంతా కావడంచేత స్పష్టమైన అద్వైతం మనకు మన సాహిత్యంలో దొరకదు).

రెండవ ప్రపంచ మహా యుద్ధం ముమ్మరంగా సాగుతూ మానవుణ్ణి భయాందోళనలమధ్య వుంచి, ముంచి వేడుక చూస్తూవున్న వర్గమొక ప్రక్కన, మానవుణ్ణి ఈ మారణహోమంనుండి తప్పించాలని రక్షించాలని

చూచే వర్గమొక ప్రక్కన ఆ యుద్ధం సాగిస్తూవున్న సమయమది. ఎలాగైతేనేం ఆ యుద్ధం ముగింపు దశకు వచ్చింది. యుద్ధోన్మాద ఉధృతం తగ్గింది.

హిరోషిమా, నాగసాకీ పట్టణాలపై అమెరికా వారు ఆటంబాంబులు వేయడంతో ఆ ప్రపంచ యుద్ధం ముగిసినట్లైనది. (అప్పటికి ఆ పక్షం చేతిలో ఆ ఆటంబాంబులులేవు. వుంటే పరిస్థితి ఎలావుండేదో, బహుశా ఈ విషయాలు చెప్పుకోవడానికి మనం మిగిలి వుండేవాళ్లం కాదేమో). ఆ తరువాత హిట్లర్ మరణంతో యుద్ధబీభత్సం సద్దుమణిగినట్లైనది. ముసోలిని మరణంతోను, టోజో శరణాగతి కావడంతోను ఆ భయం పూర్తిగా తొలిగిపోయింది. ఆ యుద్ధంలో పోయినవారు పోగా మిగిలిన మనబోటివారు నిర్భయంగా ఊపిరి పీల్చగలిగారు,

ఆనాటి యుద్ధ పరిస్థితి, ఆది ముగింపు జరిగిన పరిస్థితులపై చర్చ జరుగుతూ వుండగా ప్రసంగవశాత్తు భారత యుద్ధ ప్రసక్తి వచ్చింది. భారతయుద్ధం జరగలేదని, యుద్ధం జరిగిందనేది కథ మాత్రమేనని అన్నారు అన్నగారు. యుద్ధం జరగకపోతే అది జరిగినట్లు ఆ కథను అట్లా వ్రాయవలసిన అవసరమేమిటని అన్నాను నేను. ఆ మిషతో తత్వ శాస్త్రం చెప్పడమే ఉద్దేశమని తత్వశాస్త్రం చెబితే వినేవారుండరని భారతయుద్ధం పేరుతో చదవడానికి, వినడానికి యింపుగా దానిని వ్రాశారని అన్నారు.

## గీతా తత్వం

యుద్ధం జరిగి యిరు పక్షాలు క్షయమయ్యాయి అనడం నిజమైతే గీతాబోధవల్ల ప్రయోజనమేమున్నది అని అన్నారు అన్నగారు. అలా అని పూరుకోక చర్చను తాత్విక విషయంవైపుకు తిప్పారు. ఏదో విధంగా చర్చను తాత్విక విషయంవైపుకు మరల్చి ఆ చర్చ ద్వారా కొంత తాత్విక విషయ పరిశీలన చేయడమే అన్నగారి ఉద్దేశంగా వుండేది.

యుద్ధం జరగలేదంటే మరి జరిగిందేమిటని నే నడిగాను. ఇరు పక్షాలు యుద్ధానికి సన్నద్ధమైవున్న సమయంలో కృష్ణభగవానుడు అర్జును నకు చేసిన గీతోపదేశంవల్ల పరుడు లేడనీ వున్నది తానేననీ అప్పటి వరకు శత్రువని అనుకున్న ప్రతివానిలోను తానేవున్నానని తాత్వికంగా అర్థం కావడంతో ఇరుపక్షాలు (కౌరవ పాండవులు) ఏక పక్షమై యుద్ధం మానేసి తిరిగి యిళ్ళకు వెళ్లారని చెప్పారు. అదే గీతోపదేశంయొక్క తాత్విక ప్రయోజనం అని కూడా అన్నారు. అంతేకాక మన అధ్యాత్మిక తత్వశాస్త్ర ప్రత్యేకత అదేనని సగర్వంగా అన్నారు. (అలా అనడంతో భౌతిక తత్వశాస్త్రాన్ని పరోక్షంగా హేళనచేస్తూ వున్నారేమోనని నా కని పించింది). అలా అనడంతో నాకు సందేహం కలిగింది. మన తత్వశాస్త్రం అంత గొప్పదైతే మరి మన దేశంలో యుద్ధాలెందుకు జరిగినవని నేన న్నాను. యుద్ధాలు జరగడానికి వ్యక్తుల స్వార్థ చింతనే కారణమన్నారు.

వ్యావహారికంగా (సమాజంలో) మార్చవలసిందేమి లేదని తాత్వి కంగా దృష్టిలో (మనసులో) మార్పువస్తే సృష్టిలో మార్చవలసిందేమి లేదు. ఉన్నది ఉన్నట్లుగానే ఉంచి పరిపాలన యథాతథంగా సాగించా రని అన్నారు అన్నగారు (మార్పుని అంగీకరించని ఆనాటి అధ్యాత్మిక మనస్తత్వం మంచి అంతకంటే మంచి సమాధానం రాదని నాకు తెలుసు)

అంటే ఆర్థిక సాంఘిక రంగాలలో మార్పు చేయవలసిందేమిలేదని. యే మార్పులు చేయకుండానే సమాజం శాంతిగా వుంటుందని మీ అభిప్రా యమా? మీరు చెప్పే తాత్విక సమన్వయ సూత్రాలు అంతకంటేముందుకు సాగటానికి అనుమతించవా? ఎవరి కర్మకు వారిని వదిలేయడమే మీ సిద్ధాంత లక్ష్యమా? ఎవరి కర్మకు ఎవరు బాధ్యులని చూస్తూవూరుకోవడమే గదా అధ్యాత్మిక వాద లక్షణం. అధ్యాత్మిక వాద పరిధి అంతవరకే అయితే అది మానవుని దైనందిన జీవితానికి ఏ మాత్రము ఉపయోగ పడని నిర్జీవ సిద్ధాంతమని నే నన్నాను. అలా అనడంతో ఆనాటి చర్చ తీవ్రస్థాయికి చేరింది. అలా సాగిన ఆనాటి చర్చ తనలో కల్లోలాన్ని కలి గించి పునరాలోచనకు పునాది ఏర్పడినది.

ఆ సందేహానికి సమాధానం చెప్పడానికి కొంత తటపటాయించినా చివరకు తాత్విక జ్ఞానం లేకపోవడమే ఎక్కడ యుద్ధాలు జరగడానికైనా

కారణమని అన్నారు. మరి ఆ విధమైన జ్ఞానం కలిగించ వలసిన బాధ్యత యెవరిది? ఆ బాధ్యత నుండి వారెందుకు తప్పుకున్నారు? ఆ తప్పంతా ఆ తత్వవేత్తలదేగదా? తప్పులుచేసేతత్వవేత్తలు తత్వవేత్తలెలా అవుతారు? అందువల్ల నిజమైన తత్వవేత్తలు మనకు కరువయ్యారు అన్నాను. ఆ తరువాత ఆ చర్చను పొడిగించలేదు అన్నగారు.

సరే, యుద్ధంచేయకుండా తిరిగి వచ్చారంటే అంతవరకు బాగానే వున్నది. మరి తిరిగివచ్చిన తరువాత యుద్ధానికి కారణమైన కౌరవ పాండవుల సమస్యను యెలా పరిష్కరించుకున్నారు? ఎలాంటి మార్పులు ఇరువర్గాలు చేసుకున్నారు? స్వ పర పక్ష భేదాలు తాత్వికంగా లేకపోయినా లేవని గుర్తించినా ఇరుపక్షాలకు వున్న ఆర్థిక సమస్యకు పరిష్కారం యే పద్ధతిలో జరిగింది? అని ఆ సమస్యకు వ్యావహారికంగా వున్న సంబంధాన్ని గురించిన నా సందేహాన్ని వెలిబుచ్చాను నేను.

ఇటువంటి అనేక విషయాలు, అనేక సందర్భాలలో గంటల తరబడి చర్చిస్తూ వుండేవాళ్ళం. కాని ఏ విషయం ఎక్కడా తెగదు, ముడిపడదు. ఆ లోపం ఆధ్యాత్మిక తాత్వికాంశంలో వున్నందుచేతనే ఆచరణకు, సిద్ధాంతానికి సమన్వయం కుదరకుండా పోయింది. ఆ సిద్ధాంతంలోని వైరుధ్యాలు, విపరీతాలు చదివినా విన్నా కట్టుకథల పుట్టగా కనబడుతుంది. అందుచేత సమన్వయం కోసం చేసే కుతర్కంవల్లగాని, వాగాడంబరంతో చేసే బోకరింపులవల్ల గాని సమస్య పరిష్కారంకాదు కదా? ఏ విషయం పరిశీలించాలన్నా హేతుదృక్పథంకావాలి. అహేతుకమైన విషయాలను తత్వశాస్త్రంలో చెప్పినందువల్ల సహేతుకమైన జీవితానికి సరిపడవు.

## బ్రహ్మ విద్య

ఒకనాటి అద్వైత సభలో ప్రసంగవశాత్తు నేను జగత్ సత్యం - బ్రహ్మమిథ్య అనే పుస్తకం వ్రాయ సంకల్పించానని అన్నాను. అదివిన్న ఆ సభలోని కొందరు ఆశ్చర్యమును, మరి కొందరు ఆవేశమును వెలిబుచ్చారు. ఆవేశ కావేశాల మధ్య వారిలో వారు చర్చించుకున్నారు. కూడబలుక్కున్నారు. కలిసికట్టుగా ఇలా అన్నారు.

అదెట్లా వీలవుతుంది? అది అపచారం కాదా? అని దైవదూషణ మన్నించరాదని నామీద ప్రశ్నలు పరంపరగా విసురుతూ నాపై విరుచుకు పడ్డారు. నేను బదులు చెప్పకముందే మా అన్నగారు లేచి మా వాడు అన్నదాంట్లో తప్పేమి లేదు అని అనడమే కాక అలా అనడమే సత్యమని కూడా అన్నారు.

'అదేమిటండి' మీరుకూడా అలా అంటారు? అదెలాసిద్ధాంతమవుతుంది? అదెలా సత్యమవుతుంది? ఎలా శాస్త్రసమ్మతమవుతుంది?, అని ఆందోళనతో కూడిన వారి సందేహాలను వెలిబుచ్చారు. అంతమాత్రంతో వూరుకోక తలు బది సంవత్సరాలుగా మీరు చెబుతూవున్నదేమిటి? ఇపుడు ఇలా చెప్పడమే మిటి? అని అంటూ మీ తమ్ముడు చెప్పింది తప్పని చెప్పకపోగా, తమ్ము డని సమర్థిస్తున్నారని నిందాపూర్వక విమర్శకూడా చేశారు. (వారు ఇంత కాలం వినడం ఎలావిన్నా అర్థంచేసుకోవడంలో అద్వైత సూత్రం బాగా అర్థమైనట్లులేదు. మనకు వారసత్వంగా వచ్చిన పరోక్షవాదం మనలను అపరోక్ష జ్ఞానాన్ని పొందనివ్వదు. అదే వారి పరిస్థితి).

నేను తమ్ముడని సమర్థించడంకాదు. సిద్ధాంతాన్నే సమర్థిస్తున్నాను. సిద్ధాంత చర్చల్లో సొంత బంధాలుండవు అన్నారు. అంతటితో వారు వుండ లేక మరి ఇంతకాలంగా మాకు అలా ఎందుకు చెప్పారు? అని అడిగారు ఆతురతను వ్యక్తంచేస్తూ. జగత్తు మిథ్య కదా, అదెలా సత్యమవుతుంది అని వారిలోవారు కూడ బలుక్కున్నారు, ప్రశ్నించుకున్నారు.

## అర్థంచేసుకోవడం తప్పు

అప్పటికి ఇప్పటికి నేను సరిగానే చెప్పాను. చెబుతూవున్నాను. కాని మీరు సరిగా అర్థంచేసుకున్నట్టులేదు. అన్వయ బోధ అర్థమైతే జగత్తే సత్యమని తెలుస్తుంది. వ్యతిరేక (విశ్లేషణ) బోధలో జగత్తుమిథ్య అని చెప్పుకున్నా అన్వయం (సంశ్లేషణ) లో జగత్తు, బ్రహ్మము వేరు కాదని తెలుస్తుంది. జగత్తులేని, కాని బ్రహ్మమనేది వుండదు. జగత్తుతో (అందులోని మానవునితో) సాపేక్షంగానే బ్రహ్మము అర్థమవుతుంది గాని, జగత్తు లేని బ్రహ్మము (నిరపేక్షంగా) వుండదు. అందుచేత జగత్తు సత్య

మని అనడంలో తాత్విక దోషం లేదన్నారు. (దృశ్యమాన ప్రపంచం 'సర్వంఖల్విదం బ్రహ్మ' అనే వాక్యార్థం అదేకదా?)

అలా అన్నగారు అన్న తరువాత సభలో కొంతసేపు నిశ్శబ్దం నెల కొన్నది. ఎవరినోటమాటరాలేదు. ఏమంటే యేదోషం వస్తుందోననే తాత్విక భయమే కారణమేమో తెలియదు. మరి పైన చెప్పిన మాటలకు తాత్వి కార్థం అర్థమైనదో లేక తత్వం అర్థంకాలేదో తెలియదు. ఏది అర్థంకాక తికమక చెందారో నాకు మాత్రం ఆ సభలోని వారిభావం అర్థంకాలేదు.

ఆ తరువాత సభలో కొంతసేపు నిశ్శబ్దం ఆవరించింది, తరువాత నేనిలా అన్నాను. పదార్థాన్ని విడిచి చలనం వుండనట్లే మేనుని విడిచి "నేను" వుండదు. మేను పాంచభౌతికం. దానియందు వ్యక్తమయ్యే చైతన్యం భౌతికేతరంకాదు. భౌతిక అస్తిత్వాన్ని గుర్తించక, అభౌతిక మైనదేదో వున్నదనుకోవడం తత్వశాస్త్రంకాదు. అస్తిత్వంలో వున్నదే భౌతికం. దానిని గురించి తెలుసుకోవడమే తత్వశాస్త్రం. తద్వారా భౌతిక అస్తిత్వాన్ని గుర్తించడమే జగత్ సత్యమని గుర్తించడమవుతుంది. ఇలా నా భాషలో నేను కొంత వివరణ ఇచ్చాను. ఆ మాటలు వారికి క్రొత్తగా వుండడంచేత ఆసక్తిగా విన్నారు. కాని, ఆ మాటలను ఎలా అర్థంచేసు కున్నారో కూడా నా కర్థంకాలేదు.

## అద్వైతంలో ద్వైతం

అధ్యాత్మిక తత్వశాస్త్రంలోని తాత్వికాంశాలు అర్థమైనట్లేవుంటూ అర్థం కావు. అందులోని పరస్పర వైరుధ్యాలేఅందుకు కారణం. అద్వైతభావాలకు విరుద్ధమైన (ద్వైత) భావాలను వదలి అద్వైతార్థాన్నిచ్చే వాక్యాలను మాత్రమే స్వీకరించి తర్కించి తత్వాన్ని నిగ్గుతేల్చవలసి వున్నది. సామాన్య వ్యక్తులలో అంత పరిశీలన ఆశించలేము. కాని కొంత కాలంగా అద్వైత విచారణ చేస్తూవున్న వ్యక్తుల్లో ఆ విచక్షణ, పరిశీలన లోపించడం విచారకరమైన విషయంగా భావించవలసి వున్నది.

అద్వైత ప్రచారం కోసమని టేపురికార్డరు, మైకుసెట్టు కొన్నారు అన్నగారు. ఆ రోజు నాకు కబురంపి పిలిపించారు. తెచ్చిన క్యాసెట్లలో

మండి గీతోపదేశం (ఘంటసాల వెంకటేశ్వరరావు పాడినది) నాకు వినిపించారు. నేను వింటూ వుండబట్టలేక నవ్వాను. అందులోని వ్యంగ్యార్థాన్ని గ్రహించిన అన్నగారు (టేపురికార్డరు ఆపుచేసి) నా నవ్వులోని వ్యంగ్యానికి కారణ మడిగారు.

ఈ గీతోపదేశంవల్ల మనకు (అద్వైతులకు) ప్రయోజనమేమిటని నా సందేహాన్ని వెలిబుచ్చాను. భాష అంతా అలాగేవున్నదిరా, భావాన్ని మనం అర్థంచేసుకుని సమన్వయం చేసుకోవాలి, చెప్పుకోవాలి అన్నారు. భాష ద్వారానేకదా మనం భావాన్ని అర్థంచేసుకోగలం, ఆ భాషలో వ్యతిరేకార్థాలు వస్తూవుంటే సరైన భావం యెలా అర్థంచేసుకోగలం అని నేనన్నాను.

భావాన్ని వ్యక్తపరచడంకోసం భాషను అభివృద్ధిచేసుకున్నాం. భాషద్వారానే భావాన్ని వ్యక్తీకరించ వీలుంటుంది. భాషలోని భావాన్ని (భాషలో పెట్టిన భావాన్ని) వ్యక్తులు, వ్యక్తిగతంగా వ్యాఖ్యానించుకుంటూ పోవడానికి వీలులేదు. అలా వ్యాఖ్యానిస్తూపోతే అసలు వున్న భావం మారిపోతుంది. ఆ తరువాత అసలు భావం అర్థంకాదు. అలా యిష్టమొచ్చినట్లు వ్యాఖ్యానించారు గనుకనే పరస్పర విరుద్ధమైన అర్థాలతో కూడిన ఆ వ్యాఖ్యానాలు, ఆ వాక్యాలకు వైరుధ్యాలతో కూడిన తాత్వికాంశాలుగా మిగిలినవి. ఆ కారణంగానే మనకు తాత్విక బాధలు కలుగుతూవున్నవి.

1947 వ సంవత్సరమనుకుంటాను, మా రెండవ అన్న (రామానుజయ్య) గారి కుమార్తె 'భారతి' (వర్ణాంతర) వివాహ సందర్భంగా దుష్టసర్పయాగం చేశారు. సంఘ వ్యతిరేక శక్తులను (వ్యక్తులను) అందులో కాల్చివేశారు అన్నగారు. (అలా కాల్చగా మిగిలిన దుష్టశక్తులు, వ్యక్తులే ఈనాడు సమాజ విద్రోహశక్తులుగా పనిచేస్తూవున్నవేమో!)

ఆవుల గోపాలకృష్ణమూర్తి (*A. G. K.*), గోపరాజు రామచంద్రరావు (గోరా), డాక్టరు కొమరాజు అచ్చమాంబ, బ్రహ్మానందగిరి స్వామీజీ (పరమహంస పరివ్రాజకాచార్యవర్య జగద్గురు బిరుదాంకితులు, వీరుకాశీలో చాలాకాలంవుండి ఆధ్యాత్మిక తత్వశాస్త్రాలను క్షుణ్ణంగా, కూలంకషంగా

అధ్యయనంచేసి వచ్చినవారు), వీరే కాక ఇతర ఆధ్యాత్మిక భౌతిక తత్వ వేత్తలు, పండితులు, సంఘ సంస్కర్తలు, రాజకీయ ప్రముఖులు పలువురు వచ్చివున్నారు.

ఆరోజు అంతా కూర్చుని యిష్టాగోష్ఠి జరిపాం. మా యింట్లో ఇష్టాగోష్ఠి అంటే అది తాత్విత సంబంధమైనదేనని మా ఉద్దేశం. తాత్విక సంబంధంలేని గోష్ఠి అంటే అది భజనతో సమానమేనని అన్నగారు అంటూ వుండేవారు.

## సిద్ధమా? ప్రాప్యమా?

అలా గోష్ఠి జరుగుతూ వుండగా మోక్షం సిద్ధమా? ప్రాప్యమా? (అది సహజంగా జీవుడు పొందివున్నాడా? లేక ప్రయత్న పూర్వకంగా దానిని పొందుతాడా?) అని అన్నారు అన్నగారు. అది సిద్ధవస్తువయితే మనప్రయత్నమెందుకు? అన్నారు అక్కడవున్న ఒక అద్వైత తత్వవేత్త. (మా అన్నగారితో సరిసమానంగా అద్వైత విద్యను పూర్ణంగా విచారించినవారే వారు) అలా వారు అనడంతో మేమంతా (అన్నదమ్ములం) ఒక్కసారిగా నవ్వాం. అందుకు వారికి కోపంవచ్చింది, ముఖం చిట్లించి మా వంక చూశారు. (ఆ విషయం మాకు తెలియదని, అలా తెలియని ఆ గొప్ప విషయం చర్చకు వచ్చినప్పుడు మేము చాల చులకనగా వ్యవహరించామని వారి ఉద్దేశం. అది వారి కోపానికి కారణం).

మోక్షం కష్టపడి సాధించుకుంటామని వారి (అద్వైతుల) ఉద్దేశం. ఆ అభిప్రాయానికి భిన్నంగా అన్నగారు మాట్లాడ బోతూ వున్నారు. అందుకు మరింత వ్యాకులత చెందిన ఆ తత్వవేత్త ఆ విషయం మాకు ఎక్కడ తెలిసి పోతుందోవనే చింతతో అలా అన్నారేమో వని అనుకోవలసి వచ్చింది. కాని తరువాత తెలిసింది వారికి తెలిసింది అంతవరకేనని.

కాని మా అన్నగారు తనకు తెలిసిన విషయాన్ని దాచక అందరికి చెప్పాలని ప్రయత్నం చేసేవారు. అందుచేత అక్కడ కూర్చుని వున్న పెద్దల యెదుట మోక్షం సిద్ధమే (అందరికి) కానీ అది ప్రాప్యవస్తువు కాద

న్నారు. పొవ్యవస్తువు (ప్రియత్న పూర్వకంగా పొందినది) స్థిరంగా వుండదని, తెచ్చుకుంటే వచ్చిన మోక్షం వచ్చినట్లుగానే పోయేదవుతుందని అన్నారు. అటువంటి అభిప్రాయంతో అందరు ఏకీభవించలేరు.

ఇచ్చిపుచ్చుకునే పదవులన్నా, బిరుదులన్నా గౌరవం వుండేదికాదు అన్నగారికి. ఇచ్చిన పదవిలో అధికారదర్పం, పుచ్చుకున్న బిరుదులో అహంభావం పెరిగే అవకాశమున్నదని వారి అభిప్రాయం. అన్ని పదవులకంటే, బిరుదుల కంటే ఉన్నతమైనది నీ బిరుదు (అఖండ సచ్చిదానంద) ఆ బిరుదుని (ఆస్థానాన్ని) నీవు గుర్తించితే ఏ బిరుదుకోసం నీవు ప్రాకులాడవు. నీకున్న ఆ బిరుదు ఎవ్వరు ఇవ్వనక్కరలేదు. క్రొత్తగా పుచ్చుకోనక్కరలేదు అనేవాడు (మన భాషలో మోక్షము అంటే వ్యక్తికి వున్న స్వేచ్ఛ, ఆనందము). అది ఎవరివల్ల పొందేది కాదు. అది తనకు సహజంగానే (సిద్ధించే) వున్నది.ఆ సంగతి గుర్తించడమే జరగాలి.

భౌతిక వాదులకు మోక్షమనేది లేదు. ఆధ్యాత్మిక వాదంలో మోక్షమనేది కల్పించబడినది. అది సాధించడంకోసం భక్తి, జ్ఞాన, వైరాగ్య మార్గాలు చెప్పబడినవి. (ఆర్యులు మొదట స్వర్గమున్నదని చెప్పి తాత్విక జిజ్ఞాస పెరిగిన దశలో సంకుచితమైన స్వర్గ భావాన్ని విడిచి మోక్షము అనే విశాల భావాన్ని ప్రవేశపెట్టారు).

శంకరుడు వచ్చేనాటికి తాత్విక జిజ్ఞాస పెరిగింది. అందుచేత మోక్షం పొందేది కాదు, అది జీవునికి సహజంగానే వున్నది అనే సూత్రాన్ని ప్రవేశపెట్టి ప్రచారం చేశాడు. మోక్షం అనే దానిని మనం జీవునికి (మానవునికి) వున్న స్వేచ్ఛ అని సమన్వయం చేసి చెప్పుకోవచ్చు. జీవునికి బంధంలేదని గుర్తించడమే మోక్షమని అర్థంచేసుకుంటే - మానవుడు సహజంగా స్వేచ్ఛా పిపాసి అనే దానితో మనకు సమన్వయం సరిపోతుంది.

ద్వైత, విశిష్టాద్వైతాలు భక్తి మార్గం చెప్పగా అద్వైతం జ్ఞాన మార్గాన్ని బోధించింది. జ్ఞానం వస్తే బంధం లేదని తెలుస్తుంది. బంధం లేదని తెలియడంద్వారా జీవుడు బంధవిముక్తుడై ముక్తిని (మోక్షమును)

పొందుతాడు. అదే జీవన్ముక్తి. ముక్తిని పొందుతాడు అంటే బంధంలేదని తెలుసుకుంటాడన్న మాట.

## మోక్షం ఇచ్చేదికాదు - పుచ్చుకునేదికాదు

అజ్ఞానంచేత తాను(జీవుడు)బద్ధుడనని అనుకున్నాడేగాని జీవుడెపుడు బద్ధుడు కాలేదు. బద్ధుడు కాలేదని (బంధంలేదని) తెలియడమే (మోక్షం) అదే జీవన్ముక్తిగాని, క్రొత్తగా ప్రయత్న పూర్వకంగా బంధం పోయేది కాదు, మోక్షం వచ్చేదికాదు. వచ్చేదైతే అది మళ్లీ పోయేదే అవుతుంది (అదే చావడమంటే).

"మోక్షం ఇచ్చేది కాదు పుచ్చుకోవడానికి. అది ప్రయత్నంచేత ప్రాప్తించేదికాదు. సాధనవల్ల సాధ్యంచేసుకునేదికాదు. అది సిద్ధమేకాని, ప్రాప్యంకాదు." అని మా అన్నగారనడంతో అక్కడవున్నవారిలో సిద్ధాంత కలవరం బయలుదేరింది. ఒకే విషయాన్ని ఒకే రీతిలో విచారించిన ఇద్దరు వ్యక్తుల మధ్య ఆ విషయం వివాదాస్పదం కావడానికి కారణం ప్రధానంగా భాష (సంస్కృతం) లోని లోపంగా భావించాలి. భావాన్ని వ్యక్తీకరించడానికి భాష స్పష్టత గలిగి వుండాలి. అలా కానపుడు ఆ భాష ద్వారా వ్యక్తీకరించే భావానికి స్పష్టత వుండదు.

అసలు ఆధ్యాత్మిక తత్వశాస్త్రం అందరికి ఒకే ప్రమాణంలో అర్థం కాక పోవడానికి అది శాస్త్ర ప్రమాణం కాక పోవడమూ, భాషలో స్పష్టత లేకపోవడమూ కారణం. వినటికి ఎలా తోస్తే అలా అర్థమవుతుంది, భిన్న భావాలకు అవకాశమిస్తున్నది.

ఆ కారణంచేతనే త్రిమతాచార్యులు (శంకర, రామానుజ, మధ్వ) ఒకే విషయంపై వారి వారి దృక్పథాలనుండి వేరు వేరు భావాలను వ్యక్తీకరించి మూలభావం (ప్రధానతత్వం) యేమిటనేది అర్థం కాని దశలో దానిని వివరించడం జరిగింది. ఆ కారణంగా సామాన్య మానవులను అజ్ఞానంలో వుంచడమే జరిగింది.

## కర్మ వాసనలు

అలాగే అనేక సందర్భాలలో మనకు తాత్వికాంశాలు యెవరి ఇష్టానికి అనుకూలంగా వారు వ్యాఖ్యానం చెప్పుకోవడానికి వీలు కలుగుతున్నది. అందుకు పైన చెప్పినట్లు స్పష్టతలేని భాష కొంత కారణం కాగా అసలు చెప్పబడిన భావానికి (తత్వానికి) నిర్దిష్టమైన అస్తిత్వం లేకపోవడం ప్రధానకారణం.

జన్మకు (జీవునికి) కర్మ వాసనలు అంటగట్టి, జన్మకు పూర్వ జన్మను జతపరచి, ఆ జన్మ కర్మ ఫలితాలు ఈ జన్మకు జోడించి (సంధించి) అంటగట్టి చెప్పే జన్మ కర్మల వాదానికి గాని, స్వర్గ నరకా లకుగాని, పుణ్య పాపాలకుగాని ఆధార పూర్వకమైన సమాచారం అందదు, పైన చెప్పబడిన అంశాలేవీ అస్తిత్వంలో వున్న అంశాలుకావు. అస్తిత్వంలో లేని అటువంటి అంశాలను తత్వశాస్త్రంలో చెప్పుతూ వుండడమే మనలోని అనిశ్చిత పరిస్థితికి కారణం.

జీవునికి బంధం అంటగట్టి ఆ బంధ విముక్తికి సాధన మార్గాలు చెప్పిన సనాతన ఆధ్యాత్మిక తత్వ రీతిని యెదిరించి ఖండించిన శంకరుని నూతనతత్వ రీతిలో జీవుడు బద్ధుడు కానేకాడు. తాను బద్ధుడను కాదని తెలియడమే తనకు విముక్తి అదే జీవన్ ముక్తి. (జీవుడు ఏ దైవ కారణం చేతను జన్మకు రాలేదనీ, తాను సహజమైన పద్ధతితో పరిణామ రూపంలో రూపొందాననీ గుర్తించడం ద్వారా తాను స్వేచ్ఛాజీవి అవుతున్నాడు. అలా తన స్వేచ్ఛను తాము గుర్తించడమే బంధ విముక్తి, లేక మోక్షం). మోక్షమనేది ప్రత్యేకంగా లేనూ లేదు. ప్రయత్న పూర్వకంగా అది తెచ్చుకునేది కానూ కాదు.

## మహాకాశం - ఘటాకాశం

మహాకాశం నుండి ఘటాకాశం యెప్పుడు వేరైనది? ఘటం వచ్చి ఘటాకాశం అని పేరొచ్చింది అందుచేత మహాకాశం నుండి ఘటాకాశం

యెప్పుడూ వేరు కాలేదు. ఘట మహాకాశాలు భిన్నం కాదని, అభిన్నంగానే వున్నవని తెలుసుకోవలసిందే గాని, భిన్నమైన వాటిని అభిన్నం చేయడానికి ఘటనాశనం కానక్కరలేదు. ఘట మహాకాశాల అభిన్నత్వం అర్థం చేసుకోవాలేగాని, అందుకు ప్రత్యేక సోధన ఏదీ అవసరం లేదు. (ఘట మహాకాశాలని రెండు లేవు. వున్నది ఒకే ఆకాశం).

ఇదే సూత్రం జీవేశ్వరులకు వర్తిస్తుంది. జీవేశ్వరులు ఇద్దరు లేరు (రెండుకాదు). అందుచేత వారికి ఐక్యత కాదు కావలసింది. జీవేశ్వరులు వేరు కాదని గుర్తింపు మాత్రమే జరగాలి. జీవబ్రహ్మముల ఐక్యత మనం చేయవలసిన పనిలేదు. ఏది జీవుడని వ్యవహరించబడుతూ వున్నదో అదే బ్రహ్మమని అర్థం. తాత్వికంగా చెప్పినపుడు బ్రహ్మమనీ వ్యావహారికంగా చూచినపుడు జీవుడనీ అర్థం చేసుకోవాలి. బ్రహ్మము నుండి జీవుడు వేరు కాలేదని (వేరుకాలేడని), జీవుడే బ్రహ్మమని గుర్తించడానికే జ్ఞానమని పేరు. (పదార్థం నుండి వస్తువు వేరు కాలేదు. ఎక్కడ వస్తువు వున్నదో అక్కడే పదార్థమున్నది. వస్తువుని విడిచి పదార్థంవుండదు. వస్తువు లేనిదే పదార్థం అర్థంకాదు.)

జీవుడు మరణానంతరం బ్రహ్మైక్యం పొందుతాడని అనుకోవడం అజ్ఞానం. ఘటనాశనంతో గాని ఘటాకాశం(ఘటబంధాకాశం) మహాకాశంలో కలవదని అనుకోవడం ఎలాంటిదో, దేహానంతర విముక్తి (విదేహముక్తి) కూడ అలాంటిదే. అదికాదు శంకరుడు చెప్పింది. జీవి జీవించివుండగానే ఆ గుర్తింపు కలగాలి. అదే జీవన్ముక్తి.

## మరణానంతర జీవి

జీవి మరణానంతరం జరిగేదేమి వుండదు. మరణానికిముందు అస్తిత్వంలో వున్న జీవునిసంగతే మనం ఆలోచించేది. మరణానంతరం (తాను) ఏ రూపంలోను అస్తిత్వంలోవుండడు. ఉంటాడు అనుకుని భ్రమలో ఆలోచించారు గనుకనే ఈ చిక్కంతా వచ్చింది. ఆధ్యాత్మిక వాదంలో ఈ జీవుని గురించిన అంశమే ప్రధాన పాత్రవహిస్తుంది. ఆ భావంతోనే

ఆ జీవునికి లేనిపోని అవస్థలు కల్పించి, ఆ అవస్థా నివారణ కోసం నానా తంటాలు పడ్డారు, మనలను తంటాలు పెట్టారు.

మరణానంతరం ముక్తి వుంటుందని నమ్మిన ఏ ఆధ్యాత్మికవాదీ ఆ ముక్తి కోసం మరణించలేదు. అలా మరణించిన సందర్భాలు వున్నవంటే అవి మతం కల్పించిన మౌఢ్యంలో జరిగినదే గాని తాత్వికాంశం కాదు. (మరణానంతర ముక్తి కోసం ఒకేసారి కొన్ని వందల సంఖ్యలో మతస్థులు విషం పుచ్చుకుని మరణించినట్లు క్రైస్తవుల చరిత్రలో చదివాం).

జీవమనేది ప్రత్యేక పదార్థం కాదు. అది మరణానంతరం అస్తిత్వంలో వుండదు. ఆ సంగతి తెలియనివారు మరణానంతరజీవుడికోసంఅనేక రకాలైన అన్వేషణ చేస్తూ వచ్చారు. చివరకు అది ఏ రూపంలోను మరణానంతర చర్యలో వుండదని తేలింది. అందుచేత తత్వశాస్త్రంలో దాని ప్రాముఖ్యం అంతరించింది. మనకు కొంత బాధ తప్పింది.

## తాత్విక గారడీలు

అద్వైత సభలు జరిగే సందర్భాలలో తాత్విక తంతులు, తమాషాలు (తాత్విక గారడీలు) చేస్తూవుండేవారు అన్నగారు. రసవత్తరంగా సాగుతూ వున్న ప్రసంగాన్ని మధ్యలో ఆపి ప్రశ్నలువేస్తూ వుండేవారు. వారు ప్రశ్నించే పద్ధతిలోనే సమాధానం అర్థమయ్యే రీతిలో ప్రశ్నలు వుంటై. కొన్ని ప్రశ్నలు, వాటికి సమాధానాలు కంఠోపాఠం చేసి వుంచుతారు. ఈ సభలో స్త్రీ లెందరు? పురుషు లెందరు? అని అడిగేవారు. ఇక్కడ స్త్రీలు, పురుషులు లేరు అని సమాధానం వచ్చేది. అలాగా? మరి వున్న దెవరు? అనేవారు. "నేనే" అని సమాధానం వచ్చేది. ఏక కంఠంతో అలా సమాధానం చెప్పిన వారిలో స్త్రీలు, పురుషులు కలిసే వుండేవారు.

ఈ సభలో ఎందరున్నారు? లెక్కించి చెప్పమనేవారు. ఇక్కడ యెందరో లేరు, వున్నది ఒక్కరే ననేవారు. (వందల సంఖ్యలో వున్న ఆ సభాసదులు). ఆ ఒక్కరు యెవరు? అని అనగానే, "నేను" అనేవారు,

సభలో పలువైపుల చూస్తూ అక్కడ కూర్చున్నది యెవరు? అక్కడ నిలు చున్నది యెవరు? అక్కడ నడుస్తూ వున్నది యెవరు? అని పలువురిని పలువిధాలుగా వ్యవహరిస్తూ వున్న వారిని అడిగేవారు అన్నగారు.

అలా వ్యవహరిస్తూవున్న వారిలో స్త్రీలు, పురుషులు, వృద్ధులు బాలురు వుండేవారు. కాని, వారంతా కూడా "నేను" "నేను" అని చెప్పే వారే గాని "నేను" ని వదలి (మరచి) నేను భావంతో వెంకయ్య అని గాని, పుల్లయ్య అనిగాని అనేవారు కాదు. ఏ దిశనుంచి వచ్చిన సమా ధానమైనా ఆ 'నేను' ని మరవని సమాధానంగానే వుండేది.

అడిగిన వారెవరు? చెప్పేవారెవరు? అనే భావం యెవరికి వుండేది కాదు. అదే తాత్విక గారడీ అంటే. ఏకాత్మ వాదానికి అవి ఉదాహరణలు, నిరూపించడానికి అవి పద్ధతులు. ఇక ఆత్మ సర్వాంతర్యామి అని ఒప్పించ డానికి కొన్ని పద్ధతులున్నాయి. ఆ పద్ధతులు చూస్తూవుంటే, అదొక తాత్విక హిప్నాటిజం మాదిరిగా వుంటుంది. అలాచూడు, ఆ చెట్టు రెండు కొమ్మల మధ్య యేమున్నది? అనేవారు. సభలోని వారు యెగాదిగా చూచి అక్కడ యేమి లేదయ్యా అనేవారు. అక్కడ నీవే లేకపోతే అక్కడ యేమి లేదన్న సంగతి నీకు తెలియకనే పోనుగదా? చైతన్య వంతుడుగా (తెలుసుకునే వాడుగా) నీవు అక్కడ వున్నావు అనేవారు. అంతేనయ్యా "నేను" అక్కడ కూడా వున్నాను అనేవారు ఆ సభలోనివారు.

## అఖండత్వం

ఇక అన్ని వైపులకు తిరిగి చూడమనేవారు. అలాగే అన్ని వైపులకు చూచేవారు. తల పైకెత్తి చూడమనేవారు. ఆకాశం అంతా పరికించు అనే వారు. అదే విధంగా తలపైకెత్తి అన్ని వైపులా చూచేవారు. ఇప్పుడు మీరు అన్ని వైపులా క్రింద, పైన చూచారుగదా? మీరు చూచిన అన్ని వైపుల యేమున్నది? అని అడిగేవారు. వుంటే వున్నదని, లేకపోతే లేదని చెప్పేవారు కనుక పిండాండ, బ్రహ్మాండముల నిండా నీవే వున్నావు (తెలుసుకునే వానిగా) అనేవారు. అవునయ్యా నేనే వున్నాను అని అక్కడి వారనగానే 'అదే నీ అఖండత్వం' అని చెప్పి అందరిచేత ఈ విధంగా అని పించేవారు.

సర్వత్రా నీవే వున్నావు, అంతటా నీవే వున్నావు, నీవు ఒక్కడివే వున్నావు. అవునయ్యా నేను ఒక్కడినే వున్నాను. నీవు సర్వత్రా వుండటం చేత నీవు సర్వాంతర్యామివి. అవునయ్యా నేను సర్వత్రావుండి, సర్వాంతర్యామిగా వున్నాను. అంతటా నీవే వుండటంచేతను, నీ కంటే రెండవది లేక పోవడం చేతను, నీవు అఖండ స్వరూపుడవుగా వున్నావు. అవునయ్యా నేను అఖండ స్వరూపుడనుగా వున్నాను. ఇప్పుడు నీ స్వరూపం నీకు తెలిసిందా? (స్వస్వరూప సాక్షాత్కారం) అవునయ్యా నా స్వరూపం నాకు తెలిసింది అనేవారు సభలోనివారు.

## సచ్చిదానంద స్వరూపము

'ఒకడివై వున్న నీవు సర్వత్రా అఖండంగా వున్నావని నీ సంగతి నీకు తెలియడంద్వారా నీకు ఏ విధమైన భావం (అనుభవం) కలుగుతున్నది?' అని అడిగేవారు అన్నగారు. నేనింతటి వాడినని నా సంగతి నాకు తెలియడం ద్వారా (ఆ జ్ఞానం కలగడంద్వారా, నాకు ఇక తెలియవలసింది లేదని నేను తెలుసుకున్నాను అని సమాధానం వచ్చేది, ఇలా తెలియడంద్వారా నీ కే విధమైన అనుభూతి కలుగుతున్నది? అని ప్రశ్నించేవారు అన్నగారు. నా సంగతి నాకు తెలియడంద్వారా (స్వస్వరూపసాక్షాత్కార జ్ఞానం కలగడం ద్వారా) నాకు ఆనందానుభూతి కలుగుతున్నది, అని సమాధానం. 'ఈ ఆనందం నీకు యెక్కడినుంచి వచ్చింది? బయటి నుంచి వచ్చిందా? ఈ ఆనందం శాశ్వతంగా వుంటుందా?' అని అడిగేవారు మళ్ళీ. నాకు కలిగిన ఆనందానుభూతి బయటిది కాదు. నేను సహజంగానే ఆనంద స్వభావం కలవాడిని, అందుచేత అది నాదే, అది నాదే కావడంచేత నన్ను వదలి (విడిచి) పోదు.' అని సమాధానం.

కనుక నీవు అఖండ: సచ్చిదానంద స్వరూపుడవు. నీ వెరిగేది నీకంటే అన్యంగా (పరంగా) లేదు. నీవే సర్వమును యెరిగిన వాడివగుట చేత అపరోక్ష జ్ఞానం కలిగి అద్వైత అభేదస్థితి నెరిగి ఆ స్థితి నుంచి జారక (స్ఖలనము పొందక) అస్ఖలిత స్థితిలో వుందువు గాక అని ముగించేవారు.

అలా జరుగుతూవుండే అటువంటి సభలకు క్రొత్తగా వచ్చిన వారికి ఆ మాటలు, ఆ చేష్టలు గారడి విద్యగా కనిపిస్తుంది, అనిపిస్తుంది. అక్కడ యేది సత్యమో యే దసత్యమో యెవరు యెవరికి చెప్పేటట్లు? తెలుసు కోవడమనేది (చైతన్యం) జ్ఞానేంద్రియాలద్వారా మనసు చేస్తుంది,మనసు మెదడులో పనిచేస్తుంది. మెదడు శరీరంలోని భాగం. జ్ఞానేంద్రియాలు శరీరాన్ని ఆశ్రయించే వున్నవి. శరీరం ప్రకృతిలో ఖండ భాగం. ఈ విషయం తాత్విక గారడీల వల్ల తెలియదు.

తాత్వికజ్ఞానం వ్యావహారిక జీవితానికి ఉపయోగపడేదిగా వుండాలి. వ్యావహారిక జీవితం అసత్యమనుకున్న అధ్యాత్మిక భావవాదులు జీవిత సత్యాలను తెలుసుకోలేక పోయారు. ఆ కారణంచేత అధ్యాత్మిక సత్యం కోసం ఆరాట పడ్డారు. పారమార్థిక ప్రయోజనం అనే దానిని ఊహించు కుని దానిని జీవితానికి బయట (పరంగా) వెదకడం ప్రారంభించారు. అందుచేతనే వ్యావహారిక జీవితానికిదూరమైనారు. తాత్విక సత్యానికి దూరమైనారు. సమన్వయం కుదరక సతమతమైనారు.

## వివర్తం

"నేను" (ఆత్మ) ఖండరూపమైన మేను (శరీరం) నందు చైతన్యం (తెలుసుకునే) రూపంలో వున్నాను. "నేను" కు (మేనుతో చేర్చి) కారణ మైన పదార్థంమాత్రం (ప్రదేశంతో చేరి) అఖండంగా వున్నది. అలా అఖండంగా వ్యాపించివున్న పదార్థంనుండి ఖండరూపమైన మేను (శరీరం) యేర్పడిన తరువాతనే తెలుసుకోవడం (చైతన్యం) "నేను" యేర్పడినది.

వర్తించే పదార్థమందు (శరీరమందు) మాత్రమే తెలుసుకునే చైతన్యం వుంటుంది. వర్తించని (వివర్తమందు) పదార్థానికి తెలుసుకునే (చైతన్య) శక్తి లేదు, వుండదు. వర్త వివర్తములుగా (రెండుగా)పదార్థం వుంటుంది, అంటే కార్యకారణాల రూపంలో పదార్థం వుంటుంది. (కార్య కారణాలు రెండుకాదు) కారణమందు అవ్యక్తంగాను, కార్యమునందు

వ్యక్తంగాను వుంటూ వుంటుంది. సుషుప్తిలో అవ్యక్తంగా వున్న మనసే జాగ్రత్తలో తెలివిగా వ్యక్తమవుతుంది. తంతులు తమాషాలు చూడటం, వినడం అలవాటైతే తత్వశాస్త్రం చదవబుద్ధికాదు, వినబుద్ధికాదు. ఆ కారణంగా అది అర్థంకాదు.

ఇలాంటి తాత్వికతంతులు చూస్తూను,వింటూను ఆలోచనవిడిచి మానవుడుచిక్కులలోచిక్కుకున్నాడు. గారడివిద్యలు మనిషినిమైమరపించి,అనుభూతిలో (కృత్రిమ ఆనందంలో) వుంచగలవు, ఆ దశలో ఆలోచన అంతరిస్తుంది, అవ్యక్తం తనకు భుక్తమవుతుంది. తనకు తెలియవలసిందేమిటి? తెలుసుకుంటూ వున్నదేమిటి? చూస్తూవున్నదేమిటి? చూడవలసిందేమిటి? చూడటం అంటే కంటితో చూడడమే చూడటమా? (గారడీ చేస్తూవున్నపుడు కళ్లు చూస్తూనే వుంటై కాని అతని మాటల మైకంలో మనం విచక్షణ కోల్పోతాం. అదే విధంగా తాత్విక విషయంలో జరుగుతూ వుంటుంది. ఆ విధంగా మనం జీవితంలో నష్టపోతాం). ఇంద్రియాలతో ఎంతవరకు చూడగలం? ఏ ఇంద్రియం ఏ విషయాన్ని తెలుసుకుంటుంది? ఏ ఇంద్రియం ఎక్కడ ఎలా పనిచేస్తూవున్నది? ఇంద్రియాలకు మనసుకు వున్న సంబంధం ఏమిటి? అసలు మనసంటే ఏమిటి? మనసుతో తెలుసుకుంటామా? మనసు లేకుండా తెలుసుకుంటామా? శరీరం లేని చోట మనసు పనిచేస్తుందా? అనేటటువంటి అనేక విషయాలు తాత్వికులు సర్వదా పరిశీలిస్తూనే వున్నారు, పరిశోధిస్తూనే వున్నారు. ఇలా భౌతిక సంబంధమైన అస్తిత్వంలో వున్న విషయాలనువదిలేసి ఆలోచించడంచేతనే తెలుసుకోవడం అనేదానికి నిర్వచనం లేకుండాపోయింది.

## మంత్రాలు - మహిమలు

ఆధ్యాత్మిక విషయమంటూ అస్తిత్వంలో లేని అంశాలను చర్చిస్తూ వున్నందువల్లనే ఏది సరైనదో, ఏది సరైనది కాదో నిర్ణయించుకునే స్థితిలో మనం లేము. అలా విచక్షణ లోపించిన కారణంగానే తాత్విక తంతులు (గారడీలు) చేస్తూ వుంటే చూస్తూను, వింటూను తలలు ఆడించే పరిస్థితికి దిగజారి పోయాం.

అలాంటి పరిస్థితులలోనే మంత్రాలకు, మహిమలకు మనిషి దాసుడైనాడు. తన శక్తిని గుర్తించలేని పరిస్థితిని తనకు తానే కల్పించుకున్నాడు. మంత్రశక్తిపై నమ్మకం పెరగడంతో అన్నగారికి మంత్రాలు తెలుసునని, ఆ మంత్రాల ద్వారా మహిమలు సాధించ వచ్చునని, ఆ మహిమల ద్వారా తమ ఇష్టకామ్యఫలసిద్ధిని సాధించ వచ్చునని ఆశించి (ఆశపడి) కొందరు వస్తూవుండేవారు అన్నగారి దగ్గరకు; అలావచ్చిన వారిని పిచ్చివాళ్లను చేసి బుద్ధిచెప్పి తాత్విక జిజ్ఞాస కలిగించి పంపుతూ వుండేవా రాయన.

ఒకనాటి సభలో చిన్న తమషా జరిగింది. మంత్రశక్తులపై నమ్మకం, మహిమలపై ఆశ వున్న వ్యక్తి వచ్చాడు అన్నగారి దగ్గరకు. భక్తి వినయాలను ప్రదర్శిస్తూ వచ్చి అన్నగారికి నమస్కారంచేసి అయ్యా మీకు మంత్రశక్తులు తెలుసునా అని అడిగాడు ఆశగా. తెలుసు నీకేం కావాలి అన్నారు అన్నగారు.

ఏం కావాలో నిర్ణయించుకోలేని ఆ వ్యక్తి తన కోరికను వ్యక్త పరచడానికి ఆలోచనలో పడ్డాడు. నీవు భక్తుడవు, భక్తి చేసుకోవడానికిముందు నీకు కొబ్బరికాయ ఇస్తాను. ఆ తరువాత నీ యిష్టం వచ్చింది అడుగు అన్నారు. అతను ఆశగా చూస్తూవుండగా ఏదో మంత్రం చదివినట్లు నటించి, ఆ గోడ కావల కొబ్బరికాయ వుంటుంది పోయి తెచ్చుకో అన్నారు (అతను ఈ రోజు వస్తాడని తెలిసి ముందుగానే అక్కడ కొబ్బరికాయ పెట్టి వుంచారు). అతను వెళ్లి అక్కడ కొబ్బరికాయ వుండటంచూచి ఆశ్చర్యం, ఆనందం కలగడంతో మంత్రంమీద బాగా నమ్మకం కుదిరింది. ఆ కాయను తెచ్చి సవినయంగా అన్నగారి వద్ద వుంచి పాదాభివందనం చేశాడు. మంత్రంమీద నమ్మకం పెరగటంతో భక్తి వినయాలు ఆ దామాషాలో పెరిగాయి.

నీ సందేహం ఏమిటి నాయనా అని అడిగారు అన్నగారు. (తాత్విక సంబంధమైన సందేహమేదైనా వుంటుందని అన్నగారి ఉద్దేశం). అతను వెంటనే నాకు ఆడపిల్ల కావాలి అన్నాడు (తనకు ఆడ సంతానం కావాలని అడుగుతున్నాడని అనుకున్నారు అన్నగారు), నీకు వివాహం జరిగి ఎంత

కాలమైనది అన్నారు నాకు ఇంకా వివాహం కాలేదని అందుకే ఆడపిల్లను అడిగానని అన్నాడు ఆ వ్యక్తి (అప్పుడుగాని అర్థం కాలేదు అతని అంతర్యం).

'మంత్రాలమీద నమ్మకం మనిషిని ఏ విధమైన కోరికలకు దారి తీస్తుందో చూడండి. అటువంటి కోరికలతో మనిషి ఎంత చిన్నవాడు (తాత్వికంగా) అవుతున్నాడో చూడండి' అని సభా ముఖంగా చూచి అంటూనే చిరునవ్వుతో అతనివంక చూచి 'నీ కోర్కె ఫలించుగాక! నిన్నే ఆడ పిల్లను చేస్తాను. 'యద్భావం తద్ భవతి' అంటూ మంత్రం యేదో చదివినట్లు చదివి నీవు ఆడదానివై పోయావు చూచుకో అన్నారు గంభీరంగా. అతను వెంటనే తన చేతిని తన మర్మస్థానం దగ్గరకు పోనిచ్చి తడివి చూచుకున్నాడు, అతని ప్రవర్తనకు, అవివేకానికి సభలోనివారు గొల్లున నవ్వారు. అంతటితో చిన్నబుచ్చుకున్న మనసుతో తలవంచి నిలుచున్నాడు. నాయనా నీకు త్వరలో ఆడపిల్ల కలుగుతుంది సందేహం అక్కరలేదు. నీకు తగిన ఆడపిల్లను చూచి వివాహం చేస్తాం. అపుడు నీ కోరిక నెరవేరుతుంది అని తలమీద చేయిపెట్టి దీవించినట్లు అభినయించారు అన్నగారు.

దీవెనలకు పిల్లలు పుట్టరని అక్కడి వారందరికి తెలుసు. కాని వాటిని నమ్మే ప్రజలు, నమ్మించే మతస్థులు వున్న సమాజం ఇది. నమ్మకంలో ఒక విధమైన మైమరపులాంటి సుఖం వుంటుంది, తాత్విక జిజ్ఞాస పెరిగే వరకు ఆ నమ్మకం అతనిని విడిచి పెట్టక పట్టి పీడిస్తూ వుంటుంది అన్నారు అన్నగారు.

మానసికంగా అతనిలో యేదో బాధ వ్యక్తం కాగా సభనుండి నిదానంగా నిష్క్రమించాడు గంపెడు నిరాశను మోసుకుంటూ. 'మనిషికి మంత్రంమీద, మహిమలమీద ఇంత నమ్మకం వుంటే అతను బాగుపడే దెప్పుడు? తాత్విక జిజ్ఞాస పెరిగే దెప్పుడు? అన్నారు అన్నగారు. అటువంటి నమ్మకాలను కలిగించింది మీ ఆధ్యాత్మిక తాత్వికాంశాలే కదా? అన్నాను నేను అవకాశాన్ని పురస్కరించుకుని, కొద్దిగా బాధపడ్డారు, మౌనం వహించారు అన్నగారు.

ఆధ్యాత్మిక వాదానికి ప్రతిసిద్ధిగా తన వాదాన్ని కొనసాగిస్తూ వుండేవారు గనుక నేనలా అన్నానేగాని అన్నగారికి అటువంటి (మంత్ర తంత్ర మహిమలు) నమ్మకాలు లేవు. అన్నగారనేకాదు ఏ అద్వైతికీ ఆ నమ్మకాలుండవు. వుంటే అతను అద్వైతే కాడు, కాలేడు. ఏ నమ్మకాలను నమ్మదు అద్వైతం, అందుకే అది జ్ఞాన సిద్ధాంతం.

## దైవరూపాలలోని వైవిధ్యాలు

వికారమైన ఆకారము, వికృతమైన స్వరూపము (కార్టూన్) లతో చిత్ర, శిల్ప రూపాలలో మనకు దైవాన్ని చూపెడుతుంది మతం. ఒక తల, రెండు కాళ్లు, రెండు చేతులు వుంటే అది సహజమైన (మానవ) ఆకృతి అనుకుంటాం. కాని ఇలా సహజమైన ఆకృతులకు భిన్నమైన (భయంకర మైన) రూపాలలో దైవాన్ని చూపెట్టడంలో ఉద్దేశంయేమిటి? మనిషి కంటే దైవాన్ని విశేషంగాను, అధిక్యంగాను చూపెట్టి మనిషిని తక్కువ వాడిని (చిన్నవాడిని) చేయాలనేదే తద్వారా మనిషిని భయపెట్టి లొంగ దీసుకోవాలనేదే ఉద్దేశం.

ఆర్యుల (ఆటవిక) దశలో దైవాన్ని అలా ఊహించుకుని ఉపయోగించుకున్నారు. కాని ఆ దశ నుండి మానవుడు తాత్వికంగా యెంతో పెరిగాడు. అయితే తాత్విక దృక్పథంలేని మతం మానవుణ్ణి యింకా అజ్ఞాన దశలో వుంచుతూ వున్నది. తాత్విక దృక్పథంలేని మతం, ఆ మతంలోని మానవుడు ఏ దశలో వున్నట్లు? ఏ దశలో ఆలోచిస్తున్నట్లు? అనేది ప్రశ్నగా వున్నది మనకు.

## మేము చిన్నవాళ్లం (బాల్యం)

మేము చిన్నవాళ్లం కావడంచేత గౌరవభావంతో వారిని యెదిరించి మాట్లాడేవాళ్లం కాదు. ప్రతి చిన్న విషయానికి పెద్దగా కేకలు వేస్తూ మమ్మల్ని భయపెడుతూ వుండేవారు. వ్యావహారిక విషయాలయందు యెదిరించి మాట్లాడేవాళ్లంకాము. కాని సిద్ధాంత విషయం వచ్చినప్పుడు విడిచిపెట్టేవాళ్లం కాదు. సిద్ధాంత హానిపత్వం సహించరానిదిగదా? వారు

చెప్పడం ప్రారంభిస్తే ఆపడం అనేది వుండేదికాదు. ప్రసంగాన్ని రసవత్తరంగా సాగిస్తూ యెదుటివారు మాట్లాడే అవకాశం ఇచ్చేవారుకాదు. మంచి వాక్‌ధోరణి, సమయస్ఫూర్తి వుండేవి. తార్కికబుద్ధితో పాటు వాదంలో తర్కం కూడా బాగా అలవాటైనది. తప్పనిసరైన పరిస్థితిలో ఒకసారి నేనిలా అన్నాను 'మీరు పది నిమిషాలు మీ వాదం చెప్పండి. కాని, ఐదు నిమిషాలు మా వాదం వినండి' అని. ఆ తరువాత ఆ పద్ధతిని అనుసరించేవారు. అందువల్ల మాకు కొంత వీలైనది మా వాదాన్ని మేము వినిపించడానికి.

## గాంధి ఆశ్రమం

సేవాగ్రామ్ (వార్ధాగాంధిగారి ఆశ్రమం) లో మా నాల్గవ అన్న సుబ్రహ్మణ్యంగారి కుమార్తె (కులాంతర) వివాహ సందర్భంలో ఏర్పాటైన యిష్టాగోష్టి సందర్భంలో మాట్లాడుతూ సంగీతం వింటూ కూర్చోవడం అంటే నాకు చెడ్డ చిరాకు అన్నారు అన్నగారు. సంగీతం ద్వారా పొందే అనుభూతి (భక్తి మైమరపు) వల్ల మానవుని ఆలోచనలు ఆగిపోయినవని వారి ఉద్దేశం. (మా వదినగారు రేడియో ఆన్‌చేస్తే అన్నగారు ఆపుచేయమనేవారు). ఆ అవకాశాన్ని పురస్కరించుకుని చర్చకు కవ్విస్తూ వినడానికి అలవాటు చేసుకోవచ్చుగదా అన్నాను నేను. (ఇతరులు చెప్పడానికి అవకాశం ఇవ్వాలనేదే నా ఉద్దేశం ) ఇతరులు చెప్పింది వింటే (సంగీతం అని వారి ఉద్దేశం ) బ్రహ్మర్షి కావాలనుకున్న విశ్వామిత్రునికి పట్టిన గతే మనకు పడుతుందని వారన్నారు. మీరు ఇతరులకు చెప్పి వినిపించేది (ఆధ్యాత్మిక వాదం) కూడ ఆగతి (విన్నవారికి) పట్టించడానికేనా? అని నేనన్నాను. దానితో కోపోద్రిక్తులైనారు అన్నగారు. చర్చ తీవ్ర స్థాయికి చేరింది.

ఆ స్థాయికి తగ్గకుండా నేనూ మాట్లాడ వలసి వచ్చింది. అక్కడ వారు పెద్దవారని తగ్గితే నేను (తాత్వికంగా) చిన్నవాడిని కానా? అందుచేత నా పెద్దరికాన్ని నేను నిలుపుకోవడం కోసం నా తాత్విక స్థాయిలో

నేనూ మాట్లాడవలసి వచ్చింది. అందుచేత చర్చ తారాస్థాయికి చేరింది. ఆ గోల నలుదెశలా ప్రతిధ్వనించింది. అక్కడి వారంతా ఆశ్చర్యంగా వింటూ చూస్తూవున్నారు. అది మా యిద్దరిమధ్య పోట్లాట (వ్యావహారికం)గా భావించి వుండవచ్చు. కాని, అది తాత్విక కుమ్ములాట అని మాకు మాత్రమే తెలుసు. తాత్విక కుమ్ములాట ఒక విధంగా మనసుకి తృప్తి నిస్తుంది. ఒక స్థాయిలో అది జరిగినపుడు, ఎదటి వ్యక్తిలో ఆ స్థాయి వున్నపుడు మాత్రమే అది జరుగుతుంది.

## అనుభూతులు - ఆలోచనలు

ఎంతో సాత్వికంగా మాట్లాడుతూవున్న మనిషి చిన్న విషయం దగ్గర హఠాత్తుగా కోపోద్రిక్తులై పోయేవారు అన్నగారు. వ్యావహారిక విషయాలు నాకు అంతగా తెలియవురా అనేవారు, మరుక్షణమే తాత్విక విషయం మీకు తెలియదంటే వూరుకునేవారు కాదు. భాషలో యెక్కడైనా తప్పులు వచ్చినప్పుడు చెబితే నవ్వుకునేవారు, వెంటనే సర్దుకునేవారు. పొరపాటుని పొరపాటని తెలుసుకుని ఆ పొరపాటుని మళ్లీ చేయకుండా వుండటం మానవునికి వుండవలసిన మంచి లక్షణంగదా! ఆ మంచి లక్షణం అన్నగారిలో కనిపించేది. ఏ అనుభూతులకు మనం పరిమితం కాకూడదని, అందుచేత అనుభూతే మనిషికి ముఖ్యంకాదని, ఆలోచనకు మనిషి ప్రాముఖ్యం ఇవ్వాలని అంటూవుండేవారు.

కున్నక్కుడి వైద్యనాథన్ వయొలిన్ సంగీతం అంటే నాకు ఇష్టంగా వినాలని పిస్తుంది. అలాగే బాలమురళీకృష్ణ గాత్ర సంగీతమన్నా రవిశంకర్ సితార్ వాద్య సంగీతమన్నా కూడా వింటూ పరవశం చెందుతాం. అంటే మన మనసు పరాధీనం చెందుతుందన్నమాట. తన మనసు (పర అధీనము) పరాధీనం అవడమంటే తాను తన మనసుతో ఆలోచించే లక్షణాన్ని కోల్పోయాడన్నమాట.

కొంత మంది యెప్పుడూ అనుభూతిలోనే మునిగివుంటారు భక్తి పారవశ్యంలో, కొంతమంది యెప్పుడూ ఆలోచిస్తూనే వుంటారు విజ్ఞాన సముపార్జనలో. అటువంటి వారిలో ఉదాహరణకు ఐన్‌స్టీన్, సి. వి. రామన్

గార్లను చెప్పుకోవచ్చు. వారు తమ ఆలోచనలను అపుజేసి విశ్రాంతి తీసుకోవడం కోసం సంగీతం వింటూ వుండేవారు. (స్వయంగా వయొలిన్ వాయించుకుంటూ ఆ సంగీతనాదంతో మెదడుకి విశ్రాంతి కలిగించేవారు). అనుభూతిలో వున్న మెదడు ఆలోచించదు. మెదడు యొక్క కార్యరూపమైన మనసు ఆలోచన, అనుభూతి రెండూ ఒకేసారి చేయదు, చేయలేదు. సామాన్య వ్యక్తులు మరి సంగీతం వినడం ద్వారా, తమ మనసులను అనుభూతి దశలో పరవశం చెందించితే, ఇక తానుగా ఆలోచించే వ్యక్తిగా మిగలడు. ఆలోచన, అనుభూతి కలదే మనసని తెలుసుకున్న మనం అనుభూతిని యెంతగా తగ్గించుకుంటామో అంతగా ఆలోచించ గలుగుతాము. అనుభూతిలో వున్నప్పుడు ఆలోచించలేము, ఆలోచనలో వున్నప్పుడు అనుభూతి పొందలేము అనేది సిద్ధాంతపరంగా గుర్తించితే అనుభూతికి ఇవ్వవలసిన ప్రాముఖ్యత, ఆలోచనకు ఇవ్వవలసిన ప్రాధాన్యత దేనికెంత అనేది మనం నిర్ణయించుకోవచ్చు.

## భక్తిపారవశ్యదశ

భక్తిలో పారవశ్యదశకు చెందిన భక్తునికి వాస్తవ జగత్తు తెలియదు. ఆ దశలో తాను వ్యక్తంలో వుండడు. అదొక అవ్యక్తాను దశ ఆ దశకు చేరిన తరువాత తాను ఊహాజగత్తులో ఊహించే భావన రూపకల్పన (దృశ్యరూపం) పొంది అదే కన్పిస్తూ వుంటుంది. (భక్తునికి దేవుడు కన్పించడం ఆ దశలోనే జరుగుతుంది). ఇక దయ్యాల సంగతి చెప్పనక్కరలేదు. మతం కల్పించిన భయమే మనసులో మెదిలి దయ్యం రూపం దాల్చుతుంది. భక్తి స్వస్వరూప సాక్షాత్కార జ్ఞానాన్నివ్వకపోగా, భక్తిపారవశ్యంలోని వ్యక్తి పరాధీనుడైన కారణంగా తన సంగతి తాను మరచి (తన స్వరూపాన్ని తాను మరచి) మిథ్యాభావం పొందుతున్నాడు.

మతంలోని భక్తులకు దైవం కన్పిస్తుంది. (భయస్థులకు దయ్యం కనిపించినట్లు). భక్తుడు భక్తి అనే సాధనం ద్వారా తన మనసుని పరవశం (దైవవశం) చేయడం ద్వారా తాను పరాధీనుడవుతాడు. భక్తిపారవశ్యం అంటే అదే. ఆ దశలో తాను తన వ్యక్తిత్వాన్ని కోల్పోయి అవ్యక్తంలో

వుంటాడు. అదొక విధమైన (మత పరమైన) హిప్నాటిజం. అవ్యక్తామ దశలో దైవ సాక్షాత్కారం జరుగుతుందని మతస్థుల నమ్మకం.

## సంగీతం - సాహిత్యం

భక్తికి సాధనం సంగీతం. ఆ సాధనం ద్వారా అవ్యక్తామ దశను త్వరగా పొందవచ్చును. అటువంటి అవ్యక్తామ దశ (అనుభూతి) లో దైవ సాక్షాత్కారం జరుగుతుంది. హేతుబద్ధమైన ఆలోచనలు చేసే భౌతిక వాది వ్యక్తంలో వుంటాడు. ఆ కారణంగా దైవం కనిపించదు, దయ్యం భయపెట్టదు.

సంగీతం వింటున్నప్పుడు సాహిత్యం కనపడదు, వినబడదు, అర్థం కాదు. భావాన్ని వ్యక్తపరచడంకోసం భాషను యెలా అభివృద్ధి చేసుకున్నామో, అలాగే భాషలో పెట్టిన భావాన్ని (గీతాన్ని) సులభంగా వ్యక్తీకరించడంకోసం సంగీతాన్ని (శ్రుతిలయ బద్ధంగా) ఉపయోగించుకోవచ్చునేగాని, భావాన్ని చెడగొట్టి, విడగొట్టి, వినిపించే సంగీతంవల్ల సాధించేదేమీ వుండదు. విని ఆనందించడంకోసం అంటే అభ్యంతరంవుండక పోయినా, అది వింటున్నంత సేపు ఆలోచనఉండవనేది మాత్రం గ్రహించాలి. (మనసు అనుభూతి దశలో వున్నప్పుడు ఆలోచన చేయలేదు అని తెలుసుకున్న మనం ఆలోచనలు చంపుకుని, అనుభూతిలోనే వుండలేం ఆలోచించే మనిషే మనిషికి నిర్వచనం గనుక).

## బ్రహ్మర్షి విశ్వామిత్రుడు

భక్తి భావంవున్న వ్యక్తులు అదేభావంతో గంటల తరబడి సంగీతం వింటూ కూర్చోగలరు. అదే భక్తి తన్మయత్వంలో పాడేవారుకూడా అలాగే కాలాన్ని మరచి (వృధాపరచి) పాడుతూ వుండవచ్చు. చెప్పదలచిన విషయాన్ని వినసొంపుగా చెప్పే పద్ధతికే సంగీతం అని అర్థం. చెప్పదలచిన విషయం అర్థంకాని పద్ధతిలో చెబితే వినేవారికి, దానిని వినిపించే వారికి కూడా ప్రయోజనం శూన్యమే కాగలదు.

ఈ విషయం చర్చకు వచ్చినప్పుడు, విశ్వామిత్రుని కథ ఉదాహరించేవారు అన్నగారు. అస్ఖలిత బ్రహ్మచర్యం (తన స్థానం నుండి తాను దిగజారడమే "పతనం" లేక 'స్ఖలనం') పాటించ దలచిన విశ్వామిత్రుడు శబ్ద విషయమైన సంగీతానికి, దృశ్య విషయమైన నృత్యానికి లోబడిన కారణం చేతనే తాను పతనం (స్ఖలనం) చెందాడు. నేను 'బ్రహ్మము' ను అనే తాత్విక బుద్ధినుండి దిగజారిన కారణంగానే వ్యావహారిక (విషయ) చపల మనస్కుడై తన స్థితిని తాను మరచి పతనం చెందాడు. ఏ వ్యక్తి అయినా తన స్థితిని తాను మరచి వ్యవహరిస్తున్నాడు అంటే పతనం చెందడమే కాగలదు.

శబ్దతన్మాత్రల (శబ్ద - స్పర్శ - రూప - రస - గంధముల) వ్యామోహంలో బడి పతనమైనవారి కథలు చెబుతూ వుండేవారు. ఏ యింద్రియ సుఖానికీ బానిస కారాదని అంటూ వుండేవారు. (జిహ్వా, గుహ్య వ్యామోహంలో పతనమైనవారి కథలు మనకు తెలిసినవే) అందుచేత తన తాత్వికాంశం నుండి దిగజారక, వ్యావహారిక (లౌకిక) జీవితం సాగించ గలిగినవాడే జ్ఞాని, అతడే ప్రజ్ఞాని అంటూ వుండేవారు అన్న గారు.

## వేయి పడగల విశ్వనాధవారు

నేను, అన్నగారు గుడివాడ వెళ్ల వలెనని బెజవాడ (ఈనాటి విజయవాడకు ఆనాటి పేరది) లో రైలెక్కాం. మేము యెక్కిన రైలు పెట్టిలోనే విశ్వనాధ సత్యనారాయణగారు (కవి సామ్రాట్) కూర్చుని వున్నారు. మేము కూడా వారి ప్రక్కనే కూర్చున్నాం. వారిని నాకు పరిచయం చేశారు అన్నగారు. (అప్పటికివారు నాకు తెలియదు) వెంటనే వారిని చర్చకు కవ్విస్తూ, యేమండి విశ్వనాధగారూ! శ్రీనాథుని "శృంగారనైషధం" మీ వంటికి బాగపట్టినట్లున్నదే! దేవేంద్రుని శరీరం లాగానే స్త్రీ శరీరంపై వేయి (పడగలు) కన్నులు కన్పిస్తున్నాయి అన్నారు అన్న గారు.

త్రివిష్టపం (స్వర్గం) చేరిన త్రిపురనేనికి దేవేంద్రుని చూడగానే ఇలా అనిపించిందట "వేయికన్నులు నాకు గన్పించలేదు, బొడలు మాత్రము గన్పించె నొడలు నిండ" అని. అందులోని వ్యంగ్యార్థాన్ని అర్థం చేసుకున్న విశ్వనాథవారు కూడా యేదో చలోక్తిగా అన్నారుగాని అది అంతగా అనుకూలించలేదు, రాణించనూలేదు.

దున్నేపోతు (దున్నపోతు) పోతన్నలాగా మడి దున్నుకు బ్రతికే వాళ్లం కాదు కదా? అన్నారు. మడిదున్నకనే బ్రతక నేర్చిన(సోమరులు) శ్రీనాధులు గదా మీరు అన్నారు వ్యంగ్యంగా అన్నగారు. అలా అన్నం దుకు ముఖం చిట్లించుకున్నారు. కాని తామేదో తప్పు చేశామన్న మనో భావం ముఖం మీద నర్తించింది. పశ్చాత్తాపమో! లేక ద్వేషానికి మరో ప్రారంభమో!! ఫలితంగా తలవంచుకున్నారు.

కొంత నిశ్శబ్దానంతరం "ఖూనీ" నాటకం (త్రిపురనేని రచన) చది వారా? అని అడిగి, వారినుండి సమాధానం రాకముందే "ఖూనీ" నాటకం వ్రాయడంతో మీరు (వేనరాజు రచన) "ఖూనీ" అయ్యారని అన్నారు. దానితో ఖంగారుతిన్న ముఖభావాన్ని వ్యక్తపరుస్తూ తలపైకెత్తి నాస్తికులు (నాస్తికత్వమో జ్ఞాపకం లేదు) పెరిగిపోయిన కారణంగా ఈ దేశం సర్వ నాశనమై పోయింది అన్నారు వారు. వెంటనే దేశంకాదు మీ (హిందూ) మతం, మత సిద్ధాంతాలు నాశనమై పోయాయి అన్నారు అన్నగారు. కోపోద్రిక్త వాతావరణంలో కొంతసేపు సంభాషణ ఆగిపోయింది. ఆ తరు వాత శ్రీనాధుడు, పోతన (శృంగార, భక్తి) కవిత్వాలపై కొంత చర్చ జరిగింది. మళ్లీ తాత్విక చర్చలోకి సాగలాగి కారసారమైన పదజాలంతో తీవ్రమైన చర్చలు సాగించారు. అప్పుడు నేను చిన్నవాడిని (తాత్వికంగా) కావడంచేత ఇరువురి వాదాలు విన్నానే గాని నేను యే వాదము చేయ లేదు.

ఆ రోజుల్లో త్రిపురనేని సంస్కృతం చదివినవాడు కావడం చేత పౌరాణిక గ్రంథాలపై తీవ్రమైన సాహిత్య, సిద్ధాంత దాడి చేశారు. సూత పురాణం అని వ్రాసి ఇది బూతు పురాణం కాదని చెప్పుకున్నారు. (మిగిలిన

వన్ని బూతుపురాణాలని వేరే చెప్పాలా?) ఆలోచన రేకెత్తించే సాహిత్యం సృష్టించి పురాణ సంస్కృతిని ప్రశ్నించే చొరవను మనకు కలిగించారు త్రిపురనేని.

ఆ రోజుల్లో ఆ సాహిత్యం ఎంతో సంచలనం కలిగించింది. 'ధూర్త మానవా' అనే రచన నుంచి పద్యాలు చదివి వినిపిస్తూ అర్థాలు చెబుతూ వుండేవారు. 'మల మల మాడు పొట్ట తెగ మాసిన బట్ట కలంత వెట్టగా విల విల యేడ్చుచున్న నిరుపేదకు జాలిని జూపకుండ ...' అనే పద్యం నేను మూడవ తరగతి చదివే రోజుల్లో వినిపించారు అన్నగారు. అది నా మదిని కలవర పెట్టిన మొదటి సంఘటన. అది వినడంతో నా మనసు ఆలోచనకు ఆరంభం చేసింది. మరి ఆరంభమైన ఆలోచన ఆగదు గదా?

మా వూరి పరిసరాలు మానవ జీవితానికి యెంతో అనుకూలంగా వుండేవి. పంటకాలువలు, మెట్ట, మాగాణీ పొలాలు చూస్తూవుంటే యిదంతా మానవుల సుఖం కోసం దేవుడు సృష్టించాడు అనుకునే వాడిని ఆ చిన్నతనంలో, విజయవాడ దగ్గర కృష్ణానదికి ఆనకట్ట కట్టి ఆ నీటిని మనకు పంట పొలాలకు పంపింది విజ్ఞానమే కాని దేవుడు కాదని నాకు చాల కాలానికిగాని తెలియలేదు. కాని, ఈనాటికి ఆ విషయాన్ని ఆ విధంగా తెలుసుకున్న వారెందరు అనేది నా ఆవేదనతో కూడిన ప్రశ్న.

## బాలకృష్ణుడు - పోలియో వ్యాధి

భక్తి దశను ప్రాపంచిక కష్ట సుఖాలకు కారణంగా ప్రచారం చేస్తూ తమ పొట్ట గడుపుకోవడం పండితులకు వృత్తిగా మారింది. ఆ ప్రవృత్తి వారిలో మారాలి. 'వ్యత్యస్తా పాదారావిందా' అని పాడుతూ భజన (భక్తి) చేసుకునే భక్తులు వున్న సమాజం ఇది. అందుచేత ఈ సమాజంలోని వ్యక్తుల తాత్విక స్థాయి మనకు అర్థంకావడంలేదా? భక్తికి చరమ స్థాయి ఆలోచనారహిత స్థితి, జ్ఞానానికి ప్రథమ స్థితి ఆలోచన.

తప్పటడుగులు వేస్తూవున్న కృష్ణుడు అంటే బాలకృష్ణుడు అనేగదా? అర్థం. ఆ తప్పటడుగుల్లోని ఆంతర్యం యేమిటని అడిగాను అన్నగారిని.

అది ఏంలేదురా, పాపం, కృష్ణుడికి చిన్నతనంతో పోలియోవ్యాధి వచ్చి వుంటుంది, ఆ కాలంలో వైద్య సౌకర్యంలేదు ఆ కాలు అలాగే అలసిపోయి బలహీనపడి వుంటుంది. అందుచేత ఆ నడక ఎగుడు, దిగుడుగా సాగుతూ వుండివుంటుంది. అది చూచిన మనకవులు అదికూడా ఒక విశేషమేనమకుని అలా వర్ణించారు. 'వ్యత్యస్తా పాదారావింద' అంటే అదే అర్ధం అంతకంటే యేమీలేదు అన్నారు.

## సాహిత్యంలో తాత్విక చింతన

తాత్విక చింతనాసక్తి సన్నగిలిన మన సాహిత్యపరిస్థితిని చూస్తే మానవునికి జ్ఞానం కలిగించడ మనేది ప్రథమకర్తవ్య మని మన సాహిత్యకారులు మరచిపోయారనిపిస్తుంది. ఆ మధ్య కాలంలో కొంత మార్పు కనిపించినా మళ్లీ పరిస్థితులు మారిపోయినై. పానుగంటివారి "సాక్షి" త్రిపురనేనివారి "సూతపురాణం"వగైరాగ్రంథాల్లో కాశీపట్నంకొండయ్యగారి ఖగోళ విజ్ఞాన వ్యాసపరంపరలో, గురజాడ, కందుకూరిలాంటి వారిరచనల్లో కొంత తాత్విక సమన్వయంతో కూడిన సంఘ దృష్టి వుండేది. అడవి బాపిరాజు, "నారాయణరావు" నవల మంచి ఆలోచన కలిగించేదిగా ఆ రోజుల్లో మంచిపేరు సంపాదించుకున్నది. అలాగే ఉన్నవవారి "మాలపల్లి" ఎంతో కొంత తాత్విక తపనతో వ్రాయబడినదే.

చలం, గోపీచంద్, తాపి ధర్మరావుగార్ల రచనలు సాంఘిక దురాచారాలను, మూఢ నమ్మకాలను ఖండించేవిగావుండి మానవున్ని ఆలోచింపజేసేవిగా వుండేవి. ఆనాటి ఆ సాహిత్యం చదువరులలో మంచి సంచలనం కలిగించింది. మానవుడికి ఎంతోకొంత సహకరించింది.

## క్షుద్ర మంత్రి సాహిత్యం

భౌతిక తత్వశాస్త్రం ఎంతో అభివృద్ధిచెంది జగద్రహస్యాలను తెలుపుతూ వున్నది. కాని ఆ సత్యాలను కాదని అసత్య విషయాలను మనం యింకా నమ్ముతూ, ప్రజలనునమ్మిస్తూ వున్నాము. అంటే అందుకు కారణం

మన సాహిత్యమే. నవలా (కల్పనా)సాహిత్యం పెరిగినంతగా వాస్తవమైన విషయ పరిజ్ఞానం కలిగించే సాహిత్యం పెరగలేదు. తత్వశాస్త్రభాగం మన పాఠ్య గ్రంథాలలో తగిన స్థానం సంపాదించలేదు.

చచ్చు పుచ్చు కథలు, అశాస్త్రీయ కల్పిత (జానపద) కథలే మనం శాస్త్ర ప్రమాణ కథలుగా (గ్రంథాలుగా) చెప్పుకుంటున్నాం, అసత్య (స్థాయి) బాబాల కథలు సత్య కథలుగా చెప్పుకుంటూ అవే మన భావి పౌరులు (బాల, బాలికలు) చదువుకునే స్థితిని కల్పిస్తున్నాం. అటువంటి చచ్చు పుచ్చు (బాబాల) కథలు కాదు మనకు కావలసింది. విశ్వవిద్యాలయాల్లో వైజ్ఞానిక విషయాలకు బదులు అశాస్త్రీయమైన జ్యోతిష విద్యల లాంటివి ప్రవేశపెట్టాలని చూస్తూవున్న మన పాలకుల మనస్థితి యేమిట నేది ఆలోచించినపుడు మన ఆలోచనలు మనలను యే స్థాయికి దిగజార్చిన వనేది తెలుస్తుంది.

క్షుద్ర మంత్రశక్తులు, మహిమలు మన నిత్య జీవితంలో చోటు చేసుకుని మనలను అధోగతిలో వుంచుతూవున్నై. దైవ మంత్ర శక్తుల స్థాయి నుండి క్షుద్ర మంత్రశక్తుల స్థాయికి దిగజారింది మన మానసిక వ్యవస్థ. ఆ స్థితిని కనిపెట్టిన మన రచయితలు దానినే విరివిగా సృష్టించి, ప్రజలకు పంచి వారిని వంచించి ధనం సంపాదించుకుంటున్నారు. మనిషి యెంత సంపాదించినా ఈ వ్యవస్థలో దొరుకునా నిజమైన సంతృప్తి? అటు వంటి సాహిత్యం వ్రాయడంవల్ల చదవడంవల్ల యేపాటి జ్ఞానం సంపాదించగలం? అటువంటి కల్పనా సాహిత్యం చదవడంవల్ల వాస్తవ (సత్య) విషయం అర్థం చేసుకునే అవకాశంలేదు. తద్వారా మానవ చైతన్యం (అభివృద్ధి) దెబ్బతినే అవకాశం వున్నది.

ఈ విషయం అన్నగారిని అడిగాము వారి అభిప్రాయం తెలుసుకోవాలని. మనకు భారత, భాగవతాది పౌరాణిక సాహిత్యమే మన సమాజానికి తీరని అపకారం చేసింది అనుకుంటావుంటే (అదే ఒక విధంగా క్షుద్ర సాహిత్యం) ఇప్పుడు క్రొత్తగా వచ్చే ఆధునిక (క్షుద్ర) సాహిత్యం మరీ అధ్వాన్నంగా వున్నదన్నారు అన్నగారు.

# దైవ మంత్రశక్తులు - క్షుద్ర మంత్రశక్తులు

దైవ మంత్ర శక్తులు పూజారివర్గం (బ్రాహ్మణుల) వశంలో వున్నవి. క్షుద్ర మంత్ర శక్తులు శూద్రుల (బ్రాహ్మణేతరుల) చేతుల్లో వున్నవి. దేవతలకు దైవ మంత్రాలకు శక్తులు ఆపాదించి పురోహితవర్గం భుక్తి గడుపుకుంటూ వున్నది. క్షుద్ర దేవతలకు, క్షుద్రమంత్రాలకు శక్తులు మహిమలు కల్పించి కొంత మంది (బ్రాహ్మణేతరులు) వృత్తి చేసుకుని భుక్తికి కావలసిన ధనార్జన చేస్తూవున్నారు. ఆ కారణంగా దైవ మంత్ర శక్తులకు, క్షుద్ర మంత్ర శక్తులకు పోటా పోటీ యేర్పడింది. అవి వారి వారి భుక్తికోసం ఏర్పాటు చేసుకున్నవి కావడం చేత వాటిని రక్షించు కోవడంకోసం తాపత్రయం ఇరుపక్షాలలోను పెరిగింది. ఈ దశలో తాత్విక అవగాహన లోపించింది. ఈనాటి రచయితల్లోను, చదువరుల్లోను ఈ విధ మైన తాత్విక చింతనా రాహిత్యం వల్ల సమాజం నైతిక విలువలు కోల్పో వడం ప్రత్యక్షంగా చూస్తూవున్నాం.

ఒక ప్రక్కన విజ్ఞానం పెరుగుతూ వున్నది. మరొకప్రక్కన విజ్ఞాన రహితమైన (అశాస్త్రీయమైన) రచనా విధానం పెరుగుతూ వున్నది. ఈ తాత్విక వైరుధ్యాలకు కారణం సమన్వయంతేని ఆలోచనా పరులు సాహిత్య రంగంలో ప్రవేశించడమే. అటువంటి వారిని చదువరులే తరిమి కొట్టాలి.

# గోపీచంద్‌గారు

గోపీచంద్‌గారితోను, వారి తండ్రిగారైన రామస్వామి (కవిరాజు) గారితోను కూడ మా అన్నగారికి బాగా పరిచయం వుండేది. గోపీచంద్ గారు భౌతికవాది, రాడికల్ హ్యూమనిస్టు. ఆవుల గోపాలకృష్ణమూర్తిగారు, బ్రహ్మానందగిరిస్వామీజీ, మా అన్నగారు కలిసి అనేక సభలలో (సాంఘిక సంస్కరణలు, మూఢనమ్మకాలపై) ప్రసంగాలు చేస్తూ వుండేవారు ఆ రోజులో.

మన ఉపన్యాసాలు (సారాంశం) కరపత్రాల రూపంలో అచ్చువేసి పంచుదాం, బాగా ప్రచారమవుతుంది అన్నారట అన్నగారు. అందుకు గోపీచంద్ అంగీకరించలేదట. పైగా నేను రచయితను, రచనలు చేసి బ్రతక వలసిన వాడిని, నా రచనలు ఉచితంగా పంచితే నా వృత్తి దెబ్బ తినదా? అన్నారటవారు.

రాడికల్ హ్యూమనిష్టులనబడే వారిలో (కొందరిలో) వుండే స్వార్థ బుద్ధిని ఏవగించుకునేవారు అన్నగారు. ఆశయాలు ఎంత మంచివైనా అవి ఆచరణకు రానపుడు ఉపయోగించనపుడు రాణించవు. ఆశయాలు ఆచరణతో కూడినపుడే అవి ఉన్నతాశయాలుగా నిలబడగలవు. హ్యూమనిజం (మానవవాదం) మంచిదేకాని హ్యూమనిష్టుల్లో హ్యూమన్‌తత్వం (మానవత్వం) లోపించింది అనేవారు అన్నగారు. ఆశయాలు (ఆలోచనలు) భావాలు, ఆచరణ సాపేక్షంగా వుండాలనేవారు.

ఆలోచనలుగాని, ఆశయాలుగాని, భావాలుగాని ఆచరణతో సంబంధం లేకుండా పోయినపుడు అవి నిరర్థకమైన ఆశయాలుగానే మిగిలి పోతూవుంటై. తత్వవేత్తలు ఆ లోపాన్ని గుర్తించక పోవడంతోనే వారి తాత్వికాంశాలు ఎంత గొప్పవైనా వ్యావహారిక విషయం దగ్గర కొచ్చేటప్పటికి సమన్వయం కుదరక వారు (శంకరునితో సహా) తికమకపడిపోయిన సందర్భాలు లేకపోలేదు.

మేము మద్రాసు వచ్చిన తరువాత ఒకసారి నేను అన్నగారు కలిసి గోపీచంద్‌గారింటికి వెళ్లాము. అపుడు వారు సినీ డైరెక్టరుగా పని చేస్తూవున్న రోజులు. నాటక, సినీ రంగాలపైన, రాజకీయ, సాంఘిక రంగాలపైన సుదీర్ఘమైన చర్చలు సరదాగాను, సంతోషంగాను కోపతాపాలతోను చాలసేపు జరిగినై. నేను కల్పించుకోలేదు వారి చర్చల సారాంశాన్ని వింటూ, నెమరువేసుకుంటూ కూర్చున్నాను. గోపీచంద్ అల్ప సంతోషి. ప్రతిచిన్న విషయంచెప్పి పెద్దగా నవ్వుతూ వుండేవారు.

చివరగా చర్చ తాత్వికాంశంపైకి మళ్లింది. గోపీచంద్ మంచి తాత్వికాభిలాషగల వ్యక్తి (తత్వవేత్తలు అనే పుస్తకం వ్రాశారు).

మా అన్నగారు సరే, అదే (తాత్వికం) ప్రధాన పాఠంగా తీసుకున్న వ్యక్తి గావడంచేత ఆ విషయాలు చర్చకు వచ్చినపుడు వాటిని కూలంకషంగా చర్చించి, వివరించిగాని వదిలి పెట్టేవారుకాదు. అరవింద యోగి గొప్పతత్వవేత్త అని, ఆయన శంకరుడు చెప్పని గొప్ప విషయాలు చెప్పాడని అన్నారు గోపీచంద్‌గారు. దాంతో మా అన్నగారు ఏకీభవించలేదు ఆ కారణంగా చర్చ మంచి స్థాయిని అందుకున్నది.

శంకరుడు చెప్పిన దానికంటె పైన చెప్పవలసిందేమిలేదు. ఎవరు చెప్పినా ఆయన చెప్పిన దానిలోనుండి కొన్ని విషయాలు విడదీసి, వివరించడంతప్ప వీరు కొత్తగా చెప్పిందేమిలేదని అన్నారు అన్నగారు. గోపీచంద్ చెప్పడం మాని వినడంప్రారంభించారు (అది వారిలో ఒక విశేషం· తనకు సందేహంగావున్న విషయం చర్చకు వచ్చినవుడు ఎదటి వ్యక్తిచేత ఎక్కువ మాట్లాడించి, తాను తక్కువ మాట్లాడుతూ వుండేవారు). శంకరుడు ఏకాత్మవాది. వున్నది ఒక్కటి, అదే జీవుడు లేక బ్రహ్మము (జీవుడన్నా బ్రహ్మము అన్నా ఒకటే. తాత్వికంగా చెప్పినపుడు బ్రహ్మమని, వ్యావహారికంగా చెప్పినవుడు జీవుడని చెబుతూ వుంటాము. వ్యావహారిక విషయాన్ని విడిచి తాత్వికంగాని తాత్వికాన్ని విడిచి వ్యావహారికం గాని వుండదు. అందుచేత అవి రెండు కాదు).

అలా అవి రెండు అనుకున్న కారణంగానే ద్వైతం పుట్టింది. అజ్ఞాన కారణంగా వున్నది ఒక్కటి అన్న విషయం అర్థంకాని తత్వవేత్తల బుర్రల్లో (మెదడుల్లో) పుట్టిన తత్వం నిజ తత్వంకాదు, కాలేదు. వున్నది ఒక్కటి, అదే జీవుడు. ఆ ఒక్కటి (జీవుడు) లేదని చెప్పాడా లేక వున్నది రెండు (దేవుడు జీవుడు) అని చెప్పాడా అరవిందః అని అడిగారు. లేక భౌతికవాదంచెప్పాడా? అలా చెప్పడానికి ఆయన పూర్తిగా ఆధ్యాత్మికవాది కదా: అని కూడా అడిగారు అన్నగారు. సమాధానంకోసం తంటాలుపడ్డారు కాని సమాధానం రాలేదు గోపీచంద్‌గారి నుండి.

వీటికి సమాధానంగానే అన్నగారిలా చెప్పడం ప్రారంభించారు. రెండు వున్నవంటే ద్వైతవాదం అవుతుంది. ఒక్కటీ లేదంటే శూన్యవాదమవుతుంది, వున్నది ఒక్కటే నంటే అద్వైతమవుతుంది. మరి శంకరుని

కంటే అధిగమించి (మంచిది) అరవింద చెప్పిందేమున్నది అన్నారు. ఇంకా ఈ విధంగా వివరించారు. శంకరుడు చెప్పిన దాని కంటే పైన (అభివృద్ధిగా) చెప్పవలసిందేమిలేదు. అంతా శంకరుడే చెప్పాడు. అది అర్థం చేసుకోవడంలోనే మనతాహతు అర్థమవుతుంది. తద్వారా ( అర్థం చేసుకోవడం ద్వారా) మన తాహతు (తాత్వికంగా) పెరుగుతుంది.

శంకరుడు చెప్పిన తాత్వికాంశం (అద్వైతం) అర్థం కావడానికి చేయవలసింది ఒక్క ఆలోచన మాత్రమే గాని అన్యథా చేయవలసిందేమి లేదు. తద్ భిన్నమైన ఏ సాధన అవసరంలేదు. చిల్లర సాధనలవల్ల సాధించదగినది (జ్ఞానం) సాధించలేము అన్నారు అన్నగారు. ఆనాటి చర్చ అలా సంతృప్తికరంగా ముగిసింది (ఆ తరువాత గోపీచంద్ మాట్లాడలేదు) ఎంతో కొంత సంతృప్తి చెందినట్లు కనిపించారు.

ఏ విషయమైనా చర్చ జరుగుతూ వున్నప్పుడు, తనకు తెలియని విషయం వచ్చినపుడు తాను చెప్పడంమాని వినడం అనేది మంచి లక్షణం. ఆ లక్షణం గోపీచంద్‌గారిలో వున్నది. అది నాకు నచ్చిన లక్షణం. అందుచేత ఆ లక్షణాన్ని నేను అలవాటు చేసుకున్నాను అలా అలవాటు చేసుకున్న ఆ లక్షణం నాకు జీవితంలో చాలా ఉపయోగపడింది. నేను యేదైనా జ్ఞానం సంపాదించాను అంటే ఆ లక్షణం అలవాటు చేసుకున్న కారణంగానే. ఈనాడు ఈ విషయం ఇంతగా వ్రాయగలిగాను అంటే అదిగో ఆ పైన చెప్పిన ఆ మంచి లక్షణం యొక్క ఫలితమే.

మనలోని చాలామందికి ఆ లక్షణంలోని మంచితనంగాని, దాని అవసరంగాని తెలియదు. ముఖ్యంగా ఈనాటి యువతరంలో అది బాగా లోపించింది. చెప్పేది వినే సహనంగాని, విని అర్థం చేసుకునే స్థిమితమైన మనస్తత్వంగాని లేదు. అందుచేత తెలియవలసిన విషయం తెలుసుకునే అవకాశం లేకుండా పోతూవున్నది. అది అంత మంచి పద్ధతికాదు. కాని మంచి పద్ధతికాని ఆ పద్ధతినే అనుసరిస్తూ వున్నారు.

ఒక మంచి విషయం చర్చ జరుగుతూ వున్నపుడు తనకు తెలియని విషయంకూడా తనకు తెలిసినట్లుగా మాట్లాడటం చేస్తూవుంటారు చాలమంది

అందువల్ల చర్చించే విషయం బలహీనపడి, చర్చదారితప్పిపోతూవుండటం కూడా జరుగుతూ వుంటుంది. అందువల్ల చర్చల సమయంలో కాలయాపన జరగడమే గాక తెలియవలసింది తెలియవలసినంతగా తెలియకుండా పోతుంది. అందువల్ల గోపీచంద్‌గారిలోవున్న ఆ మంచిలక్షణం అలవాటు చేసుకోవడంద్వారా ప్రతివ్యక్తి విషయసేకరణ ద్వారా జ్ఞానార్జన చేయగలడనేది నా అనుభవంమండి నేను చెప్పగలుగుతున్నాను.

## ధర్మ సంతానం

ఆద్వైతంపై వచ్చే విమర్శను సహించేవారుకాదు అన్నగారు. ఒక సభలో ప్రసంగిస్తూ "అహం బ్రహ్మాస్మి" అని అంటూ అందరిచేత అలా అనిపించారు. సభలోని వారొకరులేచి మీరు వ్యాసులవారా లేక శంకరులవారా అహం బ్రహ్మాస్మి అనడానికి? అని ప్రశ్నించాడు. అవును (నేను) అహంవ్యాసః అహం శంకరః అన్నారు అన్నగారు. అయితే మీరు ధర్మ సంతానం ఇవ్వగలరా? ఇస్తారా? పరకాయ ప్రవేశంకూడా చేస్తారా? అని అడిగాడు ఆ వ్యక్తి ఉద్రేకంగా. ఆ, ఇస్తాను నీకు సంతానం లేదా? (నా) ధర్మ సంతానం నీకు కావాలా?అడుగు, చెప్పు, ఇవ్వడానికి సిద్ధంగావున్నాను. ధర్మ సంతానం అంటే ఏమనుకుంటున్నావు అన్నారు అన్నగారు.

ధర్మ సంతానం అంటే ధర్మంగా పుచ్చుకోవడమే ననుకున్నావా? ధర్మసంతానం ఇచ్చే వాడికి యెంత ధైర్యం వుండాలో అది పుచ్చుకునే వాడికి అంత నిబ్బరం కూడా వుండాలి. అది అడిగినపుడు లేదనే వాడు (ఇవ్వలేనివాడు) మగవాడేకాదు. అడిగినప్పుడు లేదనే అర్జునుడను కాదు నేను అన్నారు అన్నగారు. దాంతో కోపంవచ్చిన ఆ వ్యక్తి కొట్లాటకు సిద్ధపడ్డాడు, నోటికి వచ్చినట్లు తిడుతూ కలబడటానికి సిద్ధపడ్డాడు. ఇది మీ వూరని, నేను మీ వూరు వచ్చానని నన్ను కొడదామనుకున్నావేమో, ఈ వూరు నీదే కాదు నాది కూడా, ఈ వూళ్లో నీకంటే నాకే బలం వున్నది. నేనంటే యేమనుకున్నావ్ అని తొడగొట్టి సవాల్‌చేస్తూ నిలబడ్డారు అన్నగారు. నేనంటే యేమిటోతెలుసుకో, నన్ను నీవు తెలుసుకోకపోతే(తెలియకపోతే) నిన్ను నీ వూళ్లోనే కొట్టి మరీ వెళతాను. నిన్నెరిగిన వారికంటే

వన్నెరిగిన వారే యీ వూరిలో యెక్కువగా వున్నారు. కావాలంటేరా, ఇలా ఇలాలు తేల్చుకుందాం. అని కళ్లెర్రజేసి, కళ్లురుమి చూచారు. అంతటితో (అంతదాకా వచ్చే దాకా చూచి) సభలోనివారు కల్పించుకుని సర్దిచెప్పి ఇరువురికి సమాధానం కుదిర్చారు. అంతటితో సభ సద్దు మణిగింది.

వేసే ప్రశ్నను బట్టి సమాధానం వుంటుంది. అది తెలియని ప్రజల మధ్య తాత్విక సభలు నిర్వహించడం కష్టం అన్నారు అన్నగారు. ప్రశ్నలో వున్న వ్యంగ్యంవల్ల సమాధానంగూడా వ్యంగ్యంగా వుండి అడిగినవారికి కటువుగా తోచి, కష్టం కలిగించి కొట్లాటవరకూ వస్తూవుంటుంది.

అనేక సభలలో ఇటువంటి అనుభవాలు అనేకంగా జరుగుతూ వుండేవి. జరగ వలసినవి తాత్విక సభలు కాగా అప్పుడపుడు అవి పరిక్రల బల ప్రదర్శనలుగా మారిపోతూ వుంటై. జీవితంలో అనేకమైన (ఆసక్తి కరమైన) అనుభవాలు అవి అని నవ్వుతూ చెబుతూ వుండేవారు అన్న గారు.

## ఆచంట లక్ష్మీపతిగారు

ఆచంట లక్ష్మీపతిగారు (ఆయుర్వేదభిషగ్రత్న, ఆరోగ్యాశ్రమ స్థాపకులు) మంచి వ్యక్తిత్వంగల వ్యక్తి "ఆరోగ్యాశ్రమము" అనే పేరుతో "ఆవడి"లో ప్రారంభించి నడుపుతూ వుండేవారు. (ఇపుడు ట్యాంకు ఫ్యాక్టరీ వున్నచోటు) 1947 వ సంవత్సరం మేము ఆంధ్రా నుండి తమిళనాడు వచ్చిన క్రొత్తలో అక్కడవుండి వారి భూములు మక్తాకు తీసుకుని వ్యవసాయంచేస్తూ వుండేవాళ్ళం. ఆరోగ్యాశ్రమానికి జమీందారులు, పెద్ద భూస్వాములు వస్తూవుండేవారు రోగ పరీక్ష కోసం. లక్ష్మీపతిగారు రోగ నిదానంలో మంచి నిపుణులు, రోగనిదానం ప్రధానంగాని, రోగికి వైద్యం చేయడం కష్టం కాదనీ, ఖర్చు కూడా పెద్దగా కాదనీ అనేవారు, తక్కువ ఖర్చుతో వైద్యంచేసేవారు. రోగం నిర్ణయమైతే మందు ఖర్చు అణాకాని సరిపోతుందనేవారు. (అణాలు, కానులు అమలులో వున్న రోజులవి).

మా అన్నగారితో వారికి బాగా పరిచయం వున్నది. మా వదిన (సుందరమ్మ)గారు, లక్ష్మీపతిగారి సతీమణి రుక్మిణీదేవిగారు తిరుచినాపల్లి జైలులో కలిసివుండేవారట. వారి కుమార్తె ఇందిరమ్మ, ఆమె భర్త బి. రామమూర్తి (ప్రముఖ న్యూరో సర్జన్) గారు ప్రతి ఆదివారం అక్కడికి వస్తూవుండేవారు. వారు జనరల్ ఆస్పత్రిలో పనిచేస్తూవున్న రోజుల్లో మా అన్నగారికి చిన్న ఆపరేషన్ చేశారు. అన్నగారంటే మంచి అభిప్రాయం వుండేది వారికి.

లక్ష్మీపతిగారు తాత్వికాభిలాషగల వ్యక్తి కావడంచేత వారు వచ్చినప్పుడల్లా తాత్విక విషయాలు చర్చిస్తూవుండేవారు. వైదిక మత పుట్టుపూర్వోత్తరాలు, ఆ మతం కల్పించిన చాతుర్వర్ణ్య సిద్ధాంతం, అది దేశ దాస్యానికి కారణమైన వివరాలు చర్చకు వస్తూవుండేవి. మతం కల్పించిన మూఢ నమ్మకాలే రోగాలకు వైద్యం చేయకుండా మంత్ర తంత్రాలతో సరిపెట్టుకునే పరిస్థితికి కారణమనీ ఆ పరిస్థితి మారాలనీ అనేవారు.

కొన్ని ఆయుర్వేద గ్రంథాలు ఇచ్చి, వైద్య చిట్కా మందులు కొన్ని చెప్పి వైద్యం చేయమని అన్నగారికి చెప్పారు. ఆ విధంగానే చిన్న చిన్న వ్యాధులకు, ముఖ్యంగా స్త్రీలకు సంబంధించిన వ్యాధులకు మందులిచ్చి గుణపరుస్తూ వుండేవారు. సేవా దృష్టితో మందుఖర్చు మాత్రం తీసుకుని ఉచితంగానే వైద్యం చేస్తూ వుండేవారు అన్నగారు. మందులు బాగా పనిచేస్తూవున్నందువల్ల భక్తులలోను, ఇతరులలోను బాగా ప్రచారమై గౌరవం పెరిగింది. గౌరవంతోపాటు, విశ్వాసం, నమ్మకం కూడా అన్నగారి యెడల కుదిరాయి వారికి.

వేప చెట్టుకి, రావి చెట్టుకు మొక్కితే సంతానం కలుగుతుందనుకునే మూఢ నమ్మకస్తులు వున్న ఈ సమాజంలో మందులపై కంటే మంత్రాలపైననే యెక్కువ విశ్వాసం కలిగి వుంటారు, అటువంటి వ్యక్తులను చూసి అసహ్యించుకునేవారు అన్నగారు. మందులకు, మంత్రాలకు వున్న వ్యత్యాసం అర్థంచేసకోనంత కాలం వైద్యానికి విలువేమున్నది అనేవారు.

## సంతాన మంత్రం

ఒక భక్తుడు సంతానం కోసమని అన్ని రకాల దేవుళ్ళకు, దేవతలకు మొక్కి, తీర్థయాత్రలు చేసి, చూసి ఫలించక చివరకు అన్నగారి దగ్గరకు వచ్చాడు మంత్రంకోసమని. భక్తితో నమస్కరించి, తన కోరికను తెలుపుకున్నాడు సవినయంగా అన్నగారి దగ్గర. తాత్విక సంబంధమైన సందేహమేదైనా కావచ్చునని అనుకున్న అన్నగారికి ఆ కోరిక వినడంతో కోపం వచ్చింది. బుద్ధి చెప్పాలనే ఉద్దేశంతో ఇలా అన్నారు. ఆంధ్రనామ సంగ్రహం అనే పుస్తకం చదివావట్రాఅని అడిగారు. లేదన్నాడు ఆ వ్యక్తి. అయితే యింటికి వెళ్ళి ఆ పుస్తకం చదువుకో తెలుస్తుంది, 'పిల్లలగలిగించు (పుట్టించు) వేరు, చుల్లి' అని అంటూ పెండ్లి జరిగిన పది మాసాలకు పిల్లల గనలేని మగవాడేమి మగవాడురా అన్నారు. అంతేకాక ఆంధ్రనామ సంగ్రహం చదివి తెలుసుకోవలసిన విషయాలు చాలావున్నై; అదిచదివినా, ఆ సంగతి తెలిసినా ఇక్కడకు రానేరావు. నీ దగ్గరవున్న ఆ వేరుని నీవు ఉపయోగించుకోవడం చేతకాక యాత్రలు చేస్తేను, చెట్టుకి, పుట్టకి, మొక్కితేను, మంత్రాలు పెట్టించుకొని, తాయెత్తులు కట్టించుకుంటేను పిల్లలు పుట్టరు. సృష్టికార్యం నీ చేతిలో వుంచుకుని దేవుడో, దేవుడో అని వెళ్ళంబడి తిరిగి దేబిరించే ఖర్మ నీ కెందుకు పట్టింది అన్నారు. దాంతో సిగ్గుపడి తలవంచుకుని (బుద్ధివచ్చి) మారు మాట్లాడలేక నమస్కరించి వెళ్ళాడు ఆ వ్యక్తి. అలా వుండేది మూఢనమ్మకాలపై అన్నగారి విమర్శ మూఢనమ్మకమనేది ఏ రూపంలో వున్నా దానినిపూర్తిగా నిర్మూలించకపోతే మనిషికి అభివృద్ధి లేదనేవారు.

## జిడ్డు కృష్ణమూర్తి

ఈ మధ్య జిడ్డు కృష్ణమూర్తి చనిపోతే అన్ని పత్రికలు దిన, వార, మాసపత్రికలు గొప్ప తత్వవేత్త చనిపోయాడని వ్రాసినవేగాని, ఆయన చెప్పిన గొప్ప తాత్విక విషయలేమిటో ఏ పత్రికా వ్రాయలేదు. చెట్టుపేరు చెప్పుకుని కాయలమ్ముకున్నట్లు అనే సామెత జ్ఞాపకం వస్తుంది ఈ వింత ప్రవర్తనకు గొప్పవారి పేరు చెప్పుకుని తాము గొప్పవారం కావాలనుకునే

తత్వం అటువంటిది. వివేకానంద, రమణమహర్షి, అరవిందయోగి గొప్ప వారని చెప్పి వీరు గొప్పవారు కావాలని చూచే ప్రబుద్ధులు చాలామంది వున్నారు. తత్వవేత్తల పేర్లు చెప్పుకుని, తృప్తిపడే వారికి తత్వం యెలా తెలుస్తుంది? ప్రముఖ మానవవాది పేరు చెప్పుకుని (మానవత్వం లేక పోయినా) తాము మానవవాదుల మనుకుంటూ మానవత్వానికి దూరంగా వుండే మానవ వాదులు, గాంధీ పేరు చెప్పుకుని అహింసా వాదులవలె ప్రవర్తిస్తూ హింసా ప్రవృత్తిలో జీవించే ప్రబుద్ధులు వున్నారు. ప్రవృత్తిలో మార్పురానిదే ప్రవర్తనలో మార్పు ఎలా వస్తుంది?

మత ప్రవక్తల పేర్లు చెప్పుకుని. మత సామరస్యానికి పాటుబడుతూ వున్నట్లు నటిస్తూ ప్రజలలో తిరుగుతూ ప్రజలమధ్య మత ద్వేషాన్ని, తద్వారా మతకలహాలను సృష్టించే స్వార్థప్రవృత్తిని అంతరంలో పెంచు కుని జీవించే మానసిక రోగగ్రస్తుల సమాజం ఇది. భక్తునివలె నటిస్తూ, భక్తి పేర భుక్తి గడుపుకోజూచే దొంగ భక్తులకు ప్రజాహిత కార్యక్రమాల పేర ప్రజల సొత్తుని స్వాహాచేస్తూ జీవించే స్వార్థపరులకు ఈ సమాజం స్థానంగా వున్నది అంటే అందుకు తాత్విక పరిజ్ఞాన శూన్యతే కారణం.

## వివేకానంద - విగ్రహారాధన

విగ్రహారాధనపై మీ అభిప్రాయమేమిటని వివేకానందను అడిగిన పుడు - అఖండంగా వున్న చైతన్యం ఆ విగ్రహంలో కూడా వున్నది విగ్రహాన్ని పూజించడంలో తప్పులేదని అన్నాడట. అది ఎంత తాత్విక దోషమో ఆయనకు అర్థంకాలేదా? చైతన్యం అఖండం అనే శంకరాచార్యుని (అద్వైత) వాదాన్ని చెప్పుకుని పేరు సంపాదించిన వివేకానంద విగ్రహా రాధనను ఖండించిన శంకరునికి భిన్నంగా విగ్రహారాధనను సమర్థించాడు, తద్వారా వివేకాన్ని కోల్పోయి అవివేకి అయినాడు వివేకానంద.

వివేకానంద విగ్రహారాధన తప్పులేదని అన్నారటగదా? ఆయన అలా యెందుకన్నారని అన్నగారిని అడిగాయి ఆయన అభిమానులు. ఆయన లౌకికుడు, బ్రతకనేర్చినవాడు గనుక విగ్రహారాధన తప్పని అంటే

యొక్కడ తనపై గౌరవం పోతుందోనని, మతస్థుల మధ్య మర్యాద తగ్గు తుందని అలాచెప్పి తప్పించుకున్నాడు. సనాతన ఆచారబద్ధమైన మతాన్ని యెదిరించిన శంకరుడెక్కడ? అటువంటి మత సంప్రదాయాన్ని ద్వైతాన్ని సమర్ధించిన వివేకానందు డెక్కడ? పరుడు లేడనీ, వున్నది తానేననీ తెలియాలి ఆ భావం ఒకసారి కలిగితే విగ్రహాలు వుండవు, వాటికి ఆరాధన వుండదు అన్నారు అన్నగారు. అఖండంగావున్న చైతన్యం విగ్రహంలో కూడా వున్నదని తెలిస్తే అది అప్పుడు విగ్రహంకానేకాదు అది తన స్వరూపమే. తనకు అన్యంగానిదానిని తాము పూజించడమేమిటి? అయినా అఖండంగా వున్న ఆ చైతన్యం ఆరాధించమని, పూజించమని అడిగిందా? అంతా భ్రమేగాని ఆరాధించే మనస్తత్వంగల వ్యక్తికి అద్వైతం పూర్తిగా బోధపడదన్నమాట ద్వైతభావం తన అధోచేతనంలో దాగివుండి అలా అనిపిస్తూ, పలికిస్తూవున్నదన్నమాట. అది అక్కడవున్న అసలు రహస్యం. ఏ అద్వైతి అయినా అర్ధంకావలసిన 'నేను' ని అర్ధంచేసుకోవడంలో పొరపాటుబడితే ఇటువంటి అవకతవకలు తప్పవు. ఆ కారణంగానే పరస్పర విరుద్ధమైన తాత్విక ప్రకటనలు జరుగుతూవుంటై.

అరవింద, వివేకానంద, రమణ మహర్షి అద్వైతాన్ని పూర్ణంగా అర్ధంచేసుకున్నవాళ్లు కాదు. ఆయన చెప్పిన "నేను" ఆయనకు అర్ధమైతే ఆయన ప్రసంగాలు ఆ విధంగా వుండక మరో విధంగా వుండేవి.

శంకరాద్వైతంలోని కొన్ని వాక్యాలకు సరైన అర్ధాలు చెప్పవలసి వస్తే దానికి కొంత (తాత్విక) సాహసంకావాలి. "తత్వమసి" "అయమాత్మా బ్రహ్మ" అనే వాక్యాలకు పండితులు (భాషా ఛాందసులు) చెప్పే అర్ధాలు వేరు, తాత్వికులు (విషయ జ్ఞానులు) చెప్పే అర్ధాలు వేరు. అటువంటి వారిలో వివేకానంద కొంతవరకు వివరించాడు. కాని ఆయనలోని లౌకికము (భయముకూడా కావచ్చు) ఆయనను అప్పుడప్పుడు దిగజార్చుతూ వచ్చినది. అది వారిలోని (తాత్విక) బలహీనతగా బయటపడుతూ వుంటుంది.

# శిశుపాలుని వధ - నారదుని మొర

ఒక అద్వైత సభకు ప్రత్యేక ఆహ్వానంపై ద్వైతులు కూడా వచ్చారు. ఆ సభలో అన్నగారు తన సహజమైన వ్యంగ్య (హాస్య) ధోరణిలో ప్రసంగిస్తూ శిశుపాలుణ్ణి తనలో ఐక్యం చేసుకున్న కృష్ణుడు తనలో ఐక్యమైన శిశుపాలునికి ఆ రాత్రి రుక్మిణీ అమ్మగారితో శోభనం జరిపించాడు అన్నారు అన్నగారు. ఆ మాటలు వింటున్న ద్వైతులు (భక్తులు) చాలా బాధపడ్డారు, అపచారమన్నారు, పాపమన్నారు.

ఆ వ్యాఖ్యానానికి సభలో కొంత సంచలనం కలిగింది. అలా శిశుపాలుణ్ణి కృష్ణుడు తనలో ఐక్యం చేసుకున్నందుకు నారదుడు ఏడ్చాడట, మొరపెట్టుకున్నాడట. ఇంతకాలం (గడ్డాలు, మీసాలు వరిసే దాకా) నీ నామస్మరణచేస్తూ, మనసా నిన్నే సేవిస్తూవున్న నన్ను యిలాగే వదలి, ప్రతిరోజూ నిన్ను తిడుతూ, దూషిస్తూవున్న ఆ శిశుపాలుణ్ణి, పరమ శత్రువుని, దుర్మార్గుణ్ణి నీలో ఐక్యం చేసుకుంటావా? ఆ భక్తి హీనుడికి మోక్షం ఇస్తావా? అని మరీ ఏడ్చాడట అన్నారు అన్నగారు. (నారాయణ మంత్రం జపించేవాడు పాపి, వాడు మోక్షానికి దూరమవుతాడు. అఖండ స్వరూపుడు, సర్వవ్యాపకుడు అయిన స్వామికి అంటే విష్ణువుకి రూప, నామాలు కల్పించి ఖండ బుద్ధితో ఆ రూపాన్ని తలుస్తూ, ఆ నామాన్ని కొలుస్తూవున్న వానికి స్వామి దూరమై పోతాడు అని వారి ఉద్దేశం. అది భక్తి దశలో మాట. అసలు స్వరూపం తానే అయివుండగా పిలవడందేనికి? కొలవడం దేనికి? అనేది జ్ఞాన దశలోని మాట) అలా వ్యాఖ్యానంచేసి ఆ భక్తులకు కొంత కనువిప్పు (జ్ఞానం) కలిగించారు.

సభానంతరం భోజనాలకు కూర్చున్నాం. ఆ సమయంలో ఆనాటి సభలో తమాషాగా చేసిన కొత్త వ్యాఖ్యానంపై చర్చలు సాగాయి. ముక్తికి భక్తి మార్గమని చెప్పే ద్వైతులకు ఆ మాత్రం చురకలు పడాలని అన్నారు అన్నగారు. భక్తి చేయడమంటే అజ్ఞానంలో వుండటమే ననే వారు.

ఆ విధమైన భక్తి వల్ల భక్తుడు యేమి సాధించలేడని, మోక్షానికి భక్తి సాధనంగా చెప్పడం మోసమని, యే భక్తుడు మోక్షాన్ని పొందలేదని ఆ కథవల్ల తెలుస్తూవున్నది గదా? గడ్డాలు, మీసాలు పెరిసినా మోక్షం ఇచ్చేది, పుచ్చుకునేది అనుకుంటున్న నారదుని దుస్థితి చూడగా. మోక్షం సిద్ధమని తెలియక, అది ప్రాప్య వస్తువుగా భావించి దానిని ప్రాప్తింప జేసుకోవడానికి అంటే పొందటానికి చేసే ప్రయత్నం, ప్రాకులాట వృధా ప్రయాస అనేవారు. 'ఒక్కయుక్తి లోన నున్నది సకలంబు తిక్కబట్టి నరుడు (భక్తుడు) తిరుగనేల' అంటూ వుండేవారు.

## ఆంధ్ర వాల్మీకి

ఒకసారి ఆంధ్ర వాల్మీకి (వావిలికొలను సుబ్బారావు) భక్తిని ప్రచారంచేస్తూ (భక్తి గడవడానికి) పురాణం చెబుతూ వున్న సమయంలో అన్నగారు వెళ్లి వారికి నమస్కరించి "మాయ" అను పదార్థమేమిటని అడిగారట. అడిగిన దానికి సమాధానం చెప్పకుండా నీ వెవరవు (శూద్రుడవా? బ్రాహ్మణుడవా?) అని అడిగారట. చూస్తూ ప్రశ్నేమిటి? అన్నారట అన్నగారు. వీరి వేష భాషలు చూచి శూద్రుడని గ్రహించి నీ ముఖం చూడ గూడదన్నారటవారు. చూడగూడదనుకుంటే చేయవలసిందేమిటి అన్నారట అన్నగారు.

అట్లా అన్నగారిని అంతకుముందు వారు చూచి వుండరు. అదివారికి కొత్త అనుభవం. ఆయన చెబుతూ పోతుంటే వింటూ పోయే భక్త బృందమే తనకు తెలుసుగాని ఎదటబడి ధైర్యంగా ప్రశ్నించే బుద్ధి జీవుల సంగతి తెలియదు ఆ కారణంగానే అన్నగారి ప్రశ్నకు కలగాటు పడవలసి వచ్చింది. ఆ ప్రశ్న వినడంతో తాను రెండవ ప్రక్కకు తిరిగి కూర్చొని రామ, రామ అంటూ రామ భజన ప్రారంభించారట (వచ్చిన భక్త బృందంతో). దాంతో అన్నగారికి కోపంవచ్చి 'ఆపండి ఈ ఊక దంపుడు భజన' అన్నారట బిగ్గరగా, గంభీరంగా. ఎంత ఊకదంచితే మాత్రం (భక్తి చేస్తే మాత్రం) ఒక్క బియ్యపు గింజ (జ్ఞానం) వస్తుందా? అని గర్జించి ప్రశ్నించారట. సభ నిశ్శబ్దమైనది (భజన ఆపడంతో).

దాంతో ఏంచేయాలో తెలియని స్థితిలో అక్కడ ఇక తనకు గౌరవం వుండదని గ్రహించి ఆ పురాణ కాలక్షేపం అంతటితో ఆపి సభనుండి నిష్క్రమించాడట తాత్విక శూన్యుడైన ఆ భాషా పండితుడు.

జాత్యహంకారం మూర్తీభవించిన కారణంగా ఎదట బడిన మనిషితో సభ్యతగా మాట్లాడటం అనేది కూడా మరిచాడు ఆ ఆంధ్రవాల్మీకి. అందువల్ల సహనం కోల్పోయి తన స్థానం తాను కోల్పోయాడు. పది రోజులు పురాణం చెప్పి భక్తిని ప్రచారంచేస్తూ భుక్తి గడుపుకోవచ్చునని తలచి తలపెట్టిన కార్యక్రమాలను రద్దు చేసుకుని ఆ రోజే ఆ ఊరు వదలి వెళ్లిపోయారట.

భక్తి నేర్పిన వానికి భుక్తి గడుస్తుందే గాని, ముక్తిమార్గం తెలియదు. భక్తి పేరుతో భుక్తి గడుపుకోవాలని చూచే వారిని చూచి జాలి పడవలసిందే గాని వారినుండి మనం ఏ విధమైన మంచిని ఆశించలేము. భక్తి అనేది అదొక ఊబి గుండం. అందులోకి జారితే కాలాని తేరుకునే వాడుండడు.

భక్తి అంటే అంత అసహ్యించుకునేవారు అన్నగారు. భక్తిలో కలిగే అవ్యక్తానుభూతి వ్యక్తిని ఆలోచనా రహితుణ్ణి చేస్తుంది. ఆలోచన లేని వ్యక్తి వ్యక్తంలో వుండడు. శంకరుడు ప్రతి వ్యక్తిని ఆలోచించమన్నాడు కాని అలా ఆలోచించే తాహతులేని వారివల్లనే తాను హత్య చేయబడ్డాడు.

“శూద్రులు తాత్విక విషయ విచారణకు అర్హులు కారనే దుర్మార్గపు ఆలోచనే అతనిలో (ఆంధ్రవాల్మీకిలో) మూర్తీభవించింది. ఆ కారణంగానే నా ప్రశ్నకు సమాధానం చెప్పకుండా నా కులమేమిటని అడగడానికి సాహసించాడు అన్నారు అన్నగారు.

కులమో, మతమో, ఆచారమో వ్యక్తిగత ఆలోచనకు అడ్డు కాకూడదనీ, అలాంటి ఆటంకాలవల్ల ఏ సమాజమూ తాత్వికంగా అభివృద్ధి పొంద

లేదనీ, ఆ కారణంగానే సమాజం శాంతిగా వుండలేదనీ, అదే నేటి మన పరిస్థితి అనీ. అంటూ తన ఆవేదనను వెలుబుచ్చుతూ వుండేవారు అన్నగారు.

## నేను - నా చేత

"నేను" చేస్తున్నాను అంటే అది సమిష్టి నేనే. కాదు అని యెవరైనా అంటేను, అనుకుంటేను అది ఆధ్యాత్మిక (ద్వైత) వాదంలోని వైయక్తిక ఆలోచనే అవుతుంది. అటువంటి ఆలోచనా ఫలితమే గదా యెవరి 'కర్మ' ఫలితం వారనుభవిస్తారని వారు చెప్పడమంటే, ఆ జన్మలో చేసిన కర్మ ఫలానుసారం ఈ జన్మకు వారసత్వంగా ఈడ్చుచు వచ్చేది ఆ వైయక్తిక (కర్మ) జీవుడే గదా?

"కర్మ" అంటే పని (శ్రమ) కాదు. అలాగని యెవరైనా అనుకుంటే అది పొరపాటవుతుంది. అందుకే పనికి ఫలితం ఈ జన్మలో దక్కడంలేదు. కర్మకు ఫలితం వచ్చే జన్మకు వాయిదా వేశారు. అందుచేతనే ఈ సమాజంలో శ్రమ (పని) చేసేవాడు ఫలితం పొందుతున్నాడా? అనేది ప్రశ్నగా వున్నది. శ్రమ ఎందరో చేస్తున్నారు. ఫలితం మాత్రం కొందరే సొంతం చేసుకుంటున్నారు, అనుభవిస్తున్నారు. ఇది ఈ సమాజంలో నీతి బద్ధంగా చట్టబద్ధంగా చలామణి అవుతూ వున్నది.

అంటే అది తాత్విక న్యాయమనే అనుకుంటూవున్నాం. శ్రమపడే వారికి దక్కకుండా ఎవరు దోచుకుంటున్నారు? ఆ సంగతి వారు ఆలోచిస్తే అది తప్పని వారికి తెలుస్తుంది. తప్పని తెలిస్తే ఆ తప్పుని మరొకసారి చెయ్యడు. కాని తప్పు చేశానని పశ్చాత్తాపపడితే ఆ తప్పు చేయలేదు గనుక(దోచుకోలేదు గనుక)తప్పని తెలుసుకోవడానికి వీలైన (కారణమైన) ఆలోచన అతను చేయడు.

## అగ్నిసరస్సు

అగ్నిసరస్సున వికసించిన వజ్రం దానికి అధిపతులెవ్వరు, అనుభవిస్తున్న వారెవ్వరు? అనే ప్రశ్నతో ఆవేదన పడ్డాడు మహాకవి శ్రీ. శ్రీ.

రక్తాన్ని ఉడికించి తన శరీరాన్ని అగ్ని సరస్సుగా చేసి తన శ్రమతో ఉత్పత్తి చేసిన వస్తువు (వజ్రం) ను, సంపదను హస్తగతం చేసుకుని అనుభవిస్తున్న దెవ్వరు? అని ప్రశ్నిస్తున్నాడా మహాకవి (తన కవితలో). ఈ వ్యవస్థను చూచి, వ్యవస్థలోని అవస్థలను అనుభవించి. ఈ వ్యవస్థను గురించి మాట్లాడేవారు, ఈ వ్యవస్థలోని అస్తవ్యస్తపరిస్థితిని గురించి మాట్లాడేవారు దీనికి తాత్విక కారణాలేమిటని ఆలోచించాలి.

ఆర్థిక, సాంఘిక అసమానతలను ఆధ్యాత్మికవాదం తన సిద్ధాంతం ద్వారా బహిరంగంగానే అంగీకరిస్తూవుంటుంది, సమర్థిస్తూవుంటుంది వ్యక్తిగత కర్మఫలితాలు తన జన్మ పరంపరలో తాను అనుభవిస్తాడని చెప్పడం అంటే ఈ వ్యవస్థను బాహాటంగా సమర్థించడమే కదా? నిష్కామ కర్మ (ఫలితాన్నాశించక) చేయమనడం. అటువంటి బోధ (దుర్బోధ) కృష్ణ (ఆత్మలేని) పరమాత్మ బోధించాడని చెప్పడం, ఆ బోధా సారమే ఈ గీతా సారమని వీరు చెబుతూ ఉండడం వల్ల మనకు ఆ సిద్ధాంతంపై ఏ విధమైన అభిప్రాయం కలుగుతుంది (బాధాసారంగా మిగలడం తప్ప)? మనలను (తాత్వికంగా) బాధించడం తప్ప? పై విషయాలను మనం పరిశీలించితే మనకు బోధపడేదేమంటే - సిద్ధాంత పరమైన పరస్పర విరుద్ధాల సముదాయమే ఈ ఆధ్యాత్మిక వాదంలోని సారమని. తాత్వికసిద్ధాంత పరమైన ఈ వైరుధ్యాలు నిజ జీవితంలో ఏ విధమైన ఫలితాలనిస్తూవున్నవి? ఆ సిద్ధాంత ఫలితంగా మన ఆలోచనలు ఏ విధంగా సాగుతూవున్నవి? మన ఆలోచనలకు ఆ సిద్ధాంతాలు సమన్వయానికి వస్తూవున్నావా? సమన్వయం కుదరని సిద్ధాంతం సిద్ధాంతమా?

## పశ్చాత్తాపం

కర్మఫలితాలు జీవుడు తన జన్మ పరంపరలో అనుభవిస్తాడని, అనుభవించక తప్పదని చెబుతూ వున్నారు. ఇటువంటి విరుద్ధమైన తాత్వికాంశాలు మానవుణ్ణి అయోమయ స్థితిలో వుంచుతూ వున్నై. నిష్కామ కర్మచేయమనడం, ఎవరి కర్మఫలితం వారే అనుభవించాలనడం పరస్పరం విరుద్ధం గదా? దీనిని బట్టి ఈ జన్మలో చేసిన కర్మఫలితాన్ని వచ్చే జన్మకు వాయిదా వేయడంలోని ఆంతర్యం ఇందు మూలంగా అర్థంచేసుకో వచ్చు.

తప్పు చేసినపుడు ఆ తప్పుని తెలుసుకుని పశ్చాత్తాపపడితే ఆ తప్పుని ఆ వ్యక్తి మరొకసారి చేయడు, చేయలేడు అనేది తెలుసుకున్నాం గదా. కాని పశ్చాత్తాపపడే వ్యక్తికి తనమీద తనకు నమ్మకం వుంటుంది. అంత రాత్మ (తన మనసు) మీద తనకు నమ్మకం వున్నవాడే అలా చేయగలడు. కాని ఆధ్యాత్మిక వాదికి (పరమాత్మను నమ్మిన వ్యక్తికి) తన తప్పు తనకు తెలియదు, తెలుసుకునే అవకాశంలేదు. తప్పు తెలిసినా తన తప్పు తాను దిద్దుకోడు. తప్పు దిద్దుకుంటే స్వలాభం (సొంత సుఖం) పోతుంది. తన తప్పుని (పాపాన్ని) దేవుని దగ్గర చెప్పుకుని పాప పరిహారార్థం ప్రార్థన చెస్తే సరిపోతుంది, ఆ తాత్విక సూత్రం నమ్మి వుంటాడు గనుకనే చేసిన తప్పునే మళ్లీ చేస్తూవుంటాడు.

## జపతో నాస్తి పాతకం

చేసిన పాపం ఈశ్వరుని చింతనతో నశిస్తుందనే నమ్మకం కలిగిం చిన ఆధ్యాత్మికవాదం "జపతో నాస్తి పాతకం" అనే దుర్మార్గపు సూత్రం ప్రచారం చేయడం చేతనే ఆ నమ్మకం వున్న ప్రతి వ్యక్తి చేత తప్పు చేయించుతుంది. తప్పు చేయడానికి, ఆ తప్పునుండి తప్పించుకోవడానికి ఆ సూత్రమే ఆధారమవుతుంది. అందుచేతనే తన తప్పును తాను అంగీక రించడు ఆ తప్పుని దిద్దుకోడు. అంటే తప్పుచేయకుండా వుండడు. అదేగదా నేటి మన సమాజ పరిస్థితి! ఈ సూక్తి "కృషితో నాస్తి దుర్భిక్షం" అనే సూక్తిని మరిపించి దారి తప్పించింది.

ఈ వ్యవస్థను చూచి ఆ తప్పుడు సూత్రానికి వగచి, చింతించి త్రిపురనేని రామస్వామిగారు వ్రాసిన ఈ పద్యాన్ని తిలకించండి, ఒక్క సారి మీరు కూడా చింతించండి, ఆలోచించండి.

చేసిన పాప మీశ్వరుని చింతనచే నశియించునన్న వి
శ్వాసముగల్గి రేబవలు పాపమొనర్చుచు దీరినప్పు డే
దోసమయంబునన్ కలము తొందరగా గొని రామకోటినిన్
వ్రాసెడి భక్తకోటి పదపంకజముల్ శరణంబు వేడెదన్.

తీరినప్పుడు అంటే దోపిడి చేయడానికి వీలు కానప్పుడు, సమాజాన్ని వంచించడానికి వీలుకానప్పుడు, ఇరుగు పొరుగు వారిని నమ్మించి నమ్మక ద్రోహం చేయడానికి వీలుకానప్పుడు మాత్రమే అతనికి తీరిక, రామకోటిని వ్రాయడానికి తగిన సమయం.

## కర్తృత్వం

అంటే ఇక్కడ మనం అర్థంచేసుకోవలసింది యేమంటే మనం సంప్రదాయమనీ ఆచారమనీ అనుకుంటున్న (మతపరమైన) ఆధ్యాత్మిక వైయక్తిక (స్వేచ్ఛ) మనో ప్రవృత్తి తప్పు చేయడానికి అవకాశం ఇస్తూ వున్నదని. వ్యక్తిగతమైన కోరికలు మన మనసులో దాగివుండి మనలను ఈ రకమైన వృత్తిలో వుంచుతూ వుంటాయన్నమాట. ఈ విధమైన వైయక్తిక వృత్తిని భౌతిక తత్వశాస్త్రం అంగీకరించదు. ఇక్కడ ప్రతిదీ సాపేక్షమే కావడంచేత అంతా సంఘ (సమిష్టి) పరంగానే అర్థమవుతుంది.

నేను సుఖపడాలన్నా కష్ట పడాలన్నా దానికి కారణాలు సమిష్టిగానే వుంటాయని గుర్తించి వాటి పరిష్కారానికి చేయవలసిన ప్రయత్నం కూడా సమిష్టిగానే చేయాలి. దానికి సంబంధించిన ఆలోచన సమిష్టిదే. ఇలా ఆలోచించేది నేనుగా (వ్యష్టిగా) అయినా ఆలోచించే సమస్య సమిష్టిదే అవుతుంది. దానికి పరిష్కారం సమిష్టిగానే వుంటుంది.

ఆధ్యాత్మికవాది తన కర్తృత్వాన్ని తాను అంగీకరించడు. ఆ కర్తృత్వాన్ని దేవుని మీద వుంచుతాడు. భౌతికవాది అలా కాక తాను సంఘంలోని భాగంగా (సంఘ పురుషుని అంగంగా) తన వ్యక్తిత్వాన్ని తాను గుర్తించి 'నేను' (వ్యక్తి) లేనిదే సంఘం లేదనే సమిష్టి భావాన్ని కలిగి వుంటాడు. ఆ నేను ఆలోచించే ఆలోచనలనుండి ఆచరణను సమిష్టిగా ఆచరిస్తాడు, సమిష్టి బాధ్యతను స్వీకరిస్తాడు.

ఇటువంటి విషయాలు చర్చకు వచ్చినపుడు ఆస్తిక (ద్వైత) భావం నుండి వేరైన శంకరుడు అద్వైత భావంతో చెప్పిన "నేను" సమిష్టి నేనే గాని వ్యష్టి నేను "నేను" కాదు అనేవారు అన్నగారు. అందుచేతనే ఆర్థిక

సాంఘిక రంగాలలోని అసమానతలను సమిష్టి పరంగానే ఆలోచించి పరిష్కారం చేసుకోవాలనేవారు. అంతవరకు మనంకోరే సమసమాజఆశయానికి వారి సమన్వయాలోచనలు ఎలాంటివనేది తెలుసుకోవడానికే ఈ పరిచయం అవసరమని భావించాను.

వ్యక్తులకుండే స్వార్థ బుద్ధికి కారణం తాత్వికంగా అర్థమైతే ఆ తాత్వికాంశాలను తత్వశాస్త్రం నుండి తీసివేయగలిగితే అంటే మన భావంలో మార్పు వస్తే ఆచరణ సులభమే కదా? అందుకే హేతుబద్ధమైన ఆలోచన అవసరమంటున్నాము.

ఆధ్యాత్మిక వాదంలో హేతుత్వం నశించి అహేతుకత్వం అభివృద్ధి కావడంవల్ల అవి కాలంతో సాపేక్షంగా వుండక నిరపేక్షమై నిరర్థకమై పోయింది. అందుచేత దానిని విడిచిపెట్టక తప్పదు.

స్వస్వరూప సాక్షాత్కారం (తనను గురించి తాను తెలుసుకోవడం) అనే తాత్వికాంశం అర్థంకాని ఆస్తికులు దానికి తప్పుడు అర్థాలు చెప్పి (తప్పుదారి పట్టించి) తద్వారా స్వానురాగం అనేది వ్యక్తులలో పెంచి, అదే ముఖ్యం (తనను తాను ప్రేమించడం) గా మార్చి చెప్పినందువల్ల వచ్చిన ఇబ్బందే ఇది.

## మమతా మమకారాలు:

అందువల్ల తనను తాను ప్రేమించడం తప్ప ఇతరులను ప్రేమించడం అనేది మరిచాడు. విడిచాడు మనిషి. తన మీద తనకు స్వాభిమానం (తన మీద తనకు నమ్మకం) మంచిదే కాని అది దురభిమానంగా మారి (ఇతరులను కించపరిచేదిగా, బాధించేదిగా) ఇతరుల అస్తిత్వాన్ని గాని, ఇతరుల క్షేమాన్ని గాని గుర్తించడం, గౌరవించడం జరగనపుడు అది తనకు, సంఘానికి కూడా చేటుతెచ్చి పెడుతుంది. అదే గదా నేటి సమాజ పరిస్థితి? అటువంటి పరిస్థితులలో ప్రేమాభిమానాలు, మమతానురాగాలు ఎక్కడ మిగులుతై? ఎక్కడ వాటిని చూడగలుగుతాము?

స్వాభిమానం అనేది ఎంత చేటు తెచ్చిపెడుతుందో (స్వానురాగం వల్ల తనకు తానే ఎలా శత్రువవుతాడో) ఒక చిన్న కథను తన తాత్విక ఉపన్యాసాల సందర్భంలో ఉదాహరించి చెబుతూ వుండేవారు అన్నగారు. తన రూపాన్ని (ప్రతిబింబాన్ని) తాను నీటిలో చూచి, తన స్వరూపాన్ని మరచి ప్రతిబింబాన్ని వలచి, దాని అందానికి ముగ్ధుడై (మురిసిపోయి) స్వానురాగం పెరిగి (స్వాభిమానంతో) విచక్షణ కోల్పోయి ఆ నీటిలోని తన ప్రతిబింబాన్ని తాను కావిలించుకుని ముద్దాడాలని కోరిక గలిగి (బుద్ధిహీనుడై) తాను నీటిలో దూకి దుర్మరణం పొందాడనేది కథసారాంశం. స్వానురాగంతో కోరిక విపరీతమై అది వ్యక్తిగతమైనపుడు విచక్షణ కోల్పోతాడనేది తాత్వికార్థం, అదే ముఖ్యార్థం, అర్థం చేసుకోదగ్గ అర్థం.

అంటే తనమీద తనకు అభిమానం అనేది ఆధిక్యతగా మారినపుడు (దురభిమానంగా మారినపుడు) తనను తాను మరచి, తాను తన ప్రతిబింబాన్ని ప్రేమించడం, అభిమానించడం జరిగిన కారణంగా తానే తనకు శత్రువుగా మారిన విషయం గ్రహించవచ్చు. ఈ సమాజంలో నేడు సాంఘికంగా కులంపేర దురభిమానం పెరిగి నాది పెద్ద కులం, నీది చిన్న కులం అనే (కుల స్వాభిమానం) భావం రావడంవల్ల అది కుల అహంకారంగా పెరిగి చివరకు పరస్పరం కలహాలకు దారి తీస్తూ వున్నది. (దురభిమానం కులం రూపంలో పెంచుకున్నాడు మనిషి).

అదేవిధంగా ఆర్థిక రంగంలో తనది, తనవాళ్ళది, నాది, నా కుటుంబానిది అనే వ్యష్టి స్వామ్య తత్వమే వ్యష్టి ధన స్వామ్యానికి దారితీసింది. నాది నా వాళ్ళది అనేభావం వదలి, మనది మనవాళ్ళది అనే విశాలభావం అలవరచుకుంటే ధనం ఎంతవున్నా బాధలేదు. సమిష్టి శ్రమవల్ల అది (సంపద) పెరుగుతుంది. అది సమిష్టిగానే అనుభవించడానికి వుంటుంది. వున్నదంతా మనది అనుకున్నపుడు ఎవరికి యే ఇబ్బంది వుండదు, ఎవరిమీద యెవరికి ద్వేషం అసూయ వుండదు. నాది నీది అనే విభజనే అన్ని అనర్థాలకు అవకాశం ఇస్తున్నది.

# వ్యష్టిస్వామ్యం

వ్యష్టిస్వామ్యంలో ఇప్పుడు జరుగుతున్న దేమిటి? ఎలాగైనా వున్న సంపదను తన సొంతం చేసుకోవాలని ప్రతివ్యక్తి చూస్తూవుంటాడు. తనది కానిది (తన ఇంటి ఆవరణకు బయటవున్నది, సమిష్టిది) ఏదైనా తన సొంతం చేసుకోవాలని చేసే ప్రయత్నంలో అది సమిష్టి దనే మాట మరచి (విడిచి) ఎవరూ చూడకుండా (అటు ఇటు చూచి) దానిని తన ఆవరణ లోకి విసిరివేసుకుంటున్నాడు.

ఈ వ్యవస్థలో సంపాదించడం అనేదానికి అర్థంలేదు. సంపాదించ డమంటే దోచుకోవడమే. సంపద సమిష్టినుండి వ్యష్టిగా (వ్యక్తులకు) మారినపుడు ఆ వ్యక్తులు (కొద్ది మంది) సంపాదించడం జరుగుతూ వుంటుంది. కాకపోతే కర్షకులు తమ శ్రమతో సంపదను (పంటలను) పండించి తమ సంపాదనను పెంచుకోవచ్చు, కార్మికులు తమ శ్రమతో వస్తువులను ఉత్పత్తి చేస్తూ తద్వారా తమ సంపాదనను పెంచుకో వచ్చును. కాని జరుగుతున్న దేమిటి? ఆ వృత్తులవారు చేస్తూవున్న శ్రమకు తగిన ఫలితం వారికి దక్కుతున్నదా? లేదే అంటే వారి శ్రమ ఫలితాలను (సంపదను) ఇతరులు (ఆ వృత్తులు చేయనివారు) దోచు కుంటున్నారన్న మాట. తమ ఆవరణలో లేని దానిని సొంతం చేసుకుం టున్నారన్న మాట. అది ఈ వ్యవస్థలో నీతిబద్ధం, చట్టబద్ధంకూడాఅయింది.

ఈ విధమైన ఆర్థిక వ్యవస్థకు ఆధ్యాత్మికవాదం నుండి అభివృద్ధి అయిన వైయక్తిక తత్వంనుండి వ్యక్తి స్వానురాగం అనే వ్యక్తిగత స్వభావం నుండి వచ్చిన స్వార్థభావమే కారణం. వీటి అన్నిటినుండి (అటు వంటి భావాలనుండి) స్వేచ్ఛను పొందడానికి మనం ఆలోచన చేయాలి. అదే నేటి కర్తవ్యం. అలా అధోచేతనంలో దాగివున్న స్వార్థచింతనాశక్తిని మనం చేతనంలో (చైతన్యంలో) వుంచి దాని దుష్ట ప్రభావంనుండి తప్పించుకుని నిస్వార్థ (సామ్యవాద) వ్యవస్థను స్థాపించడానికి మనం ఆలోచన చేయాలి.

అయితే అద్వైతంలోని మోక్షం జ్ఞానంపై ఆధారపడ్డసమిష్టిస్వేచ్ఛయే అనేవారు అన్నగారు. ముక్తి, మోక్షం, నిర్వాణం, స్వేచ్ఛ అనే ఉన్నత మైన తాత్వికాంశాలను వ్యావహారిక సమస్యలకు సమన్వయం చేసి, చూసి వర్గసహిత (స్వార్థ) అసమ సమాజం నుండి వర్గరహిత (నిస్వార్థ) సమ సమాజాన్ని సాధించిననాడు అదే నిజమైన స్వేచ్ఛ అని చెప్పుకోవచ్చు, అదే మోక్షమని అనుకోవచ్చు. అటువంటి ఆలోచనకు వ్యక్తికి వున్న స్వేచ్ఛను యెవరు కాదంటారు? యెవరు కూడదంటారు? మనకున్న మత పరమైన (తాత్విక) అజ్ఞానాన్ని విడిచి జ్ఞానాన్ని సంపా దించడమే నిజమైన నిర్వాణం. అదే నిజమైన స్వేచ్ఛ (మోక్షం, నిర్వాణం, స్వేచ్ఛ మూడు తాత్వికరీత్యా ఒకటే).

వ్యక్తులుగా ఆలోచించి సమిష్టిగా ఆచరించిననాడే ఆ స్థితిని పొంద గలుగుతాం. అలా కానపుడు ఒకరకమైన స్వేచ్ఛను ఒకవైపున పొందుతూ (అనుభవిస్తూ) మరొక రకమైన అస్వాంతత్రతను (బానిసత్వాన్ని) అనుభ వించవలసి వస్తుంది. కనుక వీటన్నిటికి తాత్విక సమన్వయాలోచనలు కావాలి. అది ఏదో ఒక్క విషయంలోనే కాక అన్ని విషయాలలోను సాధిం చాలి. ఒక రంగంలో అభివృద్ధి సాధించి మరొక రంగంలో అభివృద్ధి నిరో ధకంగా వుంటే అది సమాజక్షేమంకాదు అందుచేత అన్ని విషయాలలోను సమమైన (సాపేక్షరీతిలోజరిగిన) అభివృద్ధే నిజమైన అభివృద్ధి అవుతుంది, అభివృద్ధి అనిపించుకుంటుంది.

ఆస్తిని అవసరం మేరకు సంపాదించడంలోను అనుభవించడం లోను దోషంలేదు. ఆస్తి మీద 'కుతి' తీరక దానిని అధికంగా కూడబెట్టి చూచుకుని తృప్తిపడే (కుతి తీర్చుకునే) వారే అధికులుగా వున్న ఈ సమా జంలో (పశువుకి తిన్నది బలం, మనిషికి వున్నది బలం అనే సామెత ఆ ప్రవృత్తి ఫలితమే) కూడబెట్టి 'కుతి' తీర్చుకోవాలను కోవడమేగాని "కుతి" తీరదు ( ఈ వ్యవస్థతో తీరేదికాదు). ఉన్నది చూచుకుని తృప్తి పడడానికి అలవాటుపడిన వ్యక్తికి కుతి తీరడంలేదు. ఎంత వుండాలి? ఎంత వుంచుకోవచ్చు? ఎంతవుంటే 'కుతి' అనే కోరిక తీరుతుంది? అనేది నిర్ణయం (హద్దు) లేదుకదా? ఈ వ్యవస్థలో.

# తీరని కుతి

ఆశకు, ఆస్తికి హద్దులేని ఈ ఆర్థిక వ్యవస్థలో ఆశ అనేది పెరుగు తుందేగాని తరగదుగదా? పెరిగే ఆశవల్ల తరిగేది సుఖమే. వ్యక్తులలో ఈ విధమైన ఆశ పెరిగిన కొద్ది సమాజంలో సుఖ శాంతుల దామాషా తరుగుతూ వుంటుంది. అసూయకారణంగా ఆ దామాషాలో అశాంతి పెరుగుతూ వుంటుంది.

కేవల వైయక్తిక జీవభావమే స్వార్థానికి పునాది అనీ, అదే పీడనను ప్రేరేపిస్తుందనీ, సమిష్టి జీవం (బ్రహ్మం) అన్న భావమే దీనికి విరుగుడనీ అంటూ వుండేవారు అన్నగారు. ఈ ఆశకు అంతం వుండదు, అదొక తీరని 'కుతి' అనేవారు.

తల్లిపాలు దాగడంలో "కుతి" తీరని శిశువు కడుపు నిండినా తల్లి స్తనాన్ని విడవక అంటి పెట్టుకుని చూషిస్తూ (కుడుస్తూ) వుంటుంది. అపుడు కూడా "కుతి" తీరకపోతే తన చేతి వ్రేలినో, కాలి వ్రేలినో నోట వేసుకుని చీకుతూ వుంటుంది. తనది వీలుకాకపోతే ఇతరులది వ్రేలైనా, ఏదైనా నోటకరచి చీకుతూ (కుడుస్తూ) వుంటుంది. అదే పెరిగి పెద్దలైన తరువాత ఇతరుల మర్మావయవాలను చీకడం (కుడవడం) చేస్తారు. (అధో చేతనంలో దాగివున్న కోరిక, కుతి తీరని కారణంగా) ప్రాయిడ్ సైకాలజీ ప్రకారం. (చూడండి 'మనసు-మర్మము' అన్నపరెడ్డి వెంకటేశ్వరరెడ్డి) అలా వ్యక్తిగత కోరికలు బలమైనపుడు మానవుడు విచక్షణ కోల్పోతాడు. ఇక్కడ "కుతి" అనేది అంతరంలో (అధోచేతనంలో) గుప్తంగా దాగివుండి ఆ విధమైన చెడు రూపంలో వ్యక్తమవుతూ వుంటుంది. అధోచేతనంలో దాచబడిన (అణచబడిన) కోరికల ప్రభావం మన జీవితంలో ఆధిక్యత వహించకుండా చూచుకోవలసిన ఆవశ్యకత మనం మన చేతన(చైతన్యం) దశలో అరికట్టాలి, అదుపు చేయాలి.

ఇలా చిన్నతనంలో అలవాటైన ఈ "కుతి" ని వయసు పెరిగిన కొద్ది ఇతర (చెడ్డ) అలవాట్లకు మార్చుకుంటాడు మానవుడు పొగ పీల్చడం పొడుం పీల్చడం, పొగాకు నమలడం, పెదవులకు రంగువేసుకోవడం,

వాటిని కొరకడం, (తనవి, ఇతరులవి) అలవాటు చేసుకుంటాడు. కాఫీ, టీ వగైరా తరచు తాగడం, బ్రాంది, విస్కీ, సారా, కల్లు వగైరా మాదక ద్రవ్యాలు, గంజాయి, నల్లమందు, బ్రౌన్ షుగర్ వగైరా అనేకంగా గల మత్తు (చెడ్డ) పదార్థాలకు అలవాటుపడటంద్వారా వ్యక్తిలో దాగివున్న (అణచబడిన) కోరికలను (కుతిని) ఆ విధంగా తీర్చుకుని తృప్తిపడ సాగాడు మానవుడు కాని మానవుడు. అదొక విధమైన కృత్రిమమైన రూపం, అతి కృత్రిమమైన తృప్తి.

"కుతి" అనేది చిన్నతనంలో అలా పెరిగి ఆ విధమైన అలవాట్లకు దారితీస్తుంది. పెరిగి పెద్దవారైనకొద్దీ కోరికలు మరొకవిధంగా కార్యరూపం పొందుతూ వుంటై. అలవాట్లు ఆకలిలాంటి అవసరాలు తీర్చుకోవడానికి సంబంధించినవే కాకపోయినా, ఆరోగ్యాన్ని చెడగొట్టేవైనా అలాంటి అలవాట్లను మానుకోలేడు. వాటినే ప్రతినిత్యం, ప్రతిక్షణం పాటిస్తూవుంటాడు. జిగురుబిళ్ళలు (గమ్‌చాక్లెట్లు) నమలడం, వక్కపొడి, ఏలకులు నమలడం చేస్తూవుంటాడు. అవే నిత్యావసర వస్తువులుగా భావిస్తాడు. అలాంటి అలవాటు అనేది బానిస ప్రవృత్తిని తెలియజేస్తూ వుంటుంది.

## తీరని కోరిక

కోరికలకు బానిసకావడం అంటే విచక్షణ కోల్పోయిన మానసిక స్థితిని తెలియజేస్తుంది. ఈ రకమైన వ్యక్తిగత కోరికలు (కుతి) తీర్చుకోవడానికి కొందరు కళలను ఆశ్రయించవచ్చు. కొందరు ఇతర వ్యాపకాలను అలవాటు చేసుకోవచ్చు. చీట్లాట, గుర్రపు పందేలు, కోడిపందేలు, గొర్రెపోతు పందేలు వగైరాలేగాక చెట్లుపెంచడం, అల్లికపనులుచేయడం లాంటి ఉపయోగపడే పనులుచేస్తూకూడా వుండవచ్చు. ఉపయోగంలేని విషయాలు చర్చిస్తూను, పనికిమాలిన కవిత్వం వ్రాస్తూను, క్షుద్ర సాహిత్యాన్ని సృష్టిస్తూను అలా కాలాన్ని గడుపుతూ (వ్యర్థపరుస్తూ) కొంత తృప్తిపడనూవచ్చు. మిగిలినవారు తమ వ్యక్తిగత "కుతి'ని (అంతరంలో దాగిన కోరికను) ఆర్థికంమీద పెంచుకుంటారు. ఆస్తిని (హద్దుమీరి) అవసరం లేకపోయినా పెంచి తమ అంతరంలోని "కుతి"ని తీర్చుకోవడానికి

పరియత్నిస్తారు. అలా ఆస్తిని హద్దుమీరి సంపాదించే వ్యక్తులలో విచక్షణ వుండదు. కోరిక బలంగావున్న కారణంగా దానిని (ధనాన్ని) సంపాదించ డానికి ఏ విధానాలనైనా అనుసరిస్తూవుంటాడు. తోటి మానవుని మంచి చెడ్డలతో తనకు నిమిత్తం లేదనుకుంటాడు. తన సంపాదనే తనకు ముఖ్య మనుకుంటాడు. అలాఅనుకోవడంతో మంచి, చెడ్డల విచక్షణ అంతరిస్తుంది

ఆ కారణంగానే ఈనాడు అన్ని వృత్తులలోను అవినీతి, అక్రమాలు అభివృద్ధి అవడం చూస్తూవున్నాం. హద్దుమీరిన సంపాదనా దాహంతో మితిమీరిన అన్యాయాలు పెరిగిపోయినై. శ్రమవిలువలు దోచుకోవడంలో అనేక పద్ధతులు అభివృద్ధి చేసుకున్నాడు మనిషి. దీనికి కారణం తనలో దాగిన వ్యక్తిగతమైన "క్షుతి" (అవసరంలేని కోరిక) అని గుర్తిస్తే, అది తప్పని తెలిస్తే వ్యక్తిలోని వ్యష్టిభావం అభావంచెంది సమిష్టిభావం వస్తుంది. సమిష్టిలో "క్షుతి" వుండదు; అవసరం మాత్రమే వుంటుంది అవసరం అందరికి తీరుతుంది. అదే సమిష్టిలోని ఉత్తమతత్వం.

వ్యక్తులలోని కోరికలు వ్యక్తిగతంగా తీర్చుకోవడం కంటె సమిష్టిగా తీర్చుకోవడం సులభం. సమిష్టిగా అవసరాలు తీర్చుకున్నప్పుడు నైతిక విలువలు చెడవు. కోరిక వ్యక్తిగతమైనపుడు చెడ్డదిగాను, సమిష్టిదైన పుడు మంచిదిగాను వుంటుంది అందుచేత మంచి, చెడ్డలు అనేవి వ్యష్టి, సమిష్టి అనేదానిమీద ఆధారపడివుంటై. అధోచేతనంలో ప్రారంభమైన కోరిక వ్యక్తిగతంగాను, చేతనం (చైతన్యం)లో ప్రారంభమైన కోరిక సమిష్టిగాను అర్థంచేసుకోవచ్చు. అందుచేతనే వ్యక్తి (వ్యష్టి) కోరిక రహస్యంగాను, సమిష్టి కోరికబహిరంగంగాను వుంటుంది.

## భ్రమ

మనం చాలా విషయాలలో భ్రమలకు లోనవుతూ వుంటాం. ఆ విధ మైన భ్రమలోనే జీవిస్తూ వుంటాం. ఆ విధంగా భ్రమలో జీవించడంతో కొంత ఆనందం వున్నది. కాని ఆ విధమైన భ్రమలోని ఆనందం నిజమై నదికాదు. అయినా ఆ భ్రమను వదలం, లేక ఆ భ్రమనుండి మనం బయటపడలేము. దానికి ప్రధానంగా తాత్విక అజ్ఞానమే కారణం. తాత్వి

కంగా మనకు చెప్పబడే అనేక విషయాలు కల్పితాలేగాని సత్యాలు కావు. అయినా సత్య, అసత్యాలు నిర్ణయించుకునే తాహతు మనకులేదు (రాలేదు). ఆ దశలోనే మనం పెంచబడ్డాం, పెరిగాం. అంతకంటే ముందుకు వెళ్ళలేని, వెళ్ళనివ్వని మతకట్టుబాట్లుమనవి. సంప్రదాయ, ఆచారబద్ధమైన మన ఆలోచనలు మనకు విచక్షణ కలిగించని కారణంగా మనలను భ్రమలోనే వుంచుతూ వున్నవి. భ్రమ అనేది ఒకవిధంగా వుండదు. అది అనేక విధాలుగా మన నిత్యజీవితంలో చోటుచేసుకుని, మనకు తెలియకుండానే మనలను మానసికంగా కుంగదీస్తూవుంటుంది, దాని ఆధిక్యతను అది నిలుపుకుంటుంది. మనలను స్వతంత్రాలోచన చేయనివ్వదు. ఆలోచించే భాగం మనది కాదనే దశలోనే వుంచుతుంది.

## నిస్సారమైన జీవితం

అందుచేతనే ఎవరు ఏదిచెప్పినా కాదనం, కాదనలేము. కాదనగల కృతనిశ్చయం మనకు రాదు, రానివ్వదు, ఆ కారణంగా కాదనగల ధైర్యం మనకు రాదు, లేదు. అంతా అనిశ్చయంతోనే కాలంగడచిపోతూవుంటుంది, నిశ్చితమైన జీవితాశయం మనకుండదు. ఆశయంలేనిజీవితం ఎంత నిస్సారంగా వుంటుందో వూహించలేము. ఆలాఊహించేస్థితికూడా మనకుండదు. కానిజీవిస్తూవుంటాము. అది వ్యర్థ (అర్థంలేని)జీవితం.

భ్రమర కీటక న్యాయం అని చెబుతూవుంటారు. ఇందులో ఎంత న్యాయం వున్నదో ఆలోచించం. కాని ఇది కూడా ఒక తాత్వికసత్యంగా చెప్పుకుంటూ వుంటాం. యద్ భావం తద్ భవతి (ఎలాభావిస్తే ఆలా కావడం). జీవితం బుద్బుదప్రాయం, దేహం అశాశ్వతం, ఆత్మ శాశ్వతం. "నేను" నిత్యం, మేను అనిత్యం. "కాయమే ఇది మాయరా ఇది గాలి నింపిన సంచిరా" అనేటటువంటి వాక్యాలలోని భావాలు వైరాగ్యాన్ని బోధిస్తూవున్నవి. తలరాత, తలవిధి, నొసటిరాత, బ్రహ్మలిఖితం, విధి బలీయం, విధికృతం, శివుని ఆజ్ఞలేనిదే చీమైనా కుట్టదు, నూకలు తీరిపోయాయి, పెట్టిపుట్టాలి వగైరా కల్పితభావాలు మనభ్రమలోనివే ఆ భావాల వల్ల మనకు తెలియనిదేదో మనలను నడిపిస్తూ, శాసిస్తూవున్నదనే భ్రమ మనకు కలుగుతూ వుంటుంది.

# అదృష్టమా? సదృష్టమా?

అదృష్టం, దురదృష్టం, దైవనిర్ణయం, ఈశ్వరేచ్ఛ, దేవుని దయ, మనంచేయగలిగింది లేదు, మన చేతిలో ఏముంది, అంతా దైవసంకల్పం అని అనుకోవడంవల్ల మనం చేయగల పనులుకూడా మనం చేయలేమనే భయం మనకు కలుగుతూ వుంటుంది. అది ఒకవిధమైన భ్రమజనిత భావమే. పాపకర్మ, పుణ్యకర్మ, నరకం, స్వర్గం, బంధం, మోక్షం, జన్మ, జన్మరాహిత్యం, హీనజన్మ, ఉత్తమజన్మ, పూర్వజన్మ, పూర్వజన్మ కర్మ ఫలితాలు, జాతకఫలాలు, జ్యోతిష్యం, వాస్తువిధానం, వాస్తుతత్వం-ఈ మొత్తం విషయాలన్నీ తాత్వికసంబంధమైన భ్రమలే. ఆధ్యాత్మిక భావవాదం కల్పించిన భావసంబంధమైన భ్రమలే.

ఈ విధమైన భ్రమలతోకూడిన ఆధ్యాత్మిక భావవాద తాత్వికాంశాలను శంకరుడే తన అద్వైత తాత్వికసూత్రంద్వారా ఖండించాడని చెప్పేవారు అన్నగారు. ఆ తాత్విక సూత్రాలు అర్థంచేసుకుంటే దైనందిన జీవితంలోని తాత్విక భ్రమలు తొలగిపోతాయనికూడ అనేవారు. కాని ఆ సూత్రాలు ఇప్పుడు ప్రచారంచేసే కాలఘట్టంలో లేము. అటువంటి కాలం కాదిది. ఇపుడు భౌతిక విజ్ఞానం ఎంతగానో పెరిగింది. ఆ విజ్ఞాన విషయాలను మనం తాత్విక సమన్వయంతో అర్థంచేసుకుంటే మనకు ఆధ్యాత్మిక భావవాదం కల్పించిన తాత్విక భ్రమలు తొలగిపోతై.

ఆ విధమైన భ్రమలు తొలగిపోతే భ్రమలకారణంగా ఏర్పడిన అనేక విధాలైన భయాలుకూడా తొలగిపోతై. ఆ కారణంగా బ్రతుకు భారం తొలగుతుంది. లేక తొలగించుకోవడానికి వీలు కలుగుతుంది. అంతేకాక మనకు మన ఆధ్యాత్మిక భావవాదం కల్పించిన భావాలనుండి అలవరచుకున్న సాంఘిక వ్యవస్థగాని, ఆర్థిక (వ్యష్టి, వర్గ) వ్యవస్థగాని అర్థరహితమని అర్థమవుతుంది. ఆధ్యాత్మిక(మత)పరమైన మన ఈ వ్యవస్థ నిత్యజీవితంలో సుఖాన్నివ్వకపోగా-ప్రతిక్షణం సమస్యలమధ్య, సంఘర్షణలమధ్య అనిత్య జీవితమే నిత్యమూ గడుపుతున్నాం, ప్రతిక్షణం కల్పించబడే సమస్యలు మానసిక ఆందోళనకు దారితీస్తున్నాయి. ఆర్థికంగా లాభాల

కోసం కల్పించబడే సమస్యలు, సాంఘికంగా మతం కోసం కల్పించబడే సమస్యలు అనుక్షణం మానసికంగా క్రుంగదీస్తూ మానవత్వంపై దెబ్బ తీస్తూవున్నాయి. తత్ ఫలితంగా ప్రశాంత జీవితానికి బదులు అశాంత జీవితమే మనకు మిగులుతూ వున్నది. ప్రతి మానవుడు మానసిక ప్రశాంతినే కోరతాడుగాని అశాంతిని, ఆందోళనను కోరడు కదా? కాని అనుభవిస్తున్న దేమిటి? అందరికి అనుభవంలోనున్నది అశాంతియేగదా? మరి మన తత్వశాస్త్రాన్ని చూచి గర్వపడేది ఇందుకేనా? మరి మతంపేర జరిగే శాంతి ఉపదేశాలు ఇందుకేనా?

శాంతి అంటే ఎలావుంటుంది? అది ఎలా వుండాలి? అది ఆర్థికంతోనే వస్తుందా? మనిషికి ప్రధానం ఆర్థికమేనా? అని ప్రశ్నించే ప్రబుద్ధులు లేక పోలేదు. ఆ ప్రశ్న ఏవిధమైన భ్రమలో పుట్టిందో తెలియదు. శాంతి అనేది ఒక్క ఆర్థికంతోనే వస్తుందని ఏ బుద్ధిమంతుడు అనడు, అనలేడు, అనలేదు. కాని ఆర్థికం కోసం అశాంతిని (కావాలని) సృష్టించే పరిస్థితిని ఈ వ్యష్టి (వ్యక్తి) ఆర్థిక సమాజంలో చూస్తూవున్నాం. వ్యష్టితత్వంపోయి సమిష్టి తత్వం అలవరచుకుంటే సమస్యకు సగం పరిష్కారం కుదిరినట్లే. ఆధ్యాత్మిక భావవాదం కల్పించిన వైయక్తిక (నేను) భావంపోయి భౌతిక తత్వశాస్త్రం నిర్వచించిన సమిష్టి (నేను) అర్థమైతే అన్ని సమస్యలు ఆ అర్థంనుండి పరిష్కారం చేసుకోవచ్చును.

'నేను' కి నిర్వచనం చెప్పడంలోను, వ్యక్తికి స్వేచ్ఛను కోరడం లోను కూడా మతం ఒక విధమైన భ్రమలోనే వుంటున్నామనిపిస్తూ వుంటుంది. తాత్వికంగా కలిగిన (కల్పించుకున్న) భ్రమలను తీసుకు వచ్చి (సమన్వయం లేకుండా) వ్యావహారిక విషయాలకు అంటగట్టజూస్తే అది వికటంగా పరిణమిస్తుంది. "నేను" అంటే నా మేనుతో కూడిన నేనే 'నేను' కాదు. "నేను" అంటే నా సమాజంతో కూడిన (సంబంధపడిన) నేనే "నేను". మేనుతో సంబంధపడని 'నేను' ఎలావుండదో అలాగే సమాజంతో సంబంధపడని 'నేను' కూడ వుండదు (వుండను).

# స్వేచ్ఛా పిపాస

స్వేచ్ఛా పిపాస ఉత్తమమైనదే, ఎవరుకాదంటారు? కానిసత్వంగాని దానిని పోషించే నియంతృత్వంగాని నీచమైనవి కాదని మాత్రం ఎవరం టారు? కాని స్వేచ్ఛ తాత్వికంగానే (పేరుకి మాత్రం) వుంటూ వ్యావహారికంలో (నిజ జీవితంలో) నికృష్టంగా వుండకూడదనేది విజ్ఞులు కోరేది. (ప్రజాస్వామ్యమనే పేరుతో వ్యక్తి స్వేచ్ఛను కాపాడతామని చెప్పుకునే దేశాలలో ఈనాడు జరుగుతున్నదేమిటి? స్వేచ్ఛమాట తరువాత. అసలు వ్యక్తులు కాపాడబడుతున్నారా? లేక వ్యక్తులు పోతే ఫరవాలేదు స్వేచ్ఛ మిగిలితే చాలనేదే సిద్ధాంతమా?)

స్వేచ్ఛ పేరుతో ఈనాడు జరుగుతున్నదేమిటి? అని ప్రశ్నించుకునే అవసరంలేదా? అక్రమాలు, అవినీతి సక్రమంగా జరగడానికి గల స్వేచ్ఛే గదా ఈనాడు ఈ సమాజంలో వున్నది. వ్యక్తి దోపిడి, వ్యక్తి హింస బాహాటంగా సాగుతూ వున్నవిగదా? ఆ కారణంగా ఏ వ్యక్తికి స్వేచ్ఛగాని శాంతిగాని లేదు. దౌర్జన్యం సాగించగలవాడు అది సాగించ గలిగినంత కాలం సాగిస్తూనే వున్నాడు అలాగే అన్ని రంగాలలోను వ్యక్తి స్వేచ్ఛ పేరుతో సమిష్టి (సమాజ) జీవన విధానాన్ని పాడుచేసి అశాంత పరిస్థితిని కల్పిస్తున్నారు. అది వారు మానుకోరు. అది వారికి వున్న స్వేచ్ఛ. కాదంటేను, కూడదంటేను అది వారికి స్వేచ్ఛాభంగం. మరి సమన్వయం ఎలా కుదురుతుంది? చెప్పుకోవడానికి మాత్రం బాగానే వున్న స్వేచ్ఛాతత్వం ఆచరణ రీత్యా ఎలా వుంటుందనేది అందరికి తెలుస్తూనే వున్నదిగదా?

# స్వేచ్ఛా కవచం

ఈ సమాజంలో అందరికి స్వేచ్ఛ వున్నది, ఒక్క శ్రమ చేసేవానికి తప్ప. శ్రమించే వానికి తగినంతగా విశ్రమించే అవకాశం లేనిది ఈ సమాజం. శ్రమించేవాని శ్రమ ఫలితాన్ని తమ సొంతం చేసుకోవడానికి అవిశ్రాంతంగా కృషిచేస్తూ వుంటారు మిగిలినవారు. అందుకు స్వేచ్ఛ

కావాలి వారికి. ఉన్న స్వేచ్ఛచాలదన్నట్లుస్వేచ్ఛా సంఘాలు పెట్టి స్వేచ్ఛా ప్రసంగాలు చేస్తూ వుంటారు. స్వేచ్ఛ పేరుతోనే (ఆ ముసుగులోనే) జరిగే అక్రమాలు సక్రమాలేనని చట్టంచేసుకున్నాం. అందుచేతనే అక్రమాలు చేసేవారు సక్రమంగానే చట్టం (న్యాయస్థానం) నుండి తప్పించుకుంటు న్నారు. మళ్లీ క్రమం తప్పకుండా అక్రమాలు సక్రమంగానే చేస్తూ వున్నారు.

ఉదాహరణకు వ్యక్తి పరంగావున్న వ్యాపారరంగంలో ముఖ్యంగా మందులు తయారు చేస్తూవున్న కంపెనీలు వ్యక్తి ప్రయోజనంకోసం (వ్యక్తుల లాభాలకోసం) వారు ప్రజలను ఏవిధంగా (క్రమంతప్పకుండా) బాధిస్తున్నారో (దోచుకుంటున్నారో) ఆలోచిస్తే బోధపడే విషయాలు అనేకం. ఏ విధమైన మందులు ఎవరికోసం తయారు చేస్తున్నారు? వారు తయారుచేస్తూవున్న మందులు వ్యవస్థత చేకూరుస్తున్నాయా? లేక అవ్యవస్థ తను పెంచుతున్నాయా? వాటివల్ల ప్రజలకు ఉపకారం జరుగుతున్నదా? లేక అపకారం జరుగుతున్నదా? అనేది మనం పరిశీలిస్తే, ఈ వ్యక్తి స్వేచ్ఛా ప్రవృత్తి (స్వైరం) మనలను ఎక్కడకు తీసుకు వెళ్లుతున్నదో అర్థంచేసుకోవచ్చు. అందుచేత సేచ్ఛకు నిర్వచనం అదే అయితే ఆ స్వేచ్ఛ మనకొద్దు. లేకపోతే స్వేచ్ఛకు మరొక పేరు పెట్టుకోవాలి.

మనం చాల విషయాలు చదువుతాం, చాలా విషయాలు చూస్తాం, అంతేకాక చాలా విషయాలు వింటాం. కాని దేనినీ విచక్షణతో చూడం. ఆలోచించం. అందుచేతనే విచక్షణకోల్పోయిన మన ఆలోచనలు మనలను విపరీత (వైరుధ్య) ప్రవర్తనకు ప్రోత్సహిస్తూ వుంటై. అదే మన బలహీ నత మన ఎదుటే జరుగుతూవున్న అన్యాయాలు, అక్రమాలు చూచి (తెలిసి) కూడా పట్టించుకోం. మన ప్రక్కనే వున్న వాని పీక నులుము తూవున్నా చూచి పట్టించుకోం. (అది ఆతనికున్న స్వేచ్ఛ అనుకుం టామో ఏమో తెలియదు).

మనలను మంచికో, చెడ్డకో, ప్రోత్సహించేది మనలోని తాత్వికాం శాలేకదా? మనలో దాగివున్న చెడ్డ (పాత) భావాలకు మంచి (క్రొత్త)

భావాల పూతపూసి వ్యక్త పరుస్తూవుంటాం. కాని అంతరంలో దాగివున్న పాత (చెడ్డ) భావాల ప్రభావం మనం చెడ్డ పనులు చేయడానికి ప్రోత్సా హిస్తూ వుంటుంది. అటువంటి ప్రోత్సాహంతోనే మనం ఏర్పాటుచేసుకున్న కట్టుబాట్లను, ధర్మాలను మనం నిర్భయంగా అధిగమిస్తూవుంటాం. దోపిడి వ్యవస్థపై అనర్గళంగా ప్రసంగాలు చేస్తూవుంటాం. కాని స్వార్థం కోసం అవినీతి పనులుచేస్తూవుంటాం. ఇతరులకు నష్టం కష్టం కలుగుతుందే మోనని కూడా ఆలోచించం. (అర్థికానికి బానిసలమైనా మన్న మాట) దీనినే సమన్వయ రహిత సిద్ధాంత జీవిత విధానం అనిఅనవచ్చు.

ఇందులో ఇతరులను నష్టపరచడంలోను, కష్టపెట్టడంలోను మనం చేస్తూవున్న పనులను (వృత్తి ధర్మంగా) సామాజిక ధర్మంగానే భావిస్తూ వుంటాం. అబద్దపు సాక్ష్యాలు చెప్పించి ముద్దాయిలను రక్షించడం, కల్తీ సరుకులు అమ్మి ధనం సంపాదించడం, రోగ నిదానం సరిగా చేయకనే (శ్రద్ధ వహించక) మందులు (కల్తీవి) ఇస్తూ రోగిని దీర్ఘ కాలిక వ్యాధి గ్రస్తుని గావించి (వుంచి) పీడించడం (అర్థికంగా) చేస్తూవుండటం. తప్పుడు వాగ్దానాలు చేసి (రాజకీయధర్మం) వోట్లు సంపాదించడం, అలా సంపాదించిన పదవిని తన ఆర్థికంకోసం దుర్వినియోగం చేయడం, ఇలాం టివే సమాజంలో అన్ని రంగాలలోను (వృత్తులలోను) చూస్తూవున్నాం. వీటన్నిటికి స్వేచ్ఛ ఒక కవచంగా (ముసుగుగా) పనికి వస్తున్నది.

వ్యావహారిక విషయాలు ఇలావుండగా తాత్విక రంగంలో కూడా ఇటువంటి పరిస్థితి ఏర్పడడం విచారకరం. అద్వైతంలో ద్వైతం చేర్చడం భౌతిక వాదంలో ఆధ్యాత్మిక వాదం చెప్పడం, విజ్ఞానంతో అజ్ఞాన (అశా స్త్రీయ) విషయాలు సమన్వయం చేయబూనడం (అతీత ఇతీంద్రియ శక్తులు) తద్వారా పదార్థశక్తి దైవశక్తిగా నమ్మించాలని ప్రయత్నిం చడం, మంత్రాలకు తంత్రాలకు శాస్త్ర (విజ్ఞాన)ప్రమాణాలు చెప్పబూనడం తాత్వికధర్మంగా భావించబడుతూ వున్నది. ఇక్కడ న్యాయ, అన్యాయాల ప్రసక్తి మన ఆలోచనకురాదు.

# పురాణాల్లోని దేవుళ్లు

పురాణాల్లో మనం చూచే దేవుళ్లు వారి వారి సొంత పనులు చూచుకోవడానికే నానాతిప్పలు పడ్డారు. అటువంటి అసమర్థపు దేవుళ్లు మన మొరలాలకించి మన పనులేమిచేసి పెట్టగలరు? అని ప్రశ్నించి ఈ పద్యాలు చదివి వినిపించేవారు అన్నగారు.

ఇల్లిల్లు తిరిగెడి ఇల్లాలికోసమై
　　దైత్యారి ఊరూరు దరలుచుండ
పొట్టకూడుసులేక కట్టబట్టయులేక
　　త్రిపురారి ముష్టికై తిరుగుచుండ
పెండ్లి పేరంటంపు పెద్ద చిక్కులు లేని
　　క్రీస్తువు సిలువపై త్రెళ్లుచుండ
క్రవ్వించి రేగు శాత్రవులగాంచి మహమ్మ
　　దిరుగూరికి గుడారమెత్తుచుండ
వీరిపాల్వడి నే మొరపెట్టుకొన్న
చెంతకున్ జేరి నా గోడు చెప్పుకొన్న
ఆర్తు రా? తీర్తురా? అడియాస గాక
యట్టివారికి జోతలు బెట్టుటేల!

కవిరాజు త్రిపురనేని ఈ పద్యాలు వ్రాసి అర్ధశతాబ్దందాటింది, కాని, వాటి భావం యెంతవరకు అర్థంచేసుకోగలిగాం? ప్రార్థించితేనే అన్ని కోరికలు తీరునని నమ్మించిన మతం, ప్రార్థనలే అన్ని సమస్యలకు పరిష్కారం అనుకునే ప్రజలు వున్నంతకాలం సమస్యలకు పరిష్కారంలేదు. అందుకోసమే ప్రజలకు ప్రశ్నించే శక్తి కావాలని త్రిపురనేని పదే పదే అంటూ వుండేవాడు. కాని ప్రశ్నించే స్వభావానికి మానవుడింకా అలవాటు పడలేదు.

కవిరాజు త్రిపురనేనికి శతజయంతి సంవత్సరమిది. ఆ సందర్భాన్ని పురస్కరించుకుని అభ్యుదయ కరమైన వారి రచనలు చదివి పైన చెప్పినట్లు ప్రశ్నించుకునే ధైర్యం, సంస్కారం మనం పెంచుకో గలిగితే

ఆయనకు మరో శతజయంతి జరుపుకునే నాటికైనా మనలోని తాత్విక అజ్ఞానానికి, మానసిక బానిసత్వానికి పరిష్కారం దొరుకుతుంది.

ప్రార్థించదగిన వాడు మరొకడులేడు, అందుచేత ప్రార్థించితే వచ్చే ఫలితం లేదు. కనుక ప్రార్థనలతో కాలం వృధా పుచ్చక కాలాన్ని సద్వినియోగం చేసుకో. అదే నీకు అన్నివిధాల తోడ్పడుతుంది. పోయిన కాలం తిరిగిరాదు - అనేవారు అన్నగారు.

పారపనులకన్న ప్రార్థన మరిలేదు
పొలము పనులమించు పూజలేదు
చెట్టుపుట్టగొట్టి సేద్యంబు జేయరా
భ్రమలుతీరు మనకు శ్రమలుతీరు  (గుత్తా శ్రీనివాసరావు)

శ్రమ (పని) కున్న విలువ భక్తికిలేదు. శ్రమవల్ల మనిషి జీవిస్తాడు. భక్తివల్ల జీవి క్షీణిస్తాడు. ఆదే నిజమైన తత్వసారాంశం.

## త్యాగయ్య - రామదాసు

భక్తి అవ్యక్తానికి కారణమని, అవ్యక్తంలో భక్తి పెరుగుతుందని, అవి రెండు పరస్పరాశ్రితాలుగా వృద్ధి చెందుతూ వుంటై అనేవారు అన్నగారు. మా మూడవ అన్న (వీరరాఘవయ్య) గారు కర్ణాటక సంగీతం బాగా అభ్యసించారు. వారు పాడే పాటల్లో త్యాగరాజ కృతులే ఎక్కువగా వుండేవి. అటువంటి సంగీత సాహిత్యాలవల్ల ప్రయోజనం (జ్ఞానం) కలగకపోగా దాస్యభావం పెరుగుతుందనేవారు మా పెద్దన్న చలమయ్యగారు. అందులోని సాహిత్యం సాహిత్య విలువలు కోల్పోయిందని తరచు ఖండిస్తూ వుండేవారు. తరువాత హేతు దృష్టితో స్వయంగా పాటలు వ్రాసి పాడుతూ వుండేవారు మా మూడవ అన్న వీరరాఘవయ్యగారు.

'పరుడులేడు, వున్నది ఒక్కడు' అనే అద్వైత జ్ఞానం కలిగితే భక్తి యెవరు యెవరికి చెయ్యాలి? యెవరిని యెవరు ప్రార్థించాలి? అనేవారు.

త్యాగయ్య, రామదాసులాంటి భక్తులు భక్తి పారవశ్యదశలో వ్రాసిన వ్రాతల్లో (పాటల్లో) పరుడెవడో వున్నాడని అతడిని ప్రార్థిస్తే మోక్షం ప్రాప్తిస్తుందని వ్రాసుకున్నారు. మోక్షం ప్రాప్యవస్తువు కాదనీ అది సిద్ధించే వున్నదనీ అద్వైతమొక్కటే బోధించింది.

ఏ సందర్భంలో యే విషయాన్ని మాట్లాడినా అద్వైత భావాన్ని సమన్వయం చేసి మాట్లాడేవారు అన్నగారు. పరుడు లేడు అనే తన దృఢ నిశ్చయాన్నుండి యెప్పుడూ దిగజారని తాత్వికుడు. వ్యావహారిక జీవితంలో కొంత ఉద్రేకంగా కనిపించినా తాత్విక విషయం వచ్చే సరికి యెంతో సాత్వికంగా మారిపోయేవారు. సాత్విక స్వభావంగలవారు తాత్వికులైతే సమాజానికి మరింత మేలు జరుగుతుందనేవారు. వారు జన్మతః సాత్విక స్వభావం కలవారు కాకపోయినా, సాధన ద్వారాను జీవిత అనుభవాల ద్వారాను సాత్విక బుద్ధిని పెంచుకుని తన తాత్విక దృక్పథానికి దీటైన వ్యక్తిగా నిలిచారు

తాత్విక విషయం చర్చకు వచ్చినపుడు మోమోటాలకుగాని, మినహాయింపులకుగాని తావుండేదికాదు. వారియెడల నేను, నా యెడల వారు అదే విధానాన్ని అనుసరిస్తూ వుండేవాళ్లం. అందువల్ల మాకు మనస్తాపాలుండేవికావు. మనసుకి సంతృప్తే వుండేది. సిద్ధాంత వైరుధ్యాలు, చర్చలు మమ్ములను మరింత దగ్గరకు చేర్చినై. అది సామాన్యంగా అందరికి (సామాన్యులకు) సాధ్యపడే విషయంకాదు. కాని మాకు సాధ్యపడింది.

## కామ్రేడ్ పుచ్చలపల్లి సుందరయ్యగారు

కృష్ణాజిల్లాలో కరువు కాలువ తవ్వుతూవున్న కాలంలో చిన్న చొక్కా, చిన్న లాగు (నిక్కరు) తొడుక్కుని చిన్నపిల్లవాని వేషంలో, రూపంలో కనిపించేవారు పుచ్చలపల్లి సుందరయ్యగారు. అతి సామాన్యమైన మనిషిగా మనుష్యుల మధ్య తిరుగుతూ నిరాడంబరతకు చిహ్నంగా దర్శనమిచ్చే ఆ వ్యక్తి బాహ్య రూపం చిన్నదైనా అంతస్స్వరూపం పెద్దది, ఉన్నతమైనది, ఉత్తమమైనది.

తాను నమ్మిన సిద్ధాంతంగా తాను మారి తానే ఆ సిద్ధాంతానికి ప్రతిరూపంగా కనిపించేవారు, అనిపించేవారు. సిద్ధాంతాన్ని అర్థంచేసు కున్న మేరకు ఆచరిస్తూ తద్వారా ఆ సిద్ధాంతానికి మెరుగునిస్తూ, కొత్త రూపు దిద్దుతూ ఇతరులకు ఆదర్శ ప్రాయుడుగా నిలబడిన ఏకైక వ్యక్తి ఆ వ్యక్తి. అలా వ్యక్తిత్వం మూర్తీభవించిన ఆ వ్యక్తి నాయకుడుగా వేషంలో కనిపించేవాడు కాదు. అలా కనిపించడం కోసం నటించేవాడుకాదు కాని పనిచేయడంలోను, పనిచేయించడంలోను పూర్తిగా నిమగ్నుడైన నాయకుడు, నిజనాయకుడు. బాహ్యరూపం (పర్సనాలిటి) అనేది చిన్న దైనా అతని అంతః ప్రవృత్తి (మానసిక విశాలత్వం) ద్వారా తానొక పెద్ద పర్సనాలిటీని సృష్టించుకున్న వ్యక్తి, మంచి వ్యక్తి. (అసలు పర్స నాలిటి అనే దానికి నిజమైన అర్థం అదే) పుచ్చలపల్లి పేరు వినబడగానే ఉత్తమమైన ఆ పెద్ద స్వరూపం మన మనసులో వుంటుంది. పుచ్చలపల్లి ప్రస్తావన వచ్చినప్పుడల్లా ఆదేవిధంగా అంటూవుండేవారు అన్నగారు. రాజకీయ రంగానికి వెలుగుబాటను చూపించగల మంచి మనిషి ఆ మనిషి అంటూ వుండేవారు.

రాజకీయరంగంలోగాని, తాత్విక రంగంలోగాని మరే యితర రంగాలలోగాని నాయకత్వం వహించేది ఆ మనసేగాని శరీరంకాదు గదా? ఏ మనిషైనా మానసిక వికాసంద్వారా ఉత్తముడు కాగలడు. గొప్పవాడైన ప్రతివాడు మంచివాడు కాలేదు, కాలేడు. మంచివాడైన ప్రతివాడు గొప్పవాడు అవుతాడని అనలేము. గొప్పవాడు నాయకుడైతే కావచ్చునేమోకాని ఆదర్శ వంతుడు మాత్రంకాలేడు. కాని, మంచివాడు నాయకుడైతే తప్పకుండా అతడే అందరకు ఆదర్శపురుషుడవుతాడు. అటువంటి వారిలో ఒకరుగా పుచ్చలపల్లి సుందరయ్యగారిని చెప్పుకోవచ్చు. వారు మనలను విడిచి పోయి అపుడే రెండు సంవత్సరా లయింది. కాని వారిని యెంతవరకు మనం ఆదర్శంగా తీసుకున్నాం? ఎంతవరకు ఆదర్శంగా అంగీకరిస్తున్నాం? అనేది ఆలోచనకు అందని విషయంగా వున్నది.

వ్యక్తి పోయినా వ్యక్తిత్వం భావాల రూపంలో శాశ్వత రూపం దాల్చుతుంది. అటువంటి భావాలే భావితరాలకు మార్గదర్శకాలవుతూ వుంటై. ఆ మార్గంలో నడిచిన వ్యక్తులు మళ్లీ సమాజానికి మార్గదర్శకుల వుతూ వుంటారు. అదే ఉత్తమ సమాజానికి నిదర్శనం. అందుచేత అటువంటి ఉత్తమ వ్యక్తులను ఆదర్శంగా తీసుకుని మనలోని ఉత్తమత్వాన్ని ఉన్నత స్థాయికి తీసుకువెళ్ళడానికి కావలసిన ఆలోచనలు చేద్దాం.

ఆలిండియా కిసాన్ సభ విజయవాడలో జరిగిన సందర్భంలో ఆ సభా ఆవరణంలో వ్యవసాయ వస్తు ప్రదర్శనం యేర్పాటు చేశాం మా సోదరులం. ఆ ప్రదర్శనశాల అందరిని ఆకర్షించింది ఆ రోజుల్లో. ఇంగ్లీషు కూరగాయలు పండించడం మన రైతులకు తెలియదు. మేము యేర్పాటు చేసిన ఆ వ్యవసాయ ప్రదర్శనశాలలో టొమేటో, క్యాబేజి, కాలీఫ్లవర్, నూల్‌ఖోల్, బీట్‌రూట్, క్యారెట్, ముల్లంగి, టర్నిప్ వగైరా అనేక రకాల ఇంగ్లీషు కూరగాయలు, మన దేశీయ కూరగాయలు స్వయంగా పండించి ప్రదర్శింప జేశాం. అంతేగాక ఆయా కూరగాయలను పండించే ఆధునిక పద్ధతులను వివరించి రైతులకు చెబుతూ వుండేవాళ్లం. అందుచేత ఆ వ్యవసాయ ప్రదర్శన మన రైతు సోదరులకు యెంతగానో ఉపయోగపడింది. ఆ కారణంగానే మన ప్రాంతంలో ఆ విధమైన కూరగాయల పంటలు ఈనాడు మన సోదరులు పండిస్తూ మనకెంతగానో ఉపయోగ పడుతున్నారు.

ఆ కిసాన్ సభ జరిగింది 1945 వ సంవత్సరమని జ్ఞాపకం. ఆ సభకు లక్షలకొలది ప్రజా సమీకరణ జరిగింది. ఆలిండియా కిసాన్ సభ నాయకులెందరో ఆ సభకు వచ్చారు. వారందరిని తీసుకువచ్చి మా వ్యవసాయ ప్రదర్శనశాలను వారికి చూపెడుతూ మా సోదరులను వారికి పరిచయం చేస్తూ మమ్ములను ఆనందపరుస్తూ తాము ఆనందపడుతూ వుండేవారు సుందరయ్యగారు.

పృధ్వీసింగ్, బంకింముఖర్జీ లాంటి ప్రముఖులెందరినో తీసుకువచ్చి కర్మవీరులు ఈ సోదరులుఅని మా సోదరులను పరిచయంచేస్తూవుండేవారు

కర్మవీరుడైన పుచ్చలపల్లి. వారికి మా యెడల వున్న అభిప్రాయం అటువంటిది. ఆనాటి ఆ విషయాలు జ్ఞాపకానికొచ్చినకొద్ది మనసు ఉల్లాసంతో ఉప్పొంగి ఈ మాటలు వ్రాయించింది.

## నవ్యమానవవాది తార్కుండే

రాడికల్ హ్యూమనిస్టు, మానవవాది కామ్రేడ్ తార్కుండే తెనాలి వచ్చినప్పుడు నేను, అన్నగారు వారిని కలుసుకున్నాం. యమ్. చక్రపాణి అనే మిత్రుడు మమ్ములను వారికి పరిచయం చేశాడు. అప్పటికి మేము చేస్తూవున్న సాంఘిక సంస్కరణల వివరాలు తెలుసుకొని చాలా సంతోషించారు. మమ్ములను ప్రోత్సహిస్తూ మాట్లాడారు. దేశంలోని మత మౌఢ్యంతోను, మత ఆచార సంప్రదాయాలపేర జరిగిన అన్యాయం ద్వారా మానవుని స్వేచ్ఛాపహరణకు దారితీసిందని అన్నగారన్నారు. అదే నేటి ప్రధాన సమస్యఅని ఆ పరిస్థితినుండి మానవుణ్ణి కాపాడవలసిన బాధ్యత తత్వవేత్తలపై వున్నదని వారన్నారు.

ముఖ్యంగా ఆంధ్రదేశంలో సాంఘిక సంస్కరణల తీరుతెన్నులపై వివరించి చెప్పారు అన్నగారు. ఎమ్. ఎన్. రాయ్‌ని గురించి వారి తాత్వికాంశాలను గురించి అడిగి తెలుసుకున్నారు. కాని, భాష కొంత యిబ్బందిని కలిగించిన కారణంగా ఆ చర్చలు అంత సంతృప్తికరంగా సాగలేదు. ఇంగ్లీషు చదవని లోపం అప్పుడు బాగా అర్థమైంది మాకు.

## నేనెందుకు ప్రధాని కాకూడదు?

ఒకసారి దేశనాయకత్వం విషయమై చర్చకు వచ్చినపుడు "నేనెందుకు ప్రధాని కాకూడదు?" అన్నారు అన్నగారు. అలా అన్నప్పుడు నాకు కొంచెం ఆశ్చర్యమనిపించింది. కాని, యిపుడు నాకు అలాగే అనిపిస్తూ వున్నది. జాతీయమనే పేర ప్రజలకు ఇంగ్లీషు భాషపై ద్వేషం కలిగించిన ఆనాటి మన జాతీయ నాయకులు ఆనాడు చేసిందేమిటి? ఈనాడు ఈ నాయకులు చేస్తున్నదేమిటి? జాతీయ ఉద్యమం పేర జాతీయ పాఠశాలలు పెట్టించి జన సామాన్యానికి ఇంగ్లీషుభాషను దూరం

చేశారు. కాని, వారి పిల్లలకు మాత్రం ఆ భాషను జాగ్రత్తగా చెప్పించుకున్నారు ఆనాడు. ఇప్పుడు చెప్పించుకుంటున్నారు చాలా శ్రద్ధగా.

'ఈ రోజుకీ నాయకుల సంతానమంతా కాన్వెంటు చదువులేగదా? ప్రధానమంత్రి కావడానికో, ముఖ్యమంత్రి కావడానికో అర్హత ఇంగ్లీషు చదివి వుండటమేనా? అదే నిజమైతే నాకు, నాలాంటి మామూలు మనిషికి జరిగిన అన్యాయానికి అర్థమేమిటి? దానికి కారకులెవ్వరు? అనేది ఆలోచించుకుంటే అర్థమవుతుంది దాని ఆంతర్యం, అన్నారు అన్నగారు. భాషపై ద్వేషం కలిగించడం, తద్వారా ప్రయోజనాన్ని పొందడం ఆర్య సంస్కృతిలోని 'చీల్చి పాలించు' అనే దుర్మార్గపు ఆలోచనా విధానమే.

ఇంగ్లీషు పరాయిభాష అని, అందుచేత ఆ భాష జాతీయభాషగా వుండతగదని, వుంచరాదని అంటూ వుంటారు. అదొక భాషా దురభిమానం. ఆ దురభిమానం మూర్తీభవించిన పెద్దలు (స్వార్థులు) హిందీని జాతీయ భాషగా చేయాలని అరుస్తూ వుంటారు. కానీ, హిందీ మాట్లాడని హిందీ మాతృభాషకాని ప్రతి మనిషికి అది పరాయిభాష అనే సంగతి ఆ ప్రబుద్ధులు మరచిపోతూ వుంటారు. బలవంతంగా ఆ భాషను ప్రజలపై రుద్దాలని చూస్తూ వుంటారు.

ఈ రోజున ఇంగ్లీషుభాష ప్రజల భాషైనది. అది బహుజనానికి తెలిసిన భాష కావడమేగాక అది అభ్యసించడానికి సులువైన భాష. అందుచేత అది జనసామాన్యంలోనికి చొచ్చుకుపోతూ వున్నది. అది ఈనాడు ప్రపంచ మానవుల భాషగా అభివృద్ధి పొందుతూ వున్నది. ఆ కారణంగా ఆ భాషను జాతీయభాషగానే వుంచుకుని ప్రాంతీయ భాషలకు తగిన ప్రోత్సాహమిస్తూ అభివృద్ధి చేసుకోవచ్చు. అంతమాత్రంచేత మన జాతీయతకు వచ్చిపడే ముప్పేమి వుండదు. అలా కానప్పుడు జాతీయమనే దానికి అర్థం వుండదు. అదొక కారణంగానే నా అంతరంలోని భావం ఇలా వేదనా ధ్వనిగా ప్రతిధ్వనిస్తూ వున్నది నేనెందుకు ప్రధాని కాకూడదు అని.

## గుత్తా శ్రీనివాసరావుగారు

శ్రీనివాసరావుగారు స్వచ్ఛమైన నాస్తికులు. మా అన్నదమ్ములలో అయిదవవారు. 'మహా వాక్యాలు' అనే పద్యశతకం వ్రాశారు. దైవతత్వ

వాదంపై వ్యంగ్యంగా విమర్శిస్తూ వ్రాసిన పద్యాలవి. నాస్తిక భావాలు అలవర్చుకునే ప్రతివ్యక్తి చదవదగిన పద్యాలు. మా పెద్దన్నగారి తాత్వికాంశాలతో ఏకీభవించక వ్యతిరేకిస్తూ వుండేవారు. వారిద్దరిమధ్య చర్చ చాలా తమాషాగాను, క్లుప్తంగానూ వుండేది.

"నేను" వున్నాను అని నేనంటున్నాను. అందుకు - అంటే ఆ మాట దగ్గర-నీకు అభ్యంతరం లేదుకదా? దేవుడులేడు అని నీవు అంటున్నావు దానికి నాకు అభ్యంతరంలేదు. మరి నీకు, నాకు ఆలోచనల్లోనేగాని అభిప్రాయంలో భేదం లేదనేవారు అన్నగారు. అంతకంటే చర్చ ముందుకు సాగేదికాదు. అంత క్లుప్తంగా ముగిసేది వారిచర్చ.

## కల్లూరి చంద్రమౌళిగారు

కల్లూరి చంద్రమౌళిగారు దేవాదాయ శాఖామాత్యులుగా వున్న సమయంలో మా అన్నగారిని కలిసి ఆ శాఖలో యేదో ఉద్యోగం యేర్పాటు చేస్తామన్నారు. ఆర్థిక యిబ్బందులలోవున్న మా అన్నగార్ని ఆదుకోవాలని, మీకు తెలిసిన తత్వశాస్త్రంద్వారా హిందూ మతాభివృద్ధికి కృషి చేయవచ్చునని అన్నారట వారు. అంతకంటే బుద్ధితక్కువ పని మరొకటి వుండదని తలచి ఆ పనికి అంగీకరించలేదు. స్వేచ్ఛా జీవితంపై మంచి పట్టు వుండేది అన్నగారికి.

స్వాతంత్ర్య పోరాట సమయంలో కలిసి పనిచేశారు వారిద్దరు. మొదటి సాధారణ ఎన్నికలలో వారివెంట తిరిగి వారికి ప్రచారం చేశారు అన్నగారు. ఆ ఎన్నికలలో జయం సంపాదించారు వారు. ఆ తరువాత మద్రాసువచ్చి స్థిరపడ్డారు అన్నగారు. కాలం గడిచింది. మళ్ళీ సాధారణ ఎన్నికలొచ్చినై - ఆ ఎన్నికల ప్రచారంకోసం మా గ్రామం వెళ్ళిన చంద్రమౌళిగారికి తీరని ఆశాభంగం కలిగింది. కారణం అక్కడి ప్రజలంతా ఏక కంఠంతో అన్నమాటలివి. ఇక్కడ కాంగ్రెసు వారంటే చలమయ్యగారే మాకు తెలుసు. వారు చెప్పినట్లుగా జరిగిన ఎన్నికలలో మీకు వోటులేశాము కాని ఇప్పుడు వారిని తీసుకురాకుండా ఈవూరి కల్లు, సారాయి వ్యాపారు

ఖను మీరు వెంటబెట్టు కొచ్చారేమిటి? చలమయ్యగారి కుటుంబం ఇప్పు డెక్కడ వున్నది, వారేమయ్యారు అని మీరేమైన ఆలోచించారా? అని అడిగారట. అంతేకాక వారిని తీసుకురండి, వారు చెప్పినట్లు యెవరికి వోటు వెయ్యమంటే వారికే మా వోటు అన్నారట. ప్రతి పల్లెలోను అదే మాట, అదే సమాధానం. పరిస్థితిని గుర్తించిన చంద్రమౌళిగారు అన్న గారికోసం కబురంపారు. కాని ఆ ఎన్నికల ప్రచారం కోసం అన్నగారు వెళ్ళలేదు. ఫలితంగా పరాజయం కళ్ళజూచారు కల్లూరి చంద్రమౌళిగారు.

ఏ ఆశయం కోసమైతే నిజాయితీగా పనిచేశామో అటువంటి ఆశ యానికి విరుద్ధమైన పద్ధతిలో మన నాయకులు ఆలోచనలు చేయటం జరుగుతున్నదనీ, ఆ కారణంగా నిజాయితీగా పనిచేసిన వారిని చేస్తూ వున్న వారిని దూరం చెసుకోవడం జరుగుతూ వున్నదనీ, అది దేశ క్షేమా నికి మంచి పద్ధతి కాదనీ అంటూ వుండేవారు అన్నగారు.

సామాన్య మానవుల్లో చైతన్యం కలిగించాలనేది గాంధీగారి ఆశ యంగా వుండేది. కాని, జరుగుతున్న దేమిటి? సామాన్య ప్రజలలోని అజ్ఞానాన్ని ఆసరాగా తీసుకుని తాము వోట్లు సంపాదించి అధికారంలోకి రావాలనుకునే ప్రవృత్తి మన నాయకుల్లో పనిచేస్తూ వున్నదని అది మంచి భవిష్యత్తుకు మంచి పద్ధతి కాదనీ ఆవేదన వ్యక్తంచెస్తూ వుండే వారు అన్నగారు.

## వినోబాభావే భూదానం

వినోబా ఆశ్రమం (పవనార్) వెళ్ళాం. వినోబాతో ఇంటర్వ్యూకు ప్రయత్నం చేశాం మాట్లాడదలచిన విషయమేమిటని అడిగారు. తత్వ శాస్త్రం అన్నాం. అంతే అవకాశం ఇవ్వలేదు. ఆయనకు తెలుసు ఆయన లోని తాత్విక బలహీనత. "అనాసక్తి యోగం" అనే పుస్తకం వ్రాశారు (జీవితంమీద ఆసక్తి తగ్గి). కాని, జీవితంమీదవ్యామోహం పెంచుకున్నాడు స్వవచన వ్యాఘాత పరుడు. నిష్కామకర్మ చేయాలని సిద్ధాంతం చెప్పే వాళంతా ఆచరణలో కోరికలు పెంచుకున్న దొంగలు అన్నారు అన్నగారు.

ఒకప్రక్క వైరాగ్యాన్ని బోధిస్తూ మరోప్రక్క బ్రతుకుమీద విపరీతమైన కోరికను పెంచుకుని బ్రతకడం యిష్టంలేనట్లు నటిస్తూ వుంటారు. జీడిపప్పు, ద్రాక్షపండ్లు మేకకు మేపి, ఆ మేక యిచ్చేపాలు త్రాగేవాడు వినోబా. చెప్పేదానికి చేసేదానికీ సంబంధం వుండదు. అటువంటి వ్యక్తుల వల్ల సమాజానికి యేవిధమైన ప్రయోజనం వుండదు. అటువంటి వ్యక్తుల ప్రవర్తనను అసహ్యించుకునేవారు అన్నగారు.

దేశంలో భూమికోసం భూమి దున్నేవారు పోరాటాలు సాగిస్తూ వుండగా ఆ పోరాటాలను నీరుకార్చే ఉద్దేశంతో కుటిల మనస్కుడై భూదాన యజ్ఞం అనేపేర సాగించిన ఆ దానకార్యక్రమం వల్ల భూమి దున్నేవారికి మేలు జరగకపోగా భూస్వాములకు రక్షణ కలిగించినట్లైనది, అదేకదా వారి ఆశయం.

కొద్దిగా దానరూపంలో వచ్చిన ఆ భూములకు సర్వోదయ నాయకులు భూస్వాములైనారు. హిందూమతం కోసం 'కుమారిల భట్టు' తనను తాను అగ్నికి యెలా అర్పించుకున్నాడో అదేవిధంగా భూస్వాములకోసం తననుతాను సర్వోదయానికి అర్పించుకున్న కుటిల సర్వోదయ (సర్వ వినాశకర) నాయకుడు వినోబా. అర్హత లేనివారు అర్హతలు కల్పించుకుని సమాజానికి చీడపురుగు లవుతూ వుంటారు. తాత్వికజ్ఞానం లేనివారు తాత్విక విషయాలు మాట్లాడుతూ ప్రజలను అజ్ఞానంలో వుంచుతూ వుంటారు. అటువంటి అర్హత లేనివారితో ఆలోచనలు సాగించాలని ఆశించడం మనదే బుద్ధితక్కువ అన్నారు అన్నగారు. ఆ తరువాత అటువంటి ప్రయత్నం మరెప్పుడు చేయులేదు మేము.

తత్వవేత్తలలోను, రాజకీయ నాయకులలోను, మరియు సంఘ సంస్కర్తలలోను వ్యక్తిత్వంలేని వ్యక్తులను తరచు చూస్తూవుంటాం. అటువంటి వ్యక్తులవల్ల సమాజానికి యేవిధమైన ప్రయోజనమూ వుండదు. అటువంటి వారినుండి యెటువంటి ప్రయోజనం మనం ఆశించగూడదు. అందుచేత ప్రజలు అటువంటివారిని గుర్తించి జాగ్రత్తగా మెసులుకోవాలి అన్నారు అన్నగారు.

దేశాన్ని తీర్చి దిద్దవలసిన దేశనాయకులకు తాత్విక జ్ఞానం లోపించడంవల్ల దేశ ప్రయోజనంకంటే వారికి వారి స్వార్థ ప్రయోజనమే ముఖ్యంగా వుంటూవున్నది. అటువంటి వారినుండి దేశం బాగుపడే దేముంటుంది దేశప్రజలు నైతికంగా దివాలా తీయడంతప్ప? ఈనాడు జన సామాన్యంలో నైతిక విలువలు లోపించడానికి కారకులు తాత్విక జిజ్ఞాసాశూన్యులైన మన నాయకులే అనేవారు. స్వతంత్ర పోరాట కాలం లోని భావాలను స్వతంత్రానంతరం నాయకులు మరిచారనీ ఆ కారణం గానే మనలోని మానవత్వపు విలువలు తరిగాయనీ వాపోయేవారు అన్నగారు.

దేశమంటే మనుషులన్న సంగతి మరచి, దేశమంటే మట్టి అని తలచి, దానికి హద్దులు సరిహద్దులు సరిదిద్దుకుని ఆ హద్దుల పేచీలతో హద్దులకు పద్దులు వ్రాసి దేశరక్షణ పేరుతో ఖర్చులు పెంచి తమ సొంత పద్దులు పెంచుకుంటూ ప్రజలపై పన్నుల భారం పెంచి దేశప్రజలను భక్షించే భల్లూకపు నాయకులు మనకు దాపురించారని అన్నపుడు నాకు కొంచెం బాధగానే వుండేది. కాని, కాలక్రమంలో వారన్నది కళ్ళారా చూచి నపుడు అన్నగారి దూరదృష్టి అర్థమైనది. ఆ మాత్రపు ముందుచూపు తత్వవేత్తలకు వుంటుందనేది అర్థమైనది.

దేశానికి స్వాతంత్ర్యం వచ్చిందని ఆనాడు ఎంతగానో సంబర పడ్డాము. కాని, ఈనాడు జరుగుతున్న దేమిటి? ఆర్థికరంగంలో స్వార్థం పెరిగింది, తద్వారా అసూయ పెరిగింది. సాంఘిక రంగంలో కుల, మతాల పేర ద్వేషం పెరిగింది. ఆ కారణంగా అనుక్షణం కలహాలతో కల్లోల పరిస్థితి ఏర్పడింది. తాత్వికంగా చూడబోతే అజ్ఞానం పెరిగిపోతూ వున్నది మూఢ నమ్మకాలు మానవులను తప్పుదారి పట్టిస్తూ వున్నై. ఆలోచన పూర్తిగా అంతరించింది. దిక్కు తెలియని దారిలో పయనం సాగుతూ వున్నది. దారి తెలియని ఈ పయనం యేదిక్కుకో? అనేది అర్థం కాకున్నది.

## కాశీ ఘట్టంలో

నోజాతి, నైవవర్ణం అనే సిద్ధాంతం చెప్పిన శంకరుడు గంగానదిలో స్నానంచేసి వస్తూవుండగా అంటరాని వానిగా భావించిన వ్యక్తి వల్ల పరాభవం పొందాడు, ఆచరణలేని సిద్ధాంతం సిద్ధాంతం కాదని గ్రహించాడు. అలా గ్రహించిన ఆ విషయాన్ని ప్రజలకు చెప్పడం ప్రారంభించాడు. అలా చెప్పడం జాత్యహంకారం మూర్తీభవించిన వైదికులకు గిట్టలేదు. ఆ కారణంగా ఆయన శిష్యులద్వారా ఆయనను అంతమొందించారు. బొందితో కైలాసానికి పంపించారు. యేబొందితో, యేరూపంలో, యే సమయంలో యెలా లాభం పొందాలో బాగా తెలిసిన బొందుల మతం మన మతం.

## జాత్యహంకారం - శంబుకుని వధ

అమాయకుడైన రాముడు చెప్పుడు మాటలువిని స్వబుద్ధివని చేయని స్థితిలో శంబుకుని వధించాడు. (శూద్రుడు తపస్సు చేయడం బ్రాహ్మణ జాతికి గిట్టలేదు). ఇక్కడకూడా జాత్యహంకారమే పునాదిగా ఆ పని చేయించింది. అలా శూద్ర బాలుడైన శంబుకుని వధకు కారణమైన ఆ కథను చెప్పేటప్పుడు అన్నగారు చాలా ఆవేశపడేవారు.

'ఘాతుకమగు ఈ క్రూర బ్రాహ్మణ జాతికి దయగలదా? పాతకమనకను పట్టి వధింతురు స్వార్థము అడ్డనను' అని కోపానికి కళ్లెరజేసి పళ్లు పట పట కొరుకుతూ అనేవారు కుల, మత, జాతి విషయాలు ప్రసక్తి వచ్చినపుడు చాలా ఆవేశపడేవారు. చాతుర్వర్ణ్య సిద్ధాంతమే మన దేశానికి చేటు తెచ్చి పెట్టిందనేవారు "చాతుర్వర్ణ్యం మయాసృష్టం" అనే దుర్మార్గపు భావాన్ని స్వార్థ బుద్ధితో భగవద్గీతలో చేర్చారు. ఆ స్వార్థానికి అడ్డువచ్చిన ప్రతివ్యక్తిని హతమార్చుతూ వచ్చారు. అది నేడు మరీ వికృతరూపం దాల్చింది. స్వార్థానికి ద్వేషం తోడైతే అది కలహంగా కార్యరూపం దాల్చుతుంది సమాజాన్ని కల్లోల పరుస్తుంది. అపుడు మానవుడెక్కడ? మానవ విలువలెక్కడ? అనేవారు అన్నగారు.

# పూర్ణ మానవుడు అరిగె రామస్వామిగారు

అచల అద్వైత సిద్ధాంతాలను పూర్ణంగా అర్థంచేసుకుని తదను గుణమైన ఆచరణాత్మక జీవితాన్ని గడిపిన ఆదర్శవ్యక్తి అరిగె రామస్వామి గారు. 1946 వ సంవత్సరం సికింద్రాబాదులో వారి ఆధ్వర్యాన జరిగిన సభలకు అన్నగారిని, బ్రహ్మానందగిరి స్వామీజీని ఆహ్వానించారు. ఆ సం దర్భంలో "బౌద్ధ విప్లవం," "రామరాజ్యం" అనే బుర్రకథలు చెప్పడానికి మమ్ములనుకూడా ఆహ్వానించారు. అక్క రాజరత్నమ్మగారు, అన్న శ్రీని వాసరావుగారు, చెల్లెలు సరోజిని, నేను వెళ్ళడం జరిగింది. ఆ సమయంలో వారితో పరిచయం యేర్పడింది.

ఆ విధంగా యేర్పడిన పరిచయమే మా రెండు కుటుంబాల బంధు త్వానికి కారణమైనది. మా రెండవ అన్న రామానుజయ్యగారి కుమార్తె 'భారతి' రామస్వామిగారి కుమారుడు 'భాస్కరరావు' గార్ల వివాహం జరిపించడంతో మా పరిచయం బంధుత్వంగా మారింది.

నిండైన రూపానికి తగినట్లుగా విశాలమైన స్వరూపం వారిది. స్వభావరీత్యా సాత్వికులు, కాని కార్యనిర్వాహణలో కఠినదీక్ష, కర్తవ్య నిర్వాహణలో నిర్ద్వంద్వత వారి ప్రత్యేకలక్షణం. ఆ లక్షణం లోపించిన ఈనాటి సాంఘిక, రాజకీయ నాయకులకు రామస్వామిగారు ఆదర్శ పురు షులుకావాలి వారిని ఆదర్శంగా తీసుకుని ఆ లోపాలను సరిదిద్దు కోవాలని అంటూ వుండేవారు అన్నగారు.

బౌద్ధ సిద్ధాంతంలోని సంఘదృష్టి, అంబేద్కర్‌లోని స్వేఛ్ఛా వ్యక్తి త్వాలు కలబోసినట్లుగా వుండేది రామస్వామిగారి వ్యక్తిత్వం. చాలాకాలం శాసన సభ్యులుగాను, కొంతకాలం మంత్రి పదవిలోను వుండి తన నియో జకవర్గ ప్రజలకు (వికారాబాద్) ఏకైక నాయకుడుగా ప్రజల మన్ననలందు కున్న రామస్వామిగారు ఒక సామాన్య వ్యక్తిగానే ప్రజలలో కలిసి జీవించారు. తిరుపతి దేవస్థానం ట్రస్టుబోర్డు సభ్యుడుగా జీవితాంతం కొన సాగాడు.

తనకుదక్కిన పదవిని తన సొంత ప్రయోజనాలకు ఎలా యెంత వరకు ఉపయోగించు కోవాలా అని నిరంతరం ఆలోచించే ఈ కాలంలో తనపదవిని స్వలాభంకోసంకాక సమాజసేవకే సదా ఉపయోగించిన నిస్వార్థ, నిరాడంబరజీవి రామస్వామిగారు. ఆయన మరణించే నాటికి పదిఃవున్నా బ్యాంకులో బ్యాలన్సుమాత్రం లేదు. దీపం వుండగానే యిల్లు చక్కదిద్దుకోమనే తత్వం (పదవి వుండగానే ప్రజలను దోచుకోవడం) వారికి తెలియదు. ఈనాటి నాయకుల (మంత్రుల) తత్వానికి భిన్న మైనది వారితత్వం. అది వారి తాత్విక జ్ఞానానికి నిదర్శనం.

తాత్విక జ్ఞానంలేని నాయకులవల్ల సమాజానికి మేలుజరగదు సరి కదా, కీడే జరుగుతుంది. ఒకవ్యక్తి సులభంగా నాయకుడు కావచ్చునేమో కాని, తాత్వికుడు మాత్రం సులభంగా కాలేడు. సహజమైన జిజ్ఞాస, విడ వని పట్టుదల యెవరిలోవుంటే వారే తాత్వికులు కాగలరు. అటువంటి వారిలో ఒకరు అరిగె రామస్వామిగారు అంటూ వుండేవారు అన్నగారు.

## కారంచేడు దుస్సంఘటన

అస్సాంలోను, పంజాబులోను పరిస్థితులు మరీ అధ్వాన్నంగా వున్నై. మన ఆంధ్రాలో కులద్వేషాలు పెరిగిపోవడం చూస్తూవున్నాం. ఆ పరిస్థితులు చూస్తూవుంటే మనసు ఆందోళన చెందుతూవున్నది. ఏనాటి కానాడు శాంతికి దూరమై అశాంత వాతావరణంలో, అనిశ్చిత పరిస్థితులలో జీవించవలసిన పరిస్థితులు వచ్చినై.

కారంచేడు సంఘటనలు తలుచుకుంటే మనం సాంఘికంగా యెంత దిగజారామో, మనిషికి మనిషి యెంత దూరమై పోతున్నాడో, మనిషికి మనిషికిమధ్య కులంపేర అగాధం యెంతగా పెరిగిందో అర్థమవుతూ వున్నది. అంటూ తెనాలి ఆస్పత్రిలో వున్నపుడు ఆవేదన వ్యక్తపరిచారు అన్నగారు.

ఆస్పత్రిలో వారిని కలుసుకోవడానికి వెళ్ళినపుడల్లా కారంచేడు బాధితులకు సంబంధించిన విషయాలు, ఆ సంఘటనకు సంబంధించిన

వివరాలు అడిగి తెలుసుకుంటూవుండేవారు. వారి చివరికాలంలో మరింత మానసిక బాధను కలిగించింది కారంచేడుసమస్య. ఆరోగ్యం చిక్కగానే చీరాలలోని బాధితుల క్యాంపుకువెళ్ళి వారిని చూచి ఓదార్చాలని అంటూ వుండేవారు. కాని, వారికోరిక నెరవేరలేదు. కులంపేర, మతంపేర జరిగే మారణహోమం అంటేనే అన్నగారు ఆవేశపడిపోయేవారు, తాత్విక దృష్టి నుంచి యెంతదూరమైనాము అనేవారు అన్నగారు.

ముఖ్యమంత్రి రామారావుగారిని కలిసి వారికి జరిగిన అన్యాయాన్ని వివరించిచెప్పి బాధితులకు తగిన సహాయం చేయించడం మనకర్తవ్యం అన్నారు. అన్నగారికి రామారావుగారితో మంచి పరిచయం వున్నది. అన్నగారంటే రామారావుగారికి మంచి గౌరవంకూడా వున్నది. కాని, ఆ ప్రయత్నం జరగలేదు.

## పండిత గోపదేవ్‌గారు

గోపదేవ్‌గారిని గురించి అన్నగారిని అడిగినపుడు ఆయన పండితుడే గాని తాత్వికుడు కాదన్నారు. ఆర్యసమాజ ప్రచారకుడైన గోపదేవ్ మనలను వేదకాలం నాటికి తీసుకువెళ్ళాలని చూస్తారు వారికి వేదాలే ప్రమాణం గాని ఉపనిషత్తులదాకా వారి ఆలోచనలు పెరగలేదన్నారు.

ఉపనిషత్‌కాలంలో యెంతో తాత్వికచర్చ జరిగింది. ఆ చర్చల సారాంశాన్ని అర్థం చేసుకుని మనం మరికొంత ఆలోచించాలేగాని ఆలోచన అంతగాలేని వేదాలవల్ల మనకు ప్రయోజన మేమీ వుండదు. ఎన్నోసార్లు చర్చలకు ఆహ్వానించాం వారిని. కాని, అందుకు వారు అంగీకరించలేదు. చర్చలకు అంగీకరించలేదంటే వారి తాత్విక బలహీనత మనకు అర్థమవుతూనే వున్నదిగదా? అంతకంటే చెప్పేదేముంది వారినిగురించి? అన్నారు అన్నగారు.

## ఆచార్య ఎన్. జి. రంగాగారు

ఆంధ్రదేశంలో రైతు నాయకుడుగాను, రైతాంగాన్ని చైతన్యవంతులను గావించిన వ్యక్తిగాను (రైతు బాంధవుడుగా) అందరెరిగిన,

అందరకు తెలిసిన ఒకేఒకవ్యక్తి రంగాగారు. వ్యక్తిగత సుఖజీవితాన్ని త్యాగంచేసి సంఘానికి అంకితమైన సంఘజీవి రంగాగారు. నిస్వార్థత, నిరాడంబరత, ఆదరణ, అభిమానం అనే ఈ నాలుగుగుణాల సమైక్యతా స్వరూపమే మన రంగాగారు అంటూ వుండేవారు అన్నగారు.

ఆంధ్రదేశంలో ప్రప్రథమంగా రైతు సోదరుల సమస్యలపై ఆలోచనలు కేంద్రీకరించి ఆ సమస్యల పరిష్కారంకోసం రైతులను సమీకరించి వారికోసం సంఘాలు పెట్టిన మొదటివ్యక్తి రంగాగారు. ఆ రోజుల్లో ఆంధ్రదేశంలో రాజకీయ పాఠశాలలు నడిపించి సామాన్య మానవునికి రాజకీయ జ్ఞానం కలిగించిన గౌరవంకూడా వారికే దక్కుతుంది. వారు నడిపిన ఆ రాజకీయ పాఠశాలలో నేనుకూడా విద్యార్థినే. ఆ మాట చెప్పడానికి నేను గర్వపడుతున్నాను. ఆ పాఠశాల విద్యార్థిగా నేను సంపాదించిన విద్య జీవితంలో నాకెంతగానో ఉపయోగపడింది, నేనొక వ్యక్తిగా మీముందు నిలబడే వ్యక్తిత్వాన్నిచ్చింది ఆ పాఠశాల నాకు. నేనేకాదు ఆంధ్రదేశంలో అనేకమంది (వారు ఏ రాజకీయ పార్టీలో వున్నవారైనా) ఆ పాఠశాలలో పాఠాలు చదివి చైతన్యవంతులై పైకి వచ్చినవారే.

రంగాగారంటే మా కుటుంబంలోని వారంతా గౌరవభావంతోనే వుంటారు. రాజకీయాలకు భిన్నంగా, వేరుగా వారిని అర్థంచేసుకుని చూడగలగడమే అందుకు కారణం. మా అన్నగారికి వారంటే మరింత గౌరవం. వారితో కలిసి పనిచేసిన సందర్భం, సున్నితమైన వారి మనఃప్రవృత్తి అందుకు కారణమనుకుంటాను. అలాగే వారికికూడా మా కుటుంబమన్నా, మా అన్నగారన్నా ప్రేమాభిమానాలు మిన్నగానే వున్నై. తాత్విక సంబంధం అలాంటిదనిపిస్తూ వుంటుంది.

రంగాగారిని గురించి మొదటగా (నా చిన్నతనంలో) అన్నగారు చెప్పగా విన్నాను. అనాడు ఎంతగొప్పగా, ఎంత ఉన్నతంగా వారిని గురించి అన్నగారు చెబుతూ వుండేవారో అంత ఉన్నతంగా నా మదిలో ఇప్పటికి నిలిచివున్న ఒకేవ్యక్తి రంగాగారు. తనవ్యక్తిత్వంద్వారా అనేకమంది వ్యక్తులలో వ్యక్తిత్వాన్ని పెంచిన వ్యక్తిగా రంగాగారిని చెప్పుకోవచ్చు.

స్వేచ్ఛమైన ప్రజాస్వామ్యవాదిగా మొదటినుండి పార్లమెంటు మెంబరుగా వుంటూ ఇప్పటికీ ఆ స్థానాన్ని నిలబెట్టుకున్న ఏకైకవ్యక్తిగా ఆంధ్రదేశంలో ఆ వ్యక్తే మనకు మిగిలారు. ఆ విషయంలో అందరకు వారే ఆదర్శపురుషులు.

వారు నడిపిన రాజకీయ పాఠశాలలో నేను విద్యార్థిగా వున్నప్పుడు లవణంగారు, రాజ్యం సిన్హాగారు వుండేవారు అయ్యదేవర కాళేశ్వరరావు గారు, కల్లూరి చంద్రమౌళిగారు, మోటూరి సత్యనారాయణగారు, బెజవాడ గోపాలరెడ్డిగారు తదితర నాయకులువచ్చి ఉపన్యాసాలిస్తూ వుండేవారు అనేక విషయాలపై.

అలా వచ్చినవారిలో మోటూరి సత్యనారాయణగారు ప్రత్యేకంగా భాష యెలా అభివృద్ధి చెందింది, ఏ వాక్యం ఎలా ఉచ్చరించాలి అనేది ఎంతో చక్కగా వివరించారు. 'అ' అనేది అంగిలి దగ్గర ఆరంభించి 'అః' అనేది పెదవుల చివర అంత మొందిస్తాం అనిచెప్పి ఆ విధంగా వారు ఉచ్చరించి చెప్పిన పద్ధతి ఎంతో బాగుండేది. ఆ రాజకీయ విద్యార్థిదశ మరపురాని ఆనందకరమైన దశ. అది నా జీవితంలో మలుపుకు మూలమైనదశ.

అప్పట్లో రంగాగారికి ఆరోగ్యం అంతగా బాగుండేదికాదు (చెవిపోటుతో బాధపడుతూ వుండేవారు). అయినప్పటికిని ప్రతిరోజు తన విధిని మరువక తరగతులకువచ్చి తన కర్తవ్యాన్ని నిర్వహిస్తూ వుండేవారు. మమ్ములను యెంతో ఆప్యాయంగా పలకరించి ఉత్సాహపరుస్తూ వుండేవారు. ఆ తరువాత మేము మద్రాసు వెళ్ళిన చాలాకాలం తరువాత ఒక రోజున మద్రాసులో అనుకోని విధంగా వారిని కలుసుకోవడం జరిగింది. ఆ సమయంలోకూడా అదే ఆప్యాయత, అదే చిరునవ్వు.

మనిషంటే మనసు. పార్టీకాదు, కులంకాదు. పార్టీలలోను, కులాలలోను మనిషి బంధించబడితే ఆ మనిషి మనసున్న మనిషిగా మిగలడు. రంగాగారిని ఒకపార్టీ మనిషిగానో, ఒకకులం మనిషిగానో మనం చూడలేము. మనసున్న మనిషిగా ఆయన మనకు దర్శనమిస్తారు. అందుకే వారంటే మనకు గౌరవం.

# సాంస్కృతిక విప్లవం

'నో జాతి ర్నై వవర్ణం నభవతి పురుషో నచస్త్రీ' అనే శ్లోకాన్ని పదేపదే వినిపిస్తూ అందులోని తాత్వికార్థాన్ని వ్యావహారిక విషయాలకు సమన్వయంచేసి చెబుతూ వుండేవారు అన్నగారు. కుల, మత, స్త్రీ పురుష భేదాతీతమైన మానవ సమాజంకోసం ఆ తాత్విక సూత్రాలను సమన్వయం చేయాలనేవారు.

తాత్విక చింతనలేని కోటిమంది సన్యాసులను (సోమరులను) దాయలకట్టి నరికించాడు దేవేంద్రుడు. మతం ముసుగులో తాత్విక చింతన లేని సోమరులు సన్యాసులు. తాము శ్రమచేయకనే యితరుల శ్రమతో జీవించే సోమరులైన పరాన్న భుకులను సమాజం సహించకూడదు. సంఘ శ్రేయస్సుదృష్ట్యా అటువంటివారిని హతమార్చినా యేపాపం లేదన్నారు. (కోటిమంది సన్యాసులను నరికినా నా అధోరోమంకూడా వూడలేదన్నాడట ఇంద్రుడు). ఈ కథ ఆత్మపురాణంలో వున్నదని అంటూ వుండేవారు అన్నగారు.

సాంస్కృతిక సంస్కారం (భావ విప్లవం) జరగనిదే ఈ సమాజానికి నిష్కృతి లేదనేవారు. మనిషిని వదిలేసిన పాత సారస్వతం తగలబెట్టాలనీ బూజుపట్టిన ఆ పాత భావాలను మానవమనస్సుల నుండి తొలగించాలనీ అనేవారు. (చైనాలో సాంస్కృతిక విప్లవం ప్రారంభం కాకముందే పై భావాలను వక్కాణిచేవారు అన్నగారు).

అన్నగారు, నేను గురుశిష్యుల న్యాయాన్ని అనుసరించేవాళ్ళం. ఉదయం లేవగానే మా యింటికివచ్చి యోగక్షేమాలు విచారించి ఒకటి రెండు జటిలమైన తాత్విక విషయాలను వివరించి సమన్వయపరచి చెబుతూ వుండేవారు. వ్యవసాయ సంబంధమైన తన సందేహాలను అడిగి తెలుసుకునేవారు. ఉదయం లేవగానే నేను తోటలో తిరుగుతూ ప్రతిచెట్టుని పరిశీలిస్తూ వాటి యోగక్షేమాలు, అవసరాలు తెలుసుకుంటూ వుండే సమయంలో తానుకూడా నాతోవుంటూ చర్చించే విషయాలవి. ప్రతిదినం ప్రతి

మొక్కను చూస్తూ వాటిలోవచ్చే మార్పుని చూచి ఆనందించడం అనేది మాకు నిత్యకృత్యంగా వుండేది. అది ప్రతి వ్యవసాయదారునికి అనుభవ విషయమే.

## మానవత్వం

సాయంత్రం వ్యవసాయ పనులు ముగించుకుని నేను క్రమం తప్పకుండా వారింటికివెళ్ళేవాడిని. దూరంలోవున్న నన్ను చూడగానే కూర్చునివున్న తాను లేచివచ్చి నన్ను సాదరంగా పలకరించి తనవెంట తీసుకు వెళ్ళేవారు. వారి అభిమానం అటువంటిది. (మా అన్నదమ్ములలో అందరికంటే పెద్దవారు వారు. అందరికంటే చిన్నవాడిని నేను) నాకంటే పెద్దవారు నన్నుచూచి లేవడంవల్ల నాకు అధిక గౌరవ మర్యాద లిస్తున్నారని నాకు బాధగానే వుండేది. కాని, అది వారి పూర్ణ మానవత్వానికి గుర్తుగా భావించి సంతోషపడేవాడిని నేను.

వారియింటి ఆవరణంలోవున్న పూలమొక్కలు, కూరగాయలచెట్లు చూపెడుతూ ప్రతిక్షణం వాటిలోవచ్చే మార్పుని గురించి చెబుతూ ఆనందిస్తూ నన్నానందింపజేసేవారు. "త్వమేవాహం" అనే వాక్యార్థాన్ని అర్థం చేసుకున్న పూర్ణవ్యక్తిగా అగుపించేవారు. ఆ విధంగానే ఆచరించేవారు.

లఘు, గురు అని రెండులేవు. లఘువుంటేగదా గురువుండటానికి? అని వారి ప్రసంగాలలో తరచు అంటూ వుండేవారు. ఆ తాత్వికార్థంనుండి మారకుండా (జారకుండా) అదేభావం వ్యావహారిక మందుకూడా ఆచరణలో చూపెట్టేవారు (ఆయన తన తాత్వికస్థాయినుండి దిగజారని అస్ఖలిత బ్రహ్మచారి).

కాలం పవిత్రమైనది. అదిపోతే తిరిగిరాదు. భక్తి గడవాలన్నా, జ్ఞానం సంపాదించాలన్నా కాలాన్ని సద్వినియోగం చేసుకోవాలనేవారు. 'గుడికి తరచువోయి గొణుగుచుండెడివాడు చెడ్డ పావమేదో చేసియుండు' (త్రిపురనేని). అందుచేత గుడుఃచుట్టు దిరిగి నీ కాలాన్ని నీవు పాడు చేసుకోవద్దు, చిల్లర దేవుళ్ళకు మ్రొక్కి నీవు చిన్నవాడివి కావద్దు,

'పొరపనులకన్న పార్థన మరిలేదు పొలము పనులకన్న పూజలేదు' (గుత్తా శ్రీనివాసరావు). పొలము పనులు చేసేవారికి పూజలెందుకు? అదే అందరికి అన్నంపెట్టే పూజ అనేవారు. విగ్రహారాధన అంటే పూర్తిగా వ్యతిరేకి.

వారిమాటలు విన్నా, వారిచేతలుచూచినా ప్రఖ్యాత తత్వవేత్త "సోక్రటీస్" ను చదువు తున్నట్లుండేది నా మనసుకి. ఇది వ్రాస్తు న్నప్పుడు నా మనసు ద్రవీభూతమయింది నా కన్నులు నీటితో నిండినవి. ఆ కారణంగా కన్నులు మూతబడి రెండు నీటిబొట్టులు కన్నులనుండి జారినై.

## స్వప్న జాగరములు

స్వప్న జాగరములు సరిసమానమని ఆధ్యాత్మికవాదం చెబుతుంది. స్వప్నంలో కనిపించే వస్తువులు తన మనసులో తానే సృష్టించుకుంటాడు. అలా సృష్టించుకున్న వస్తువులను అనుభవించేది తానే, ఆనందించేది, అనుభూతి చెందేది తానే. (కర్త, భోక్తతానే) తానే గుర్రం అవుతాడు, తానే ఆ గుర్రమెక్కి స్వారీచేస్తాడు. తానే స్త్రీ అవుతాడు, తానే పురుషుడై ఆ స్త్రీతో సంభోగిస్తాడు, ఆనందిస్తాడు. స్వప్నంలో రోగి తానే, వైద్యుడు తానే. తానే రోగమై ఆ రోగానికి తానే మందవుతాడు. తన మనసే తనకు భిన్నమైన వస్తురూపం పొందుతుంది. అక్కడ తనకు మిత్రుడు తానే, శత్రువు తానే. మిత్రత్వంలో వుండే ఆనందం, శతౄత్వంలో వుండే దుఃఖం రెండూ తానై అనుభవిస్తాడు.

సృష్టి, స్థితి, లయకారులైన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరాదుల లక్షణాలు గల త్రిమూర్తిత్వం తాను పొందుతాడన్నమాట. అందుచేత తన మనసు యెలాఅనుకుంటే జగత్తు అలా అవుతుందని వారిభావం. అందుచేతనే బాహ్య జగత్తుకు అంతః ప్రవృత్తి కారణ మనుకున్నారు. అందుచేతనే స్వప్నంలో కనిపించే వస్తువులకు అస్తిత్వం లేనట్లుగానే జాగ్రత్తలోని జగత్తుకికూడా అస్తిత్వం లేదని అనుకోవడం జరిగింది. అందువల్ల మిథ్యా భావం అభివృద్ధి అయింది మిథ్య అనేదానికి అర్థం మారిపోయింది.

స్వప్న జాగరములు సమానమని భౌతిక తత్వశాస్త్రం అంగీకరించదు. ఈ విషయం అన్నగారితో చర్చకు వచ్చినప్పుడు అనేక గ్రంథాలనుండి అనేక శ్లోకాలను, పద్యాలను చదివి ఉదాహరించి వివరించారు. ఆ కాలంలో వారికున్న జ్ఞానాన్నిబట్టి అలా భావించారు. ఆ భావాలను గ్రంథస్థం చేశారు. అంతమాత్రంచేత వాటిని నమ్ముతూ కూర్చోలేంకదా? మన తర్క బుద్ధికి, హేతుబద్ధతకు సరిపోతుందా? అని ఆలోచించాలిగదా మనం అనే వాడిని నేను.

శాస్త్ర ప్రమాణాలను కాదనలేంకదా అనేవారు. మీరు శాస్త్రమనేది శాస్త్రంకాదు. విజ్ఞానరీత్యా (సైన్సుద్వారా) విశ్లేషణకు నిలిచే విషయాన్నే శాస్త్రమంటాం మనం ఆధ్యాత్మిక తత్వశాస్త్రమని చెప్పుకునే మతపరమైన గ్రంథాలు శాస్త్రాలుకావు అందుచేతనే తాత్విక విషయ పరిశీలనకు శాస్త్ర (మతగ్రంథ) ప్రమాణం పనికిరాదని శంకరుడే అన్నట్లు విన్నాంకదా? అని నేనన్నాను. ఆనాటితో ఆ విషయం వదిలేశారు అన్నగారు.

గ్రంథ ప్రమాణాలు జ్ఞానానికి అగడ్తలు. గ్రంథాలు చదవడంవేరు, వాటిని ప్రమాణంగా తీసుకోవడంవేరు. సొంత ఆలోచన, స్వబుద్ధితో పరి శీలన, విచక్షణతో నిర్ణయం చేసుకోవాలి. ఆ నిర్ణయం చేసుకున్న విషయం ప్రమాణానికి సరిపోతుందా అని చూచుకోవచ్చు. గ్రంథ పఠనంతో ఆగి పోరాదు. శంకరుడు అలా చేయగలిగాడు గనుకనే సంప్రదాయంగా చెప్ప బడుతూవున్న ఆస్తిక విధానాన్ని ఖండించి నూతన జ్ఞాన సిద్ధాంతాన్ని బోధించగలిగాడు. ఆ కాలాని కది తాత్విక విప్లవమే. దానినే దేవునిపై తిరుగుబాటు అంటూ వుండేవారు అన్నగారు.

## బింబ - ప్రతిబింబాలు

ఘట, తటాక, నదీ జలాలయందు కాన్పించు ప్రతిబింబానికి సూర్య బింబం కారణం. సూర్యబింబం ఒక్కటే అయినా ప్రతిబింబాలు అనేకాలుగా గోచరిస్తూవున్నై. ఘట, తటాకాలయందు జలం ఆవిరిగా మారిపోయి నపుడు (నీరు లేకుండా పోయినపుడు) ప్రతిబింబం అంతర్ధాన మవుతుంది.

ప్రతిబింబం తోచుటలేదు. కాని సూర్యబింబానికి ఏ విధమైన మార్పులేక నిశ్చలంగా వుంటున్నది. అట్లే పరమాత్మ కారణంగా దేహమునందు కాన్పించుజీవాత్మ దేహము నశించినంతనే తోచుటలేదు. అంటే దేహానంతరం జీవాత్మ పరమాత్మలో లయమవుతున్నది (ఐక్యమవుతున్నది). కార్య రూపంలోవున్న జీవాత్మ, కారణరూపమైన పరమాత్మలో (మరణానంతరం) ఐక్యమవుతుందని సంప్రదాయ వేదాంతులు చెబుతూ వుంటారు. ఆ వాదం శంకరునిచే ఖండించబడింది. "విదేహముక్తి" అనే సిద్ధాంత దోష వాక్య మును శంకరుడు అంగీకరించలేదు. జీవన్ముక్తి అనే వాక్యాన్ని ప్రచారం చేశాడు.

## జీవుడు - పాపకర్మలు

జీవుడు పాపకర్మలు చేస్తే హీనజాతుల దేహాలయందు మళ్ళీ జన్మకు వస్తాడనీ, పుణ్యకర్మలు చేస్తే దేహాన్ని చాలించిన జీవాత్మ పరమాత్మలో ఐక్యమై జన్మరాహిత్యం జరిగి మోక్షం బొందుతాడనీ వారినమ్మకం. అదే విదేహముక్తి అనికూడా నమ్ముతూవచ్చారు. ఈ వాదననుకూడా శంకరుడు ఖండించాడు. (విదేహముక్తి వేరు, జీవన్ముక్తి వేరు) జన్మరాహిత్యమే మోక్షమనుకున్నారు వైదికులు.

యజ్ఞ యాగాది క్రతువులు చేసిన పుణ్యఫలితంగా జీవుడు స్వర్గానికి వెళతాడనీ, అలాంటి పుణ్యకార్యాలు చేయని పాపజీవులు నరకానికి వెళ తారనీ చెప్పిన వైదిక సిద్ధాంతం తాత్విక జిజ్ఞాస పెరిగిన ఉపనిషత్ కాలానంతరం స్వర్గం అనేదానిని వదిలేసి మోక్షం అనేదానిని ప్రవేశ పెట్టింది. ఆ మోక్షాన్ని భక్తి, యోగ, జ్ఞాన మార్గాలద్వారా సాధించవచ్చు వని అనుకున్నారు. అలా చెబుతూ వచ్చారు. కర్మఫలితాలు జీవుడు తన జన్మపరంపరలో అనుభవిస్తాడని చెప్పడం పై విషయాలకు విరుద్ధంకాదా?

అలాంటి పరస్పర తాత్వికాంశాలను యెలా సమన్వయం చేసు కుంటాం? అది అద్వైతం, ద్వైతం కాని అగమ్య గోచరం. అందుచేతనే శంకరుడు వాటిని ఖండించాడు. మోక్షం భక్తి, యోగ సాధనల ద్వారా

సాధించేదికాదనీ, జ్ఞానంవల్ల ప్రాప్తించేది కాదనీ చెప్పి జ్ఞానమే మోక్షమని నూతన ప్రతిపాదన చేశాడు. బంధంవుంటే మోక్షంగాని జీవుడు తాత్వికంగా బద్ధుడేకానపుడు మోక్షం క్రొత్తగా పొందడమనేది తాత్వికంగా తప్పన్నాడు. 'నబంధం, నమోక్షం' అని అందుకే అన్నాడు.

## భక్తి - భారత భాగవతాలు

ఆ కారణంగా సంప్రదాయ వైదిక సిద్ధాంతంమీద దెబ్బతీసిన శంకరునిపై మత సంప్రదాయకులు (జ్ఞానశూన్యులు) దండెత్తారు. ఆయన సిద్ధాంతం వారికి గిట్టలేదు. జ్ఞానంవస్తే మతం నిలవదు, అందుకే ఆచార బద్ధమైన మతోద్ధరణకోసం ద్వైతం ప్రచారంలోకి తీసుకువచ్చారు. అభిన్నమైన జీవ, బ్రహ్మములకు భిన్నత్వం ప్రవేశపెట్టారు. భక్తిని ప్రచారం చేశారు. భారత, భాగవతాది భక్తికథలు విరివిగా వ్రాయబడినై.

భక్తికి ప్రాముఖ్యం పెరిగింది. సంగీత, సాహిత్య, నాట్య, నాటక వగైరా కళారూపాలను అందుకు సాధనాలుగా వుపయోగించుకున్నారు. దానితో మనిషి భక్తి పారవశ్యానికి దాసుడైనాడు. జ్ఞాన తత్వానికి దూరమైనాడు. భక్తి చేయని వ్యక్తిని న్యూనంగా చూచేదశకు పతనం చెందింది ఈ సమాజం. ఫలితంగా కావలసినంత అజ్ఞానం పెరిగింది. (మత్తునిచ్చే మత్తు ద్రవ్యాలకంటే మించిన మత్తునీయగలదు కళా రూపాలలో రంగరించిన భక్తిమందు). ఇది నేటి మనతాత్విక పరిస్థితి అని వివరించారు అన్నగారు. అదే సరైన విశ్లేషణ.

## సాంకేతిక విజ్ఞానం - తాత్విక అజ్ఞానం

ఇటు విజ్ఞానరీత్యా అభివృద్ధి చెందిన భౌతిక తత్వశాస్త్రంగాని, అటు ఆధ్యాత్మికపరంగా చెప్పబడిన జ్ఞానమార్గంగాని తెలుసుకునే పరిస్థితిలోలేరు మనప్రజలు. అదే విచారకరమైన విషయం. విజ్ఞానరీత్యా పెరిగిన సాంకేతిక సాధనాలద్వారా ఆధునిక మైన వస్తూత్పత్తి జరుగుతూవున్నది. ఆ వస్తువులను విరివిగా వుపయోగించు కుంటున్నాడు, అనుభవిస్తున్నాడు మనిషి.

వైజ్ఞానిక పరంగా వచ్చిన మార్పుల సహాయంతో వ్యవసాయ రంగంలో ఉత్పత్తి బాగా పెరగడానికి అవకాశం యేర్పడింది. అలాగే యితర రంగాలలో యెన్నో మార్పులు వచ్చినై. తద్వారా మానవుడు తన జీవితాన్ని సుఖవంతం చేసుకుంటున్నాడు. కాని, తనలోని తాత్విక అజ్ఞానంవల్ల ఈ వచ్చిన సౌకర్యాలన్నీ భౌతిక విజ్ఞానంవల్ల వచ్చినవని తెలుసుకోక పోవడం మూలంగా తన వైయక్తిక సుఖ, భోగాలకు తిరిగి దేవునిపై నమ్మకం పెంచుకుంటున్నాడు. తాత్వికంగా తిరోగమనం చెందుతున్నాడు నమ్మకమనేది మనిషిని ఆలోచించ నివ్వదు. అదే ఇప్పుడు జరుగుతూవున్నది. ఆ నమ్మకంలో తృప్తి చెందుతున్నాడేగాని వాస్తవం తెలుసుకోలేక పోతున్నాడు.

## స సాయిబాబా

అద్వైత సభలకు ద్వైత, విశిష్టా ద్వైతభక్తులు వచ్చినట్లుగనే సత్య సాయిబాబా భక్తులుకూడా వస్తూవుండేవారు. సత్య సాయిబాబా భక్త బృందం పుట్టపర్తి వెళుతూ అన్నగారిని కలిసి బాబాను చూడటానికి వెళ్లుతున్నట్లు చెప్పారు. అలాగా అయితే "నేను" వారిని అడిగినట్లు చెప్పమన్నారు అన్నగారు. అలాగే, అక్కడ బాబాను కలుసుకున్నప్పుడు మా గురువుగారు మిమ్ములను, మీ క్షేమములను అడిగినట్లు చెప్పమన్నారని చెప్పారు.

అలా ఆ భక్తబృదం చెప్పగానే అలాగా మంచిది అని సంతోషంగా "నేను" కూడా మీ గురువుగారిని అడిగినట్లు చెప్పమన్నారట బాబాగారు. అందుకు ఆ భక్తబృందం ఆశ్చర్యపడి మీకు మా గురువుగారు తెలుసా అని అడిగారట. లౌకికం తెలిసిన బాబా 'తెలుసు మీ గురువుగారు తెలియక పోవడమేమిటి' అన్నారట. దాంతో మా అన్నగారిమీద అపరిమితమైన గౌరవం పెరిగింది ఆ భక్త బృందానికి, శిష్యవర్గానికి.

ఆధ్యాత్మికవాదులు ఇలాగే పరస్పరం భక్తులదగ్గర గౌరవం పెంచుకునే యుక్తులు ప్రయోగిస్తూ వుంటారు. ఒకసారి ఒక సాయీ భక్తుడు

ఒక బంగారు ఉంగరంతెచ్చి అన్నగారికి చూపెట్టి ఈ ఉంగరాన్ని మా బాబాగారు స్వయంగా (శూన్యంనుండి) సృష్టించారని చెప్పాడు. ఆ ఉంగరాన్ని తన చేతిలోకి తీసుకుని అటూ, ఇటూ త్రిప్పిచూచి బాగానేవున్నది నిజమైన వుంగరమే. కాని, మా గురువు (శంకరుడు) బ్రహ్మ సృష్టించిన ఇంత పెద్ద ఈ జగత్తుని మిధ్యచేశాడుగదా? మరి మీ బాబా తాను సృష్టించిన ఈ చిన్న వుంగరాన్ని మిధ్యచేయగలడా? అన్నారు అన్నగారు.

మిధ్యఅంటే యేమిటి? మాయఅంటే యేమిటి? సత్యం అంటే యేమిటి? అసత్యం అంటే యేమిటి? శూన్యం అంటే యేమిటి? శూన్యంలో నుండి సృష్టించడ మంటే యేమిటి? అని తెలియని ఆ సాయిబాబా భక్తుడు నోరుమూసుకున్నాడు. పాపం ఏం చెప్పగలడు? అతడు భక్తుడు అని అంటూనే వున్నాంగదా? ఎక్కడైనా, ఏ విషయంలో భక్తుడైనా అంతే పరిస్థితి భక్తునికి తెలియడమంటూ వుండదు. నమ్మకం మాత్రమే ప్రబలంగా వుంటుంది. నమ్మకం తెలియనివ్వదుకదా? తెలిస్తే భక్తుడు కానే కాడు కదా?

సాయిబాబా పెద్ద గారడివాడు, బ్రతకనేర్చినవాడు, అంతేగాని తాత్వికం తెలిసిన వాడుకాడు. తత్వం తెలిసినవాడు మహత్యాలు, మహిమలు వున్నవని చెప్పడు. అమాయకులైన ప్రజలు అతని మాయలోబడి అతనుచేసే గారడి విద్యలను మహత్వాలని; మహిమలని అనుకుని మోసపోతూ వుంటారు. సామాన్యుడు బజారులో బ్రతుకుతెరువుకోసం చేస్తే గారడి అంటున్నాం. మతం ముసుగులో స్వాముల వేషంలో చేసేదానిని మహత్వాలని, మహిమలని అంటున్నాం. ఇది మనదేశానికి పట్టిన పీడ. తాత్విక పరిశీలనకు మానవుడు దూరమైనకొద్ది ఇటువంటి పీడలు అతనిని పట్టి పీడిస్తూ వుంటై అనేవారు అన్నగారు.

## పోతులూరి వీరబ్రహ్మంగారు

పోతులూరి వీరబ్రహ్మంగారి కాలజ్ఞానం సంగతేమిటండి అని అడిగాడు ఒక సభలో ఒక భక్తుడు. పూజకు పువ్వులు తెమ్మని శిష్యుణ్ణి పంపించిన బ్రహ్మంగారికి ఆ శిష్యుడు పువ్వులు తెచ్చేలోగానే తాను మరణిస్తానని

తెలియదు. శిష్యుడికి పూర్ణ మంత్రం చెప్పకుండానే అతడిని నట్టేటముంచి తాను మరణించవలసి వస్తుందని తెలియని బ్రహ్మంగారికి కాలజ్ఞానంచెప్పే జ్ఞానం వున్నదని నమ్మే మనం యేపాటి జ్ఞానం కలిగివున్నామనేది అర్థ మవుతుంది. కాలజ్ఞానమనేది అంతా బూటకం అన్నారు అన్నగారు.

బ్రహ్మంగారి జీవిత చరిత్రలో మరొక విశేషం వున్నది. అది మీకు తెలియదు. బ్రహ్మంగారిది జీవ సమాధిగాదు, పాడుగాదు. ఆయన ఆత్మ హత్య చేసుకున్నాడు అన్నారు అన్న గా రు. ఆ వార్త విన్న అక్కడి వారంతా ఆశ్చర్యంతో అదేమిటండి అలాఅంటారు అని అడిగారు. బ్రహ్మం గారు బ్రాహ్మణ వ్యతిరేకి. ఆయన బ్రాహ్మణుడు కాదనే నెపంతో బ్రహ్మవిద్య వినడానికి, చెప్పడానికికూడా అంగీకరించలేదు బ్రాహ్మణులు. అందుచేత ఆ విద్యను గురు సాంప్రదాయకంగా వినే అవకాశం లేకపోయింది. ఆ పరి స్థితి వారి మానసిక పరిస్థితిని కృంగదీసింది.

## సంప్రదాయము - బ్రహ్మవిద్య

ఎలాగో సంప్రదాయాన్నెదిరించి తాను విద్యను సంపాదించ గలి గారు. కాని, అలా సంప్రదాయాన్నెదిరించి విద్యనుసంపాదించిన బ్రహ్మం గారే తన శిష్యునికి పూర్ణ మంత్రం చెప్పడానికి అర్హత లేదనే సంప్రదాయ బంధానికి బద్ధుడైపోయాడు. ఆ న్యూనతా భావమే ఆయన మరణానికి కారణ మైనది. పూజకు పువ్వులు తెమ్మనే నెపంతో శిష్యుణ్ణిపంపి అతడు తిరిగివచ్చే లోగా జీవసమాధి (ఆత్మహత్య) చేసుకున్నాడు అని చెప్పి 'ఈ విషయం యెవరితోను అనవద్దు. పాపం ఆయన శిష్యులు ఈ విషయం ఇలా వింటే బాధపడతారు' అన్నారు అన్నగారు.

(గురువువద్ద సంప్రదాయ బద్ధంగా విద్య నభ్యసించివుంటే ఆ గురు వుగారివద్ద అధికారం పొందేవరకు ఆ విద్యను యితరులకు చెప్పే అర్హత ఆ శిష్యునకు వుండదు, ఇది సంప్రదాయం. ఈ సంప్రదాయాన్ని తన మీద తానే అమలు జరుపుకున్నాడు బ్రహ్మంగారు).

బ్రహ్మంగారు బ్రాహ్మణేతరుడు అనే సాకుతో బ్రాహ్మణులు వారికి విద్య చెప్పడానికి అంగీకరించలేదు. అందుచేత బ్రాహ్మణజాతిపై పోరాడి

ఆ విద్యను సాధించారు. కాని, గురువు దగ్గర అధికార మంత్రం పొందే అవకాశం లేకపోవడంచేత అది ఒక పెద్ద లోపంగా భావించారు. ఆ భావం వారిని మానసికంగా కృంగదీసింది. జీవసమాధికి కారణమయింది (ఆత్మ హత్యకు దారితీసింది).

అన్నగారు బ్రహ్మంగారి మఠానికి సతీసమేతంగా వెళ్ళివచ్చారు. అక్కడకు వెళ్ళిన సమయంలో రెండురోజులు వుండి సభలు జరిపి ప్రాథ మిక తాత్విక విషయాలు బోధించారట. ఆ సమయంలో బ్రహ్మంగారి సమాధి చూద్దురుగాని రండని అన్నారట మఠవాసులు. ఆత్మహత్య చేసు కున్నవారి సమాధి చూచేదేమిటి? అన్నారట అన్నగారు. అలా నిర్మొగ మాటంగా అన్నందుకు బాధపడ్డారట అక్కడివారు. కాని, అదేమిటని అడగ లేదట వారు.

## బెజవాడ గోపాలరెడ్డి గారు

గోపాలరెడ్డిగారు స్వతహాగా సాత్విక స్వభావులు. సాత్వికులైనవారు తాత్వికులైతే సమాజానికి తగినంత మేలు జరుగుతుందని అన్నగారంటూ వుండేవారు. స్వాతంత్ర్య పోరాటకాలంలో గోపాలరెడ్డిగారు, అన్నగారు తిరుచినాపల్లి జైలులో కలిసి వుండేవారట. ఆ పరిచయంతో అన్నగారికి కలిగిన అభిప్రాయం అది.

ఆర్థికంగా యెంతో ఉన్నత స్థితిలోవున్నా, భౌతిక సుఖ భోగాలకు తగినంత అవకాశంవున్నా ఆ సుఖం సుఖంకాదని, ఆ సుఖాన్ని మన స్ఫూర్తిగా త్యజించి నిజమైన సుఖాన్వేషణలో భాగంగానే దేశ స్వాతం త్ర్యాన్నపేక్షించి స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొన్న నిస్వార్థ, నిరాడంబర జీవి గోపాలరెడ్డిగారు. నిండైన విగ్రహరూపం, ఆ రూపానికి తగిన మాన సిక స్వరూపం వారిది.

ఒక సందర్భంలో గోపాలరెడ్డిగారు, మాలతీ చందూరుగారు మా వూరు (పుష్పగిరి) వచ్చారు. మా మూడవ అన్న వీరరాఘవయ్య గారికి వారితోవున్న పరిచయంతో వారిని తీసుకువచ్చారు. మా వ్యవసాయ

కృషిని చూచి సంతోషించారు. వివరాలు అడిగి తెలుసుకుని ఆనందించారు. అలా ఆ విషయాలు తెలుసుకున్న తరువాత నాకుకూడా ఇక్కడే వుండి పోవాలని వున్నది. రెండెకరాల తోటనుకొని ఇక్కడే వుండిపోతాను అన్నారు మాలతీ చందూరుగారు. నీ కెందుకమ్మా, ఆ కృషి నీవల్లకాదు; చూచినంత సులభంకావు చేతలు, ఆ కృషిలో నిరంతరం నిమగ్నమైన వారికే అది సాధ్యం అన్నారు గోపాలరెడ్డిగారు.

కృషితో నాస్తి దుర్భిక్షం అనే వాక్యార్థాన్ని పూర్తిగా విశ్వసించిన వారికే అది సాధ్యం. నాస్తికులైన వారే ఆ వాక్యాన్ని అర్థం చేసుకుని ఆచరించగలరు అన్నారు గోపాలరెడ్డిగారు. మీరు నాస్తికులెలా అయ్యారు? అని అడిగారు మాలతీ చందూరు గారు. నాస్తికులు కొత్తగా అవడం అంటూ వుంటదండీ, మానవులు నాస్తికులుగానే పుడతారు. పుట్టుకలో యే భావమూ వుండదు. కాని, పుట్టిన తరువాత తాను పెరిగే పరిస్థితుల, పరిస రాల, భావాల ప్రభావం వల్లను, పెద్దల పెంపకంలో ఆస్తిక భావాలు (దేవుడు వున్నాడనే భావం) వారికి నూరిపోస్తారు. అందువల్ల ఆస్తికులుగా మానవులు మారతారేగాని నాస్తికులుగా కొత్తగా మారరు అన్నాం.

మా కుటుంబ రాజకీయ పోరాటాల, సాంఘిక సంస్కరణల చరిత్ర అడిగి తెలుసుకొని చాలా సంతోషించారు. మాలోని తాత్విక పరిణామాలు తెలుసుకొని 'మీరు దేవుణ్ణే యెదిరించారు (తాత్వికంగా); ఇక మీకెదురు లేదు; యే శక్తీ మిమ్ములను యెదిరించలేదు. విజృంభించి ముందుకు, మరింత ముందుకు సాగిపొండి అన్నారు. అన్ని కులాల్లోను మీరు కలిసి పొండి. అన్ని కులాలను మీలో కలుపుకోండి. తద్వారా కులహద్దులు చెరి పెయ్యండి' అన్నారు గోపాలరెడ్డిగారు మమ్ములనెంతో ఉత్సాహపరుస్తూ.

అలా అంటూ యెంతగానో మమ్ములను ప్రోత్సహించారు. మనలో యెంతమంది అటువంటి విశాల మనస్తత్వం గలవారుంటారు అనిపించింది ఆ మాటలు వారంటున్నప్పుడు. సాత్వికులైనవారు తాత్వికులైతే సమా జానికి మరింత మేలు జరుగుతుందని నా చిన్నతనంలో వారిని గురించి అన్నగారన్న మాటలు నాకు జ్ఞాపకానికొచ్చినై. ఆ జ్ఞాపకమే ఈ వ్రాతకు మూలమైనది.

## చలంగారు - తాత్విక తిరోగమనం

చలం (గుడిపాటి వెంకటచలం) గారితో మా అన్న (గుత్తా చలమయ్య) గారికి పరిచయం వుండేది. ఆ రోజుల్లో ఆయన, ఈయన మంచి వయసులో వుండగా ఫ్రీ లవ్ సొసైటీ అని పెట్టి నడిపిన రోజులవి. (అప్పటికి, ఇప్పటికి దానికి సరైన, పూర్తి అర్థం యేమిటనేది యెవరికి అర్థమైనట్లులేదు) స్త్రీలకు స్వేచ్ఛకావాలనే భావంతో ఆ విషయమై ఆవేదన పడి ఎన్నో పుస్తకాలు వ్రాశారు వారు. ఆంధ్రదేశంలో చలం సాహిత్యానికి ప్రత్యేక స్థానమున్నది. ఆ సాహిత్యంపై అన్నగారికి మంచి అభిప్రాయం వుండేది స్త్రీలపై సానుభూతి చూపెట్టి వారి సమస్యలకు పరిష్కారం ఆలోచించడం ఆ రచనల ముఖ్యోద్దేశం.

మను ధర్మశాస్త్రం ప్రకారం స్త్రీలకు యేవిధమైన స్వేచ్ఛ వుండ కూడదు. (మనువు దృష్టిలో స్త్రీ పురుషునితో సరి సమానమైన జీవికాదు). హిందూ మతస్థులకు అది ప్రమాణ గ్రంధం. అటువంటి మనుధర్మ శాస్త్ర సంబంధమైన మత కట్టుబాట్లను యెదిరించ గలిగితేనే స్త్రీలు స్వేచ్ఛ పొందగలుగుతారు. స్త్రీలుకూడా మానవులని గుర్తించబడతారు. లేనిచో వారు మానవులేకాదు. ఆ కారణంగా వారికి స్వేచ్ఛ అనే మాటేలేదు.

అందుచేత ఆ మతపరమైన తాత్విక పువాదిని యెదిరించగల జ్ఞానమూ, సాహసమూ వుంటేనే ఆటువంటి సంచలనాత్మకమైన రచనలు చేయగలడు అనే అభిప్రాయంతోనే చలంగారంటే అభిమానం. ఆ దృష్టితోనే ఆ సాహిత్యం అంటే గౌరవం వుండేది అన్నగారికి.

స్త్రీలు తమ కోరికలను యధేచ్ఛగా తీర్చుకోవడానికి ఈ సమాజం (పురుషాధిక్య సమాజం) అంగీకరించదు. ఇక్కడ కుటుంబ వ్యవస్థకు గౌరవం వున్నది. భర్తను యెదిరించలేని మనస్తత్వంగల భార్యలనే భర్తలు గౌరవిస్తారు, అంగీకరిస్తారు. అదే ఈ సమాజ సంప్రదాయంగా భావిస్తున్నారు. ఆటువంటి పరిస్థితులలో తమ కోరికలను యెలా వివరించగలరు? యెలా యెదిరించగలరు? అనేది ముఖ్యమైన ప్రశ్నగా వున్నది.

అయిదవ తనంతోనే ఈ సమాజంలో తనకు గౌరవం వుంటుందని, మర్యాద వుంటుందని అనుకునేభార్య తన భర్తను యెలా యెదిరించ గలదు? మత ఆచార, సంప్రదాయాలను యెదిరించి తన స్వేచ్ఛను వ్యక్తిత్వాన్ని నిలుపు కుంటుందా? లేక తాను తనభర్తకు బానిసయై తన వ్యక్తిత్వాన్ని చంపుకుని కోరికలను, భావాలను దిగమ్రింగి తన భర్తతో కృత్రిమమైన సంసార జీవితాన్ని గడుపుతూ తన పునిస్త్రీ తనాన్ని కాపాడుకుంటూ పుణ్యస్త్రీగా తనను తాను మలచుకుంటుందా? ఆ విధమైన అసహజమైన జీవితాన్ని గడుపుతూ సమాజంలో గౌరవం పొందుతూ వుండటమా? సమాజాన్ని యెదిరించి స్వతంత్రులై తన కోరికలు తీర్చుకోవడమా? అనే దానికి సమాధాన మేది?

ఆనాడు చలంగారు ఇటువంటి జటిలమైన సమస్యలను గురించి ఆలోచించారా? ఆలోచించకుండానే అనాలోచితంగా ఉద్వేగానికి లోనై ఉద్రేకంలో వ్రాసివుంటారా? అనేది నాలాంటి తాత్వికమనే పిచ్చివున్న వాళ్ళకు వస్తూవున్న సందేహం. కాని, ఇది పిచ్చి సందేహం అని సుల భంగా మాత్రం కొట్టి పారెయ్యొద్దు.

ఈ సమాజంలో స్త్రీలను నీచంగాచూచే స్వభావానికి, వారిస్వేచ్ఛను అరికట్టే ఆలోచనకు వెనుకవున్న తాత్విక పునాదులేమిటి? ఏ దుర్మార్గపు పునాదులమీద ఈ దుర్వ్యవస్థ నిర్మింపబడి వున్నది? అనేది ఆలోచించ కుండా, ఆ తాత్విక పునాదులు కదలించకుండా, ఆ దుర్మార్గపు ఆలోచనా పరణిని మార్చకుండా స్త్రీలపై సానుభూతితోను, వారిపై దయా దాక్షి ణ్యాల కారణంగాను యేదో వ్రాస్తేను, యేదో చేస్తేను సరిపోదు. ఆ పై సంస్కరణలవల్ల, ఆ సానుభూతివల్ల వారికి ఒరిగేది, మిగిలేది యేమి వుండదు. ఆ పద్ధతి శాశ్వత పరిష్కారానికి మార్గంకాదు, కాలేదు.

ఈ విషయమై చలంగారితో బహుకాలంగా పరిచయంవున్న పలువు రితో ప్రస్తావించడం జరిగింది. కాని, వారు యింత లోతుగా ఆలోచించ లేదని చెప్పడం జరుగుతూ వచ్చింది. అందుచేత చలాన్ని తాత్వికంగా అర్థంచేసుకున్నవాడు లేడనిపించింది. వారి తాత్విక జ్ఞానం అవగాహన మీద నాకు అనుమానం కలిగింది.

ఈ మధ్య మధురైలో ప్రపంచ తాత్విక మహాసభలు జరిగినవి. ఆ సభలకు హాజరైన అన్నగారు అక్కడనుండి అరుణాచలం (చలం వుండే స్థలం) కూడా వెళ్ళి చలంగారిని కలుసుకున్నారు. అనేక విషయాలు చర్చించారు

ఆంధ్రదేశంలో ఆనాడు ఫ్రీ లవ్ సొసైటి నడిపిననాడు మీరు చెప్పిన విషయాలకు, ఈనాడు మీరు చెపుతున్న విషయాలకు తాత్వికమైన వైరుధ్యం కనిపిస్తూ వున్నదికదా, ఆ మార్పుకు కారణమేమిటని అడిగారట అన్నగారు. స్త్రీలకు స్వేచ్ఛ కావాలని ఆనాడు యెన్నో రచనలు చేశారు. ఈనాడు అంతా ఈశ్వరేచ్ఛ అంటున్నారు. ఈ వైరుధ్యంలోని ఆంతర్యమేమిటి? మీ భావాలకు బాహ్యరూపమైన ఆ రచనలకు, మీ అంతరంలో దాగిన ఈశ్వర భావానికి యే విధమైన సమన్వయం కుదరదు. అంతరంలోని ఆంతర్యం ప్రధానమైనదా? అంతరానికి సంబంధం లేని బాహ్య భావాలకు ప్రాధాన్యం ఇస్తున్నారా? అని అడిగారట అన్నగారు.

## నాది కాకి కన్ను

'నేను ఇపుడు ఒక కంటి వాడను అన్నారట. కాకి ఒకే సారి రెండు కళ్ళతోను చూడలేదు. ఆ కన్నుతో చూచినపుడు ఈ కన్ను కనిపించదు. ఈ కన్నుతో చూచినపుడు ఆ కన్ను కనిపించదు. జగత్తుని చూస్తే దేవుడు కనిపించడు, దేవుడిని చూస్తే జగత్తు కనిపించదు. ఆ రోజుల్లో రెండు కళ్ళతో రెంటిని చూచేవాడిని. ఈ రోజున ఒక కన్నుతో ఒకదాన్ని (ఈశ్వరుణ్ణి) చూస్తున్నాను అన్నారట. అంటే జగత్తుని చూచేకన్ను పోయిందన్నమాట.

ఆ విధంగా జగత్తుని చూచే కన్నుని కావాలని మూసుకుని జగత్తుని చూడలేని గుడ్డివాడైనాడన్నమాట. మరి జగత్తులో వున్న స్త్రీలు, వారి సమస్యలు యెలా చూడగలుగుతాడు? ఎలాంటి పరిష్కారమార్గం చెప్పగలుగుతాడు? తాత్విక పునాదులులేని భావోద్రేకాలు ఉద్వేగ పూరితాలేగాని నిజమైన ఆలోచనా జనితాలుకావు. అందుచేతనే అవి తాటియాకు మంటలాంటివి అంటున్నాను, నిలబడేవి కావంటున్నాను.

'ఒకేసారి రెండు కళ్లతోను ఒకే విషయాన్ని చూడగలగాలి, అది వ్యావహారికం. రెండు కళ్లతోను ఒకేసారి రెంటిని (జగత్తుని, దేవుణ్ణి) ఒకటిగా చూడగలగాలి అదే తాత్త్వికం. అలా చూడగలిగినవాడే జ్ఞాని. అలాకాకపోతే రెండు కళ్లకు ఒకే దృశ్యం రెండుగా కనిపిస్తుంది. అదే అజ్ఞానం" అన్నారట అన్నగారు. ఆ కాలాన్ని తలుచుకుంటే అంతా అజ్ఞానంగా కనిపిస్తూ వుంటుంది అన్నారట వారు. అంటే జగత్తునిచూస్తూ అందులోని మానవులను వారికున్న సమస్యలను చూస్తూ ముఖ్యంగా స్త్రీల సమస్యలపై ఆవేదనపడి వ్రాసిన ఆనాటి భావాలు ఈనాడు వారికి అజ్ఞానంగా తోస్తూవున్నవి. అదే వారిలోని తిరోగమనం. అందుకు తాత్త్విక పునాది లేకపోవడమే కారణం.

ఆ కారణంగానే మానవులకు దూరంగావుంటూ మానవుల సమస్యలను గురించి ఆలోచించడానికి దూరమై జగత్తుని చూడలేక (గుడ్డివాడై) కేవలం కల్పనా మాత్రుడైన ఈశ్వరుణ్ణి భావిస్తూ, ఆరాధిస్తూ ఆనందిస్తూ వున్నాడన్నమాట. ఎంతోమంది గొప్పవారుగా చలామణి అవుతూ తాత్త్విక సమన్వయంలేక, తెలియక, చివరకు చిన్నవారై సంచరిస్తూ వుంటారు. ఆనాటి ఆ చలానికి స్వేచ్ఛాభావాన్ని కోల్పోయిన ఈనాటి అరుణాచలంలోని ఈశ్వరదాసుడైన ఈ చలానికి అంత భేదం వున్నదన్నమాట.

ఒక్కసారి ఆంధ్రకు దయచేయకూడదా అన్నారట అన్నగారు. ఎందుకు అన్నారటవారు. ఈనాడు మూఢ నమ్మకాలు మరీ పెరిగిపోయినై. ముఖ్యంగా స్త్రీలను బాధిస్తూవున్న సమస్యలు వారిని మరీ అధ్వాన్నపు పరిస్థితిలో వుంచుతూవున్నై. వారి మార్పుకోసం మీ రేదైనా సందేశం ఇవ్వాలి. మీ లాంటివారి అవసరం ఈనాడు ఆంధ్రదేశానికి మరింతగా వున్నది అన్నారట అన్నగారు. మనం చెప్పవలసిందేమీలేదు. మార్చవలసింది అంతకంటే లేదు. అంతా ఈశ్వరేచ్ఛ అన్నారట వారు (ఇపుడు అర్థమైనాడు చలం నాకు).

మార్చవలసిందేమీ లేదని మీరంటున్నారు. ఈ సమాజం ఇలాగే వుండాలని మీ రభిప్రాయ పడుతున్నారా? మార్పుకావాలని కోరిన మీరే

మార్పువలసిందేమీ లేదని అంటున్నారు. అంతా ఈశ్వరేచ్ఛ అనే తాత్విక సూత్రం నమ్మిన మీ మంది అంతంకటే ఆశించేదేముంటుంది అన్నారట అన్నగారు. చిరునవ్వుతో తల ఆడించారట చలంగారు ఏమీ తనకు పట్టనట్టు.

ఒకనాడు అన్నగారిని నేనడిగిన ఆ ప్రశ్న నే ఈనాడు చలంగారిని అడిగారు వారు. చలంగారిలో వచ్చిన ఆ మార్పుకి, చలమయ్య గారిలో వచ్చిన ఈ మార్పుకి నేనొకింత చలించాను, సంతోషించాను.

ఆయన తాత్వికంగా అలా దిగజారి పోవడం అన్యాయం. మత పరమైన ఆధ్యాత్మిక భావవాదాన్ని నమ్ముతున్నాడు అంటే పరిణామ సహితమైన నూతన సమాజాన్ని కోరడం లేదన్నమాట. ఆనాడు ఆయన ప్రచారంచేసిన భావాలకు, ఈనాడు నమ్ముతూవున్న ఈ నమ్మకాలకు పరస్పరం విరుద్ధంగదా? ఆనాడు యెంతో మార్పుని కోరిన చలం ఈనాడు మార్పు అక్కరలేదనే దశకు దిగజారి పోయాడు అంటే అందుకు కారణం ఆయనకు బలమైన తాత్విక పునాదులు లేకపోవడమేననేది అర్థమవుతుంది. అదే వారి తిరోగమన కారణం. అందుకు జాలి పడటం తప్ప మనం చేయ గలిగిందేముంది?

## వీరేశలింగం (కందుకూరి) వితంతు వివాహాలు

కందుకూరి వీరేశలింగం గారంటే అన్నగారికి మంచి అభిమానం వుండేది. ఆయన భావాల ననుసరించి అనేక వితంతు వివాహాలను అన్న గారు జరిపించారు. మా పెద్ద అబ్బాయి "సంఘమిత్ర" వివాహంకూడా (వితంతువుతో) అన్నగారే జరిపించారు. అన్నగారిలోవున్న సంస్కరణ భావాల ప్రభావంతో ప్రోత్సాహంపొంది వారి శిష్యురాలైన "లోపాముద్ర" (కొత్త సూర్యనారాయణగారి సతీమణి) గారు తమ మరదిగారైన కొత్త సుబ్బయ్య గారి రెండవ కుమార్తె "వీణాదేవి"తో ఆ వివాహం జరిపించారు.

కొత్త సుబ్బయ్యగారిని, వారి కుటుంబ సభ్యులను అంగీకరింప జేయడానికి వారు (లోపాముద్రగారు) చేసిన కృషి అందరికి, ముఖ్యంగా

ఆ గ్రామ స్త్రీలకు యెంతో సంతోషాన్ని, ఉత్తేజాన్ని కలిగించిన విష యం. సంగం జాగర్లమూడి గ్రామంలో చాలామందికి తాత్విక పరిజ్ఞానం వుండడమే అందుకు కారణం.

సంస్కరణలు అంటేను, ముఖ్యంగా వితంతువివాహా లంటేను అంగీకరించని నేటి సమాజంలో సంప్రదాయాలని, ఆచారాలని చెప్పి తప్పించుకు తిరిగే వ్యక్తులమధ్య అటువంటి ఉత్తమ భావాలుగల వ్యక్తు లనుకూడా చూస్తూ వుంటాం. మానవత్వాన్ని మంటగలిపే మత సంప్ర దాయ బంధనాలనుండి బయటపడి ఆ ఉత్తమురాలు ముందుకువచ్చి అటు వంటి సాహస కార్యమును చేయ తలపెట్టిందంటే ఆమె అంతరంలో దాగిన సంస్కారం అర్థమవుతుంది. అది ఆమెకుగల తాత్విక చింతనాసక్తి నుండి పరివర్తన చెందిన మానసిక వికాస ఫలితమే. తాత్విక జ్ఞానం ఆమెను సంస్కారవతిని చేసింది. వేదికలెక్కి ఇతరులకు ఉపన్యాసాలు, ఉపదేశాలు ఇవ్వవచ్చు, కాని ఆచరణ వుండదు. అంటే వారిలో మానసిక సంస్కారం లోపించిందన్నమాట. తాత్విక సమన్వయం లేదన్నమాట. అందుకే తాత్విక సమన్వయం కావాలంటున్నాం.

## సంఘమిత్ర - వీణాదేవి వివాహం

వీరేశలింగంగారి రచనలు చదవడం వల్లను, ఆ విషయాలపై మేము అనేకసార్లు చర్చిస్తూ వుండడం చేతను మా అబ్బాయి "సంఘ మిత్ర" కు ఆ విషయంపై సదభిప్రాయమే వుండేది. మా అన్నగారు కూడా పరిస్థితిని స్వయంగా వివరించి అటువంటి సంస్కరణ వివాహం చేసుకోవడానికి కావలసిన మానసిక స్థాయిని కలిగించి ఆ వివాహాన్ని అన్నగారే స్వయంగా చేయించారు. అందుకు మా కుటుంబం వారందువు రికి (అన్నగారికి, లోపాముద్ర గారికి) ఇందుమూలంగా కృతజ్ఞతలు తెలియజేస్తూ వున్నది. అదొక మానసిక తృప్తినిచ్చిన ఆచరణ భాగంకదా?

సంఘ సంస్కర్త అనబడే వారిలోను, రాజకీయ నాయకులలోను స్థిరమైన అభిప్రాయాలుండక తరచుగా తాముచెప్పే విషయాలకు భిన్న

మైన అభిప్రాయాలకు దిగజారిపోతూ వుండటం చూస్తూ వుంటాము. కాని అన్నగారు తమ సాంఘిక సంస్కరణ భావాల్లో యేవిధమైన మార్పులు, మినహాయింపులు లేక చివరివరకు ప్రచారంచేస్తూ వచ్చారు.

## అచలం

బ్రాహ్మణేతరులు బ్రహ్మవిద్య వినరాదు, చెప్పరాదు శూద్రులు సంస్కృతం చదవరాదు. బ్రహ్మవిద్య బ్రాహ్మణులకే సొంతం. సంస్కృతం ఆ కులంవారికే పరిమితం. ఇది ఆర్యనీతి, ఆర్య సంస్కృతి. అది ఒకనాడు సభ్యతగానే, సంస్కృతిగానే భావించబడింది. కాని, అది ఈనాడు అతి నీచమైన సంస్కృతి, సభ్యతకు సరిపడని నీతి. అంటే దుర్నీతి అని అర్థం.

తత్వం ఉత్తమమైనదైతే అది అందరికి సొంతం కావాలి, అందరికి తెలియాలి. తత్వంలో సంకుచితం వుంటే అది అందరికి తెలియ గూడదనే స్వల్పత్వం చోటు చేసుకుంటుంది. స్వల్పత్వం అల్పత్వానికి పునాది. ఆ పునాదిమీద నిర్మించుకున్నదే ఆర్యమతం. అదే కాలక్రమంలో హిందూ మతంగా వ్యవహరించ బడుతూ వున్నది. ఆ మతం చాతుర్వర్ణ్య సిద్ధాంతాన్ని బలమైన కట్టుబాట్లమధ్య పెంచి పోషిస్తూ వుంటుంది. ఆ సూత్రాలకు అనుగుణంగానే వారి తాత్విక సూత్రాలు వుంటై అని నమ్ముతూ వుంటుంది. ఆ సూత్రాలు వారు స్వార్థంతో సూత్రీకరించినవే గమక ద్రోహబుద్ధి, స్వార్ధ చింతన ఆ సూత్రాల్లో చోటు చేసుకున్నవి.

తత్వశాస్త్రం అంటే సత్యానికి సంబంధించినది. అటువంటి సత్యాన్ని అందరు తెలుసుకుంటే యిబ్బం దేమిటి? అది తెలుసుకోవడానికి జాతి (కుల) భేదం అడ్డురావడమేమిటి? అనేది యేమాత్రం ఆలోచనవున్న వారికైనా వచ్చే ప్రశ్న. ఈ ప్రశ్న మతస్థులకు రాదు. ఎందుచేతనంటే అటువంటి ప్రశ్నలకు మతంనుండి సమాధానం రాదుగనుక.

అటువంటి సంప్రదాయాన్ని యెదిరించి తత్వాన్ని తెలుసుకోవాలనే ఆలోచనా పరులైన బ్రాహ్మణేతరుల ప్రయత్నమే అచల మతారంభం.

తెలుగులో తాత్విక భావాలను తెలియ జెప్పాలనే ప్రయత్నమే అచల మతాశయం. ఆశయం మంచిదే, కాని అది చెప్పే తాత్వికాంశాలేమిటి? అందుకు ఆధారాలేమిటి?

'ఏ సాధన నీకెందుకు వీసానికి పనికిరాదు వినుమా అయ్యా' అంటూ భక్తి, యోగ మార్గాలైన వైదిక సంప్రదాయాలను హేళనచేస్తూ జ్ఞాన మార్గాన్ని అనుసరించాలని ఆశించారు. కాని, అద్వైత(మాయా)వాదాన్ని ఖండిస్తూ 'అడుసు దొక్కనేల కాళ్లు కడగనేల' అని ప్రాథమిక బోధనా పద్ధతులను అనుసరించక పోవడంతో తాత్విక సారాంశాన్ని తెలుసుకోవ డానికి వారికి సాధ్యపడలేదు. అందుచేత బాధలు తప్పలేదు.

కపిలుని సాంఖ్యదర్శనాన్ని తీసుకుని శంకరుడు తన అద్వైత బోధను అభివృద్ధి చేసుకున్నాడు, హెగిల్ భావ గతి తర్కాన్ని తీసుకుని మార్క్స్ తన గతి తార్కిక భౌతికవాదాన్ని అభివృద్ధి చేశాడు. అలాగే యేసిద్ధాంతాన్ని వివరించాలన్నా విశద పర్చాలన్నా ఒక తార్కిక పద్ధతి అవసరం. అటువంటి తర్కబద్ధమైన బోధనా పద్ధతిలేమి కారణంగా అచల మతం చెప్పాలనుకున్న వారికే ఆ సూత్రాలు తెలిసినట్లనిపించదు. వాద ప్రతివాదాలు వచ్చినప్పుడు పట్టుమని పదినిమిషాలు వారి వాదం వారు చెప్పలేరు.

అచల మత పీఠాధిపతులైన పొన్నాల రాజయ్య, అరిగె రామస్వామి గార్లతో అన్నగారికి వున్న పరిచయాన్ని పురస్కరించుకుని వారిశిష్యులు తరచు వస్తూ పోతూ వుండేవారు. ఎరుక వుండగా మరుపెలా వచ్చిందిరా? అని అడిగేవారు అన్నగారు. ఎరుకను వివరించలేక, మరుపును వదలలేక ముసి, ముసి నవ్వులు నవ్వి వూరుకునేవారు వారు. మరుపున్నంతకాలం ఎరుకను ఎలా యెరుగగలరు (తెలుసుకోగలరు)? అనేవారు అన్నగారు. దానికి వివరం అర్థంకాక మౌనం పాటించేవారు (అది కొంతమేలే, తెలి యని విషయం తెలియ జెప్పబోయి తెలియనితనం బయట పడకుండ).

అన్నగారు మద్రాసులో వున్నకాలంలో అద్వైతాన్ని చాటు మాటుగా విమర్శిస్తున్నట్లు తెలిసింది అన్నగారికి. వారిని సవాల్‌చేస్తూ

చర్చలకు ఆహ్వానించారు అన్నగారు. కొండపల్లి కమిలి బాబాగారి ఆధ్వర్యంలో మూడుచోట్ల మూడు సభలను యేర్పాటు చేశారు. సిద్ధాంత చర్చలలో యెవరు తమ సిద్ధాంతాన్ని నిరూపించుకోలేరో వారు తమ ఓటమిని అంగీకరించి వాదంలో గెలిచినవారి పాదాలకు నమస్కరించి తప్పుని ఒప్పుకోవాలి. అది వారి ఒప్పందం.

మూడుచోట్ల మూడు సభలలోను వారు వారి సిద్ధాంతాలను చెప్పి నిరూపించుకోలేక మరొక సభకు అవకాశం కోరారు. అదే విధంగా మరో సభకు అంగీకరించి యేర్పాటు చేశారు. కాని, అందులోనూ వారు వారి వాదాన్ని సమర్థించు కోవడంలో విఫలులైనారు. ఆ కారణంగా వారిలోని కొందరు అన్నగారి పాదాలకు నమస్కరించి శిష్యులైనారు.

బయటో బట్ట బయలో, చట్టుబండలో. ఏదో, ఆ చెప్పేది స్పష్టంగా చెప్పగలగాలి గాని ఏవో రెండు కలదార్థాలు వల్లె వేస్తే సరిపోతుందా అనేవారు. క్షుణ్ణంగా విద్య నభ్యసించలేని సోమరులవల్ల విద్య పెరగదు అనేవారు. 'అద్వైతమా, నీకు భయమెందుకు? చలం వుండగా అచలు డెవడొస్తాడో చూస్తాను' అని తమ విజయాన్ని ఛలోక్తిగా ప్రకటించుకునే వారు అన్నగారు. అదే వారిలోని ప్రత్యేకత, మెచ్చదగిన అర్హత.

## తాపి ధర్మారావు గారు

జస్టిస్‌పార్టీ బ్రాహ్మణ వ్యతిరేకోద్యమం సాగిస్తూ బ్రాహ్మణేతరులకు విద్యాబుద్ధులు గరిపించే ఉద్యమంకూడా సాగిస్తూ వచ్చింది. ఆ ఉద్యమ కాలంనుండి తాపి ధర్మారావుగారితో బాగా పరిచయం వుండేది అన్నగారికి. తాపి ధర్మారావు గారికి మా అన్నగారంటే మంచి అభిమానం, గౌరవం వుండేవి. నాటక రంగంలోను, రాజకీయ సాంఘిక రంగాలలోను, ముఖ్యంగా తాత్విక రంగంలోను మా అన్నగారు చేసిన కృషిని తరచు చెబుతూ వుండేవారు తాపివారు. ఒక్కొక్క రంగంలో ఒక్కొక్కరు ప్రతిభావంతులుగా వుండటం చూస్తూ వుంటాము. కాని, ఇన్ని రంగాల లోను ఇంత ప్రతిభావంతులుగా చలమయ్య గారొక్కరినే చూస్తూ వున్నాం అనేవారు తాపి ధర్మారావుగారు.

"రాజు-పేద" అనే సినిమాలో "రాజగురువు" వేషంలో నటించారు అన్నగారు. ఆ సందర్భంలో తాపి ధర్మారావు గారిని తరచు కలుస్తూ వుండేవాళ్ళం ఆ సమయంలో అనేక విషయాలు చర్చిస్తూ కాలం సద్వినియోగం చేస్తూ వుండేవాళ్ళం. "దేవాలయాలపై బూతు బొమ్మలెందుకు?" అనే పుస్తకం వ్రాశారు వారు. మనకున్న కవులంతా బూతు కవులేనా అనిపిస్తూ వుంటుంది అన్నారు తాపివారు. ఏ కవిని చూడబోయినా బూతు మాటలేని కవిత్వం వ్రాయలేదు.

బూతే శృంగారమనుకుని, శృంగారాన్ని బూతు స్థాయికి దిగజార్చి వ్రాసిన కవిత్వమంతా బూతేగదా? కామవృత్తినే ప్రేమ ప్రవృత్తి అనుకోవడం యెలాంటిదో శృంగారం అంటే బూతు అనుకోవడంకూడా అలాంటిదే. శృంగార, ప్రేమ రూపాలలో దైవాన్ని ఊహించి ఒకరు రచన చల్పితే, కామ (బూతు) వృత్తినే దైవ ప్రవృత్తిగా చిత్రించి కవిత్వం వ్రాశారింకొకరు. జయదేవుని అష్టపదులతో అన్నమాచార్య కీర్తనలతో భక్తి పారవశ్యంపేర పచ్చిబూతు సాహిత్యం సృష్టి అయింది. భక్త పోతన కూడా శృంగారంపేర కొంత బూతుని చేర్చకుండా వుండలేకపోయాడు అన్నారు వారు.

ఈనాటి యువతరంలో కామ ప్రవృత్తి పెరగడానికి ఆ రచనలు కూడా కొంత కారణమనాలి. వెంకటేశ్వర సుప్రభాతం (సంస్కృతం) తెలుగులో అనువాదంచేసి వినిపించమనండి యెలా వుంటుందో? జయదేవుని అష్టపదులు తెనిగించి చూస్తే ఈనాటి తెలుగు సినిమా పాటలు వేరే చూడనక్కరలేదు, వినవక్కరలేదు అన్నారు తాపిగారు. (ఆనాటికే తాపి వారికి అటువంటి అభిప్రాయం కలిగిందంటే ఈనాటి తెలుగు సినిమా పాటలువిన్నా, వాటిని దృశ్య విషయంగా చూపెట్టే తీరుని చూచినా యేమని వ్యాఖ్యానించేవారో! కాని, వారు యిపుడు లేకపోవడంచేత మనకు ఆ అవకాశం లేకుండా పోయింది )

దేవుడు సృష్టికర్త అనుకున్నారొక దశలో. మానవసృష్టి జరిగేది బూతు కార్యంవల్లనే గనుక బూతునే సృష్టికి మూలంగా భావించి బూతును, బూతు పరికరాలను చిత్రించి వాటిని పూజించడం ప్రారంభిం

చారు. మరొకదశలో దేవాలయాలు నిర్మించేకాలం వచ్చేసరికి దేవాలయా లపై బొమ్మల రూపంలో ఆ భావాలను చూపెట్టారు (మా గ్రామంలో ఒక దేవాలయంపైన స్త్రీ పురుషులు నగ్నంగా సంభోగిస్తున్నట్లు శిల్ప నిర్మాణం జరిగింది). శివాలయంలోని శివలింగం (పానువట్ట దృశ్యం) శివ పార్వతుల అంగ, లింగ కలయికేగదా? అన్నారు ధర్మారావుగారు. (పశ్చిమ గోదావరిజిల్లా వేల్పూరు అనే గ్రామంలో నడివీధిలో నిలువెత్తు విగ్రహాలు నగ్నంగా రంగులలో నిర్మించబడి చూపరులకు (భక్తులకు) ఆహ్లాదం కలిగిస్తూ వున్నై). ఎనిమిదిమంది నగ్నంగావున్న స్త్రీల మధ్య (గోపికల మధ్య) ఒక పురుషుడు (కృష్ణుడు) వుండి శృంగార చేష్టలు (లీలలు) చేస్తూ వుండటం, అది మనంచూచి ఆనందించడం మన సంస్కృతికి ప్రతిరూపమేగదా! దేవుడు యేపని చేసినా అది మనకు మంచిపనే. అసలు మంచి, చెడ్డల నిర్ణయం దేనినిబట్టి చేస్తాం? నలుగురు ఏది మంచి అంటే అది మంచి, నలుగురు ఏది చెడ్డ అంటే అది చెడ్డ. అంతేగాని మనం విచక్షణతో ఆలోచించి నిర్ణయించే స్థితిలో లేముగదా! అదే మన దుస్థితి.

రాజు దైవాంశ సంభూతుడు అనిచెప్పి రాజు లక్షణాలు దేవుడిలోను, దేవుడి లక్షణాలు రాజులోను చూపెట్టి రాజుని పూజించేదశకు తీసుకువెళ్ళారు. దేవుడిని ప్రశ్నించగూడదని చెప్పినట్లుగానే రాజునికూడా ప్రశ్నించ గూడదని చెప్పారు, నమ్మించారు.

## రాజు దైవాంశ సంభూతుడా?

రాజు దైవాంశ సంభూతుడు గనుక రాజు శృంగార ప్రవృత్తిని (బూతు వృత్తిని) దేవుని శృంగార చేష్టలు (లీలలు)గా చెప్పి నమ్మించారు ప్రజలను. ఏ విధంగా చెబితే ప్రజలు నమ్మి రాజుపై తిరుగుబాటు చేయకుండా వుంటారో, ఎన్ని దుర్మార్గాలు చేసినా చూచి సహించి వూరుకుంటారో ఆ మార్గాలు ఆలోచించి చెప్పారు. అలా చెప్పిన వారందరికి రాజ దర్బారులో మంచి గౌరవం వుండేది. అటువంటి వారికి ముఖ్య, మాన్యాలిచ్చి మంచి భృతిని కల్పించేవారు. శ్రమ చేయకుండా సోమరులై బ్రతికే ఒక

వర్గం అలా తయారైనది. ఆ తరువాత సాహిత్య, సంగీత, నాటక, నృత్య, చిత్ర, శిల్పకళా రూపాలలో జరిగిందంతా అందుకే. దాస్య భావానికి సిగ్గుపడని రీతిలో బ్రతకనేర్చిన వర్గమది. అలాగే బ్రతుకుతూ వున్నది ఇప్పటివరకు ఆ వర్గం.

దేవదాసీలనేపేరుతో దాసి వృత్తిని కొంతమందికి కల్పించి వారిని మొదట రాజులు అనుభవించి ఆ తరువాత పైన చెప్పబడిన వారంతా తమ కామ దాహం తీర్చుకోవడానికి ఉపయోగించుకునే వ్యవస్థను సృష్టించారు. సిగ్గు, లజ్జ అనేది లేని మానసిక కాఠిన్యులు దేవుడిపేరు చెప్పుకుని జీవిస్తూ వుండడం కళ్లారా చూస్తూనే వున్నాం ఈ వ్యవస్థలో.

రాజు దైవాంశ సంభూతుడుకాడు. అతడుకూడా సామాన్య మానవుడే. శరీరం అంటూ యేర్పడిన తరువాత అది పాంచ భౌతికమే. అన్ని దేహాలలోను వున్నది ఒక్క జీవుడే. ఆ విధంగా రాజు మామూలు మనిషే. అద్వైత జ్ఞానం కలిగితే ఆ విషయం బోధపడగలదు అని అన్నగారనడంతో నేను కల్పించుకుని రాజు దైవాంశ సంభూతుడు కాదని, అతను పరిణామంతో వచ్చిన సామాన్య మానవుడేనని, భౌతిక పరిణామ వాదం ప్రచారం జరిగిన తరువాతనే ఫ్రాన్సులో రాచరికాన్ని కూలదోయటం జరిగిందని, అలాగే రష్యాలో జారు చక్రవర్తులపై తిరుగుబాటు చేయ గలిగారు అక్కడి ప్రజలు అని నేనన్నాను. ఏ తప్పుచేసినా దేవుని పేరుతో చేస్తే అది తప్పుకాదనే ఈ సమాజం నమ్ముతుంది. మన సాహిత్యం అలా నమ్మించింది.

అటువంటి నమ్మకాలమీద తిరుగుబాటు వచ్చినప్పుడే ఈ సమాజం బాగుపడుతుంది. రష్యాలో తిరుగుబాటు చేయడమే కాకుండా అక్కడ ప్రజల కనుకూలమైన ప్రభుత్వాన్ని యేర్పాటు చేసుకున్నారు. దైవ నమ్మకం పోనిదే మానవుడు తనను గురించిన ఆలోచన తాను చేయలేడు. దేవునిపై నమ్మకం కలిగించే మతం దానికనుకూలమైన సాహిత్యాన్ని సృష్టిస్తూ ప్రజలపై విరజిమ్ముతూ వుంటుంది. ఆ పనికి కావలసిన ధన సహాయం రాజులు విరివిగా చేస్తూ వుండేవారు. కాబట్టి మన సాహిత్య

మంతా మతపరమైన దాస్య ప్రవృత్తిని పెంచేదిగా వున్నదేగాని స్వేచ్ఛా ప్రవృత్తికి దోహదం చేసేదిగా లేదు అని నేనన్నాను. అది నిజమేనని తాపి ధర్మారావుగారన్నారు. అది విన్నతరువాత అన్నగారు మారు మాట్లాడ లేదు.

## వాద ప్రతివాదాలు

ఒక్కొక్క సమయంలో వాది, ప్రతివాదాలుగా మారి (తాత్విక విషయంగా) వాద, ప్రతివాదాలు చేస్తూ వుండేవాళ్ళం. తాత్వికంగా వారిపై నేను చేసిన అభియోగాలను సారవంతమైన తన ప్రతివాదనల ద్వారా తిప్పికొట్టి తన వాదనను సమర్థించుకోజూచేవారు. కాని, సహజంగా తన ఆధ్యాత్మిక వాదంలోని అవక తవకలను, బలహీనతలను గుర్తించి వాదనను సవరించుకునేవారు, ఉపసంహరించుకునేవారు.

అది తత్వవేత్తలకు వుండవలసిన మంచి లక్షణం. ఆ లక్షణం లోపించిన తత్వవేత్తల తత్వం కాలానికి యెదురీది తద్వారా కాలంలో కలిసి పోతుంది. కాలంలో వచ్చేమార్పులను గుర్తించని తత్వవేత్త తత్వవేత్త కాలేడు. ఆ మంచి లక్షణం అన్నగారిలో వున్నది గనుకనే నేను వారితో యెన్నో విషయాలలో భేదించినా వ్యక్తిగతంగా భేదపడకుండా కలసి మెలసి వుండగలిగాం. ఆ విషయంలో మాదొక ప్రత్యేక ప్రయోగమనే చెప్పాలి, మాకు తృప్తినిచ్చిన ఫలితమనే చెప్పాలి.

ఆర్థికంగా కాస్త అవకాశంవస్తే ఆంధ్రదేశం అంతా తిరిగి తాత్విక ప్రచారం చేద్దాం అన్నాను నేను. దానికి వారెంతో సంతోషించి తప్పకుండా చేద్దాం అని నా అభిప్రాయానికి యెంతో బలం యిచ్చారు. ఒక నెల రోజులపాటు పాదయాత్ర చేస్తూ మూఢ నమ్మకాలపైన కులతత్వం పైన ప్రచారం చేద్దామని పదే, పదే అంటూ వుండేవారు, అది నెరవేరలేదు.

## భౌతిక విజ్ఞాన తరగతులు

అటువంటి ఆలోచనా ఫలితంగానే డార్విన్ శత వర్ధంతి సందర్భంగా ఇక్కడ (పుష్పగిరి, మద్రాసులో) పదిరోజులు భౌతిక విజ్ఞాన తరగతులు

నిర్వహించడం జరిగింది. ఆ సందర్భంగా పదిమంది అద్వైత తత్వవేత్త అను తనవెంట తీసుకువచ్చారు అన్నగారు. ఆ పదిరోజులు ఆధ్యాత్మిక, భౌతిక తత్వ శాస్త్రాలపై ప్రముఖుల ప్రసంగాలు యేర్పాటు చేశాం.

అద్వైతం శాంతికి మార్గం అనే విషయంపై అన్నగారు మాట్లాడారు. సమాజం శాంతిగా వుండాలంటే అద్వైత సూత్రాలను బాగా అర్ధం చేసుకుని తదను గుణమైన ఆచరణ కలిగి వుండాలన్న ఏకాత్మ జ్ఞానం కలిగితే, జీవుడు సమిష్టి జీవుడని తెలిస్తే సమాజంలో దబుద్ధిపోయి అభేద తత్వం అలవడుతుంది. అందువల్ల మానవులమధ్య సమరస భావం పెరుగుతుంది. తద్వారా మానవులు సహకార జీవనాన్ని అలవరచుకుని సుఖ, శాంతులు పొందవచ్చునని అన్నారు అన్నగారు.

ఆ తరువాత నేను మాట్లాడుతూ ఆధ్యాత్మిక తత్వ శాస్త్రమని చెప్పబడే మన తత్వశాస్త్రం అసలు భారతీయ తత్వశాస్త్రంకాదు. ఇది ఆధ్యాత్మిక భావవాదమేగాని శాస్త్ర బద్ధమైన తత్వశాస్త్రం కాదు. వున్నదానిని గురించి విశ్లేషించేది తత్వశాస్త్ర: అయితే లేనిదానిని గురించి ఊహించేది భావవాదం అవుతుంది.

## ఏది తత్వశాస్త్రం?

ఏదైనా ఒకటి అస్తిత్వంలోవుంటే దానికి సంబంధించిన భావం యేర్పడుతుంది. అలా అస్తిత్వంలో వున్న వస్తువులకు సంబంధించిన వివరణ ఇచ్చేదే తత్వశాస్త్రం అస్తిత్వంలో లేనిదానిని గురించి చేసేభావం విశ్లేషణకు గిలువదు. వివరించడానికి వీలుకాదు. దానినే భావవాదం అంటాం. వస్తుగతమైన విశ్వం వున్నది, వస్తు రహితమైన చైతన్యంలేదు. భావవాదాలకు జగత్తులేదు, భావం మాత్రమే వున్నది. భౌతిక వాదులకు జగత్తు మాత్రమే వున్నది ఆ జగత్తుకి సంబంధించిన ఆలోచన మాత్రమే సత్యం దాని వివరణే తత్వశాస్త్రం.

అఖండ చైతన్యం అనేది ఊహామాత్రపు భావం. అందుచేత అది నిరూపణకురాని భావం. అందుచేతనే అది అవాగ్ మానస గోచరం,

అలాగే నిరపేక్షమైన చైతన్యం వుండదు. అలా భావించ బడిందేగాని చైతన్యమనేది నిరపేక్షంగా వుండటానికి వీలులేదు. ప్రదేశ కాలాలకు అస్తిత్వం పదార్థంతోనే యేర్పడుతుందిగాని ప్రదేశ కాలాలు నిరపేక్షంగా వుండవు. అందుచేతనే పదార్థం చలనాలు లేకుండా వాటిని నిరూపించలేము. అలాగే శరీరం లేకుండా మనసూ వుండదు. మరి మనసులేక చైతన్యం వుండదు.

అందుచేత ఆధ్యాత్మిక భావవాదులు భౌతిక విజ్ఞానరీత్యా నిరూపించ బడిన తాత్విక సత్య విషయాలను తమ తత్వశాస్త్రంలో చేర్చుకుని తాము తాత్వికంగా మరింత ముందుకు సాగగలరని ఆశిస్తున్నాము. అందుచేత పరస్పర విరుద్ధమైన తాత్వికాంశాలను వదిలేసి సమన్వయానికి సరిపోయే అంశాలకోసం అన్వేషణ చేయాలి. అందుకోసమే ఈ ఆలోచనలు, చర్చలు అవసరమని భావించాం. అపుడే ఏది తత్వశాస్త్రం అనేది మనకు బోధపడుతుంది.

## 'నేను' యెలాంటిది?

భౌతిక తత్వశాస్త్రరీత్యా చెప్పబడే "నేను" యెలా వుంటుందనేది వివరిస్తాను. మామూలు కండ్లకు ఆరడుగులుగా కనిపించే ఈ స్థూల శరీరంలో మెదడు అనేది ముఖ్యమైన భాగం. ఆ మెదడు 12 వందల కోట్ల సున్నితమైన నరముల కూటమి. అక్కడే చైతన్యం (తెలుసుకోవడం) అనే కార్యం జరుగుచున్నది. గనుక చైతన్యం అఖండంగా వున్నదని చెప్పకూడదు. శరీరంలో ఖండ ప్రదేశంలో పనిచేస్తూ వున్నదానినే చైతన్యం అంటాం. శరీరం లేనిచోట పదార్థం వుంటుంది. అది అఖండంగా అంతటా వున్నది. కాని, అదే చైతన్యంకాదు కదా? అది తెలుసుకోలేదుకదా?

ఇక ఆరడుగుల ఈ స్థూల దేహాన్ని పదార్థ రూపంలోకి మార్చి చూస్తే అది ఆవగింజలో అరపై వంతుగాకూడా వుండదు. అంటే మన కంటికి కనిపించదు. (మైక్రోస్కోపులో చూడవలసిందే.) స్వల్పమైన

ఆ పదార్థాన్నే శక్తిగామారిస్తే అది కాంతిరూపంలో అవధులులేని ప్రదేశాన్ని ఆక్రమిస్తుంది. ఇలా కాంతిరూపంతో అఖండంగా వున్నదానినే "నేను" అందామంటే అది చైతన్య వంతమైలేదు. చలనంలో మాత్రం వుంటుంది. చలనమే చైతన్యం కాదుకదా? చలనం తెలుసుకోలేదుకదా?

అందుచేత ప్రదేశమంతా అఖండంగావున్న పదార్థంనుండి ఖండమైన పదార్థం భిన్న రూపంలోకి మార్పుచెంది శరీరరూపంలో వున్నపుడే జ్ఞానేంద్రియాల సహాయంతో మెదడులో మనసు పనిచేస్తూ వుంటుంది. దానినే చైతన్యం అంటాం. అందుచేత స్థూలమైన ఆరడుగుల శరీరంగాను అదే స్వల్పమైన పదార్థంగాను, అదే విశాలమైన కాంతి రూపంగాను మూడు దశలుగా చెప్పుకుంటాం. అంటే భౌతిక పదార్థమే కారణ కార్య రూపాలలో జడము, చైతన్యము అనే భిన్న దశలలో వ్యక్తమవుతూ వుంటుంది. కనుక ఖండ - అఖండాలుగా పదార్థమే వర్తించు చున్నదిగాని పదార్థేతర మైనదేది అస్తిత్వంలో లేదు.

ఆధ్యాత్మికంగా చెప్పబడే భావం (చైతన్యం) అస్థిత్వంలోలేదు గనుకనే దానిని తత్వశాస్త్రంలో చెప్పగూడదు. భావ, అభావములు రెండూ పదార్థ జనితాలేగాని వేరుకాదు. పదార్థేతరమైన భావం వుండదు. పదార్థేతర భావం వుంటుందనుకున్న ఆధ్యాత్మిక వాదం సత్యంకాదు. అందుకే అది వాదంగా మిగిలి పోయుందేగాని శాస్త్రం కాలేకపోయింది.

అందుచేత ఇక్కడ జరిగిన చర్చలలో భౌతిక తత్వశాస్త్రంలోని మౌలిక సూత్రాలను అర్థం చేసుకుని అంగీకరించారు అన్నగారు. తమ వెంట వచ్చిన మిత్రబృందము (అద్వైతులు) కూడా మన వాదాన్ని శ్రద్ధగా విన్నారు. సంతృప్తిని తెలియజేశారు. ఎందుచేతనంటే ఏబది సంవత్సరముల వారి తాత్విక చరిత్రలో, అన్వేషణలో భౌతిక తత్వశాస్త్రం విని, తెలుసుకునే అవకాశం వారికి కలగలేదు. అంతేకాక సత్యాన్వేషణలో భౌతిక తత్వశాస్త్రం యింత ప్రగతిని సాధించిందనే సంగతికూడా వారికి తెలియదు. ఆ కారణంగా ఆ విషయాలు ఇక్కడ తెలుసుకునే అవకాశం వారికి కలగడం కూడా వారికి సంతృప్తిని కలిగించింది.

నాకుకూడా ఆ పదిరోజులు జరిగిన చర్చల అనంతరం చాలా తృప్తి కలిగింది. అంతేకాక ఒక ఉన్నతమైన ఆశయం నెరవేరిందనీ, అది అత్యంత సాహసంతో నిర్వహించ గలిగామనీ, భిన్నమైన తాత్వికాంశాలు గల వ్యక్తులమధ్య ఆదరణ పూరితమైన సహకార, సద్భావాలతో ఆ కార్య క్రమం ముగిసినందుకు చాలా ఆనందించానని కూడా చెప్పవలసి యున్నది.

అంతేకాక అది నాకెంతో గర్వకారణంగా కూడా భావిస్తున్నాను. ఎందుచేతనంటే మనదేశ చరిత్రలో, బహుశా ప్రపంచ చరిత్రలోనే ఆధ్యాత్మిక తత్వవేత్తల మధ్య భౌతిక తత్వశాస్త్రం అంత సుముఖంగా చర్చించడంగాని, అది వారికి వినిపించడం (వివరించడం) గాని జరిగి వుండలేదు. అందుకు కారణం ఆధ్యాత్మిక వాదులకు పరపక్షంవారు చెప్పేది వినే సహనం లేకపోవడం కాని, అన్నగారి వెంటవచ్చిన వారిలో ఆ లోపం లేదు గనుకనే అది సాధ్యపడింది. సిద్ధాంత వైరుధ్యం వున్నంత మాత్రంచేత వ్యక్తులమధ్య వైరుధ్యం వుండనక్కరలేదు. వైరుధ్యం సిద్ధాంతానికి లక్షణంగా వుంటుంది. అపుడే అది అభివృద్ధి చెందుతుంది. కాని, వ్యక్తులకు వైరుధ్యం వుండవక్కరలేదు. అది వారి అభివృద్ధిని ఆటంక పరుస్తుంది.

## ప్రముఖుల ప్రసంగాలు

ఆ పదిరోజులు జరిగిన భౌతిక విజ్ఞాన తరగతులలో ప్రసంగించిన ప్రముఖుల పేర్లు. వారు ప్రసంగించిన అంశాలు ఇక్కడ వివరిస్తున్నాను.

తరగతులను ప్రారంభిస్తూ 'పౌరాణిక సాహిత్యంపై త్రిపురనేని తిరుగుబాటు' అనేది ప్రధానాంశంగా డాక్టరు త్రిపురనేని వెంకటేశ్వరరావు గారు (గుడివాడ) ప్రసంగించారు.

'త్రిపురనేని సాహిత్యం - హేతువాదం.' 'మన సాహిత్యంలో దేవుళ్లు, దేవతలు, వారి పుట్టు పూర్వోత్తరాలు.' కళాప్రపూర్ణ, కవిరాజు కొండవీటి వేంకటకవిగారు సంస్కృత పండితులు, చమత్కార రచయితలు (హైదరాబాదు.)

'అద్వైతము - శాంతికి మార్గము.' వేదాంత విద్యా విశారద, సదానంద గుప్తా చలమయ్యగారు. వేదాశ్రమం, (పెదపులివర్రు.)

'హేతువాద ఉద్యమం - దాని ఆవశ్యకత.' యస్. వి. రావుగారు. ఆంధ్రప్రదేశ్ హేతువాద సంఘాధ్యక్షులు, (నర్సారావుపేట.)

'రష్యా పర్యటనలో నా అనుభవాలు' తోటకూర వెంకటేశ్వరరావు గారు. వెంకటేశ్వర ట్యుటోరియల్ కాలేజి ప్రిన్సిపాల్, (నర్సారావుపేట.)

'గతి తార్కిక చారిత్రిక భౌతికవాదం'. టి. రామమూర్తిగారు, నాస్తిక సమాజం అధ్యక్షులు, (విశాఖపట్టణం.)

'ముస్లిమ్ మతం - మూఢాచారాలు.' యస్. హజరత్ అలిగారు. ఖురాన్ పరిశోధకులు, బి. యిడి. కాలేజి, (నెల్లూరు.)

'మార్క్సిజం - హేతువాదం.' వి. చెంచయ్యగారు, తెలుగు లెక్చరర్, విరసం సభ్యులు (కావలి.)

'బాలలు - బాలల మనస్తత్వం.' బాలబంధు. బి. వి. నరసింహారావుగారు, (గుడివాడ.)

'డార్విన్ జీవితం - జీవ పరిణామ సిద్ధాంతం'. సాయిలుగారు' అంబేద్కర్ ఉద్యమనాయకులు, (నిజామాబాద్.)

'పురాణాలు - బూతుకథలు' అనే విషయంపై సమీక్ష. మునెప్ప గారు. హేతువాద ఉద్యమ నాయకులు, (అనంతపురం.)

'ఐన్‌స్టీన్ జీవిత విశేషాలు, సాపేక్ష సిద్ధాంతం'. డా॥ వై. వెంకటేశ్వరరావుగారు, అక్కినేని నాగేశ్వరరావు కాలేజి ప్రిన్సిపాల్, (గుడివాడ)

'ఆధునిక ప్రపంచంలో మానవుని స్థానం', 'ఆధునిక వైద్యరీతులు—వైద్యతత్వం' డా॥ ఎన్. వి. బ్రహ్మంగారు, బైబిలు బండారం రచయిత, మనీషా హోమియోహోమ్, (చీరాల.)

'మనస్తత్వం - మెదడు - మనసు'. డా॥ సంజీవదేవ్‌గారు, కళాతపస్వి. మనోవిజ్ఞాన పరిశోధకులు, (తుమ్మలపూడి.)

'ఆధ్యాత్మిక - భౌతిక తత్వరీతులు' త్రిపురనేని వెంకటేశ్వరరావు గారు, వేమన వివేక కేంద్రం, (విజయవాడ.)

"స్త్రీలు-వారిఅభివృద్ధి" రావూరి మనోరమ అర్జునరావుగారు, గోరా గారి ప్రథమ పుత్రిక, ప్రముఖ హేతువాది, (గుడివాడ.)

'భారతీయ సంస్కృతిలో స్త్రీలు - సాహిత్యం' జోత్స్నసాయిలు, తెలుగు పండిట్, (నిజామాబాద్ )

"వైదిక మతం - చార్వాకులు - తాత్విక తిరుగుబాటు." శెందామరై గారు పెరియార్ ఇ. వి రామస్వామిగారి శిష్యులు, నాస్తిక ప్రచారకులు. పబ్లిక్ ప్రాసిక్యూటర్, (వేలూరు, తమిళనాడు.)

"సుప్రభాతంలో శృంగారం". వెనిగళ్ళ సుబ్బారావుగారు, పెండ్లి మంత్రాల బండారం - సుప్రభాతంలో శృంగారం, రచయిత, (రేపల్లె.)

'త్వమేవాహం - వేదాంతాంబన అది నీ నామా ట'. పి. రాజరత్నమ్మగారు, వేదాంత విద్యారత్న, (పుష్పగిరి, మద్రాసు )

"అవస్థాత్రియ సాక్షి". శాంతమ్మగారు, (గొరిగపూడి.)

'సమన్వయం'. కొడాలి వీరయ్యగారు, (కిష్కింధపాలెం.)

"వివర్త వాదం". మంగమ్మగారు, (పునాదిపాడు.)

"నేత్రదానం - దాని ఆవశ్యకత". పూర్ణయ్యగారు, (మొగల్రాజపురం, విజయవాడ.)

హేతువాద గేయాలు, సందర్భోచితంగా పాడుతూ సభికుల నానందపరిచారు. బాబూరావుగారు (గుడివాడ.)

లోతైన తాత్విక విషయాలు సామాన్య మానవులమధ్య యేకరువు పెట్టి ప్రయోజనం వుండదు. భిన్న రీతుల తాత్వికాంశాలను భిన్న రీతుల తత్వవేత్తలమధ్య చర్చించి సిగ్గు తేల్చవలసి వుంటుంది. అప్పుడే దానికి సార్థకత యేర్పడుతుంది. అటువంటి ప్రయోజన కరమైనపని. ఆ పది రోజులు జరిగిన చర్చలవల్ల జరిగిందని తలుస్తున్నాను.

## సత్యాన్వేషణ

సాంప్రదాయకంగా చెప్పబడునే తాత్వి కాంశాలలోని లోపాలను సవరించుకుని నూతన విజ్ఞానరీత్యా అర్థమయ్యే తాత్విక సత్యాలను తత్వ

శాస్త్రంలో చేర్చుకుని తద్వారా పరిపూర్ణ సత్యంవైపుకు పయనం సాగిం చాలి. సత్యమెప్పుడుస్థిరంకాదు. అది పరిపూర్ణసత్యం వైపుకు సాగుతూ, పరి వర్తన చెందుతూవుంటుంది పరస్పరావగాహనతో మన తాత్వికపయనం సాగించాలని ఆ భౌతికవిజ్ఞాన తరగతుల ముగింపుసభలో నేను చెప్పినపుడు అందుకు మా సహకారం పూర్తిగా వుంటుందన్నారు అన్నగారు. ఆ తరువాత అన్నగారు జరుపుతూ వచ్చిన అద్వైత సభలలో తాత్విక సం బంధమైన పాత సూత్రాలకు కొత్త అర్థాలుచెప్పి పాత సంప్రదాయాలను బద్దలు కొట్టారు. అది అందరకు ఆశ్చర్యం కలిగించింది.

వ్యావహారిక సత్యాన్ని వదలి పారమార్థిక సత్యం వుండదనీ, యేది వ్యావహారిక మంటున్నామో అదే పార పార్థికమనీ, వ్యావహారిక మని, పారమార్థికమని రెండు లేవనీ అంటూ ధర్మార్థ కామములే మోక్ష మనీ అంతకుమించి, వాటిని కాదని మోక్షమనేది కాదనీకూడా చెబుతూ వచ్చారు అన్నగారు.

## సమన్వయం

శంకరుడు తన తప్పుని తాను తెలుసుకుని వ్యావహారికి సత్యానికి మించిన పారమార్థిక సత్య ముండదని చెప్పడం ప్రారంభించాడు (కాశీలో తనకు జరిగిన పరాభవం తర్వాత తత్వశాస్త్రాన్ని సమన్వయపరచి ఆలో చించాడు. దాని ఫలితంగా వ్యావహారిక విషయానికి తాత్వికాంశం వేరు కాదని గుర్తించాడు). ఏది మిధ్యగా చెబుతూ వచ్చామో అదంతా సత్యమే నని, సత్యా, సత్యాలు రెండుకావని, సత్యము అసత్యము సాపేక్షకంగా వుంటూ అవి రెండూ ఒకే సత్యంగా అనుభవంలోకి రావాలని చెప్పడం ప్రారంభించాడు. అలా చెప్పడం సంప్రదాయ మత ఛాందసులకు గిట్ట లేదు. ద్వైతంగా చెప్పబడే మత సూత్రాలకు అద్వైతం బద్ధశత్రువు. అద్వైతంలో మతం వుండదు. జీవులంతా సమానులే. అందుచేత చాతు ర్వర్ణ్య సిద్ధాంతం కుప్పకూలి పోయింది. అందుకే 32 ఏళ్ళ వయస్సులోనే అంతం మొందించారు ఆయనను.

అంత త్వరలో ఆయన అలా పోవడం తాత్విక జగత్తుకి తీరనినష్టం అంటూ వుండేవారు అన్నగారు. ఒక సభలో కలిసినపుడు సమన్వయం మీద చర్చించాం. అన్వయం చెప్పకపోతే ద్వైతమవుతుంది. అన్వయం చెబితే అద్వైతమవుతుంది. అన్వయంలో తాత్విక సూత్రాలను సమాజానికి సమన్వయంచేసి చెప్పినపుడు అది వ్యావహారిక ప్రయోజనం పొందుతుంది. కానపుడు అది సమాజానికి దూరమై నిష్ప్రయోజన మవుతుంది

శంకరుడు తాత్విక సూత్రాలను సమాజానికి సమన్వయ పరచి చెప్పడం ప్రారంభించాడు. అది మతస్థులకు, జాత్యహంకార బ్రాహ్మణ వర్గానికి గిట్టలేదు. అందుచేత తమ అహంకారాన్ని, ఆధిక్యతను నిలుపుకోవడానికి ఆయన భౌతిక అస్తిత్వాన్ని అంత మొందించారు. కాని, ఆయన మిగిల్చిపోయిన జ్ఞానమార్గం వుండనే వున్నది. ఆ మార్గంలో ఆయన మిగిల్చిపోయిన తాత్విక విషయాన్ని (అన్వయంలో సమన్వయం) సమాజానికి అన్వయించి ప్రచారంచేసి ఆయన ఆశయాన్ని పూర్తి చేయడానికే ఈ చలమడు (చలమయ్య) వచ్చాడు అన్నారు. చలమడు పూర్తి చేయని (అన్వయంతో ఆచరణ) భాగాన్ని ఈ (రాధా) కృష్ణుడు పూర్తి చేస్తాడు అని నేనన్నాను. అందరం నవ్వుకున్నాం.

అలా నే నన్నందుకు అన్నగారు యెంతో సంతోషించారు. సంతోషించడమేకాక నన్ను ప్రోత్సహిస్తూ యిలా అన్నారు. నేనంటె నీవేరా, "నేను" అన్నా "నీవు" అన్నా ఒక్కటే. శంకరుడు చెప్పినా, నేను చెప్పినా, నీవు చెప్పినా అంతా ఆ "నేను" మీదనేగదా? ఏ రూపంలో చూచినా, ఏ రూపంలో కనిపించినా. ఏ నామంతో పిలిచినా అదంతా ఆ "నేను" కి అన్యం కాదుకదా? అన్నారు. అంత విశాలంగా వుండేది వారి తాత్విక సమన్వయం.

కొంతమంది ఏకత్వ తత్వాన్ని చెబుతున్నారో, అనేకత్వ తత్వాన్ని చెబుతున్నారో వారికే తెలియదు భిన్నత్వాన్ని చెబుతున్నారో, అభిన్నత్వాన్ని చెబుతున్నారో తెలియదు అభేదాన్ని చెబుతున్నారో, లేక భేదాన్నే సృష్టిస్తున్నారో తెలియదు. సమిష్టిని కోరుతున్నారో, వ్యష్టిని కాంక్షిస్తు

న్నారో తెలియదు. అంత అస్పష్టంగా వుంటుంది వారిబోధ. ఆ బోధలో మనకు బాధోపశమనం కలగదు. కాగా బాధే మిగులుతుంది. కాని, అన్న గారి ఉపన్యాసాలు చాలా స్పష్టంగా వుండి వినేవారికి శ్రవణానందమేకాక జీవిత విధానానికి ఒక చక్కని బాట చూపెట్టేదిగా వుండేది. తత్వశాస్త్రాన్ని తెలుసుకున్నామంటే అది జీవితానికి ప్రత్యక్ష ప్రయోజనం కలిగించేదిగా వుండాలి కదా?

## ఆచరణకు అనుకూలంగా

ఏ వాదమైనా ఆచరణ దగ్గర సమన్వయం కుదరకపోతే అది వాదం గానే మిగిలిపోతుంది. ఆచరణకు అనుకూలంగా లేని సిద్ధాంతం, సమాజంపై దాని ప్రభావం వుండక పోవడంతో, దానికి సంబంధించిన తాత్వికాంశంపై దెబ్బ తీస్తుంది. ఆధ్యాత్మిక భావవాద మంతా భావాలుగా, వాదాలుగా చెప్పుకోవడానికి బాగానే వున్నట్లుగా వున్నా ఆచరణ దగ్గర సమన్వయం కుదరక పోవడంతో దాని తాత్వికాంశంపై మనకు సందేహం కలుగు తున్నది. ఆ కారణంగానే నేడు దాని తాత్విక పునాదులు దెబ్బతిన్నవి.

'కావడి కొయ్యేనోయ్ కుండలు మన్నేనోయ్' అని తత్వం చెబితే చాలదు. "కాయమే యిది మాయరా గాలి నింపిన సంచిరా" అని తత్వాలు పాడితే సరిపోతుందా? అలా తత్వాలు పాడిపాడి తత్వాన్ని తప్పుదారి పట్టించి జీవితంపై విరక్తి కలిగించిన ఆధ్యాత్మిక వాదం జీవితానికి అర్ధ మేమి చెబుతుంది? వాస్తవమైన జీవితాన్ని వదలి, అవాస్తవమైన పర మార్ధమేదో వుందని ప్రాకులాడటంతప్పు. ఈ తప్పుని శంకరుడు గుర్తిం చాడు గనుకనే అతడిని ప్రచ్ఛన్న బౌద్ధుడన్నారు. మరి కొంతకాలం బ్రతికి వుంటే పూర్తిగా బౌద్ధ (భౌతిక) వాదిగా మారివుండేవాడు శంకరుడు అంటూ వుండేవారు అన్నగారు.

జీవితం బుద్బుద ప్రాయమని, భౌతిక జీవితసుఖాలు సుఖాలుకావని చెప్పి జీవితంపై వైరాగ్యభావం కలిగించి జీవితానంతరం పొందే ప్రయో జన మేదో వుంటుందని భ్రమ కలిగించే తాత్విక జగత్తునుండి, ఆ తాత్విక సూత్రాలు ఆధారంగావున్న మత మౌఢ్యంనుండి తేరుకున్న మానవుడు

మాత్రమే ఆలోచిస్తాడు. అతడే మానవుడుగా జీవిస్తాడు, మానవుడుగా మిగులుతాడు. అలా ఆలోచించిన శంకరుడు బ్రతికివుంటే యేమి చెప్ప బోతాడనేది మతస్థులకు తెలుసు. అందుకే ఆయనను బ్రతకనివ్వలేదు. ఫలితంగా మతం బ్రతక గలిగింది.

## నీ - నా మాట (వచన మాట)

'అద్వైతంబన అది నీ, నా మాట. నేను, నీవుతప్ప ఇంకెవరున్నారు' అనేవారు అన్నగారు. తన సంగతి తాను మరచి (అజ్ఞానంచేత) యెవడో వున్నాడని, యెక్కడో వున్నాడని అనుకునే దశయే ఆస్తిక (ద్వైత) దశ. ఆస్తికుడు అజ్ఞానంచేత దేవుడున్నాడు అనుకుంటాడు. తన ఉనికిని మరి చాడు. లేని దానిపై ఉనికిని కల్పించాడు వున్నతాడుని మరచి లేని పాముని కల్పించుకున్నట్లు. అదేకదా రజ్జు సర్ప భ్రాంతి అంటే. అలా తాను కల్పించుకున్న పాము తననే కాటు వేస్తుందని భయపడసాగాడు. ఆ భయం పోవడానికి పాముని కొట్టనక్కరలేదు (లేదుగనుక) ఉన్నది తాడని తెలిస్తే చాలు.

ఉన్నది తాడని, పాము కాదని తెలియడానికి దీపం (జ్ఞానం) కావాలిగాని కర్ర (సాధనం) గాదు. ఇక్కడ తాను అజ్ఞానంచేత కల్పించు కున్న ద్వైవ భావం తనను దాస్య భావంలో వుంచుతున్నది. ఆ దాస్య భావం పోయి తాను స్వేచ్ఛాజీవి నని తెలియాలంటే స్వయంగా ఆలో చించ గలగాలి. ఆలోచించే స్వేచ్ఛ తనకున్నదని గుర్తించాలి అలా ఆలో చించిన మానవునికి "నేను" అంటే యేమిటని తెలుస్తుంది. "నేను" తెలిస్తే అంతా తెలిసినట్లే - నేనంటే మేనుతో సాపేక్షమే గనుక.

'ఆస్తిక దశనుండి ఆలోచించిన మానవుడు ""నేను" వున్నాను, "నేను" వున్నాను గనుక "నేను" ఆలోచిస్తున్నాను' "నేను" ఆలోచిస్తు న్నాను గనుక నాకు సర్వము తెలుస్తున్నది' అంటాడు, కాని, భౌతికవాది 'నాకంటే ముందు భౌతిక అస్తిత్వంగల పదార్థంవున్నది' ఆ పదార్థంనుండి "నేను" అనేది అస్తిత్వంలోకి వచ్చింది. అలా నేను అస్తిత్వంలోకి వచ్చాను గనుకనే "నేను" ఆలోచిస్తున్నాను. "నేను" ఆలోచిస్తున్నాను

గనుకనే నా సంగతి నాకు తెలుస్తున్నది. నాకు కారణమైన పదార్థం సంగతీ నాకు తెలుస్తూ వున్నది. గనుక "నేను" చైతన్య వంతుడను. నా కంటే అన్యంగా నన్ను తెలుసుకునేది యేదీలేదు. తెలుసుకోవడమనే ప్రత్యేకత నా యందే వున్నది. అందుచేత "నేను" వుండడం సత్యం. దేవుడు వుండడం అసత్యం' అని అంటాడు.

సత్యాసత్యాలు తనకే తెలియాలిగాని తాను గానిదేది తనకు తెలియదు. తనను తెలుసుకోలేడు. తాను వున్నాను అనేనమ్మకం తనకు కలగాలి. ఆ నమ్మకం కలిగిన క్షణమే తనకు ఆనందాన్ని కలిగించే క్షణం. దానినే జ్ఞానం అంటాం. ఆ జ్ఞానం యెవడికి కలగదో అతడే జడుడు (తెలుసుకొనలేనివాడు). సంస్కృత భాషా దాస్యంనుండి మనం మన భాషలోకి వచ్చి చెప్పుకుంటే 'చైతన్యం' అనే దానికి 'తెలుసుకొనుట' అని అర్థం చేసుకుంటే తెలుసుకొనుట ద్వారా దేనిని తెలుసుకుంటామో అది "తెలివి". అదే ఆ భాషలో "ప్రజ్ఞానం", మన భాషలో "తెలివి". తెలుసుకునేది చైతన్యం అయితే తెలుసుకున్నది "ప్రజ్ఞానం" అని చెప్పుకోవచ్చు అనేవారు.

ఈ విషయంలో కూడా భాషా ఛాందసులు (పండితులు) అన్నగారితో చాలాకాలం యేకీభవించక తీవ్రమైన వాదోపవాదాలు చేస్తూ వుండేవారు తత్వశాస్త్రం సంస్కృతంలోనే వుండాలని దానిని తెలుగులోకి దించి చెబితే దానికి వుండవలసిన గౌరవం, హుందాతనం వుండదని వాదించేవారు. అలాంటి ఛాందసులు తాత్వికంగా లోతుకువెళ్లి విచారించకపోవడంతో వారిలోని తాత్విక బలహీనతలను కప్పిపుచ్చుకునే ఉద్దేశంతో భాష విషయం దగ్గర మొండి వాదనలు చేస్తూ వుండేవారు. కాని, చివరకు అన్నగారివద్ద తాత్విక విషయంలో చిత్తై పలాయనం చిత్తగించేవారు. విషయానికి బద్ధమై భాష వుండాలిగాని, భాషకు బద్ధమై విషయం వుండదు.

## అన్వయం

నానాత్వ భిన్నత్వాలుగా కనిపించే వస్తువులమధ్య ఏకత్వం అర్థమైతే, (అన్వయ వ్యతిరేకి జ్ఞానం కలిగితే) తత్వశాస్త్ర పరమైన సమ

న్వయం అర్థమవుతుంది. అదే తత్ త్వమ్. తత్, త్వమ్‌ల ఏకత్వం అర్థమైతే తత్, త్వమ్ తానేనని తెలుస్తుంది. అది తెలిస్తే, ఏది దేనికి భిన్నమవుతుంది? అటువంటి అభిన్న అభేద స్థితిని అర్థం చేసుకుంటే నానాత్వ భిన్నత్వాలుగా కనిపించే జగత్తువల్ల నీకేమి నష్టంలేదు, కష్టంరాదు. పైగా సుఖాన్నే యిస్తుంది.

సిద్ధాంతమందుగల ఈ అన్వయ, వ్యతిరేకాల సమన్వయం అర్థం కాకపోతే జగత్తు అసత్యమని (మిధ్య) అనిపించవచ్చు. అసలు జగత్తని, బ్రహ్మమని రెండులేవు. ఉన్నది ఒక్కటే. నానాత్వంగా చూచినప్పుడు (తోచినప్పుడు) జగత్తని, ఏకత్వంగా అర్థమైనప్పుడు బ్రహ్మమని (ద్రవ్యమని) అనవచ్చును. ఇనుప వస్తువు తుప్పు పడుతుంది. కొయ్య వస్తువు మగ్గి, బొగిలి వస్తు రూపం నశిస్తుంది. ఇనుము, కొయ్యలకు కారణమైన పదార్థం నశించదు, ఆ వస్తువులకు కారణమైన పదార్థ రూపంగా మారుతుంది (లయమవుతుంది). వస్తువుని విశ్లేషించి చూస్తే పదార్థం అర్థమవుతుంది. పదార్థం సంశ్లేషణలో వస్తురూపం పొందుతుంది. అన్వయ వ్యతిరేకాల సమన్వయం అర్థమైతే అది అద్వైత జ్ఞానమవుతుంది. నానాత్వ భిన్నత్వాలకు ఏకత్వం అర్థమవుతుంది.

అలా అర్థమైతే అపుడు జగత్తని బ్రహ్మమని ద్వైత (భేద) భావం రాదు. అభేద భావమే మిగులుతుంది. పదార్థం వస్తువు వేరుకాదనీ పదార్థం వస్తువు ఒక్కటేననీ భౌతిక తత్వ శాస్త్రం తెలిసినవారికి తెలుస్తుంది. అద్వైతం కూడ అంతే.

అంటే చక్షురాది సర్వేంద్రియాలకు తెలిసే (అనుభవంలోకి వచ్చే) సర్వమూ సత్యమే. అలా దృశ్య విషయమైన సర్వజగత్తు సత్యమని అంటే దృగ్ విషయం వేరై సిద్ధాంత దోషం యేర్పడదా? అని సందేహం కలగవచ్చు. అందుకే సమన్వయం అర్థం కావాలని పదే, పదే చెప్పవలసి వస్తున్నది. దృగ్, దృశ్యములు (తెలుసుకునేది, తెలియబడేది) అని రెండు లేవు. ఏది దృశ్యమో (కారణమో) అదే దృగ్ విషయమై (కార్యరూపమై) దృశ్య విషయాన్ని తెలుసుకుంటుంది. తెలియబడే జడ పదార్థానికి తెలుసు

కునే చైతన్యం భిన్నంకాదు. జడ పదార్థంయొక్క కార్య రూపమే చైతన్యం.

అలా అన్వయ వ్యతిరేకాల సమన్వయంతోనే యెవరైనా నిజ జీవితాన్ని సాగించవలసి వుంటుంది. కేవలం తాత్విక దృష్టిగాని, కేవలం వ్యావహారిక దృష్టిగాని పనికిరాదు. అటువంటి సమన్వయ భావం అర్థం కానివారు మనకు తటస్థపడినప్పుడు వారు సమాజానికి దూరమైన వ్యక్తులుగా మెట్ట వేదాంతులుగా మనం భావిస్తాం. వారినే దొంగవేదాంతులనీ దొంగ సన్యాసులనీ కూడా అంటూ వుంటాం. అటువంటివారే తత్వ శాస్త్రానికి, తద్వారా సమాజానికి ద్రోహం చేసిన వారవుతారు. అటువంటివారు యెదుట బడినపుడు మీరు ధైర్యంగా నిలబడి వారిని నిలదీని అడగగల ధైర్యం ఈ పుస్తకంద్వారా మీకు కలగగలదని ఆశిస్తున్నాను. అది నెరవేరితే నా కృషి ఫలించినట్లే భావిస్తాను.

## తలుపు తీయవలసింది మేమూకా? నేనుకా?

ఒకనాడు సభానంతరం భోజనాలకు కూర్చున్నాం. కుల, మత, స్త్రీ, పురుష భేదంగాని, మరే విధమైన సాంఘిక ఆచార, సంప్రదాయ భేదం గాని పాటించని రీతిలో ఆ కార్య క్రమం సాగిపోతూ వుంటుంది. అటువంటి భేద రహిత సహపంక్తి భోజన కార్యక్రమం కొత్తవారికి వింతగాను, విడ్డూరంగాను వుండవచ్చు, తోచవచ్చు. కాని అక్కడివారికది వింతాకాదు, కొత్తాకాదు. సహజంగానే సాగుతూ వుంటై ఆ కార్యక్రమాలు.

అక్కడ యెటువంటి భేదబుద్ధి యెవరికీరాదు. కారణం ఆ స్థాయికి వారిమనసు పక్వత కలిగివుంటుంది. కాని, ఆ విద్యలో ప్రవేశంలేని క్రొత్త వారికి వింతగానో, విడ్డూరంగానో తోచవచ్చనుకున్నాం గనుక ఆ సమయంలో క్రొత్తవారిని అక్కడకు (భోజనాలు జరిగే చోటుకు) రానివ్వరు.

ఆ ఉద్దేశంతోనే ముఖద్వారం తలుపులుమూసి యెవరు వచ్చినా తలుపులు తీయవద్దని చెప్పి అన్నగారు లోనికి వెళ్లారు. ఆ తరువాత కొద్ది

నిమిషాలకు ఒక భక్తురాలు (ఆలస్యంగా) వచ్చి తలుపు తట్టింది (బయట నుండి). ఎవరు తలుపు తట్టేది అని నే నడిగాము. "నేనే" అని సమాధానం చెప్పింది ఆ బయటి మనిషి. నేనే అంటే అని మళ్లీ నేనడిగాము. 'నేనే' నని మళ్లీ ఆమె సమాధానం చెప్పింది. అలా నేనడుతూ వుండటం, 'నేనే' నని ఆమె సమాధానం చెప్పుతూ వుండటం కొన్ని నిమిషాలు జరిగిపోయినై. కాని, నేను తలుపు తీయనీయలేదు (ఎవరొచ్చినా తలుపు తియ్యవద్దని అన్నగారు చెప్పి వున్నారనేది నా ధైర్యం).

అలా కాలం గడుస్తూవున్నా ఆమె తన వ్యావహారిక నామం (పేరు) చెప్పడంలేదు. 'నేను' అనే తాత్విక భావంనుండి తాను తన పేరుని చెప్పటంద్వారా 'మేను' తాననే వ్యావహారిక భావం వస్తుందని ఆమె ఉద్దేశం. తలుపు తీయవలసింది 'మేను' కి గాని 'నేను' కి గాదని నా ఉద్దేశం. అందుచేత పేరు చెప్పనిదే తలుపు తీయబడదు అని నేనంటు న్నాను.

అలా నేనంటున్నకొద్ది ఆమెను పరీక్ష చేస్తున్నామనే భావం ఆమెలో బలపడి పేరు చెప్పక పోవడంతో కాలం గడుస్తూ వుండటంతో అక్కడి వారంతా ముసి, ముసి నవ్వులు ఆరంభించారు అలా తాత్విక, వ్యావ హారికాలమధ్య మా యిద్దరికి జరుగుతూవున్న పరీక్షను వీక్షిస్తూవున్న వారికది వినోదంగానే వున్నది. కేవలం తత్వాన్ని వల్లె వేసేవారు ఇటు వంటి విషయాలలో అప్పుడప్పుడు నాకు తటస్థపడి నా ద్వారా వారి తప్పుని వారు తెలుసుకుంటూ వుండేవారు. వ్యావహారికం, తాత్వికం అని రెండులేవు. ఏది వ్యావహారికమో అందులోనే తాత్విత ముంటుంది. అది తెలుసుకో లేనప్పుడు ఇలాంటి వినోదం కలిగిస్తూ వుంటారు.

ఇంతలో యెవరో లోనికివెళ్ళి అన్నగారితో ఈ విషయం చెప్పారు. వారికి తెలుసు నేను అటువంటి పరీక్షలు వారి శిష్యులకు పెడుతూ వుంటా నని. అందువల్ల ఈ విషయం తెలియగానే వారు నవ్వుకుంటూ మా వాడేదో పరీక్ష పెట్టినట్లున్నాడు అనుకుంటూ మా వద్దకు వస్తున్నారు. అది గ్రహించి వారి నుద్దేశించి నేనిలా అన్నాను.

అన్నయ్యా యెవరో బయటనుండి తలుపు తీయమని అడుగు తున్నారు. ఎవరంటే వారు వారిపేరు చెప్పకుండా "నేను" అంటున్నారు. 'నేను' కి తలుపు తీయడమేమిటి? 'మేను' కి గదా తలుపు తీయవలసింది అని నేననడంతో అంతేరా నీవు చెప్పింది కరెక్టే. అఖండమైన 'నేను' కి తలుపు తీయవలసిందిలేదు. ఖండమైన మేనుకు గదా తలుపు తీయవలసింది అని అంటూ తానే తలుపు తీశారు అన్నగారు. మంచి పరీక్ష పెట్టావు మా శిష్యులకు. ఆ భయంతోనే ఆమె పేరు చెప్పలేదు. నీ పరీక్షలో ఆమె తప్పింది అన్నారు నవ్వుతూ అన్నగారు.

మేను నాది కాదనుకుని, మేనుకాని 'నేను' వుంటుందనుకునే ద్వైత బుద్ధి త్వరగా పోదురా అన్నారు. నాలుగు తాత్విక పదాలు వల్లె వేస్తే సరిపోదు. వ్యావహారిక, తాత్విక సమన్వయం తెలియాలి. అది అర్థం కావడం కొంచెం కష్టమే అని అన్నగారంటూ వుండగా మీ తమ్ముడుగారు మంచి పరీక్ష పెట్టారు అని అంటూ ఆమె లోపలికి వస్తూ వుండగా అందరం నవ్వుకున్నాం. 'నేను' అనే భావంనుండి దిగజారని స్థితిలో వుండాలని చెబుతూ వుండేవారు. అటువంటి స్థిర ప్రజ్ఞత్వం అంత సులభం కాదుకదా!

## కొండవీటి వేంకట కవిగారు

కవిరాజు త్రిపురనేని విజ్ఞాన వేదిక (పుష్పగిరి, మద్రాసు) నుండి భౌతిక విజ్ఞాన తరగతులు నడిచిన సందర్భంగా కొండవీటి వేంకట కవి గారిని ఆహ్వానించాం. "సాహిత్యంలో త్రిపురనేని తిరుగుబాటు" అనే విషయంపై వారు ప్రసంగించారు. కవిరాజు త్రిపురనేనితో వారికి సన్నిహిత (సాహిత్య) సంబంధం వున్నది. పౌరాణిక (సంస్కృత) సాహిత్యంలో మంచి పాండితీ ప్రజ్ఞా పాటవంగల వ్యక్తి వేంకట కవిగారు.

పౌరాణిక సాహిత్యంపై విమర్శనాత్మక రచనలుచేసి తెలుగు చదువరులకు విమర్శనాత్మకమైన ఆలోచనలు కలిగించిన విప్లవాత్మక కవి త్రిపురనేని రామస్వామిగారు. ప్రశ్నను పుట్టించేవారి రచనలు ఆనాటి సాహిత్య రంగంలో మంచి సంచలనం కలిగించినవి. మత పునాదులను పెకలించి వేసినవి. ఆచార సంప్రదాయాలపేర జరుగుతూ వున్న

అటువంటిఅక్రమాలకు, అన్యాయాలకు కారణాలుగావున్న మూఢనమ్మకాలపై యెదురు దెబ్బతీసినవి త్రిపురనేని రచనలు, ఎందుకు? ఏమిటి? అనే ప్రశ్న వేయలేని సామాన్య మానవుడుకూడా ఆ ప్రశ్న వేయడం నేర్చుకున్నాడు ఆ రచనలు చదివి అని అన్నారు వేంకట కవిగారు.

రెండవరోజు మా ప్రత్యేక కోరిక మేరకు దేవుని పుట్టు పూర్వోత్తరాలు యెలాంటివి? మనపురాణాలలో వాటినిగురించి యెలావివరించ బడింది? దశావతారాలు, యితర చిల్లర దేవుళ్లు, వారికథ లెలాంటివి? అనే విషయంపై సావధానమైన వివరణ యిచ్చారు. ఆ కథలు వింటూవుంటే కడుపుబ్బ నవ్వొస్తుంది. వారి సహజమైన హాస్య ధోరణి, వ్యంగ్య భాషణలు వారి ప్రసంగానికి తోడుకాగా ఆ దైవ కథలు మరీ చిలిపి కథలై పోయినవి.

కట్టు కథలకు కావలసినంత అసభ్యత, అసత్యాలు తోడుచేసి వ్రాయబడటంచేత ఆ కథలు చదువుతున్నా వింటున్నా మనకొక విధమైన అసభ్య భావం కలుగుతూవుంటుంది. హిందూ మతంలోని ఆ దేవుళ్ళ కథలు, తాత్విక విమర్శనా దృష్టితో చూడగల వారికి, యెంత లేకితనం కలిగివున్నవనేది అర్థమవుతుంది. ఆ రోజు వేంకట కవిగారి ఉపన్యాసం విన్న ప్రతిసామాన్య వ్యక్తికి యెంతో కొంత ఆలోచన కలిగించివుండక మానదు. అలా కలిగిన ఆలోచనవల్ల ఆ దేవుళ్ళపై మనకువున్న భక్తి భావం అంతా అజ్ఞాన కారణమేననేది అర్థం కాగలదు. అటువంటి కథలు ఆ దేవుళ్ళ కథలు. ఆ కథలు అలాగే అర్థం చేసుకుంటే ఆ దేవుళ్లు మిగలరు.

పరస్పరం అసూయా ద్వేషాలతోకూడి సామాన్య సాంసారిక జీవుల జీవితాలకంటే నికృష్టమైన, నీచమైన జీవితాలు ఆ దేవుళ్ళ జీవితాలు. ఆ విషయం తెలిసిన మరుక్షణమే ఆ దేవుళ్ళపై గల భక్తికి అర్థం లేదనిపిస్తుంది. స్వార్థ బుద్ధితో ఒకరిని ఒకరు నిందించుకుని వారిలో వారు కలహించుకున్న కథలే వారి కథలు, శైవులపై వైష్ణవులు, వైష్ణవులపై శైవులు పరస్పరం చేసుకున్న విమర్శలతో కూడిన చవుకబారు భాషతో వ్రాసుకున్న కథలే ఆ కథలని అర్థమవుతుంది అన్నారు.

పరస్పరం ద్వేషంతో మత వైషమ్యాలతో వ్రాసుకున్న కథలేగాని ఒక పద్ధతిగా ఒక క్రమంగా మంచి ఆలోచనతో మంచికోసం వ్రాసిన వ్రాతలు కావవి. పండితులు వారి పాండిత్యాన్ని ప్రదర్శించుకోవటానికి వ్రాసిన కథలేగాని ప్రజలకు మంచి విషయం చెప్పాలనిగాని మంచిదారిలో వుంచాలనిగాని ఆశించి వ్రాసినవి కావన్నారు. లేని దేవుళ్లు వున్నారని నమ్మించి, చిత్రించి అన్నిరకాల పాడు బుద్ధులు వారికి కల్పించి వర్ణించి కాము పికార ప్రవృత్తులు వారికి పులిమి వ్రాసుకున్న ఆయా రచయితల రచనలు ఏ సమాజానికి ఎప్పుడు ఎలా ఉపయోగ పడగలవు? వాటిని వారు (ఆయా రచయితలు) ఎందుకు రచించి మనముందు వుంచినట్లు? అలా ప్రశ్నించుకుని పరిశీలించితే అర్థంకాగలదు ఆయా కాలాల్లోని ఆయా రచయితల మనః ప్రవృత్తి యెలాంటిదని. వారి ప్రవృత్తిని వృత్తిని కూడా ఆ రచనలద్వారా తెలుసుకోవచ్చు మనం.

తాత్విక జ్ఞాన చింతనను ప్రక్కకునెట్టి, భక్తిపేర కల్లబొల్లి కట్టు కథలనల్లి ప్రజలను తప్పు త్రోవను (అజ్ఞాన బాటను) పట్టించినదే ఆ పురాణ సాహిత్యమంతా. అందుచేత మళ్లీ ప్రజలలో తాత్విక జిజ్ఞాస కలిగించి వారిలో చైతన్యం తీసుకు రావలసిన అవసర మెంతైనా వున్నది. అందుకు ఆ సాహిత్యాన్ని తగల బెట్టాలని ద్వైత (దాస్య) భావంనుండి అద్వైత జ్ఞాన (స్వేచ్ఛా) భావం కలిగించాలని ఆ సభకు అధ్యక్షత వహించిన అన్నగారు తన అధ్యక్షోపన్యాసంలో అన్నారు.

ఆ మరుసటిరోజు వేంకట కవిగారు బయలుదేరి వెళ్ళే సమయంలో మీరు బహుకాలం ఆరోగ్యంతో బ్రతికి బాగుండాలని, సమాజానికి సాహిత్య సేవ మరింత చేయాలని అంటూ మీ ఆరోగ్యం బాగుండాలంటే మీరు చుట్ట కాల్చడం మానుకోవాలని, దానిని మాకు (సన్యాసులకు) దానం ఇవ్వవలసిందని అన్నారు అన్నగారు.

అంతేకాక వారి (కవిగారి) కాళ్ళకు నమస్కరించి ప్రార్థించారు అన్నగారు. పెద్దవారు మా క్షేమంకోరి మాకు మంచి సలహా యిచ్చారు. మీ సలహాను తప్పక పాటించగలనని అన్నారు కవిగారు. ఈ సారి మనం

కలుసుకునే సమయానికి, ఆ పని (చుట్ట కాల్చడం మానడం) చేస్తారని నేనన్నాను. అయ్యో, తప్పకుండాను అని అన్నారు వారు.

అదే విధంగా ఆ తరువాత హైదరాబాద్‌లో నేను వారిని కలిసినపుడు, మీ కోరిక ప్రకారం నేను చుట్ట కాల్చడం మానేశానని సంతోషంతో చెప్పారు వారు. అందుకు నేను సంతోషించాను. నేను అన్నగారిని కలిసినప్పుడు ఆ విషయం అన్నగారికి చెప్పగానే వారు చాలా సంతోషించారు. సంతోషించటమేగాక, మనసు నిబ్బరం గలవారు మనస్ఫూర్తిగా మానాలనుకుంటే, అదెంతపని అనికూడా అన్నారు అన్నగారు.

ఇదంతా యెందుకు చెప్పవలసి వచ్చిందంటే ఏ చిన్న దురభ్యాసమున్నా సహించేవారు కాదు అన్నగారు. అది సభ్యతకాదు, ఆ మాత్రం నిగ్రహం లేకపోతే మన ఆరోగ్యాలు చెడి మనం యెందుకు పనికిరానివారమై పోతామని అన్నగారి ఉద్దేశం వారి శిష్యబృందం అంతాకూడా అటువంటి కట్టుబాట్లతోనే వుండేవారు. అలా కాని ఒక రిద్దరు వుంటే వారియెడల చాలా కఠినంగా వుండేవారు అన్నగారు.

## ముక్కుపొడుము, జందెపు పోగు

ఒకరు ముక్కుపొడుం డబ్బా బొడ్లో పెట్టుకుని (ఎవ్వరు చూడరనుకొని) సభకు వచ్చారు. అది ఎలాగో చూచారు అన్నగారు. అందరి సమక్షంలోను దాన్ని బయటకులాగి, తీసి దూరంగా పారేశారు. ఆనాటితో ఆ అలవాటుని వారు మానుకున్నారు. అలవాటనేది మనిషికి వుండకూడదు. ఏ రకమైన అలవాటుకీ మనిషి బానిస కాకూడదు అనేవారు. సాధారణమైన లౌకిక అలవాటులే మానసిక (తాత్విక) బానిసత్వానికి కారణాలవుతై అనేవారు.

బ్రాహ్మణ పౌరోహిత్యాన్ని యెదిరించి, స్వసంఘ పౌరోహిత్యం అని ప్రారంభించిన కమ్మవారు జంధ్యాలు వేసుకుని పౌరోహిత్యం చేబట్టిన కాలం కొంతకాలం సాగింది. ఏ పౌరోహిత్యమూ అక్కరలేదని, దాన్నికూడా

యెదిరించారు అన్నగారు ఒకనాటి సభకు జంధ్యం వేసుకున్న స్వసంఘ పురోహితుడు ఒకాయన వచ్చాడు. జంధ్యం కనబడకుండా వుండాలని (అన్నగారు చూస్తే పూరుకోరని) దాన్నిచుట్టి లోపలకు దోపుకున్నాడు. కాని అదెలాగో మా అన్నగారి కంట బడింది. వారిని దగ్గరకు పిలిచి అదేమిటి నాయనా అని అడిగారు. దానికి సమాధానం చెప్పలేక ఆ వ్యక్తి ఆలోచిస్తూ వుండగా, అందరి సమక్షంలో, ఆ జంధ్యాన్ని పట్టి, లాగి, తెంచి, దూరంగా అవతల పారేశారు అన్నగారు. అదేమిటని అక్కడి వారెవ్వరు అడగలేదు. కాని ఆ పని అందరికీ అబ్బురంగానే అనిపించి వుండవచ్చు (పవిత్రమైనదనుకున్న ఆ జంధ్యానికి పట్టిన గతికి).

తాత్విక సభలకు వస్తూ, పురోహితుని వేషం యెందుకురా పిచ్చివాడా, అని అనడంతో మరెవ్వరు కిక్కురుమనకుండా కూర్చున్నారు. ఆ తరువాత అటువంటి పాడుపని మరెవ్వరు చేయలేదు. సంస్కారం వారి వేష భాషల్లో కనబడుతూ వుంటుంది. వేష భాషల కతీతమైనది తాత్విక చింతన. అందుచేత వాటికి బానిసలం కాకూడదు. వాటినిచూచి భయపడనూ కూడదు అనేవారు.

మన ఆలోచనలకు తగినట్లుగా మన ప్రవర్తన వుండాలేగాని, ఆలోచనల తీరుకి ఆచరణ దారి వేరు కాకూడదు. ఒకనాటి సంప్రదాయం (ఆనాటి కది మంచి సాంఘిక పద్ధతి కావచ్చు) ఈనాటికి దుస్సంప్రదాయమై అది ఆచారంగామారి, మూఢంగా అనుసరించబడుతూ వున్నది. జ్ఞాన సంబంధమైన అద్వైత తాత్విక విచారణ చేసే వ్యక్తులకు అజ్ఞాన కారణమైన వైదిక కర్మ (మంత్ర కాండ) కు సంబంధించిన పౌరోహిత్యంతో పనేమున్నది? అదే తాత్విక (జ్ఞాన) వ్యావహారిక (లౌకిక) సమన్వయం లేకపోవడం అంటే.

సమాజంలో పెద్దవారు (పెద్ద మనుషులు) గా చలామణి అవుతున్న వారిలో చాలామందికి ఏదోఒక దురభ్యాసం వుండటంవల్ల వారు సంఘంలో చిన్నచూపు చూడబడటమేకాక, అటువంటి అలవాట్లవల్ల ఆరోగ్యం చెడి వారు తమ ఆయుష్షుని అర్ధాంతరంగా కోల్పోతూ వున్నారు.

# హేతువాద మిత్రులు - వారి అలవాట్లు

అణ్ణాదురై (తమిళనాడులో డి. యమ్. కె. స్థాపకులు) మంచి మనిషిగాను, పెద్ద మనిషిగాను పేరున్న మనిషి. కాని ముక్కు పొడుం పీల్చడమనే దురలవాటుని మానలేని చిన్న మనిషిగా మారిపోయాడు. జవహర్‌లాల్ నెహ్రూ గొప్పవ్యక్తిగా పేరున్న వ్యక్తి కాని జిహ్వా చాపల్యం వున్న వ్యక్తి గావడంచేత వ్యక్తిత్వం లోపించి నట్లైనది. వీరిద్దరు తమతమ అలవాట్లను మానుకోలేక తమ చావుని తాము కోరి తెచ్చుకున్నట్లైనది. అది విచారకరమైన విషయం.

హేతువాద మిత్రులు కొంతమంది అహేతుకమైన అలవాట్లను (ముక్కు పొడుం పీల్చడం, చుట్ట, బీడి, సిగరెట్లు కాల్చడం మద్యపానం వగైరా) మానలేకుండా వుండటంఅంటే వారిలో(ఆ విషయంలో) హేతుబుద్ధి లోపించడంగానే భావించాలి. ఆ విషయమై అటువంటి వారిని హెచ్చరించినప్పుడు ఇది వ్యక్తిగతమని చెప్పడం (తప్పించుకోవడం) జరుగుతూ వున్నది.

ప్రతిది వ్యక్తిగతమని, వదిలేస్తూపోతే (ఆస్తికుడు తన నమ్మకాలు కూడా వ్యక్తిగతమే నంటాడు) మనం సంఘ పరంగా ఆలోచించే దెప్పుడు? (దోపిడిదారు తన దోపిడిని వ్యక్తిగతమని సమర్థించుకుంటాడు) సమాజ పరంగా చూచినప్పుడు ఏదీ వ్యక్తి పరంగా వదిలి పూతుకోరాదు. ప్రతిది వ్యక్తిగతమని వదిలేస్తే వ్యక్తులకు, కలిగే శారీరకమైన అనారోగ్యం, మానసికమైన అజ్ఞానం సమాజంపై ప్రభావం చూపెట్టవా? మానసికమైన శారీరకమైన ఆరోగ్యంకూడా సంఘ పరంగానే సమిష్టి దృక్పథంతోనే కాపాడుకుంటూ వుండాలి.

ఇటువంటి విషయాలలో ఏ విధమైన మొహమాటాలకుగాని, మినహాయింపులకుగాని అంగీకరించేవారు కాదు అన్నగారు. అటువంటి విషయాలలో కొంతమందికి కొంత కఠినంగా ప్రవర్తించినట్లు కనిపించినా కనిపించవచ్చు, అనిపించనూవచ్చు. కాని క్రమశిక్షణలేని వ్యక్తులవల్ల, సమాజం నైతిక విలువలు, కోల్పోయి నిర్వీర్యమై పోతుందని వారి ఉద్దేశం.

# అన్నం పరబ్రహ్మ స్వరూపం

భోజన కార్యక్రమాలు (సభలు, సమావేశాల సందర్భంలో) జరిగే సమయంలోకూడ క్రమ పద్ధతుల కోసం తాను స్వయంగా పర్యవేక్షణ చేస్తూ వుండేవారు. అన్నం పరబ్రహ్మస్వరూప మని చెప్పేవారున్నారు. దానిని కళ్ళ కద్దుకునే వారున్నారు. కాని దాని విలువ తెలుసుకోక దానిని దుర్వినియోగ పరిచేవారే ఎక్కువగా వున్నారు. అటువంటి వారిని అస హ్యించుకునేవారు అన్నగారు. భోజన పదార్థాలు విస్తరిలో వదిలేసే దురలవాటుని (అధికంగా వడ్డించుకుని) చూస్తూ వూరుకునేవారు కారు,

శ్రమ విలువ తెలియని కుక్షింభరులు (పురోహిత వర్గం) సోమరులై తాము శ్రమపడకనే అవసరానికి మించి తినడమేకాక, తినేదానికంటే అధికంగా విస్తళ్ళలో వదిలేయడంతోగాని వారికి తృప్తి వుండదు. దాన్ని దురలవాటుగా భావించేవారు అన్నగారు అట్టి అలవాటుని సహించేవారు కాదు.

తినడానికే బ్రతుకుతున్నామని వారనుకుంటారు, అంటారు. కాని, మనం బ్రతకడానికి మాత్రమే తింటున్నామనేది గుర్తించాలి. ఏ వస్తువైనా దాని ఉత్పత్తి (శ్రమ) విలువను గుర్తించి దానిని ఉపయోగించు కోవాలి. అప్పుడే విలువలకు వాస్తవికత యేర్పడుతుంది అలా కానప్పుడు దాన్ని దుర్వినియోగ పరచడం జరుగుతుంది. ఆ కారణంగా అది సద్వి నియోగం కాకుండా పోతుంది. అటువంటి పని వారు (బ్రాహ్మణ వర్గం కానివ్వండి, సమాజంలో శ్రమ పడకుండా జీవించే వ్యక్తులు కానివ్వండి) చేస్తారు, కాని ఆ పని మనం చేయకూడదనేవారు అన్నగారు.

ఒక సమావేశ సందర్భంలో భోజనాలు జరుగుతూ వున్నవి. ఒక శిష్యుడు తన అవసరానికి మించి అన్నం పెట్టించుకున్నాడు. కాని, దానిని పూర్తిగా తినలేక కొంతభాగం విస్తరిలో మిగిల్చాడు (వదిలేశాడు). అది చూచిన అన్నగారు అదేమిటని అడిగారు. అతడు బదులు చెప్పలేక, దానిని పూర్తిగా తినలేక నమస్కరించి క్షమించమన్నట్లు దీనంగా చూచాడు.

తక్షణమే అన్నగారు 'త్వమే వాహం' అంటూ ఆ మిగిల్చిన నాలుగు ముద్దలు తాను తిని (పూర్తి చేసి) ఈ పూటకు ఇక నేను భోజనం చేయను అని ఆ పూటకు భోజనం మానేశారు. అజ్ఞానంతో ఆ శిష్యుడు చేసిన ఆ నేరానికి తనకుతానే ఆ శిక్షను అనుభవించారు అన్నగారు.

ఆనాటి ఆ సంఘటనకు అక్కడి వారందరు చాలా బాధపడ్డారు. ఆ కారణంగా అటువంటి తప్పు మరొకసారి చెయ్యకూడదనుకున్నారో యేమో తెలియదుగాని నాకు తెలిసినంతవరకు అటువంటి పొరపాటు వారు మరెప్పుడూ చేయలేదు. అట్లా వుండేది అన్నగారి క్రమశిక్షణ.

ఆహారం అవసరానికి తినడంవేరు, అవసరానికి మించి తినడంవేరు. అవసరానికి మించి తినడమేకాక దానిని అధికంగా వడ్డించుకుని వదిలేయడమనేది వేరు. అన్ని విషయాలలోను "క్షుత్" తీరని మనస్తత్వం అలవాటు చేసుకున్న మనం తృప్తి అనేది తెలియని స్థితిలో సంచరిస్తూ వుంటాం. ఆకలితోవున్న తోటి మానవుడు అన్నం అడిగితే వాడికి అన్నం పెట్టం. పెట్టాలని మనకు తట్టదు. కాని, అవసరంలేనిది పెట్టించుకుని వదిలేస్తూ వుంటాం. ఇదొక విచిత్రమైన మనస్తత్వం. ఇది నాది, నా యిష్టం వచ్చినట్లు నేను చేసుకుంటాను అనుకుంటాం. ఆ విధంగా వ్యక్తి స్వేచ్ఛను ప్రదర్శిస్తూ వుంటాం. తినేదానికంటే వదిలేసేది యెక్కువగా వున్నప్పుడే మనకు తృప్తి. ఆనందం. అంతరంలో దాగివున్న ఆ "క్షుత్" అనే దాని దుష్ట ఫలితమే ఈ దురలవాటుకి కారణం. సంఘ దృష్టి లేనప్పుడు ఇటువంటి స్వల్పత్వం అలవాటై అల్పత్వంతో సంచరిస్తూ వుంటాం.

## గోరాగారి ఉద్యమాలు

పూల మొక్కలు పీకమని, కూర మొక్కలు పాతమని పోరాటం ప్రారంభించారు గోరాగారు. ఆ విషయమై అన్నగారిని అడిగారు ఆధ్యాత్మిక, భౌతికవాద మిత్రులు. ఉత్తరాల ద్వారా కూడ తమతమ సందేహాలను తెలియజేస్తూ వుండేవారు తమ సందేహ నివృత్తికి సమాధానం కోరుతూ.

గోరాగారు నాస్తికుడేగాని తాత్త్వికుడు కాదు. ఏ మాత్రం తత్త్వశాస్త్రం తెలిసినా వారు ఆ విషయంలో (పూల మొక్కలు పీకమనడంలో) ఆ విధంగా ప్రవర్తించి వుండేవారు కాదు. మానవుడు జీవించడానికి కావలసింది తిండి మాత్రమే కాదు. అది ఒక రసనేంద్రియానికి, అన్నకోశానికి సంబంధించిన ఆహారం మాత్రమే. అలాగే మిగతా ఇంద్రియాలకు సంబంధించిన ఆహారం ఆయా ఇంద్రియాలు అనుభవించడం ద్వారానే మానవుడు సుఖ సంతోషాలతో కూడిన జీవితం జీవించినట్లుగాని తిండిమాత్రమే తిని జీవించే జీవితం జీవితంకాదు. అది సంపూర్ణ జీవితం కానేకాదు.

పశు పక్ష్యాదులు యేదో తిని యెలాగో జీవిస్తూనే వున్నవిగదా? కాని మానవుడు అలా జీవించలేడు. మానవునికి మనసనేది వున్నది. అది అతని ప్రత్యేక లక్షణం. ఆ మనసుకి తృప్తి కలగాలి. అందుచేత పంచేంద్రియాలకు (శబ్ద, స్పర్శ, రూప, రస, గంధరూపాలలో) తృప్తినిచ్చే ఆహారం కావాలి. తద్వారానే మనసు అనుభూతి పొంది ఆనందిస్తుంది. తద్వారా దేహ ఆరోగ్యం నిలుస్తుంది. మనసు పొందే ఆనందం మీదనే జీవితానందం ఆధారపడి వుంటుంది.

పూల మొక్కలు పూచినప్పుడు వాటి సహజ సౌందర్యం చక్షురింద్రియం (కన్ను) ద్వారా దృశ్య విషయకమైన ఆనందాన్ని మనసుకి కలిగిస్తుంది. వాటి సుగంధం ఘ్రాణేంద్రియం (ముక్కు) ద్వారా గ్రహించిన మనసుకి ఉల్లాసం కలుగుతుంది. ఆ విధంగా రెండు విధాలా ప్రయోజనమిచ్చే పూలమొక్కలు పీకమనటం గోరాగారు చేయవలసిన పనికాదు, అది వారి తాహతుకి తగిన పనికాదు అన్నారు అన్నగారు.

(ప్రబల నాస్తికుడైన డేవిడ్‌హ్యూమ్ మనసనేది ప్రత్యేకంగా లేదనీ ఇంద్రియాలద్వారా కలిగే అనుభూతినే మనసని అంటాం అనీ వ్రాశారు అందుచేత మనసుకి అవసరాలుండవని గోరా అభిప్రాయపడి వుంటవచ్చు. ఏ ఇంద్రియమూ తానుగా అనుభూతి పొందలేదు. ఇంద్రియాలద్వారా మెదడుకి చేరిన సంవేదనల సమిష్టి కార్యమే మనసు. ఆ మనసులో మాత్రమే అనుభూతి కలిగి తద్వారా ఆనందం అనే అనుభవం కలుగుతుంది).

కొన్నివేల యెకరాల భూములలో పనికిరాని పొగాకు పండించ బడుతూ వున్నది (వ్యాపార పద్ధతిలో). పలు విధాలైన ప్రయోజన కర మైన ఆహార పంటలు పండించడానికి అనువైన ఆ భూములలో యెందుకూ పనికిరాని ఆ పొగాకుని పండిస్తూ వున్నారు. పైగా ఆ పొగాకు ఆరోగ్యానికి అన్నివిధాలా అపకారం కలిగిస్తూ వున్నది. అనారోగ్యాన్ని పెంచుతూ వున్నది. అటువంటి పొగాకుని పండించడం మానవలసిందిగా ప్రజలమధ్య ప్రచారం చేయవచ్చు, పొగాకుపంటను నిషేధించ వలసిందిగా ప్రభుత్వంపై పోరాటం చేయవచ్చు. కాని, అది చేయకుండా పూల మొక్కలు పీక మనడం, కూర మొక్కలు పాతమనడం గోరాగారు యెందుకు చేశారో అర్థం కావడంలేదు.

పువ్వులు దేవుని పూజలకు మాత్రమే ఉపయోగపడేవని, అవి మాన వులకు ఉపయోగ పడవని, వాటి అవసరం భౌతికంగా మానవులకు లేదని గోరాగారు అనుకున్నారేమో తెలియదు. అలా అనుకునివుంటే వారికి తాత్విక చింతనా సమన్వయం లేదని అనుకోవలసి వస్తుందనికూడా అన్నారు అన్నగారు.

ప్రజలమధ్య వుంటూ వారి అవసరాలు గుర్తెరిగి వారికోసం చేసే పోరాటాలు విజయవంత మవుతై. కాని, ప్రజలకు నిత్య జీవితంతో సంబం ధంలేని సమస్యలు గాని, వ్యక్తిగత ఆలోచనలకు సంబంధించిన విష యాలుగాని (నిజమైన పోరాట స్వభావం కలిగి వుండక) అవి విజయ వంతంకావు.

1942 క్విట్ ఇండియా పోరాటం సమయంలో జైలుకి వెళ్లినప్పుడు అన్నగారు, గోరాగారు ఒకే జైలులో వుండేవారట. అక్కడకూడా తాత్విక చర్చలు చేస్తూ వుండేవారట అన్నగారు. ఆ చర్చలలో పాల్గొన వలసిం దిగా అన్నగారు గోరాగారిని ఆహ్వానించేవారట. కాని వచ్చేవారు కాదట గోరాగారు.

మీరు మాయావాదులు, మీతో వాదించి ప్రయోజనం లేదు. మీతో వాదించి జయించనూలేను అనేవారట గోరాగారు. "నేను" నా సంగతి

చెబుతాను. "నీవు" నీ సంగతి చెప్పు. మనిద్దరం కలిసి మన సంగతులు చెప్పుకుందాం. ఇందులో మాయలేదు మర్మంలేదు అనేవారట అన్నగారు. నీ సంగతి నీకు, నా సంగతి నాకు స్పష్టంగా తెలియాలి. అలా తెలిస్తే నీకు, నాకు భేదంలేదు "త్వమేవాహం" అనేవారట అన్నగారు. అయినా చర్చలకు అంగీకరించేవారు కాదట గోరాగారు. ఎవ్వరితోను ఏ విషయమూ చర్చించకుండానే తనకు తానే (ఏకపక్ష) నిర్ణయంచేస్తూ వుండేవారు గోరా గారు అన్నారు అన్నగారు. అలా అయినప్పుడు సిద్ధాంతంలో క్రొత్త దనం యెలా వస్తుంది అనికూడా అనేవారు.

గాంధీగారు పూర్తిగా ఆధ్యాత్మిక (దైవ తత్వ) వాదిగదా? గోరా గారు పూర్తిగా నాస్తికులు గదా? వీరిద్దరికి బలమైన తాత్విక వైరుధ్యం వుండగా సేవాగ్రామ్ (వార్ధా)లో వీరిరువురు కలిసి వుండి అక్కడ చేసిం దేమిటి? సాధించిందేమిటి? అని ప్రశ్నించారు కొందరు మిత్రులు. ఆ విష యంలో ఆ యిద్దరు లౌకికులే (దొంగలే) అన్నారు అన్నగారు. ఆర్థిక విషయం వచ్చేసరికి ధర్మకర్తృత్వ విధానం (వ్యష్టి ఆర్థిక విధానం) ఇద్దరికి సమ్మతమే అయింది. అందుకే సర్వోదయ సిద్ధాంతాలు మంచివని చెప్పే స్థితికి దిగజారిపోయారు గోరాగారు. అదే ఆయనలోని తాత్విక బలహీనత అన్నారు అన్నగారు.

గోవధను నిషేధించాలని హిందూమత ఛాందసులు పోరాటం (ఆర్భా టం) ఆరంభించారు. మానవుల్లో కొందరికి (ఏ మతస్థులైనా కావచ్చు) ముఖ్య ఆహారంగా వున్నది గోమాంసం. గోసంరక్షణ అనే పేరుతో గో వధపై నిషేధం తీసుకువచ్చి తద్వారా గోమాంసం ప్రధాన ఆహారంగా గలవారికి ఇబ్బంది కలిగించడం వారి ప్రధానోద్దేశం. ఆ విధంగా మత వైషమ్యాలను పెంచి మత కల్లోలాలకు కారకులవుతున్నారు. గోసంరక్షణ అనేది కారణంగా చెబుతూవున్న వారి అంతరంలో దాగివున్నదేమంటే మత కల్లోలాన్ని సృష్టించడమే ననేది అర్థం చేసుకోవచ్చు.

గోవధ మత ద్వేషంతో జరుగుతున్నదని హిందూ మతస్థుల ఉద్దే శం. గోవధను నిషేధించాలని చేస్తూవున్న ఆందోళన మత ద్వేషంతో

చేస్తూ వున్నారని గోరాగారి ఉద్దేశం. అందుచేతనే గోవధను నిషేధించాలని చేస్తూవున్న ఆందోళనకు వ్యతిరేకంగా గోరాగారు ఆవు - పంది మాంసం తినండని ప్రచారం ప్రారంభించారు. ఆ విధంగా చేస్తే హిందూ ముస్లిం మతద్వేషం తగ్గుతుందనీ, పైగా అవు, పంది మాంసం ఉత్తమ ఆహారమనీ చెబుతూ ప్రచారం ప్రారంభించారు గోరాగారు.

ఆ సమయంలో అన్నగారు ఆవు, పందిమాంసం తెప్పించి, వండించి, మా అందరకు వడ్డించి మాచేత తినిపించి గోరాగారి ఆశయాన్ని సమర్ధించి వివరించి చెప్పి మా అందరిచేత అంగీకరింప జేశారు. అంతేకాక మీ పోరాటం వెనక అండగా మేమంతా వున్నాం. మీరు మీ పోరాటాన్ని ధైర్యంగా సాగించవలసిందిగా గోరాగారికి పెద్ద ఉత్తరంకూడా వ్రాశారు అన్నగారు.

మత వ్యతిరేకమైన పోరాటాలను ఆ విధంగా సమర్థిస్తూ వుండేవారు. మత మంటేనే వారికి గిట్టేదికాదు. మతంలోని అజ్ఞానం మూఢ నమ్మకాలకు కారణమనీ మతం సామరస్యంపేర ద్వేషాలను పెంచి పోషిస్తూ వుంటుందనీ మత రహితమైన మానవ సమాజం అద్వైత సూత్రాలను అర్ధం చేసుకోవడం ద్వారానే సాధ్యపడుతుందని అంటూ వుండేవారు అన్నగారు.

సృష్టి వాదం తప్పని, పరిణామ వాదం తప్పని, హేతువాదమూ తప్పని, చివరకు మార్క్స్ చెప్పిన గతి తార్కికమూ తప్పని చెప్పిన గోరాగారు తనదంటూ ఒక సిద్ధాంతాన్ని చెప్పలేదు. ఏ తాత్విక సూత్రాలను ఆధారం చేసుకుని నాస్తిక వాదం చెప్పారో తెలియదు. ఆ విషయంలో ఆంధ్ర దేశంలోని నాస్తిక భావాలు గలవారికి అన్యాయం జరిగిందనే చెప్పాలి.

నేను నాస్తికుణ్ణి, నా సిద్ధాంతం నాస్తికత్వం అని చెప్పుకోవడానికి భయపడుతూ వున్న ఆ రోజుల్లో తాను భయపడకుండా నేను నాస్తికుణ్ణి, నా సిద్ధాంతం నాస్తికత్వం అని ధైర్యంగా చెప్పి ఆ సిద్ధాంతాలను ప్రజలలో ప్రచారంచేసిన ప్రథమ వ్యక్తి గోరాగారు.

కులమత భేదాలు పోవాలని, సాంఘిక సంస్కరణలు రావాలని తపన వుండేది. ఆ విధమైన కృషిలో వారికి వారేసాటి. ఏదైనా చేసి చెప్పు చెయ్యకుండా చెప్పవద్దు అనేవారు. చెప్పడమేకాని చెయ్యడం మావంతు కాదు (మా వల్ల కాదు) అనేవారు ఎందరో వున్నారు ఈ సమాజంలో. అటువంటి వారివల్ల సమాజానికి యేవిధమైన మేలు జరగదు. చెప్పడం సులభం, చెయ్యడం కష్టం. కాని, గోరాగారు రాబోయే కష్టాలు తెలిసి కూడా తాను నమ్మిన ఆశయంకోసం నిరంతరం కృషిచేసిన వ్యక్తి. అటువంటి వ్యక్తిని ఆదర్శంగా తీసుకుని కృషిచేయాలి అంటూ వుండే వారు అన్నగారు.

## కలం, హలం, కావ్యం

మా అన్న శ్రీనివాసరావుగారి కుమార్తెలు కలం, హలం, కావ్యం. ఈ ముగ్గురు భిన్నమైన మనస్తత్వం గలవారు. అయినా వీరికి తాత్విక విషయాలు తెలుసుకోవాలని కుతూహలం వుండేది. వారి నాన్న శ్రీనివాస రావుగారు గాని, మా అన్న చలమయ్యగారు గాని, నేనుగాని తాత్విక విషయాలు మాట్లాడుతూ వున్నప్పుడు శ్రద్ధగా వింటూ వుండేవారు వారు.

పుష్పగిరిలో జరిగిన భౌతిక విజ్ఞాన తరగతుల్లో అన్నగారు ఉపన్య సించిన తరువాత ఇష్టాగోష్టిగా ఆ ఉపన్యాస సారాంశంపై మాట్లాడు కుంటూవున్న సమయంలో మాకు (అక్క చెల్లెండ్రకు) ఒక చిన్న సందే హం అడగవచ్చునా అన్నది కావ్యం. అడగమన్నారు అన్నగారు.

మరణమంటే భయంకర మైనదిగదా? అటువంటి మరణాన్ని గురించి తలచుకుంటేనే అందరికి భయం వేస్తుందిగదా? అటువంటి మర ణం నుండి మానవులు తప్పించు కోవడానికి మార్గమేదైనా మీ ఆధ్యా త్మిక వాదంలో చెబుతున్నారా అని అడిగింది కావ్యం వారి ముగ్గురి తర ఫున. (అద్వైతంలో ప్రధానాంశం జననమ రణాలపై చర్చించడమే గనుక ఆ విధమైన ప్రశ్న వారు వేసివుండవచ్చు).

అది చిన్న ప్రశ్న కాదమ్మా పెద్దప్రశ్నే. పైగా అందరికి వచ్చే ప్రశ్న. అందరిని ఆలోచింప చేసేప్రశ్న. మరణమనేది "మేను" కే గాని "నేను" కి లేదు, రాదు. మేను (శరీరం) పుట్టింది కనుక అది మరణించక తప్పదు. ఈ శరీరానికి మార్పు (మరణం) సహజం. అది ప్రకృతి నియమం. దానిని తప్పించలేము. 'నేను' పుట్టలేదు కనుక దానికి చావు (మార్పు) లేదు అన్నారు అన్నగారు.

మరణం మేనుకేగాని 'నేను' కు కాదని తెలుసుకుంటే మరణ భయం పోతుంది. మరణం సహజమని తెలుసుకోవడం ద్వారా అది భయంకరమైనది కాదు అనే భావం కలగడంతో ఆ భయం పోతుంది. 'నేను' మీద నమ్మకం కుదిరితే మేను 'నేను' కాదని తెలుస్తుంది. 'నేను' సక్రమంగా అర్థమైతే "నేను" కి అన్యంగా మేను లేదని తెలుస్తుంది. అలా తెలిస్తే అసలు మరణమనేది లేదని తెలుస్తుంది. ఇదే మా తాత్విక సూత్రం అని అంటూ అర్థమైనదా? అని అడిగారు అన్నగారు,

ఈ శరీరానికి తగిన పోషకాహారం, ఆరోగ్యాన్ని కాపాడే తగిన వైద్య సౌకర్యం వుంటేకూడా మరణం తప్పదంటారా అని అడిగింది కావ్యం. అటువంటి పరిస్థితులు కల్పించుకుని ఆయుష్షుని కొంత పెంచుకోవచ్చునే గాని శాశ్వతంగా శరీరాన్ని కాపాడలేము. చావు పుట్టుకలు ప్రకృతి ననుసరించి జరుగుతూ వుండే సహజ పరిణామాలు. అటువంటి చావు పుట్టుకలు లేనిది "నేను". ఆ నేను సంగతి యెవరికి తెలిస్తే వారికి ఈ మేను మీద కనిపించే (వచ్చిపోయే) జనన మరణాలు తనవి కావని తెలుస్తుంది. అలా తెలియడంద్వారా ఆ భయం తనకురాదు అన్నారు అన్నగారు.

(నూరు సంవత్సరాలు ఆరోగ్యంగా జీవించి అప్పుడు ముసలితనంలో మరణించడం సహజమైన మరణం. అటువంటి మరణాన్ని గురించి యెవరికి యే విధమైన భయమూ వుండదు, వుండనక్కరలేదు. కాని, పుష్టికరమైన ఆహారం లేమివల్లకాని, తగిన వైద్య సౌకర్యం లేకపోవడం వల్లకాని వచ్చే అకాల మరణం భయంకరమైనది. అటువంటి మరణాలను గురించే భయపడాలి. కనుక అటువంటి ఆ మరణాలను తప్పించడానికే ఆలోచించాలి). అటువంటి ఆలోచనా ఫలితంగానే కావ్యం ఆ ప్రశ్న వేసివుంటుందని

అనుకుంటున్నాము, ఈ సమాజంలో సహజ మరణాలకంటే అసహజ మరణాల సంఖ్య అధికంగా వున్నది. వీటిని గురించే సభ్య మానవులు ఆలోచించాలి.

మేనంటే యేమిటి? నేనంటే యేమిటి? అవి రెండు రెండుగా విడి విడిగా (వేరువేరుగా) ఎలాగంటె అని అడిగింది కావ్యం. అటువంటి జటిలమైన విషయాలు ఒకటి రెండు మాటలలో చెబితే అర్థంకావు. అటువంటి లోతైన తాత్విక విషయాలు తరచూ చర్చిస్తూ మళ్లీ మళ్లీ ఆలోచిస్తూ వుంటేనే తెలుసుకోవడానికి వీలుంటుంది. తమ్ములు శ్రీనివాసరావును, రాధాకృష్ణను అడిగి తెలుసుకుంటూ చర్చిస్తూ వుండమని చెప్పారు అన్నగారు.

అలాగే మేము యే సందర్భంలో కలుసుకున్నా అటువంటి తాత్విక సంబంధమైన సందేహాలను అడిగి తెలుసుకుంటూ వుండేవారు. మేము భౌతిక దృక్పథం నుండి ఆయా విషయాలను వివరిస్తూ వుండే వాళ్ళం.

'నేను' అనేది నిరపేక్షమైన అస్తిత్వంలో వుండదు. మేనుతో సాపేక్షమైన 'నేను' నే భౌతికవాదం అంగీకరిస్తుంది. ఆధ్యాత్మిక వాదం చెప్పినట్లు మేను పోయినా "నేను" వుంటుం దనుకోవడం సరికాదు మేను (శరీరం) లో జ్ఞానేంద్రియాలు పనిచేస్తూ వున్నదశనే "నేను" అంటామే గాని అంతకుమించి 'నేను' కి ప్రత్యేక అస్తిత్వం లేదు. మేనుతో కలిసి వున్న నేనుకే నేనని పేరు అని మేము వివరించి చెబుతూ వుండేవాళ్ళం.

## 16-11-1985 తరువాత

ఒకరోజు ఆ విషయాలు చర్చకు వచ్చినప్పుడు పెదనాన్న (చలమయ్య) గారు లేకపోవడం యెంతో లోటుగా వున్నట్లు అనిపిస్తూ వున్నదని తన బాధను వ్యక్తపరుస్తూ నన్నునేను మరుపనంతకాలం వారిని (చలమయ్య గారిని) నేను మరువలేను అన్నది కావ్యం.

వారు శారీరకంగా మనమధ్య లేకపోయినా వారు వ్యక్తపరుస్తూ వచ్చిన 'నేను' రూపంలో మనమధ్య వుంటూనే వుంటారు "నేను" అనేది అర్ధం చేసుకుంటే ఆ రూపంలో వారిని చూస్తూనే వుంటాం. ఆ భావాలను మననం చేసుకుంటూ వుండటం ద్వారా వారు మనతోనే వున్నట్లు భావిస్తూ వుండవచ్చునని అన్నాను. అది విన్న తరువాత కావ్యం కొంత మానసికంగా స్థిమితం యేర్పరచుకుని ఆలోచించడం ప్రారంభించింది.

ఈ మేము 'నేను' ల గురించి అనాదిగా ఆలోచిస్తూనే వున్నారు. కాని, స్పష్టమైన అభిప్రాయానికి రాలేక పోయారు. భౌతిక తత్వ శాస్త్రాభివృద్ధి జరిగిన తరువాతనే తగిన నిర్వచనం ఇవ్వగలుగుతున్నాం. ఆ ఆలోచనలకు కొంత స్పష్టత యేర్పడినందువల్లనే మనం ఈనాడు ఆ విధమైన తాత్విక చిక్కులనుండి, ఇబ్బందులనుండి బయట పడగలిగాం. అందువల్లనే అన్నగారు అటువంటి తాత్విక విషయాలకు (పాత అభిప్రాయాలను మార్చుకుని) క్రొత్త నిర్వచనం చెప్పి, ఆ విషయాలను భౌతిక శాస్త్రానికి అనుకూలమైన పద్ధతిలో అద్వైతంతో సమన్వయ పరచి చెప్పుతూ వచ్చారు.

'నేను' అర్ధమైతే 'నేను' కి వేరుగా మేము లేదని అన్నగారనేవారు. దానిని ఖండిస్తూ మేమ అర్ధమైతే ఆ మేమకి వేరుగా 'నేను' లేదని తెలుస్తుందని నేనంటూ వుండేవాడిని. అలా మా మధ్య నేను, మేముల భిన్నత్వ ఏకత్వాల సమస్యపై చర్చ సాగుతూ వుండేది.

'నేను' అర్ధమైతే నేనుకి వేరుగా మేము లేదు. "నేను" మేము అని రెండులేవు వున్నది 'నేనే' అనేది అద్వైత సూత్రం. కాని, ఆ ప్రకారం చెప్పాలంటే వినేవారికి సులభంగా అర్ధంకాదు. ఆ భాష కొంత గజిబిజిగా వుంటుంది. నిరపేక్షమైన 'నేను' వుంటుందని చెబుతూ వుండటంవల్ల అటువంటి ఇబ్బంది కలుగుతూ వుంటుంది. మేము అర్ధమైతే మేముకి వేరుగా "నేను" లేదనీ మేము, "నేను" అని అవి రెండు రెండుగా వుండవనీ మేముతో సాపేక్షంగానే 'నేను' వుంటుందనీ భౌతిక తత్వశాస్త్రం చెబుతూ వున్నది. దానిని అలాగే అర్ధం చేసుకోవాలి.

అందువల్ల మరణించేది మేనేగాని 'నేను' కాదు. మేను మరణా నంతరం 'నేను' యొక్క వ్యవహారం అస్తిత్వంలో వుండదు. అయితే మనం సాధారణంగా మరణించిన మనిషిని చూచినప్పుడు ప్రాణం పోయింది అంటాం. అంటే శరీరం అక్కడే వున్నది. అందులోని ప్రాణం అనే పదార్థం (జీవుడు) ఆ శరీరాన్ని విడిచి (వదలి) వెళ్ళిపోయిందనే అర్థంలో అలా అంటూ వుంటాం. కాని, అక్కడ జరిగిందేమిటి? ప్రాణ మనే వ్యవహారం ఆగింది (లేదు). అందువల్ల ప్రాణం పోయింది అనే పదం అక్కరలేదు. అంటే ప్రాణమనే వ్యవహారం జరగడానికి శరీరం తగిన స్థితిలో లేదన్నమాట. అదే మరణమంటే. అందుచేత మరణం మేనుకేగాని 'నేను' కి లేదు. "నేను" ప్రత్యేక అస్తిత్వంలో లేదు. అందుకే దానికి మరణంలేదు.

మనిషి జన్మించి నప్పటినుండి మరణించేవరకు ఆ శరీరంలో అనేక మార్పులు జరుగుతూ వుంటై. అనేక జీవాణువులు పుట్టి నశిస్తూవుంటై. ఆ జీవాణువుల ఉత్పత్తి అధిక దశలో జరిగినంతకాలం శరీరం పెరుగుతూ వుంటుంది. అణువుల ఉత్పత్తి దశ తరిగినప్పుడు శరీరం క్షీణిస్తూ వుం టుంది. ఆ విధంగా శరీరంలో మార్పుజరుగుతూ వుంటుంది. అది ఒక దశలో గుణాత్మకమైన మార్పు వచ్చినప్పుడు (నశింపు జరిగినప్పుడు) మరణం అంటాం. అప్పుడే ఆ విషయం గుర్తిస్తాం. అంతకంటే మరణమనే దానికి ప్రత్యేక అస్తిత్వం లేదు. అందుచేత దానిని గురించి భయపడ వలసిందేమీలేదు. ఆధ్యాత్మిక వాదంలో చెప్పబడిన జనన, మరణ సంబం ధమైన కథలు కల్పితాలు. అందువల్ల అవి తాత్విక సత్యాలుకావు.

తాత్వికాంశాలు కాని వాటిని తాత్వికాంశాలుగా మూఢంగా నమ్ముతూ వుండటం చేతనే మరణమంటే లేనిపోని భయం మనలో యేర్పడింది. అట్లా యేర్పడిన భయం తాత్విక జ్ఞానంద్వారా పోతుంది. ఈ సమాజంలో అకాల మరణాల సంఖ్య అధికంగానే వున్నది. తగిన పోషకాహారం లేక పోవడం, తగిన వైద్య సౌకర్యం లేకపోవడం కారణంగా అలా జరుగుతూ వున్నది.

వ్యష్టి దృష్టిగాని సమష్టి దృష్టిలేని ఈ సమాజంలో అటువంటి మరణాలు సహజం అయిపోయినై. అందుకే అటువంటి మరణాలు జరగకుండా వుండే కొత్త సమాజాన్ని (సమ సమాజాన్ని) సమకూర్చుకోవలసి వున్నది. అప్పటివరకు ఆ భయాందోళనలు మనకు తప్పవు.

## ఏబదిఏళ్ళు నిండిన నాటి వేదాశ్రమం

నాన్నగారు ప్రారంభించిన వేదాశ్రమానికి ఏబది సంవత్సరాలు పూర్తి అయిన సందర్భంగా 1985 మార్చి 14, 15, 16 తేదీలలో మా స్వగ్రామమైన పెదపులివర్రులో ఆధ్యాత్మిక, భౌతిక తత్వశాస్త్రాలపై చర్చలు యేర్పాటు చేశారు.

భావం ముందా? పదార్ధం ముందా? చైతన్యంనుండి పదార్థం పుట్టిందా? పదార్ధం నుండి చైతన్యం వచ్చిందా? భావమంటే యేమిటి? భావాలకు వారసత్వం వుంటుందా? జీవమంటే యేమిటి? జీవికి మరుజన్మ వున్నదా? ప్రదేశ కాలాలు నిరపేక్షాలా? సాపేక్షాలా? అనేటటువంటి భౌతిక తత్వశాస్త్ర సంబంధమైన అంశాల పైననూ—

'నేను' అంటే యేమిటి? "మేను" అంటే యేమిటి? మోక్షమంటే యేమిటి? అసలు మోక్షమనేది వున్నదా? వుంటే అది సిద్ధమా? ప్రాప్యమా? జీవుడు వ్యష్టి జీవుడా? సమిష్టి జీవుడా? కర్మ అంటే యేమిటి? కర్మ ఫలితం అంటే యేమిటి? కర్మ ఫలితాన్ని యే జీవుడు వారసత్వంగా తీసుకువస్తాడు? అనేటటువంటి ఆధ్యాత్మిక భావ వాదానికి సంబంధించిన అంశాల పైననూ చర్చలు జరిగినై.

## సభాధ్యక్షులుగా ఆవుల సుబ్బారావుగారు

ఆంధ్రదేశం నలుమూలలనుండి అద్వైత ప్రముఖులు, హేతువాద మిత్రులు పలువురువచ్చి ఆ సభలలో జరిగిన చర్చలలో పాల్గొన్నారు. భౌతిక దృక్పథం నుండి హేతువాదులు, ఆధ్యాత్మిక దృక్పథం నుండి అద్వైతులు తమతమ ప్రసంగాలను సాగించారు.

అవుతు సుబ్బారావుగారు (ఆంధ్రప్రదేశ్ హేతువాద సంఘ ఉపాధ్యక్షులు) మాట్లాడుతూ భారత, భాగవత గ్రంధాల కథలను వివరిస్తూ జాత్యహంకారంతో ఆర్యజాతి యెలాంటి అవినీతి అక్రమాలకు దిగి పర జాతులను యే విధంగా నాశనం చేస్తూ వచ్చింది వివరించి చెప్పారు. ఆధ్యాత్మిక వాదంలో చెప్పబడిన ఏకాత్మ సిద్ధాంతం ఆచరణలో ఏమైనదని ప్రశ్నించారు సుబ్బారావు గారు.

ఆధ్యాత్మిక వాదంలో చెప్పబడిన పరతత్వం హేతువాదులు అంగీకరించరని, ఆర్యులు మన దేశానికి వచ్చి మన తత్వశాస్త్రాన్ని నాశనం చేశారని చెప్పారు. స్వర్గ - నరకాలు, పాప - పుణ్యాలు, బంధ - మోక్షాలు కల్పితాలని ఆ తాత్విక సూత్రాలు మతపరమైన నమ్మకాలేగాని హేతు బద్ధమైన ఆలోచనలకు నిలిచేవి కావనీ అన్నారు.

పరశురాముడు బ్రాహ్మణ ఆధిపత్యం కోసం తన గొడ్డలితో ఇరువది ఒక్క మారులు క్షత్రియులను నరికి తన జాతి అహంకారాన్ని నిరూపించు కున్నాడన్నారు. చలమయ్యగారు చెప్పే అద్వైతం పండితు లెంతవరకు ఆమోదిస్తారో తెలియదుగాని సాంఘిక సంస్కరణలకు వారుచెప్పే తాత్విక సూత్రాలతో మనకు ఆక్షేపణలేదు భౌతిక విజ్ఞానం యెంతో పెరిగింది, అనేక విశ్వ రహస్యాలను తెలుసు కుంటున్నది, ఆ విషయాలను అర్థం చేసుకుని సాంఘిక, ఆర్థిక రంగాలలో కావలసిన మార్పులు చేసుకుని సమాజంలో సుఖ, శాంతులను సాధించాలని చెప్పారు సుబ్బారావుగారు.

ఆధ్యాత్మిక భావవాదంపై శంకరుడు యే విధంగా తిరుగుబాటు చేసింది అన్నగారు వివరించారు. వైదిక మతం ప్రవేశపెట్టిన పరతత్వం (పరోక్ష దేవుడు) తప్పంటూ శంకరుడు తత్వాన్ని అపరోక్షంగానే (తానే దేవుడని) చెప్పాడని, జీవుడు సమిష్టి జీవుడేగాని వ్యష్టి జీవుడు కాదని చెప్పాడని, ఆ తాత్విక సూత్రాన్ని సమాజ పరంగా సమన్వయ పరిస్తే సమిష్టి జీవితానికి తోడ్పడగలవని చెప్పారు. తాత్వికంగా జీవు డొక్కడేనని చెప్పడంవల్ల వ్యావహారికంగా మానవులంతా సరి సమానులేనని అన్నారు అన్నగారు.

తత్వశాస్త్ర మంటే యేమిటి? ఆధునిక విజ్ఞానరీత్యా వచ్చిన మార్పు లతో భౌతిక తత్వశాస్త్రాన్ని యే విధంగా అభివృద్ధి చేసుకోవడానికి వీలైంది? ప్రదేశ కాలాలకు పదార్థ చలనాలతో యెలా అస్తిత్వం యేర్పడుతుంది? పదార్థం నుండి చేతన, చైతన్యాలు యెలా యేర్పడినవి వివరిస్తూ నేను మాట్లాడాను.

## భౌతిక వాదిగా కత్తి పద్మారావుగారు

భారతీయ తత్వశాస్త్రమైన లోకాయత సిద్ధాంతాలను వివరిస్తూ పద్మారావుగారు మాట్లాడారు. వైదిక మతంలోని అవక తవకలను, అవాస్త వాలను వివరించారు. ఆనాడే చార్వాకులు ఆ లోపాలను యెత్తి చూపెట్టారని అన్నారు. సంస్కృతంలో వున్న చార్వాక సిద్ధాంత సూత్రాలను (శ్లోకాలను) చదివి తెలుగులో వివరించి చెప్పారు. ఆనాడు చార్వాకులు వేసిన తాత్విక సంబంధమైన ప్రశ్నలకు ఆనాటికీ, ఈనాటికీ సమాధానం ఆస్తికులనుండి రాలేదన్నారు.

వైదిక భావవాదం దుర్మార్గ మైనదనీ అది ప్రవేశ పెట్టిన వైయక్తిక (వ్యక్తిగత) సిద్ధాంతమే సమాజంలోని అన్ని అనర్థాలకు కారణమనీ అన్నారు. ఆనాడు చార్వాకులు అడిగిన విషయాలనే ఈనాడు మేము అడుగుతున్నాం. ఆధ్యాత్మిక వాదులమని చెప్పుకుంటున్న మీరు వాటికి సమాధానం చెబుతారా? అని ప్రశ్నించారు పద్మారావుగారు.

సభలోనుండి ఒకవ్యక్తి (అద్వైతి) వచ్చి వేదికనెక్కి యేదో చెప్పబోయాడు. కాని, ఇంతలో అన్నగారు వచ్చి వారి చేయిపట్టి లాగి వేదిక నుండి దింపివేశారు. వారేదో చెప్పబోతున్నారు గదా చెప్పనివ్వండి అన్నాం మేము. ఏమిటి వారు చెప్పేది, వారి తాహతు నాకు తెలుసు అన్నారు అన్నగారు. మరి మీరైనా మీ అభిప్రాయం చెప్పండి అన్నారు పద్మారావుగారు.

నేను చెబుతాను వినండి. పితరులకు పిండాలు పెట్టటం మేము యేనాడో మానేశాం. వైదిక (మత) పరమైన కర్మకాండను వదిలేసి చాలా

కాలమైనది. ఆచార సంప్రదాయాలపేర సమాజంలో వున్న మూఢ నమ్మకాలు మా అద్వైతులకు లేవు. స్వర్గ, నరకాలు కల్పితాలని గ్రహించి వాటిని మా మనసులనుండి తొలగించి చాలా రోజులైంది. పర లోకాలకు పోయే జీవుడు లేడని, పునర్జన్మ లేదని, అందుచేత ఆ జన్మలోని కర్మఫలం ఈ జన్మలో అనుభవిస్తాడనే నమ్మకం మాకు లేదని అన్నారు అన్నగారు.

అద్వైతులకు జీవుడే దేవుడు గనుక దేవుడిపేర రాళ్ళకు, రప్పలకు పూజలు చేయం, గుడులని గోపురాలని వాటి చెంతకు పోము. తీర్థయాత్రల పేర ఊరూర దిరిగి కాలం వృధావరచం. ఈ అద్వైత వేదికనుండి ఆనాడు చార్వాకులు అడిగిన ప్రశ్నలనే ఈనాడు అడుగుతున్నాం. ఆస్తిక (వైదిక) సాంప్రదాయకులనుండి సమాధానం రాలేదు అన్నారు అన్నగారు.

మరి మీరు ఆస్తికులు కారా? మీరు వేద ప్రమాణాన్ని అంగీకరించరా? మీకు దేవుడు లేడా? జపతపాలపై మంత్ర తంత్రాలపై మీకు నమ్మకం లేదా? అని పద్మారావుగారు అడిగారు (అన్నగారి అంతర్యం తెలుసుకోవాలని).

మేము ఆస్తికులము కాదు, అధ్వాన్నము కాదు. మేము శుద్ధాద్వైతులం. మాకు దేవుడు లేడు. జీవుడే దేవుడని భావిస్తాం. జీవునికంటే దేవుడు వేరే లేడు. "అహం బ్రహ్మాస్మి" అని అంటూ అందరిచేత అలా అనిపించారు. మేము వేద ప్రమాణాన్ని అంగీకరించం. మాకు ఉపనిషత్తులే ప్రమాణం. జపతో నాస్తి పాతకం అనే నమ్మకం మాకులేదు. జప, తపాలవల్ల సాధించేది యేమి వుండదని గ్రహించి వాటిని విసర్జించాం. మా వాళ్లు జపమాలలు యేనాడో పారవేశారు, వదిలేశారు. తత్వ విచారణ తప్ప చేయవలసిందేమిలేదు ఆ తత్వ విచారణలో అర్థమైన మేరకు వ్యావహారిక జీవితానికి సమన్వయ పరచుకుని జీవించడమే మా ఆశయం అన్నారు అన్నగారు.

ముగింపుగా పద్మారావుగారు మాట్లాడుతూ చలమయ్యగారు చెప్పేదంతా భౌతిక వాదమే. ఆయన అద్వైతం ముసుగులో వచ్చి భౌతిక

వాదాన్ని చెబుతున్నారు. అందుచేత భార్తలు అన్నగారు(చలమయ్యగారు నాకు అన్నగారే అంటూ) అద్వైత ముసుగులోనుండి బయటకు వచ్చి తన అద్వైత పీఠాన్ని భౌతిక తత్వ వేదికగా ప్రకటిస్తారని ఆశిస్తున్నాను అన్నారు పద్మారావుగారు.

పేరు యేదైతేనేమి మనమంతా సిద్ధాంతాలు కలిసినచోట కలిసి పనిచేద్దామని, అందుకు నేను సిద్ధంగా వున్నానని అన్నగారు అనడంతో అన్నగారు భౌతిక వాదాన్ని అంగీకరించినట్లైనది.

సాంఘిక, ఆర్థిక రంగాలలోని అసమానతలు తొలగి సమాజం సుఖ శాంతులతో వుండాలంటే ముందు ప్రజలలోని మూఢ నమ్మకాలు పోవాలని అందుకు మనం యేకాభిప్రాయంతో తాత్విక ప్రచారంచేసి ప్రజలను చైతన్య వంతులను చేద్దామని అన్నారు అన్నగారు. ఆ విషయం మాకు సమ్మతమేనని మేము అన్నాం. అందుచేత సుముఖమైన ఏకాభి ప్రాయంతో ప్రశాంత పరిస్థితులలో ఆ సభలు ముగిసినై. ఏబది సంవత్స రాలుగా జ్ఞాన ప్రచారం చేస్తూవున్న వేదాశ్రమం. సార్థకతను సాధించు కున్నదనిపించింది. భౌతిక దృక్పథం విజయం సాధించింది.

## ఆసుపత్రిలో ఉన్నప్పుడు

ఆరోగ్యం బాగుండక అన్నగారు తెనాలి ఆస్పత్రిలో వున్న సమయంలో తరచు వారిని కలుస్తూ వుండేవాడిని. నేను వారిని కలిసి నప్పుడల్లా కాలం వృథా కానివ్వక యేదో తాత్విక విషయాలే చర్చిస్తూ వుండేవారు. మన దేశానికి పట్టిన తాత్విక పీడను గురించి పదేపదే తలచి బాధపడేవారు.

తన ఆరోగ్యాన్ని గురించి చెబుతూ—చిన్న ఆపరేషను అని చెప్పి నమ్మించి పెద్ద ఆపరేషను చేశారురా అని నన్ను చూడగానే కంటతడి పెట్టారు. నేను మొదటిసారి వారిని చూడటానికి వెళ్ళినప్పుడు. బాధను భరించలేకుండా వున్నాను. ఇంత బాధిస్తుం దనుకుంటే ఆపరేషనుకు అంగీక రించేవాణ్ణి కాదు అన్నారు. డాక్టరు గారికి చెప్పకపోయారా బాధ సంగతి

అన్నాను. చెప్పాను, బాధ నాది కాదనుకోండి, అంతా ప్రాతిభాసికంగా భావించాలి అని నా మాట నాకే అప్పజెప్పారు డాక్టరుగారు అన్నారు డాక్టరుగారికి కూడా యథార్థ తత్వం (బాధకూడా తన స్వరూపమని) అర్థం కాలేదన్నమాట అన్నాను నేను. ఆ మాటతో తన బాధను మరచి తాత్విక విషయాలు చెప్పడం ప్రారంభించారు. ఆ విధమైన మార్పుకోసమే గదా నేనా మాట అన్నది. అది ఫలించిందన్నమాట.

ఎక్కువగా మాట్లాడవద్దని డాక్టరుగారు చెప్పారు. మీరేమో ఆరోగ్యం బాగా వున్నప్పుడు మాట్లాడినట్లుగానే యిప్పుడుకూడా మాట్లాడుతున్నారు. కొంచెం తగ్గించి విశ్రాంతి తీసుకోండి అన్నారు వదినగారు. డాక్టరు మానమంటే మానటానా? నాకు యేది ఇష్టమో అదిచేస్తే నాకు సుఖం (ఆనందం) గాని అన్నారు (తాత్విక విషయాలు చెప్పడం చర్చించడం వారికి ఆనందం). వారి అభిప్రాయం నాకు తెలుసు గనుక ఆ విధమైన చర్చకు వారిని ప్రోత్సహించాను. ఆ ఫలితంగా వారు ఉత్సాహంతో మళ్ళీ మాట్లాడటం ప్రారంభించారు. మీ యిష్టం, చెబితే వింటారా మీరు? అని మరొకసారి సూక్ష్మంగా సూచించారు వదినగారు.

వారు మాట్లాడుతూ తన శారీరక బాధను మరిచారు. అందుచేత మాట్లాడ నివ్వండి, వద్దని మనం అనగూడదని నేనన్నాను - ఆ విధంగానైనా రెండు మాటలు (తాత్విక విషయాలు) వారినుండి నేను వినాలని. అది గ్రహించిన అన్నగారు చిరునవ్వుతో తన ప్రసంగాన్ని ఈ విధంగా కొనసాగించారు.

డాక్టర్లు శారీరక వ్యాధులకు మాత్రమే వైద్యం చేస్తారు. తాత్వికులు మానసిక రుగ్మతలకు చికిత్స చేస్తారు. శారీరక వ్యాధికంటే మానసిక వ్యాధి మనిషిని యెక్కువ బాధిస్తుంది (పీడిస్తుంది). అంతేకాక శారీరక వ్యాధి వ్యక్తిగతం కాగా, మానసిక వ్యాధి (తాత్విక అజ్ఞానం) సామాజిక పరంగా (సమిష్టిగా) బాధిస్తుంది. దానికి సరైన చికిత్స జరగకపోతే సమాజం నైతిక విలువలు కోల్పోతుంది. అదే నేటి ప్రధాన సమస్య అన్నారు అన్నగారు.

ఒక బ్లడ్ ప్రెషర్ వున్న వ్యక్తికి తన మాటలద్వారా ప్రెషర్ తగ్గించానని అది తెలుసుకున్న డాక్టరు ఆశ్చర్య పోయారనీ అన్నారు. మానసిక ఆందోళనవల్ల కలిగే బ్లడ్ ప్రెషర్ మనసుని ఆందోళనుండి మరల్చడం ద్వారా ప్రెషర్ తగ్గుతుందని అన్నారు అన్నగారు. మానసికంగా కలిగే ఆందోళన వల్ల రక్త ప్రసరణతో మార్పులు రావచ్చు. అందుచేత యే విషయానైనా తీవ్రంగా తీసుకోవద్దనీ, ఏ సమస్య యెదురైనా మనసుని ఆందోళన రూపంలోకి కాక ఆలోచన రూపంలోకి మార్చుకోవాలనీ దానికి తాత్విక పరంగా పొందే జ్ఞానమే మార్గమనీ అన్నారు అన్నగారు.

## మౌన భాష

15-11-1985 న అన్నగారిని చూడాలని నేను వెళ్ళినప్పుడు అన్నగారు మౌనంగా పడుకుని వున్నారు. శారీరక బాధను తగ్గించడానికి డాక్టరు మత్తుమందు ఇచ్చారట. వదినగారు, అక్కగారు (మా గురువుగారైన రాజరత్నమ్మగారు) కూడా ప్రక్కన కూర్చుని వున్నారు. నన్ను చూచి చిరునవ్వుతో ఆహ్వానించి కూర్చోమని అన్నారు. నేను ప్రక్కనే కూర్చున్నాను.

ఆ తరువాత మా మధ్య మౌనం మంతనాలు సాగించింది. మేము మాటలు లేకుండానే మాట్లాడు కున్నాం. ఒకరి కొకరం ఏదో చెప్పుకున్నాం. మేము మౌనంగానే అనేక తాత్విక విషయాలు చర్చించుకున్నట్లని పించింది. మా పెదవులు మేము విప్పలేదు, నాలుక కదలాడలేదు, కాని మాలో భావాల పంపకం జరిగింది. అక్కడ మా భావాలకు భాషలేదు, మా చూపులే మాకు మాటలు, మా కనుసైగలే మా భావాలకు భాషగా వున్నాయి. కాలం నిదానంగా నత్త నడకగా నడుస్తూ వున్నది.

మధ్యలో ఒకటి రెండు సార్లు కన్నెత్తి చూచి ఒకటి రెండు విషయాలు అడిగి తెలుసుకుని మళ్ళీ కన్నుమూసి మౌనంగా పడుకున్నారు అన్నగారు. అక్కగారు యేదో ఒకటి రెండు మాటలు చెప్పి మళ్ళీ మౌన చర్చలకు పునాది వేశారు. మనసు మూగదే గాని అది సంకల్పిస్తుంది, ఆలోచిస్తుంది, చర్చిస్తుంది.

చూడటమంటే కంటితో నేనా? కంటితో చూడటమే చూడటమా? అని అంటూ వుండేవారు అన్నగారు. జగత్తుని శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలుగా చూస్తూ వున్నాం. వాటిని శ్రోత్రం, త్వక్కు, చక్షువు, జిహ్వ, ఘ్రాణం అనే ఇంద్రియాల ద్వారా చూచి తెలుసు కుంటున్నాం.

శబ్దాన్ని చెవితో విని చూస్తాం. రూపాన్ని (దృశ్యాన్ని) కన్నుతో చూచి తెలుసు కుంటాం. రుచిని నాలుకతో చూస్తాం. వాసనను ముక్కుతో చూస్తాం. ఈ విధంగా చూడటమంటే తెలుసు కోవడమే. చూచి తెలుసు కోవటం. తెలుసుకుని చూడటం అని రెండు విధాలు. మనసుద్వారా తెలుసుకుంటాం. ఇంద్రియాల ద్వారా చూస్తాం. ఇంద్రియాలు లేకపోతే మనసు తెలుసుకోలేదు. మనసు లేకపోతే ఇంద్రియాలు చూడలేవు. తెలుసు కోవటం అనేది ఇంద్రియాలకు మనసుకు వున్న అవినాభావ సంబంధం.

గుడ్డివానికి మాటలతో చెప్పి చూపించవచ్చు. ఇతనికి చెవియే కన్ను. చెవితో విని చూస్తాడు. మూగవాడు సైగలతో తన అభిప్రాయం చెబుతాడు. ఇతనికి సైగలే భాష. చెవిటివాడు సైగలను చూచి (విని) తెలుసుకుంటాడు. అతనికి కనులే చెవులు. కనుక చూడాలనుకునే వానికి కనులు, వినాలనుకునే వానికి చెవులు మాత్రమే వుండనక్కరలేదు. అవి లేకపోయినా చూస్తాడు, వింటాడు.

అలాగే తెలుసు కోవాలనుకునే వానికి మాటలే అక్కరలేదు. చూపులు సైగలే చాలు. మాటలు లేకనే మాట్లాడగలడు. చూపులు లేకనే చూడగలడు. సైగలేచాలు (చెప్పకనే) అనేక విషయాలు చెప్పుకోవటానికి. అట్లాగే మేము మాటలు లేకనే మాట్లాడుకున్నాం. భాష లేకనే భావాలు మార్చుకున్నాం, అర్థం చేసుకున్నాం (పెదవులు కదలకనే, నాలుక ఆడకనే).

అప్పుడు అక్కడ ఎవరు, ఎవరికి చెప్పారో, ఎవరు చెప్పింది ఎవరు విన్నారో తెలియదు. కాని, అందరం చెప్పినట్లే వున్నది, అందరం విన్నట్లే వున్నది, లేకపోతే అంత (ఎంతో) సేపు, ఎన్నో (తాత్విక) విషయాలు మా మనసుల్లో ఎలా మెదులాడినై? మా చూపులూ, మా సైగలూ మాకేమి చెప్పినై?

ఒకసారి అన్నగారు మాట్లాడుతూ వున్నట్లు, ఒకసారి అక్కగారు మాట్లాడుతూ వున్నట్లు వుండేది. ఒక్కొక్కసారి ఇద్దరూ మాట్లాడుతూ వున్నట్లు వుండేది. మాట్లాడింది ఇద్దరైనా మాట్లాడే విషయం ఒక్కటై వారిద్దరూ ఒక్కరై మాట్లాడుతూ వున్నట్లుండేది. వారిద్దరూ ఒక్కరై నాకు చెబుతున్నారా? వారిద్దరూ ఒకరి కొకరు చెప్పుకుంటున్నారా? ఏమైనా వారిద్దరూ ఒక్కరుగానే నా కగుపించేవారు. వారిద్దరిమాటా ఒక్కరి మాటగానే నాకు వినిపించేది, నేను ఒక్కమాటగానే వినేవాడిని.

ఆ సమయంలో వారిద్దరిలో నాకు గురువెవరో నేను మరచి నట్లుండేది (అందుకు కారణం నేనుకాదు). అక్కడ వారిద్దరేరి? (ఆ విషయం నాకు తెలియ జెప్పింది వారే.గా) అందుచేత ఇద్దరు ఒక్కరై నాకు చెప్తున్నట్లు వుండటంచేత ఎవరు చెప్పారు అనేది నాకు తెలియని స్థితిలో నేనున్నాను. ఎవరు చెప్పారు అనేదికాదు ముఖ్యం. ఏమి చెప్పారు అనేదే ముఖ్యం,

అసలు ఆ సమయంలో వారెవరైనా నోరువిప్పి చెప్పారా, చెప్పారనడానికి? అప్పుడు వారు మాట్లాడారా ఆ మాటలు వినడానికి? లేదే, అందుకే నేను ముందన్నాను మౌన భాష అని. మనసులు కలిసిన వారికి (భావాలకు) భాషుండదు. మూగభాషే వారి భాష. 'అందుకే మౌనమే నీ భాష, ఓ మూగ మనసా' అన్నారు కవులు.

తమిళ కవి కణ్ణదాసన్ మంచి తాత్విక భావాలున్న కవి. స్వేచ్ఛా భావాలున్న కవి కావడంచేత సూక్ష్మమైన తాత్విక విషయాలను సులభ శైలిలో వివరిస్తూ వుండేవారు. మన రచయితల్లో (కవుల్లో) స్వేచ్ఛా రచయితలేరి? అంతా చూచి రాతగాళ్ళే గాని? తాత్విక చింతన లోపించిన కారణంగా వ్యావహారిక జీవితంలో సమన్వయం కుదరక అశాంత చిత్తం వారిని వెంటాడగా వారు దైవ భక్తులై చిత్త స్వాధీనం తప్పి భక్తి రసం (దాస్యభావం) గుప్పించారు.

కణ్ణదాసన్ తమిళంలో వ్రాసిన కవితలు వినిపించి వాటిని తెలుగులో అనువదించి అన్నగారికి చెబుతూ వుండేవాడిని. అవి విన్న అన్నగారు

చాలా సంతోషించేవారు. వారిని కలిసి మాట్లాడాలని అంటూ వుండేవారు, కాని వీలుపడలేదు. ఆ కోరిక అలాగే మిగిలిపోయింది.

మనసులు కలిసినచోట మనసే వుంటుంది. మనసులు కలియడంతో అనేకమనే భావం అభావం చెంది ఏకత్వ భావం అభివృద్ధి అవుతుంది. అందుచేత చెప్పేదెవరు? వినేదెవరు? తానే చెప్పుకుని, తానే విని, తానే ఆనందిస్తాడు. తానే అనే దానిలో అనేకత్వం నుంచి ఏకత్వం సాధించిన తాత్విక సూత్రం ఇమిడి వున్నది. అలా వుండేవి కణ్బాసన్ కవితలు.

చెప్పేవారికి వినేవారికి సిద్ధాంత ఐక్యత ఏర్పడినప్పుడు కలిగే మానసిక తాదాత్మ్యతలో కలిగే ఆనందమే నిజమైన ఆనందం. అక్కడ భేదించే (రెండవ) వాడు వుండడు గనుక మనసులో బాధ వుండదు. భేదం లేని మనసులో ఖేదానికి తావుండదు గనుక మోదమే మిగులుతుంది. అదే అద్వైతానందం అనేవారు అన్నగారు. అలా అంటూ వుండే మాటలు ఇప్పుడు మౌనంగానే అంటున్నట్లనిపించింది.

ఆ స్థితిలో అక్కడ రెండవవాడు లేడుగనుక చెప్పవలసిన మాటలుండవు. (వ్యావహారిక భాష వుండదు). చెప్పే మాటలుండవు గనుక వినే చెవులుండవు. అయినా ముందు చెప్పుకున్న మాటల సారాంశమే ఇప్పుడు మనసులో భావ రూపంలో మననం చేసుకుంటూ వుంటాం. ఒక భావాన్ని భాష రూపంలో వ్యక్తపరిచినప్పుడు అది వ్యక్తమైన (అర్థమైన) వ్యక్తులలో భావాలరూపంలో అనుభూతి నిస్తూనే వుంటుంది. అవి తిరిగి ఆలోచనా రూపం పొంది మనసు (లు) మౌనంగా మాట్లాడుకుంటై.

అలాంటి అనుభూతులు ఆ సమయంలో మాలో ఆలోచనలు రేపి మమ్ములను మౌనంగా మాట్లాడుకునే టట్లు చేసినై. అవి ఒకనాటి ఆలోచనలు కావు, ఒక విషయానికి సంబంధించిన అనుభూతులు కావు. మా కుటుంబ తాత్విక చరిత్ర మొత్తం అంతా ఒక్కసారి కళ్ళముందు కదులాడినట్లైనది.

గుడ్డివానికి తాను చూడలేని దృశ్యాన్ని మాటలతో వర్ణించి వివరించి చెప్పి చూపించవచ్చు. చూడలేని విషయాన్ని స్పర్శలాంటి ఇతర చర్యలద్వారా కూడా చూపెట్టవచ్చు. అలాగే తాత్విక జగత్తుని చూడడానికి వ్యావహారిక గుడ్డితనం అడ్డురాదు. అందుకు మార్గాన్వేషణ చాలు.

చూచే కన్నులున్నా వాస్తవ జగత్తుని చూడలేని గుడ్డివారు, వినే చెవులున్నా జగత్ సత్యాన్ని విని తెలుసుకోలేని చెవిటివారు యెందరు లేరు ఈ సమాజంలో? వాస్తవాన్ని వినటానికి, చూడటానికి చెవులు, కళ్లు వుంటేనే చాలదు. ఆ విషయాన్ని అందుకోవడానికి మనసనేది వుండాలి. అదిలేని మనిషి కళ్లుండి గుడ్డివాడు, చెవులుండి చెవిటివాడు అవుతాడు.

అనేక సందర్భాలలో అనేక విషయాలపై సాగించిన చర్చల సారాంశం ఆ సమయంలో మేము నెమరు వేసుకున్నట్లైనది. అదే మా మౌన భాషకు అర్థం.

ఆ తరువాత అన్నగారిని "మేను" రూపంలో నేను చూడలేదు. కాని "నేను" రూపంలో (భావరూపంలో) ఎప్పుడూ చూస్తూనే వున్నాను. అందుచేతనే అన్నగారిని మీకు పరిచయం చేయగలిగాను.

* * *

ఇందుగల డందు లేడని
సందేహము వలదు చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకి చూచిన
నందందే గలడు దానవాగ్రణి వింటే? (భక్తపోతన)

ఇది ఆధ్యాత్మిక భావవాద సిద్ధాంతం.

ఇందుగల దందు లేదని
సందేహము వలదు ప్రకృతి* సర్వోపగతం
బెందెందు వెదకి చూచిన
నందందే గలదు మానవాగ్రణి వింటే? (భౌతిక హిత)

ఇది భౌతిక తత్వ సిద్ధాంతం.

---

* ద్రవ్య-శక్తి రూపకమైన సత్తు. (అంటే పదార్థమే)

తోలు కడుపులోన దొడ్డ దేవుం డుండ
రాతి గుళ్ళకేల రాశిబోయ?
రాయి దేవుడైన రాసులు మ్రింగదా
విశ్వదాభిరామ వినురవేమ. (వేమన)

ఇది నాస్తిక సిద్ధాంతం.

శంకరుని యంత వేదాంత శాస్త్రవేత్త
అనియెగా 'అహం బ్రహ్మఽస్మి' యంచుగాన
నాకు నేనె నమస్సు లొనర్చుకొందు
ఆది మధ్యాంత శూన్యుండ నైతినంచు —(కవిరాజు త్రిపురనేని)

నా కంటే వేరుగా నేను పూజించ దగినవాడు లేడు. ఇది అద్వైతసిద్ధాంతం.

ప్రకృతి లోనపుట్టి ప్రకృతికేల్ చేపట్టి
ప్రకృతిపై నమోఘ పదము మెట్టి
పురుషుడైన నరుని వరణీయత దలంతు
మహిత తత్వసాంద్రి మానవేంద్రి. -(ఎన్. వి. బ్రహ్మం)

మానవుడు ప్రకృతిలో భాగంగా పుడుతున్నాడు; ప్రకృతిని గ్రహించి దానిని అనుసరిస్తున్నాడు; ప్రకృతి నియమాలు అర్థం చేసుకొని దానిని తన కనుకూలంగా మలచు కొంటున్నాడు ఇది మానవవాదం.

"మానవుడే అన్నిటికి ప్రమాణం" (ప్రొటాగరస్)
"మానవుడే మానవజాతికి మూలం" (కారల్‌మార్క్సు)
"మానవుడు తన ప్రపంచానికి తానే కర్త" (ఎమ్. ఎన్. రాయ్)
'మానవుడు తన నూతనప్రపంచాన్ని (నూతనవ్యవస్థను) తానే సృష్టించు కుంటాడు' నూతన వ్యవస్థా నిర్మాణానికి తానే కర్త.
(భౌతికహిత)

# ఉపసంహారం

మనం ఇంతవరకు అనేక విషయాలు చర్చించాం. మనం అంటే మానవ సమాజం యేర్పడి నప్పటినుండి మానవుడిలో ఆలోచన ఆరంభ మైనప్పటినుండి క్రమాధికంగా పరిణమిస్తూ వచ్చిన మనం అని భావం. ఈ జగత్తుకి కారణమేమిటి? అని సందేహంవచ్చి నప్పటినుండి ఆలోచిస్తూనే వున్నాం. దానికి యేదో ఒక సమాధానం చెప్పుకుంటూనే వచ్చాం. ఆ విధంగా మనం పొందే సమాధానంతో తృప్తి పొందక మళ్ళీ ఆలో చించాం. అలా ఇప్పటివరకు ఆలోచించాం. ఇంకా ఆలోచిస్తూనే వున్నాం. అలా ఆలోచించి విశ్లేషించి వివరించిన దాన్నే తత్వశాస్త్రం అంటున్నాం.

అలా తత్వశాస్త్రం పేర అనేకమైన అశాస్త్రీయమైన విషయాలను కూడా చెప్పుకుంటున్నాం. విశ్వసిస్తున్నాం. విశ్వాసం ప్రబలంకాగా ఆలో చించడం మానేశాం. నమ్మకమే ప్రాధాన్యత వహించింది మన జీవి తంలో. అదలా వుండగా అసలు తాత్విక విషయాన్ని ప్రక్కకు నెట్టి ఆ స్థానంలో భక్తిని ప్రవేశపెట్టి అజ్ఞానంతో సంచరిస్తున్నాం. తత్వ శాస్త్రంతో మనకు పనేమిటి? అనుకుంటున్నాం. పర్యవసానంగా నైతికం అనేది మరిచాం. అవినీతిని ఆహ్వానించాం. అవినీతితో జీవిస్తూ అందుకు అలవాటుపడి పోయాం. అది తప్పని అనుకోవడం లేదు. మనలో తార తమ్యాలు (ఆర్థికంగా సాంఘికంగా) పెంచుకున్నాం.

ఆ కారణంగా ఈ వ్యవస్థలో యే వ్యక్తికీ సుఖమనేదిలేదు. సమా జం శాంతికి దూరమైంది. సుఖశాంతులు ధనంతో కొనుగోలు చేయవచ్చు నని అనుకుంటున్నాడు మానవుడు. అందువల్ల ధనంమీద దాహం (కతి) పెరిగింది. అందువల్ల ధన సంపాదనకు ఇచ్చినంత ప్రాధాన్యం దేనికి ఇవ్వలేక పోతున్నాడు. ఆ ప్రయత్నంలో పోటీ పడుతున్నాడు, పరుగిడుతున్నాడు. తన శక్తి సామర్ధ్యాలను ఉపయోగించి దానిని సంపాదిస్తున్నాడు, అందుకు యే మార్గమైనా అనుసరిస్తున్నాడు అలా వీలు కానప్పుడు దైవాన్ని ప్రార్థిస్తున్నాడు (అన్నీ దైవం ఇస్తుందని మతం నమ్మించింది గనుక). ఎన్ని చేసినా చివరకు సుఖం, శాంతి అనే వాటికి దూరమైనాడు. అయినా సుఖశాంతులు సంత సరుకు కాదని తెలుసు కోలేక పోతున్నాడు. దీనికంతటికి ప్రధాన కారణం తాత్విక సమన్వయ జ్ఞానం లేకపోవడం అనేది అర్థంకాలేదు.

మనదేశంలో తాత్విక పరిణామాలు ఒక పద్ధతిలో జరగలేదు. బుద్ధుడికంటే ముందు వచ్చిన లోకాయత, చార్వాక సిద్ధాంతాలు ఆర్యుల వైదిక (వైయక్తిక) మత ప్రచారాన్ని తీవ్రంగా యెదుర్కొని చివరకు నిలబడలేక పోయినై. ఆర్యులు ప్రవేశపెట్టిన వర్ణ వ్యవస్థ స్థిరపడింది. ఆ వ్యవస్థపై పోరాటం సాగించినవాడు గౌతమ బుద్ధుడు. సమస్యలను సంఘ పరంగా (సమిష్టిగా) ఆలోచించి పోరాటం సాగించాడు కాని, ఒక సమిష్టితత్వం తాత్వికంగా ప్రతిపాదించని కారణంగా ఆ పోరాట ఫలితం యెక్కువ కాలం నిలువలేదు. ఫలితంగా మళ్లీ వర్ణ, వర్గ వ్యవస్థ నిలదొక్కు కున్నది.

ఆ కారణంగా తాత్విక పునాదిలేని వ్యావహారిక వ్యవస్థ నిలబడలేదని అర్థం చేసుకున్నాం. అప్పటికి భౌతిక తత్వశాస్త్రం అభివృద్ధి కాలేదు. ఆధ్యాత్మిక తాత్వికాంశాలలోని ఏకత్వ (ఏకాత్మ) వాదం అనేదికూడా తగినంత అభివృద్ధి కాలేదు.

ఆ తరువాత శంకరుడు వచ్చాడు. అప్పటికి సూత్ర ప్రాయంగా మాత్రమే చెప్పబడుతూవున్న ఏకాత్మ (అద్వైత) సిద్ధాంతాన్ని ప్రచారం చేశాడు. తన పాండితీ ప్రకర్షా పాటవాన్ని అద్వితీయంగా ప్రయోగించి ఆ సిద్ధాంతాన్ని ప్రజలముందు వుంచాడు. అలా తాత్వికంగా చెప్పబడిన ఏకాత్మ సిద్ధాంతాన్ని వ్యావహారిక జీవులకు సమన్వయంచేసి జీవులంతా (మానవులంతా) సమమేనని చెప్పాడు. జీవుడు వ్యష్టి జీవుడు కాదని, సమిష్టి జీవుడే జీవుడనికూడా చెప్పి జీవులయందు (మానవులయందు) యే విధ మైన తారతమ్యమూ లేదని చెప్పాడు. అదే తాత్విక సమిష్టి సూత్రం.

అలా సమన్వయం చేసి చెప్పడం ప్రారంభించగానే దానిని అంగీకరించని వైదికులు (వైయక్తిక వాదులు) ఆయనను 32 ఏళ్ళ వయస్సులోనే సాగనంపారు. అది మనదేశ తాత్విక చరిత్రలో మరపురాని మలుపు. శంకరుడు అలా చంపబడక వుంటే అతడు ప్రవేశపెట్టిన తాత్విక సూత్రాలు ఆధారం చేసుకుని బుద్ధుడు ప్రవేశపెట్టిన సమిష్టి సంఘ నిర్మా ణం జరిగి వుండేది. (ఇది నా అభిప్రాయం మాత్రమే కాదు. విజ్ఞులు

అనేకమంది వెలిబుచ్చిన అభిప్రాయం, దీన్ని యెంతవరకు అంగీకరిస్తా రనే దానితో నాకు నిమిత్తం లేదు.)

శంకరుడు అలాపోగా ఆ తరువాత వచ్చినవాడు రామానుజుడు. శంకరుడు చివరగా చెప్పిన 'నోజాతి నై వవర్ణం' వంటి సూత్రాలను తీసు కుని వాటిని సాంఘికంగా సమన్వయ పరచి ప్రచారంచేస్తూ వచ్చాడు. కుల వ్యవస్థను వ్యతిరేకించాడు రామానుజుడు. అంతకంటే భిన్నమైన తాత్విక విషయాలేవీ వారు చెప్పలేదు.

ఆ తరువాత వచ్చినవాడు మధ్వాచారి. ఈనాడు భారతదేశంలో అనుసరిస్తూవున్న భక్తి మార్గానికిగాని, వైయక్తిక (వ్యక్తిగత) జీవన వ్యవస్థకుగాని పునాది వేసినవాడు మధ్వాచారే. భారతదేశ తాత్విక చరి త్రలో ఇంత దుర్మార్గమైన చరిత్ర మరొకటిలేదు. లోకాయతులు, బౌద్ధులు తాత్వికంగా చేసిన కృషిని సర్వనాశనం చేయుటమేకాక, ఆధ్యాత్మిక రీతిలో శంకరుడు చేసిన కృషిని కూడా పూర్తిగా నాశనం చేసినవాడు మధ్వాచారి. కొన్నివేల సంవత్సరాలుగా సాగిన తాత్విక సమన్వయ జ్ఞాన కృషిని ఒక్క భక్తి మార్గంతో సమూలంగా నాశనం చేసినవాడు మధ్వ.

ఎంత ప్రయత్నం చేసినా తాత్విక సూత్రాలను అర్ధం చేసుకోలేని సామాన్య ప్రజలుకూడా యే ఆలోచన చేయకుండా ఈ భక్తి మార్గాన్ని అనుసరించి మొత్తం వ్యవస్థనే తారుమారు చేశారు. వైయక్తిక (వ్యక్తి గత) జీవుని కర్మఫలితం వ్యక్తిగతమేనని చెప్పగానే యే ఆలోచనా చేయకుండా మూకఉమ్మడిగా దానిని అనుసరించారు, ప్రజలు.

ఆ కారణంగా తత్వశాస్త్ర మనేది బుద్ధుని కాలానికంటే వెనక్కునెట్టి వేయబడింది. అంటే కొన్ని వేల సంవత్సరాలు సమాజం వెనకకు నడిచింది. తాత్వికంగా జరుగుతూ వచ్చిన పురోగమనం కంటే తిరోగమనం చాలా అధిక స్థాయిలో జరిగింది.

అందుకే చరిత్రలో ముందు మధ్వాచారి (వైయక్తిక జీవుడు) వచ్చి, తరువాత శంకరుడు (సమిష్టి జీవుడు) వచ్చి, ఆ తరువాత బుద్ధుడు వచ్చి

వుంటే బుద్ధుడు ఆశించిన రీతిలో సమిష్టి సమాజం యేర్పడి వుండేది అనేది నా అభిప్రాయం, తాత్వికంగా ఒక సమిష్టి సూత్రాన్ని శంకరుడు నిరూపించాడు కనుక ఆ విధమైన మానసిక పరివర్తన మానవుడు పొంది వున్నాడు కనుక వ్యావహారికమైన సమిష్టి సమాజం శాశ్వతంగా యేర్పడి వుండేది.

తత్వశాస్త్రానికి కూడా జాతి, దేశ హద్దులు పెట్టుకుని ఇతర దేశాల తత్వశాస్త్రం పనికిరాదనే సంకుచిత మనస్తత్వం మన అభివృద్ధికి ఆటంకంగా నిలిచిందనే చెప్పాలి. ఇతర దేశాల్లో అలాకాక ఏ దేశంలో ఏ తత్వవేత్త ఏ తాత్విక విషయాన్ని చెప్పినా వాటిని సమన్వయ పరుచుకుంటూ అభివృద్ధి చేసుకుంటూ వచ్చారు. జర్మన్ తత్వవేత్త హెగిల్ (భావవాది) వచ్చిన తరువాత కారల్‌మార్క్స్ (భౌతికవాది) వచ్చాడు.

ఇక్కడ ఇలా వుండగా ఇతర దేశాల్లో అనేక తాత్విక మార్పులు వచ్చినై. అప్పటికి అనేక విధాల అభివృద్ధి అయిన తత్వశాస్త్ర రీతులను పరిశీలించి సమన్వయ పరచి భౌతిక తత్వశాస్త్రం అనేది రూపొందించగలిగాడు మార్క్స్. హెగిల్ తన భావ వాదానికి ఉపయోగించిన తర్క విధానాన్నే తాను తన భౌతిక వాదానికి ఉపయోగించు కున్నాడు. అంటే అప్పటికి అభివృద్ధి అయిన తర్క విధానం తనకు చాలా ఉపయోగ పడుతుందని అనుకున్నాడు మార్క్స్. (భారత దేశంలోకూడా సాంఖ్యులు భౌతిక వాదులు అభివృద్ధి చేసిన సాంఖ్య శాస్త్రాన్ని ఆధ్యాత్మిక వాదియైన శంకరుడు ఉపయోగించు కున్నాడు).

విజ్ఞానం పెరిగినకొద్దీ భౌతిక తత్వశాస్త్రం ఏకత్వ సూత్రాన్ని నిరూపించు కున్నది. (జగత్తులోని నానాత్వ, భిన్నత్వాలకు పదార్థరీత్యా ఏకత్వం రుజువయింది).

ఆ భౌతిక సమిష్టి సూత్రాలను ఆధారంగా తీసుకుని అభివృద్ధి అయిన తాత్విక విషయాన్ని ఆధారం చేసుకుని వ్యావహారిక జీవితానికి సమన్వయ పరచి సమాజ పరంగా సమిష్టి తత్వాన్ని చెప్పడానికి వీలయింది. అలా మార్క్స్ చెప్పిన సమిష్టి సూత్రాలను లెనిన్,

మావో, ఎమ్. ఎన్. రాయ్ లాంటి వారు కొత్త మార్పులు చేర్పులు చేసి, మరింత అభివృద్ధి చేశారు. అవసరమైతే మరి కొన్ని మార్పులు మనం చేసుకోవచ్చు. ఆ మార్పు కోసం ఆలోచించవచ్చు, అన్వేషించవచ్చు.

ఏ మార్పులైనా ఒక సమిష్టి సూత్రాన్ని ఆధారం చేసుకుని చేసుకోవలసిందేకాని ఆ సమిష్టి సూత్రాన్ని కాదని చేయగలిగిందేమీ వుండదు. అలా చేస్తే అది తిరోగమనమే అవుతుంది, కాని పురోగమనం మాత్రం కాదు. నానాత్వ భిన్నత్వాలకు ఏకత్వం నిరూపించిన భౌతిక తత్వశాస్త్రం నుండి అర్థమయ్యే సమిష్టి సూత్రాలను సమాజ పరంగా సమిష్టిగా ఆచరణకు అంగీకరించలేక పోవటం అనేది భౌతిక వాదులలో కనిపిస్తూ వున్నది. అలాగే అపరోక్ష, అభేద సిద్ధాంతాన్ని చెప్పే అద్వైతులలో తాత్వికంగా పరోక్ష భావానికీ వ్యావహారికంగా భేద బుద్ధికీ కారణం అర్థం కావటంలేదు. ఈ పరస్పర వైరుధ్యాలు యెలా అభివృద్ధి అవుతూ వున్నవో అర్థం కావటం లేదు. ఇది ఒక వైపరీత్య ధోరణి అనవచ్చు.

సమన్వయం కుదరని తాత్వికాంశాలను వల్లెవేస్తూ వుంటే వచ్చే యిబ్బంది అటువంటిదే. అటువంటి సమన్వయ లోపానికి కారణం తాత్విక పరిపక్వత లేకపోవడమే ననేది అర్థమవుతుంది. అటువంటి పరస్పర వైరుధ్యాలు యెలా వుంటవనేది పరిశీలిద్దాం. అరవై సంవత్సరాలకు పైగా అద్వైతం విచారించినా సమన్వయం అర్థం కాకపోతే అది యెలా వుంటుందో చూడండి. తరువాత భౌతిక వాదుల సంగతి చూద్దాం.

అవస్థాత్రయ సాక్షిఅని, పంచకోశ విలక్షణుడని, త్రిగుణాతీతుడని వ్యతిరేకంలో చెప్పబడిన తాత్విక విషయాలను అన్వయంతో సమన్వయం చేసుకోలేక వాటికి భిన్నమైన తాత్విక అర్థాలను ప్రచారంలోకి తీసుక వచ్చారు వేదాంతులు. ఆ వాక్యాలకు భాషార్థం తీసుకుంటే వాటికి పైన చెప్పబడిన స్వప్న, జాగ్రత్త, సుషుప్తి అనే అవస్థలకూ అన్నమయ ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ అనే కోశాలకూ, సత్వ, రజ, స్తమోగుణాలకూ వేరుగా 'నేను' వున్నాను అనే అర్థం వస్తుంది. కాని, 'నేను' అర్థమైతే "మేను" కు సంబంధించిన ఆయా

అవస్థలు, కోశాలు, గుణాలు తనకు వేరుకాదనీ, అంతా తానేననీ అర్థమవుతుంది. అదే నిజమైన వేదాంతం. అదే అసలైన అద్వైతం.

ఆ విషయం ఇలా అర్థంకాని పీఠాధిపతులు, గురువులు సమన్వయం కుదరక అవస్థలకు, కోశాలకు, గుణాలకు తాను వేరనే ద్వైత అర్థాన్ని కలిగించి శంకరుని అద్వైత సిద్ధాంతానికి ద్రోహం చేస్తున్నారు. అది వారు అలా కావాలని చేస్తున్నారో మరెందుకు చేస్తున్నారో మన కర్థంకాని విషయం.

మేనే 'నేను' అనుకునేవాడు మూఢుడు. మేను లేకనే 'నేను' వుంటుం దనుకునేవాడు అజ్ఞాని, ఇవి రెండూ లేవు (మాయ) అనుకునే వాడు మాయావాది, పరమ మూర్ఖుడు. అంతా అనుభవిస్తూ యేమీ లేదనే వాడు మోసకారుడు. చూస్తూ గుడ్డి, వింటూ చెవుడు అనే నానుడి వీరు సార్థకం చేసుకున్నా రనిపిస్తుంది. ఆ సామెత వీరికోసమే పుట్టిందేమో ననిపిస్తుంది.

మేనుతో (సాపేక్షమైన) 'నేను' ని గుర్తించినవాడే జ్ఞాని. మేను పోయినా "నేను" కోసం అన్వేషించేవాడు అజ్ఞాని. అంటే అన్వయం అర్థమైతే అద్వైతం. అది అర్థం కాకపోతే ద్వైతం. అందుచేత ఆయా పదాలకు భాషార్థమే అర్థమైతే చాలదు. తాత్వికార్థం కూడా అర్థంకావాలి. పదాలకు భాషార్థం తెలిసినవాడు పండితుడు. పదాలకు తాత్వికార్థం తెలిసినవాడు తాత్వికుడు. చాలామంది భాషా పండితులు తాత్విక విషయం ప్రస్తావన వచ్చేసరికి సర్రున జారుకుంటారు. అందుకే భాష స్పష్టంగా వుండాలనీ ఏ పదం ఏ పదార్థాన్ని ఉద్దేశించి వాడబడిందో ఏ వస్తువుని ఉద్దేశించి ఏ నామం ఉద్భవించిందో స్పష్టత వుండాలనీ, అంటున్నాం. అలాగే ఏ వాక్యాన్ని ఏ భావాన్ని వ్యక్తపరిచే ఉద్దేశంతో వాడుతూ వున్నాం అనేది అర్థం కావాలి. లేకపోతే అర్థం కావలసింది అర్థంకాక వ్యతిరేకార్థంలో కూడా అర్థం కావచ్చు. అందువల్ల మనిషిని మనిషిగా అర్థం చేసుకున్న ఆధ్యాత్మిక వాది లేడనిపిస్తుంది.

మనిషి జన్మించినప్పటినుండి మరణించే వరకు ఆ శరీరంలో అనేక జీవాణువులు(జీవకణాలు)పుట్టి నశిస్తూవుంటై. అలా ఉత్పత్తి అవుతూవున్న అణువులకంటే నశించే అణువుల సంఖ్య తక్కువగా వున్నప్పుడు శరీరం పెరుగుతూ వుంటుంది. ఉత్పత్తి కాబడే అణువుల కంటే నశించే అణువుల సంఖ్య అధికంగా వున్నప్పుడు శరీరం క్షీణ దశలో వుంటుంది. అదే ముసలితనం. ఆ విధంగా శరీరంలో మార్పు జరుగుతూ వుంటుంది. అది ఒక దశలో గుణాత్మకమైన మార్పు (నశింపు) వచ్చినప్పుడు మరణం అంటాం. అప్పుడే గుర్తిస్తాం దానిని.

ఈ జనన మరణాలను గురించిన శాస్త్రీయ అవగాహన, వివరణ ఆధ్యాత్మిక వాదులకు తెలియదు. అందుచేతనే వారు చెప్పే నిర్వచనాలు మానవుణ్ణి భయ భ్రాంతులకు లోను గావిస్తూ వుంటాయి. అంతేగాక ఈ దేహాన్ని వదలిన జీవుడు మరొక దేహంలో ప్రవేశించి మళ్ళీ జన్మకు వస్తాడని చెప్పి పునర్జన్మ వాదాన్ని ప్రవేశపెట్టారు. అందువల్ల జన్మలకు కర్మ ఫలితాలను అంట గట్టారు. మేనంటేను, నేనంటేను, మరణ మంటేను, జనన మంటేను అర్థం కాకపోవడమే అందుకు కారణం.

ఈ రకమైన అర్థంలేని (అవాస్తవమైన) సిద్ధాంతాల ప్రభావంవల్ల మరణంపై భయం, కర్మఫలితంపై వ్యామోహం ఒకేసారి మానవుడు అనుభవిస్తూ వున్నాడు. తత్ ఫలితమే నేటి వైయక్తిక మానసిక ప్రవృత్తి. ఇటువంటి తాత్విక సంబంధమైన ఆలోచనలనుండి అహేతుకమైన ఆచరణ భాగం అన్ని రంగాలలోను అభివృద్ధి అయింది. అదే నేటి సమాజ స్వరూపం. దీని మార్పుకోసం హేతుబద్ధమైన ఆలోచన అవసరం.

అందువల్ల సమాజంలో మార్పుని, అభివృద్ధిని కోరే ప్రతివ్యక్తి సంప్రదాయ బద్ధమైన తాత్విక ఆలోచనలు వదలిపెట్టి ఆధునిక తాత్వికాంశాలను అర్థం చేసుకుని తదనుగుణమైన ఆలోచనలు చేయాలి. సిద్ధాంతాలను ఆచారాలుగా మార్చి చెప్పే సంప్రదాయ ఆస్తికులను ఎదిరించి సత్యాలకు సమ్మతమైన సూత్రాలను సాంఘిక, ఆర్థిక రంగాలకు సమన్వయం చేసి ఆచరణకు అనుకూలంగా వాటిని వివరించి చెప్పడం అవసరం.

ఆనాటినుండి ఈనాటివరకు సమాజంలో కనిపించే తాత్వికావగాహనలో లోపం స్పష్టంగా కనిపిస్తూనే వున్నది. మతపరమైన ఆధ్యాత్మిక భావవాదం సమాజానికి చేస్తూవున్న అపకారం తాత్విక జిజ్ఞాసగల ప్రతివ్యక్తికి అర్ధమైన విషయమే. కాని, అన్ని రంగాలలోను వ్యక్తి స్వార్ధానికి అలవాటు పడిన ఏ వ్యక్తి దానిని ఎదిరించలేడు, పోరాడలేడు. ఆ తాత్విక దృఢత్వం అతడు కోల్పోయాడు. స్వార్ధంవైపు మనసు మొగ్గు చూపగా సత్యంవైపు మోము తిప్పలేక తప్పించుక తిరుగుతూ వున్నాడు.

అందుకే హేతువాద సంఘాలు శాస్త్రీయమైన భౌతిక తాత్విక దృక్పధం కలిగించే ప్రబోధంచేస్తూ వున్నాయి. వ్యక్తిలో స్వార్థాన్ని ప్రేరేపించే ఆధ్యాత్మిక తాత్విక సూత్రాలను వివరించి చెప్పి, నిస్వార్థ తత్వం అలవరచుకునే తత్వ రీతులను ప్రవేశపెట్టి, ప్రజలను చైతన్యవంతులను చేయడానికి ప్రచారం చేయవలసి వున్నది. (నేను వ్రాసిన 'జగత్ సత్యం – బ్రహ్మ మిధ్య' అనే పుస్తకంలో దీనికి సంబంధించిన తాత్విక వివరణ ఇవ్వబడింది. అది త్వరలో అచ్చుకానున్నది. ఆ పుస్తకం చదివి వాస్తవమైన తాత్వికాంశాలను అర్ధం చేసుకుంటారని ఆశిస్తున్నాను)

## అస్తిత్వ వాదం - ఆస్తిక వాదం

పదార్థేతరమైనదేదీ విశ్వంలో అస్తిత్వంలో లేదు. అస్తిత్వంలోవున్న ప్రతిది పదార్థ లక్షణాలనే కలిగివున్నది. వస్తువులకుగల రూపగుణ భేదాలు పదార్థంయొక్క మార్పువల్ల యేర్పడు తున్నవి. కానిది, లేనిది ఏదో వున్నదని అనుకుంటే సరిపోదు. అటువంటి దేదైనా వుంటే అది యే రూప గుణాలతో వ్యక్తమై, మనకు అనుభూతిలోకి వస్తుంది? అలా అనుభూతి లోకి రానిది వున్నదని అనుకోవడం అజ్ఞానమవుతుంది. ఇలా అజ్ఞానంతో ఆరంభమైనదే ఆస్తికవాదం (దేవుడు వున్నాడు అని చెప్పే దానిని ఆస్తిక వాదం అంటాం).

స్వప్నంలో కనిపించే వస్తువులు అక్కడ అస్తిత్వంలోనే వుంటై, అక్కడ యేదోఒక విధమైన అనుభూతిని కలిగిస్తూనే వుంటై. స్వప్నంలో

వున్నంతసేపు ఆ వస్తువులు అక్కడ అస్తిత్వం కలిగేవుంటై. అక్కడ ఆ వస్తువులకు జాగ్రత్తలోని వస్తువులే కారణం. ఈ సంగతి ఆధ్యాత్మిక వాదులకు తెలియదు. అలాగే జాగ్రత్తలోని వస్తువులు మనకు కనిపించడం, వినిపించడం, అనిపించడం అనే ప్రమాణాలకు నిలిచి (అనుభూతిని కలిగిస్తూ) అవి వాటి అస్తిత్వాన్ని నిరూపించు కుంటున్నవి. ఇది అస్తిత్వవాదం.

ఎండమావి దృశ్య విషయకమైన వాస్తవ మైనప్పటికిని దానియందు జలమున కుండవలసిన మిగిలిన రెండు లక్షణాలైన తడి, ద్రవ లక్షణాలు లేనందున ఎండమావిని భ్రమ అని మనం తేల్చి చెప్పగలిగాం. అలాగే దైవం అనే భావంకూడా ప్రమాణాలకు నిలవని కారణంగా భ్రమ అని తేల్చి చెప్పగలం. అలా తాత్వికంగా దైవభావం అభావం చెందినా, అది అసత్యమని తాత్వికంగా రుజువైనా దైవం సత్యమనే నమ్ముతున్నాం. ఆ భావం మన మనసులనుండి తొలగిపోలేదు. అందుకు తాత్విక జ్ఞానం మనకు కలగక పోవడం ప్రధాన కారణం. దైవం వున్నదనే భావం అజ్ఞాన జనితం కావడంచేత జ్ఞానంవస్తే ఆ భావం పోతుంది.

## ప్రజ్ఞానం బ్రహ్మ

ప్రజ్ఞగల ప్రతివాడు జ్ఞాని కాలేడు. ప్రజ్ఞ గలవాడు తన ప్రజ్ఞతో తాను వ్యావహారిక జీవితంలో రాణించవచ్చు (మన నాయకుల మాదిరిగా). పెద్దవాడు కావచ్చు, గొప్పవాడి ననిపించుకోనూవచ్చు. కాని, తాత్వికంగా అతడు చిన్నవాడే. ఆ విషయంలో అట్టివారు అజ్ఞానంతో సంచరిస్తూ వుంటారు. సమాజంలో తమ అంతస్తుని నిలుపుకోవడం కోసం వారు చిల్లర దేవుళ్ళకు మొక్కుతూ వుంటారు. అయితే ప్రజ్ఞ–జ్ఞానంగల ప్రజ్ఞాని మాత్రం అన్నిరంగాలలోను ప్రతిభావంతమైన జ్ఞానంతో వ్యవహరిస్తూ వుంటాడు. తనమీద తనకు నమ్మకం వున్నది గనుక తన అస్తిత్వాన్ని నిలుపుకోవడం కోసం యే దైవ శక్తులమీద ఆధారపడడు. అందుకే "ప్రజ్ఞానం బ్రహ్మ" అన్నారేమోనని పిస్తుంది. అట్టివారు సమాజంలో అరుదుగానే కనిపిస్తారు.

తనను ఇతరులలో చూచుకునే (ఇతరులతో పోల్చుకునే) తత్వవేత్త లను చాలామందిని నేనెరుగుదును. కాని, అందరిని తనలో చూచుకునే వారు, తనతో పోల్చుకునేవారు అరుదైనారు. "త్వమేవాహం" అనే వాక్యార్థాన్ని అర్థం చేసుకున్న తత్వవేత్తలు మనకు కరువైనారు. ఆ లోపం కాలం తీర్చగలదని ఆశిద్దాం. నైతికంగా శిథిలావస్థలో వున్న ఈ సమాజాన్ని తత్వవేత్తలే పునర్నిర్మించాలి.

జ్ఞాన ప్రబోధం కోసం శంకరుడు దేశం నలుమూలలా నాలుగు ప్రదేశాలలో నాలుగు జ్ఞాన పీఠాలను యేర్పాటు చేశాడు. కోట్లకు పడగ లెత్తిన ఆ పీఠాధిపతులు తమ కర్తవ్యాన్ని మరచి తద్భిన్నమైన భక్తి, వైరాగ్య మార్గాలను బోధిస్తూ ప్రజలను అజ్ఞానంలో వుంచుతున్నారు. ఆ కారణంగా మళ్ళీ పూజారి వర్గం పుంజుకున్నది. (పూజారి వర్గాన్ని శంకరుడు పునరుద్ధరించాడనేది అబద్ధం మధ్వాచారే ఈ పూజారి వర్గాన్ని పునరుద్ధరించాడనేది సత్యం.)

పేరుకి అవి శంకర పీఠాలేగాని వాస్తవానికి అవి అశంకర పీఠాలుగా మారి అద్వైతానికి వ్యతిరేకమైన ద్వైత సిద్ధాంతాలను ప్రచారంచేస్తూ వున్నవి. ఆశించింది జ్ఞానంకాగా వారందించేది అజ్ఞానం మాత్రమే. కోట్లకు మించిన ఆ పీఠాల ఆస్తులను ప్రభుత్వం స్వాధీనం చేసుకుని ఆ ధనాన్ని సమిష్టి (వైజ్ఞానిక) కార్యక్రమాలకు వినియోగించడం మంచిది. ప్రజాస్వామ్య బురఖాలో దాగిన రాజరికపు (అజ్ఞాన) భావాలు మూర్తీభవించిన ఈ రాజకీయ నాయకులు అంతటి సాహసవంతమైన మంచిపనులు చేయగలరని ఆశించగలమా? అలా ఆశించడం మనకు ఆశాభంగం కాదా? ప్రజలను అజ్ఞానంలో వుంచడమే ప్రజాస్వామిక దేశాల లక్ష్యం. ఆ లక్ష్యాన్ని ఆ పీఠాలు సాధిస్తూ వుండగా పైన చెప్పిన విధంగా యెందుకు చేస్తారు? ఇది లౌకికరాజ్యం కదా? తప్పించుక తిరిగే పద్ధతికే లౌకిక రాజ్యమని పేరు.

# సృష్టివాదం

ఈ జగత్తుని సృష్టించిన సృష్టికర్త ఒకడున్నాడనీ అతడే ఈ జగత్తుని సృష్టించి పోషించి నడుపు తున్నాడనీ ఆస్తిక వాదుల నమ్మకం. అలా చెప్పే సృష్టికర్తను (దేవుడిని) శంకరుడు నిరాకరించాడు. అందు చేతనే ఇతర ఆస్తికులు (అద్వైతేతరులు) శంకరుడు చెప్పిన అద్వైతాన్ని ప్రచ్ఛన్న బౌద్ధమని. శూన్యవాదమని అంటూ విమర్శించాడు, వ్యతిరేకించారు చివరకు దూషణకు దిగారు.

దేవుడు పోతే మతం పోతుంది. అందుచేత లేని దేవుణ్ణి వున్నాడని చాటుతూ మతాన్ని కాపాడుకుంటుంది ఆధ్యాత్మిక వాదం. అలాగే మతం పోతేకూడా దేవుడు పోతాడు. దేవుడుపోతే చాలు మతం వుంటే వుంటుంది, (ఆ తరువాత అదే పోతుంది) అనే ఉద్దేశంతో పరోక్ష దైవాన్ని తాత్వికంగా రద్దుచేశాడు శంకరుడు. అలా చెప్పిన ఆయన సిద్ధాంతాన్ని వ్యతిరేకించడం కోసం ఆయన వ్యక్తిగత జీవితాన్ని న్యూనతపరచి తద్వారా వీరు ప్రయోజనం పొందుదామని ఆశించారు. అందుకే అటువంటి వ్యక్తి దూషణకు దిగజారారు. సిద్ధాంత బలంలేనప్పుడు వ్యక్తులమీద విరుచుకు పడి కక్ష సాధించు కుంటూ వుంటారు అల్పజ్ఞులు. అది నేడు చూస్తూ వున్న విషయమే. అదేమి వింతకాదు.

# రండా గర్భోద్భవుడు శంకరుడు

భీమునిచే చంపబడ్డ రాక్షసుడే సంకరుడుగా రండా గర్భాన జన్మించిన శంకరుడని ద్వైతులు తిట్టిపోశారు. మణిమంజరి అందుకోసం వ్రాయబడిన గ్రంథం (గతి తార్కిక భౌతిక వాదం! నండూరి ప్రసాదరావు) ఆది శంకరుని అవతారమే ఈ శంకరుడని చెప్పుకున్న ఆస్తికులే తమకు సిద్ధాంత భేదం అనుకునే సరికి శంకరుణ్ణి సంకరుణ్ణి చేశారు. ఎంతకైనా తగుదురు వీరు!

సృష్టికర్తను అంగీకరించక పోవడం అంటే మతపరమైన ప్రధాన తాత్వికాంశాన్ని యెదిరించడమే కాగలదు. మతానికి సంకుచిత (తత్వ)

స్వభావం యేర్పడటమే అటువంటి భావానికి కారణం. ఆస్తికుడు కాని వాడు మత వ్యతిరేకి అనేభావం రా వ డం తో మతం సంకుచితమై పోయింది. ప్రతి మ త స్థు డు అటువంటి సంకుచితుడుగానే వుంటాడు, వుంటున్నాడు. అందుచేత మతానికి పునాదిగా ఆస్తికత్వం అవసర మయింది. ఆస్తికత్వంపై నమ్మకం లేనివాడు మతంలో వుండలేడు. ఆ నమ్మకం లేని వ్యక్తులపై యేదో ఒక విధమైన నిందలువేసి ఆ వ్యక్తు లను కించపరచి చిన్నచూపు చూడటం మతానికి అలవాటై పోయింది. అదే దాని పతనానికి కారణమయింది. పరస్పరం నిందా పూరితమైన ఆలో చనలే తప్ప సఖ్యత సామరస్యం అనేవి తరిగినై, ద్వేష మనేది మాత్రం మిగిలింది.

ఆ కారణంగానే ఆస్తికుడనని చెప్పుకుంటూనే ఆస్తిక (ద్వైత) వాదంపై తిరుగుబాటు చేశాడు శంకరుడు. దేవుడులేడు అంటే మతం అంగీకరించదు గనుక దేవుడి స్థానం పరోక్షంగా కాదని చెప్పి ఆ దేవు డికి స్థానభ్రష్టత్వం కలిగించాడాయన తన అపరోక్షసిద్ధాంతంద్వారా. అది సంప్రదాయ ఆస్తికులకు పెద్ద దెబ్బగా పరిణమించింది. పరోక్షంలో చెప్ప బడే దైవత్వాన్ని అపరోక్షంలో చెప్పడమంటే అది ఆధ్యాత్మిక విప్లవ మేనని నేనంటున్నాను.

అందరి మానవులలోను వున్నది ఒకే జీవతత్వమని చెప్పడంవల్ల మానవులంతా సమానం అనే ఒక సాంఘిక సమానత్వ సూత్రం అంగీక రించినట్లైనది. వ్యష్టి దృష్టినుండి మానవష్టి సంఘ దృష్టికి మార్చిన బుద్ధుని తాత్విక సూత్రం శంకరుడు మరో రూపంలో చెప్పినట్లైనది సమిష్టి జీవుడి ప్రతిపాదన ద్వారా.

దైవం నిరాకారమని నిర్గుణమని తన తర్కబుద్ధితో నిరూపించ డంతో దేవునిపేర జరిపే పూజా పునస్కారాలు తత్సంబంధమైన కార్య క్రమాలు తాత్వికంగా రద్దై పోయినై. బుద్ధుడు ఆశించిందికూడా అదే. కాని, తాత్వికంగా లోతుల్లోకి వెళ్ళి చర్చించని కారణంగా అది నిలబడలేదు. తాత్వికంగా జరిగిన ఆ లోపాన్ని శంకరుడు పూర్తి చేశాడు. దానిని వ్యావహారికంగా సమన్వయం చేయసాగాడు. ఆ కారణంగా ఆయనను సాగనంపారు వైదిక ఛాందసులు.

పరోక్ష దైవానికి అస్తిత్వం లేకుండాపోయే ప్రమాదం గుర్తించిన వైదిక మతం మండిపడింది. మళ్ళీ పరోక్ష దైవాన్ని పునరుద్ధరించి ప్రచారంలోకి తీసుకువచ్చారు. భక్తి, వైరాగ్య మార్గాలను ప్రవేశపెట్టి ప్రజలను దారి తప్పించారు. ఆ విధంగా ద్వైత సిద్ధాంతాన్ని ప్రవేశపెట్టిన ప్రముఖులలో మధ్వాచార్యులు. ఆ తరువాత భక్తి ప్రచారమే ప్రధాన పాత్ర వహించిందిగాని జ్ఞాన ప్రసక్తి లేదు. తాత్విక శూన్యులైన ప్రజలు దిక్కు తెలియని దిశలో ప్రయాణం సాగిస్తున్నారు నేడు.

దైవ సృష్టి వాదం, పదార్థ పరిణామ వాదం అని రెండు వాదాలు ప్రచారంలో వున్నవి. సృష్టికర్తను, తద్వారా సృష్టి వాదాన్ని వ్యతిరేకించిన శంకరుడు పరోక్షంగా యథార్థమైన పదార్థ పరిణామ వాదాన్ని అంగీకరించి నట్లయింది సృష్టించే సృష్టికర్త లేనప్పుడు జగత్తుకు కారణం పదార్థమే అవుతుంది. ఆకాశాది పంచ భూత పరిణామ ఫలితమే ఈ జగత్తని చెప్పి పరిణామంలో అది మారిపోతూ వున్నది గనుక జగత్తు అనిత్యమని (మిథ్యఅని) చెప్పి, మారనిది (కారణ బ్రహ్మము) వున్నదని అది సత్యమని చెప్పాడు. అయినప్పటికిని మనం "బ్రహ్మము" అనే స్థానంలో (కారణ ద్రవ్యము) పదార్థము అని ఆ పదాన్ని మార్చి చెప్పుకుంటే సమన్వయం సరిపోతుంది.

అయితే "బ్రహ్మము" నకు వారు చెప్పిన లక్షణం 'చైతన్యం' గదా? ఆ లక్షణం పదార్థానికి లేదు. అలాగే పదార్థానికి వున్న లక్షణం వారు చెప్పే బ్రహ్మమునకు లేదు. అయితే వస్తువులుగా వున్నది (జగత్తు) మారిపోవటం (మిథ్యా లక్షణం). కారణ పదార్థంగా వున్నది నశించక (సత్యంగా) వుండటం వాస్తవం. ఈ విధంగా అందులో (అద్వైతంలో) చెప్పబడిన సత్య విషయాలు, ఇందులో (భౌతిక తత్వశాస్త్రంలో) తెలియబడిన యదార్థ విషయాలు తీసుకుని సమన్వయంతో ఆలోచించాలి. అలా ఆలోచిస్తే వచ్చే చిక్కేమీలేదు. అందుచేత మన భౌతిక అస్తిత్వానికి వచ్చే యిబ్బందేమీలేదు. లేని, రాని యిబ్బందిని గురించి ఊహించుకుని భయపడవలసిన అవసరం అంతకంటే లేదు.

కొన్ని వేల సంవత్సరాలుగా ఒక విధమైన తత్వ విషయాలను విన డానికి అలవాటుపడిన ప్రజలు ఒక్కసారిగా క్రొత్త విషయాలను చెప్ప డానికి ప్రయత్నం చేసినప్పుడు దానిని విని అర్థం చేసుకోగల మానసిక పరిస్థితిలో వారుండరు. భౌతిక తత్వశాస్త్రాన్ని చెప్పడానికి ప్రయత్నంచేసి నప్పుడు అది మన తత్వశాస్త్రం కాదనీ పాశ్చాత్య తత్వశాస్త్రమనీ అనే వారిని నేనెందరినో చూచాను. అలాగే మన తత్వశాస్త్రం చెప్పమని అడిగిన వారినీ నేనెరుగుదును. అందుచేత మనం అద్వైత విషయాలను చెబుతూ నెమ్మదిగా భౌతిక విషయాలు చెప్పినప్పుడు తప్పనిసరిగా వింటారు.

సమన్వయం కుదరని తత్వశాస్త్రం శాస్త్రబద్ధమైన తత్వంకాదు, కాలేదు. సమన్వయం కుదిరితే కొంత ప్రయోజనం వుంటుంది. ఆ పేరు కొంతకాలం నిలుస్తుంది. తద్వారా అది సజీవమవుతుంది. ప్రయోజనకర మైన కార్య రూపం పొందుతుంది. భౌతిక తత్వశాస్త్రంలో సమన్వయం కుదరని యే తాత్వికాంశమూ బ్రతికి బట్టకట్టలేదు. అందుచేత తాత్వికులకు ముఖ్యంగా అద్వైతులకు నేను చెప్పదలచుకున్న దేమంటే సమన్వయం కుదరని ద్వైత (పరోక్ష) భావాలను మీ అద్వైతంలో చేర్చకండి. భౌతిక తత్వశాస్త్రంలో చెప్పబడిన విశ్వ రహస్యాలను అందులో వచ్చే పరిణామ ఫలితాలను అర్థం చేసుకుని అద్వైతంతో సమన్వయం చేసి చూడండి. ఆ సమన్వయంతో సంచరించండి.

ఆచరణకు పనికిరాని (తాత్విక) భాగాలను విసర్జించండి. మీరు తర్క (యుక్తి) వాదాన్ని తగ్గించండి. తార్కిక (హేతు) బుద్ధిని పెం చండి. నిజాయితీని తత్వశాస్త్రంలో నిలపండి. మానవునిలో నైతిక విలువ లను పెంచండి. మానవుడంటే నిర్వచనం చెప్పండి. ఆ విధంగా తాత్విక భాగంలో అభివృద్ధిని సాధించండి, తద్వారా తరించండి. అంటే సంపూర్ణ మానవులుకండి అని.

అలాగే భౌతిక వాదులకు కూడా వాదొక చిన్నసలహా. మీరు ఏక పక్షంగా భౌతిక వాదం మాత్రమే తెలుసుకుంటే సరిపోదు. ఆధ్యాత్మిక వాదం చెప్పే ప్రధాన సూత్రాలుకూడా తెలుసుకోండి. అందువల్ల అందు

లోని లోపాలేమిటనేది అర్ధమవుతుంది. అంతేకాక మనకు బాహ్య జగత్తుని గురించి తెలుసుకోవడం యెంత ముఖ్యమో అంతః ప్రవృత్తిని గురించి తెలుసుకోవడం కూడా అంత ముఖ్యమే. ఆధ్యాత్మిక వాదులు అంతరంలోకి చూడు (ఆత్మ విచారణ చేయి) అన్నారు. అంతవరకే పరిమితమైనారు. భౌతిక వాదులు బాహ్య ప్రపంచాన్ని గురించి తెలుసుకోవడంలో యెంతో ప్రగతిని సాధించారు. కాని, అంతః ప్రవృత్తిని ప్రక్కకు నెట్టారు. దానికివ్వవలసిన ప్రాముఖ్యం దానికివ్వలేదు. అందుచేత వారిరువురు (ఆధ్యాత్మిక భౌతిక వాదులు) ఏకపక్ష ఆలోచనలు నిరపేక్ష నిర్ణయాలు చేసుకుంటూ పోయారు, పోతున్నారు. అందువల్ల ఎవరివాదం వారికి బాగున్నట్లు సరిపోయినట్లు వుంటుందేగాని యే ఒక్కరి వాదం సరికాదు, కాలేదు. అటు స్థూల ప్రపంచం, ఇటు సూక్ష్మ ప్రపంచం సాపేక్షంగా అర్థం చేసుకున్నప్పుడే అది సహజ స్థితిలో అర్థమవుతుంది. కానిచో దేనికది వేరై, అవి రెండై, ఆ రెంటికిమధ్య అంతరం పెరిగి నిరంతరం మనలను కలవర పరుస్తూ వుంటై. ఇంతకుముందు జరిగిందంతా అదే. భౌతిక అస్తిత్వానికి వేరుగా మనసు అస్తిత్వంలో వుంటుదని ఆధ్యాత్మిక వాదులు, మనసనేది అసలు అస్తిత్వలో లేదని భౌతిక వాదులు అనుకుంటూ వచ్చారు. అందువల్లనే మనకీ తిప్పలు తప్పలేదు.

పదార్థం వస్తు రూపంలోకి మారినప్పుడు రూప, నామ, గుణాత్మకమైన నానాత్వంగాను, భిన్నత్వంగాను కనిపిస్తూ వుంటుంది. అలా కనిపించే ఈ జగత్తుని తాత్వికంగా పరిశీలించితే నానాత్వ, భిన్నత్వాలకు ఏకత్వం అభిన్నత్వం (ద్రవ్య రూపంలో) అర్థం కాగలదు. వ్యావహారిక జగత్తు నానాత్వ భిన్నత్వాలుగాను, తాత్విక జగత్తు ఏకత్వంగాను వున్నప్పటికిని అవి రెండు కాదు. రెండుగా అనిపించినా ఒక్కటిగానే అర్ధమవుతుంది.

అలా రూపనామ క్రియా సహితమైన జగత్తుని అభావం (మిధ్య) చేసి రూపనామ క్రియా రహితమైన ద్రవ్యము(బ్రహ్మము) ను సత్యమని శంకరుడు చెప్పాడని మనం సమన్వయం చేసి చెప్పకోవచ్చు. ఈ సమ

న్వయానికి సంపత్రిదాయ అద్వైతులు అంగీకరించరు. (భౌతిక వాదులూ అంగీకరించరు.) వారు అద్వైతమని విన్నది అద్వైతంకాదు. ద్వైతం చేర్చిన కల్తీ అద్వైతం కావడమే అందుకు కారణం.

ఏ తత్వశాస్త్రమైనా సమన్వయంతో పరిచూచినప్పుడు అందులోని అవాస్తవాలను (సమన్వయం కుదరని) విషయాలను తొలగించి సమన్వయానికి పరిపోయే భాగాలను మాత్రమే తత్వశాస్త్రమని చెప్పుకోవాలి. అలా కాకపోతే అది కేవలం భావ వాదంగానే (ఊహా మాత్రపు వాదంగానే) మిగిలి మనకు ఉపయోగపడదు. ఆ భావాలు మనలను మానసికంగా ఇద్దుబ్బి చేస్తూ ముక్తి (స్వేచ్ఛ) నొసగవు. ఆ కారణంగా దుఃఖం మిగులుతుంది. సుఖ శాంతులు తరుగవుతై.

వస్తు రూపంలో వున్నదేదీ (దేహంతో సహా) శాశ్వతంకాదు. అది నశించినట్లుంటుంది. కాని, నశించదు. రూప నామాలకు మాత్రమే నశింపు గాని మూలతత్వం నశించదు (చావదు). ప్రతిదీ మార్పు మాత్రమే జరుగుతూ వుంటుంది. అది అప్పటి గుణ లక్షణాలనుండి కొత్త గుణ లక్షణాలకు పరిణామం చెందుతూ వుంటుంది. అలా ఆ వస్తువులలో వచ్చే మార్పుకి కారణం ఆ వస్తువులకు బయట (పరోక్షంలో) లేదు. అది ఆ వస్తువులకు అంతర్గతంగానే (అపరోక్షంగానే) వున్నది. అలాంటి వస్తువుల గుణ గణాలను ఆ వస్తువులకు వుండే సంబంధాలను (బంధాలను) చూచి ఆలోచించి తెలుసుకోవచ్చు. అలా తెలుసుకున్న విషయమే తాత్విక జ్ఞాన విషయం. దానినే తత్వశాస్త్రం అంటాం, అంటున్నాం.

వస్తువులలో వచ్చేమార్పు మన కళ్ళకు కనుపించదు. నీటిని వేడి చేసినప్పుడు పరిమాణాత్మకమైన మార్పు పొందుతూ వుంటుంది. కాని, అది మనకంటికి కనిపించదు. నీరు బాగా మరిగి ఉష్ణం ఒకదశకు (నూరు సెంటిగ్రేడు డిగ్రీలకు) చేరినపుడు ఆ నీరు ఆవిరి రూపంలోకి (గుణాత్మక) మార్పు చెందినప్పుడు మనం కళ్ళతో చూడగలుగుతాం.

అలాగే విత్తులను మనం నీటితో తడిపినప్పుడు ఆ క్షణం నుండి అవి మార్పు చెందుతూ వుంటై. ఆ మార్పుని మనం కళ్ళతో చూడలేము. కాని.

అవి గుణాత్మకమైన మార్పు దశకు వచ్చినప్పుడు మొలకెత్తడం ద్వారా ఆ మార్పుని మనం కళ్ళతో చూడవచ్చు.

అంటే మార్పు జరుగుతూ వుండటం, మార్పు జరగనట్లు వుండటం రెండూ వాస్తవాలే. వస్తు రూపంలో జగత్తుగా కనిపించేది సత్యమే. వస్తువులకు కారణం పదార్థంగా వుండటమూ సత్యమే. అయితే వస్తువుని మిథ్యా సత్యంగాను, పదార్థాన్ని అస్తిత్వ సత్యంగాను అర్థం చేసుకుంటే అద్వైతం సులభంగా అర్థమవుతుంది. వస్తువనీ పదార్థమనీ రెండులేవు. ఏది వస్తువో అదే పదార్థం. కారణ రూపంలోవున్న పదార్థమే కార్యరూపంలో వస్తువుగా తెలుస్తూ వుంటుంది.

కారణ కార్యాలు రెండూ ఒకటే. అవి రెండుకాదు. అదే అన్వయ జ్ఞానం, తాత్విక సమన్వయం. వ్యావహారిక మందు అవి రెండుగా తోచినా తాత్విక పరిశీలనకు అవి రెండుకాదని ఒక్కటేనని అర్థమవుతుంది. అదే భౌతికఅద్వైతం, రెండుకాదని తెలియడమే నిజంగా తెలియడం. అలా కారణ కార్యాలు రెండుకాదని తెలియడమే జ్ఞానం. అదే తాత్విక సమన్వయంలో జీవుడని (మానవుడని), బ్రహ్మమని (పదార్థమని) రెండులేవు.

అలా సమన్వయ పరచి చూచినప్పుడు జీవుడుగా వున్నదే బ్రహ్మము. జీవుడుగా వ్యక్తమవుతున్నదే అవ్యక్తమందు బ్రహ్మముగా వున్నది. వ్యావహారికమందు వస్తువుగా వున్నదే తాత్వికమందు పదార్థమైవున్నది. వ్యక్త-అవ్యక్తములు రెండుకావు. అవ్యక్తం నుండి వ్యక్తం వేరుకాలేదు, వేరైవుంటే ఆ రెంటిని కలిపినా అవి కలవవు. వేరుగావున్న రెంటిని కలపటం కాదు అద్వైతమంటే. అవి రెండు కాదనీ, కాలేదనీ తెలియడమే అద్వైత జ్ఞానం.

జగత్తనీ, బ్రహ్మమనీ రెండులేవు. దేనిని మనం జగత్తుగా చూస్తూ వున్నామో అదే శంకరుని దృష్టిలో 'బ్రహ్మము', మా దృష్టిలో "విశ్వము" అదే ద్రవ్యము. ద్రవ్యము కానిది ఏదీలేదు. ద్రవ్యమే సత్యం (జగత్తే సత్యం). అందుకే 'ఏకమే వాద్వితీయం బ్రహ్మ' అని అద్వైతులంటే

'ఏకమే వాద్వితీయం ద్రవ్యం' అని నేనంటున్నాను. అదిలేక (ఏది) రెండవది లేదు. అదే అన్నిటికి కారణం (మూలం). వస్తు రూపంలో నానాత్వంగాను, ద్రవ్య రూపంలో ఏకత్వంగాను వుంటూ వుంటుంది, అదే సత్యం.

ప్రతిదానికి గ్రంథ ప్రమాణమంటూ శుష్కతర్కం చేయడంకంటే అస్తిత్వంలో వున్న ఈ జగత్తుని గురించి ఆలోచించడం ఉత్తమం. అది అలా వుండటానికి, మనకిలా తెలియడానికి గల కారణాలను బయట వెదకడం (పరోక్షంలో ప్రయత్నించడం) అవివేక మవుతుంది, కారణం బయట లేదు గనుక, వున్న కారణం అంతర్గతమే గనుక.

జగత్తుకి జగత్తులోనే కారణం గ్రహించగల్గితే పరతత్వం అంతర్ధానమై తత్వం ప్రత్యక్షమవుతుంది. కారణానికిగల కారణం ఆ కారణంలోనే వుంటుందని గ్రహించితే మొత్తం చిక్కంతా తీరినట్లే. శంకరుడు అదే పని చేశాడు. అందుకే ప్రచ్ఛన్న బౌద్ధుడని అన్నారు. మఱికొందరు ప్రత్యక్ష బౌద్ధుడని కూడా అన్నారు. బౌద్ధాన్ని ప్రేమించే కొందరు అద్వైతాన్ని ద్వేషించడంలో అర్థమేమిటో బోధపడటం లేదు. చూచే కంటికి జగత్తు సత్యం. ఆలోచించే మనసుకి అ దసత్యం. చూచే కంటికి జగత్తు సత్యం. ఆలోచించే బుద్ధికి పదార్థం సత్యం. సమన్వయంతో తర్కించు కుంటే రెండూ ఒకే సత్యం.

## కారణం ముందా? కార్యం ముందా?

కార్య కారణ విచారణతో ఏదిముందు? ఏది వెనుక? అనే కుతర్కం, లేక సందిగ్ధం కూడా వ్యర్థమే. ముందున్నది కారణమనీ తరువాత వచ్చేది కార్యమనీ ఈ కార్యమే ఆ తరువాత వచ్చే కార్యానికి కారణమవుతుందనీ తెలుసుకోవాలి. అయితే కారణం కంటే కార్యంలో కొంత అభివృద్ధి కనిపిస్తుంది. కొన్ని సందర్భాలలో అది కనిపించక పోనూవచ్చు. ఇలా కార్య కారణ సంబంధాలలో వున్న ఈ జగత్తుని దైవ సంకల్పంగా భావించ నక్కరలేదు. అలాంటి అవసరమూ లేదు. అటువంటి అవసరం

ఆనాడు అజ్ఞాన దశలో వున్నదనుకున్నా ఈనాడు అటువంటి అవసరంలేదు. విజ్ఞానం పెరిగింది, అది జ్ఞానానికి సాధనంగా వుంటూ వున్నది గమక.

ఒక్కటిగా వున్నది అనేకం కావాలని వాంఛించి (సంకల్పించి) నందువల్ల అనేకంగావున్న ఈ జగత్తు వచ్చిందని, శూన్యం నుండి ఈ జగత్తుని కల్పించే (సృష్టించే) యేదోఒక అతీత (కేవల) సంకల్పశక్తి వున్నదని అనుకోవడం తాత్విక అల్పత్వంగానే అర్థమవుతుంది. అటువంటి అల్పత్వ దశలో మానవుడు ఆనాడు అలా ఆలోచించాడు. కాని, ఈనాడు కూడా అలాగే అనుకుంటాము అంటే చేసేదేమున్నది? బుద్ధిః కర్మాను సారిణీ అని జాలిపడటం తప్ప.

ప్రదేశకాలాలు, పదార్థ చలనాలు అనే నాలుగు మితుల్లో ఈ విశ్వం యొక్క అస్తిత్వం వున్నదని అర్థంచేసుకున్న ఆధునిక విజ్ఞాన యుగంలో మనం వున్నాం. ప్రదేశ కాలాలు నిరపేక్షాలనుకునే కాలంలోను, ఆకాశం అంటే అర్థం తెలియని (ఆదిమ) కాలంలోను అనుకున్నదే సత్యమని, అదే తత్వమని అనుకోవడం, అలా అనుకోమని ప్రజలకు చెప్పబూనడం అజ్ఞాన ఫలితమవుతుంది. అందుకే ఆలోచన, పునరాలోచన అవసర మంటు న్నాను. ఆలోచించే హక్కు (స్వేచ్ఛ) అందరికి వున్నది. ఆ స్వేచ్ఛను గుర్తించి ఆలోచించి కాలానికి తగిన తాత్విక బుద్ధిని పెంచుకోవాలి. కాదని, కూడదని, అదే సత్యమని, అదే తత్వమని అనుకోవడం అజ్ఞాన మవుతుంది. అలా వుండాలనుకునే వాళ్లు వుంటే వుంటారు.

ఇలా విజ్ఞానం అభివృద్ధి అవుతున్నకొద్ది ఏకత్వ సూత్రాలు రుజువు కావడంద్వారా భౌతిక తత్వశాస్త్రానికి బలమైన పునాదులు ఏర్పడ్డాయి. అంతేకాక అందరు మానవులలోను వున్నది ఒకే జీవ పదార్థమని తెలియ డంద్వారా జీవుడు సమిష్టి జీవుడని రుజువైనది. ఇలా తాత్విక ఏకత్వం అర్థం కావడంద్వారా మానవులంతా ఏక కుటుంబికులని, అది వ్యావహారి కంగా సమిష్టి తత్వానికి సమన్వయమని అర్థమవుతుంది.

అందువలన తాత్వికంగా వైయక్తిక (జీవ) దృష్టిగాని, వ్యావహారికంగా వ్యక్తిగత (వ్యక్తిస్వామ్య) ఆలోచనలుగాని తప్పని తేలిపోయింది. బుద్ధుడు, శంకరుడు ఆనాడు సమిష్టి తత్వాన్ని చెప్పినా వారికి తగిన శాస్త్ర ప్రమాణం లేదు. అందుచేతనే ప్రజా సామాన్యం మధ్య ఆ సమిష్టి సిద్ధాంతాన్ని స్థిరపరచలేక పోయారు ఆ పరిస్థితిని పురస్కరించుకుని మళ్ళీ వైయక్తిక తత్వరీతిని ప్రవేశపెట్టడం జరిగింది. ఆ కారణంగా సమాజంలో మళ్ళీ వ్యష్టి స్వామ్య వ్యవస్థ యేర్పడింది. వ్యక్తి స్వేచ్ఛ పేరుతో వ్యక్తి దురభిమాన దుర్వ్యవస్థ ఏర్పడింది. యథేచ్ఛా తత్వం, స్వైరం, స్వాభిమానం, దురభిమానం పెరిగిపోయింది.

## దేనివిచూచి దీనిని నేర్చుకున్నాం?

సమిష్టి దృష్టిలేని వైదిక ద్వైత తాత్వికాంశంలోని వైయక్తిక ప్రవృత్తి ప్రధానంగా గల వ్యక్తి స్వేచ్ఛ అనే ప్రధానాంశంనుండి వచ్చినదే ఈ దుర్వ్యవస్థ. అది ఈనాడు ఆ తాత్విక సూత్రంమీద ఆధారపడి పోషించబడుతూ వున్నది. నేను, నాది, నాకోసం అనే వ్యక్తిగత ప్రవృత్తి మారనిదే, ఆ స్వభావం పోనిదే, మనం, మనది, మనకోసం అనే సమిష్టి ఆలోచనరాదు. అది రానంతవరకు మనం ఈ వ్యవస్థలోని దురవస్థలకు అలవాటుపడి జీవిస్తూ వుండవలసిందే. అందుచేత సమిష్టి ఆలోచనలు చేసిన తాత్వికుల తాత్వికాంశాలను మనం అర్థం చేసుకోవాలి.

అలాంటి తాత్వికాంశాలనుండి మనం ఆలోచనలను సమన్వయ భావంతో పరిశీలించి, విశ్లేషించి దానికి సంబంధించిన ఆచరణ భాగాన్ని అనుసరించిననాడే మనం మానవ సమాజంలో మానవులంగా జీవిస్తూ వున్నట్లు లెక్క. లేనిచో ఒక జంతువు మరొక జంతువుతో పోట్లాడి, దానిని కరచి, దాని ఆహారాన్ని కబళించే దశకూ మన స్థితికీ తేడా యెక్కడ అనే ప్రశ్న వస్తుంది ఈ సమాజాన్ని చూస్తున్నప్పుడు. ఈ సమాజంలో యే సంఘటన చూచినా ఆ భావాన్నే కలిగిస్తూ వున్నది. ఇలా మనల్ని జంతు స్థాయికి దిగజార్చిన పరిస్థితిని కల్పించింది వ్యక్తి స్వామ్యవ్యవస్థే కదా!

తేనెపట్టుని చూచినప్పుడు అందులోని సమిష్టి భావం మనకు అర్థమవుతుంది. అన్ని ఈగలు కలిసి ఒక నాయకత్వాన్ని (రాణీ ఈగను) యెన్నుకుని ఆ నాయకత్వంలో అవన్నీ సమిష్టి జీవనాన్ని సాగిస్తూ వుంటై. అన్ని ఈగలు స్వేచ్ఛను అనుభవిస్తూనే వుంటై. ఏ ఒక్క ఈగ అస్వతంత్రమై వుండదు. వుండవలసిన అవసరంలేదు. ఆ ఈగల సమిష్టి భావం మనకొక గుణపాఠంగా వుంటుంది. ఇంత పెద్ద మానవుడు అంత చిన్న ఈగల స్థాయికి వెళ్ళి ఆలోచించడమా అని ఆగ్రహపడి ప్రయోజనం లేదు. ఈ వ్యవస్థను చూచినప్పుడు మన బుద్ధి స్థాయి అంతకంటే చిన్నదేమో ననిపిస్తూ వుంటుంది.

జడ చేతన ప్రకృతినిచూచి మనం చాలా నేర్చుకున్నాం చైతన్య ప్రకృతిలో ప్రవేశించాం, చైతన్యవంతులమైనాం. అంతవరకు ఆనందించదగిన విషయమే. కాని, మన జీవిత విధానంలో (సాంఘిక, ఆర్థిక రంగాలలో) మనం కల్పించుకున్న కృత్రిమమైన ఈ తారతమ్యాలు దేనినిచూచి నేర్చుకున్నాం?

ఈ విశ్వంలో ఏ ఒక్క వస్తువు ఏ ఒక్క వ్యక్తిదీ కాదు, ఏదైనా అది అందరిది. అలాగే అందరితోను కలిసివుండే వ్యక్తే వ్యక్తిగాని అందరితోను వుండక (ఉండలేక) కొందరు వేరైపోతాం అంటే అది సాధ్యపడే విషయంకాదు. అలా కాదనుకుంటే ఆ వ్యక్తి సమాజానికి దూరమై సన్యాసం పుచ్చుకోవాలి వ్యక్తిగత స్వాభిమానం యెలాకూడదో వ్యక్తిగత సన్యాసంకూడా అలాంటిదే. సన్యాసం పుచ్చుకున్న యే వ్యక్తి వ్యక్తిగతంగా జీవించలేడు, జీవితమంటే వ్యక్తిగత సన్యాసంకాదు. వ్యక్తిగత స్వాభిమానముకాదు, మానవత్వంతో మానవులతో కలిసి జీవించడమే మానవ జీవితం.

ఈ విధంగా వైయక్తిక జీవుణ్ణి ప్రవేశపెట్టి ప్రచారంలోకి తీసుకువచ్చిన ఫలితమేగదా నేటి వ్యవస్థ? ఈ వ్యవస్థలోని మానవుల అవస్థలు కళ్ళారా చూస్తూనేవున్నాం, చెవులారా వింటూనే వున్నాం. అందుకే ఈ వ్యవస్థ మారాలంటున్నాం. ఆ మార్పుకోసం ఆలోచిస్తున్నాం, తపిస్తున్నాం, కృషి చేస్తున్నాం, ఎవరికి తోచినది వారు చేస్తునేవున్నాం.

అయితే ఈ వ్యవస్థలోని వ్యక్తుల కష్టాలు వ్యక్తిగతాలు కావు (వైయక్తిక జీవుల కర్మ ఫలితాలు కావు). అవి సమిష్టి గతాలే. సమాజంలో సృష్టించబడిన కల్పించబడిన కృత్రిమ సమస్యలే. అందుచేత ఆ సమస్యలను సమిష్టిగానే పరిష్కరించాలిగాని వ్యక్తిగతంగా కాదు. వ్యక్తిగతంగా ఆలోచించవచ్చు. సమస్యా పరిష్కారానికి వ్యక్తిగతంగా సూచనలివ్వవచ్చు. కాని, పరిష్కారం మాత్రం సమిష్టిగానే జరగవలసి వున్నది. అందులో అణుమాత్రం ఆలోచనకు తావులేదు.

మానవుడు అంటే ఒక మానవుడని కాదుకదా? అలాగే మానవుడు కష్టాలనుండి ముక్తి (స్వేచ్ఛ) పొందాలి అంటే అది అందరి మానవుల ముక్తి (స్వేచ్ఛ) అనేకదా అర్థం? అది తాత్వికంగా ఆలోచించినప్పుడు జీవన్ముక్తి అవుతుంది. అంటే మానవులంతా స్వేచ్ఛను పొందాలి, అనుభవించాలి అని అర్థం.

## స్వేచ్ఛ

స్వేచ్ఛ అనేది ఉత్తమమైనది, విశాలమైనది. అది అంతంలేనిది. హద్దులు సరిహద్దులు లేనిది. వ్యక్తి స్వేచ్ఛ (స్వైరం) అనేది అధమమైనది. అది సంకుచితమైనది. హద్దులు, సరిహద్దులమధ్య యిరుకైనది. కారణం తాత్వికంగా వైయక్తిక జీవుడిని ఆధారంచేసుకుని, వ్యావహారికంగా వ్యక్తిగత మానవుడికిగల స్వేచ్ఛను ఆధారంచేసుకుని, యధేచ్ఛా ప్రవృత్తిని కల్పించుకుని, పెంచుకుని, దాని ఆధారంగా తనవృత్తిని చేస్తూవున్న వ్యక్తికి నైతిక విలువలుండవు. అట్టివ్యక్తి నీతికి బద్ధుడుకాడు. అవినీతికి వెరవడు. నిజాయితీని కోల్పోతాడు, స్వార్థం పెరుగుతుంది. అది అసూయకు కారణమవుతుంది. తనకు తెలియకుండా ద్వేషం పెరుగుతుంది. అంతరంలో స్వాభిమానం చోటుచేసుకుంటుంది. దురభిమానం కాలుదువ్వుతుంది. నిదానం కోల్పోతాడు. మానవత్వం మంట కలుస్తుంది. స్వైరం తాండవ మాడుతుంది. దూషణ, తిరస్కారాలు రంగంలోకి వచ్చి వ్యక్తులమధ్య కలహంగా మారుతుంది. ఆ కారణంగా సమాజంలో అశాంతి తాండవ మాడుతుంది. శాంతి కరువవుతుంది. పర్యవసానంగా మిగిలేదేమిటని ప్రశ్న పుడుతుంది.

ఇదంతా ఈరోజు జరుగుతూ వున్నదేగదా? దీనికి ఆ వైయక్తిక జీవుని (మానవుని) స్వేచ్ఛా తత్వమే కారణం కాదా? అది ఈనాటి వ్యక్తిస్వేచ్ఛ.

స్వేచ్ఛ అనే దానితో వ్యక్తి స్వేచ్ఛ అనేది సాపేక్షంగా వుంటుంది, వుండాలి. కాని, వ్యక్తిస్వేచ్ఛ అనేది వేరుగా వుండదు. వుండకూడదు. వాటిని సాపేక్షంగా కాక నిరపేక్షంగా చూడకూడదు. అసలు యేదీ నిరపేక్షంగా వుండదు అని తాత్విక సూత్రాలు చెబుతూ వుండగా వ్యక్తిస్వేచ్ఛ అనేది యెలా సాధ్యపడుతుంది?

అందుచేత స్వేచ్ఛ, వ్యక్తిస్వేచ్ఛ అనే దానిలో తాత్విక సంబంధమైన తేడాను, వైరుధ్యాన్ని గ్రహించకపోతే వచ్చే యిబ్బంది చాలా వున్నది, అది అర్థం చేసుకుని తదనుగుణమైన ఆలోచన చేయాలి.

నిర్వాణం (బుద్ధుడు) జీవన్ముక్తి (శంకరుడు), స్వేచ్ఛ (ఎమ్. ఎన్. రాయ్) అనేవి ఒకే తాత్విక విలువ కలిగి వున్నవనేది నా అభిప్రాయం. అలా కాదని నిర్వాణానికి నిర్యాణమని అర్థంచెప్పి (మరణానంతరం పొందేది) జీవన్ముక్తి అనేదానికి (విదేహముక్తి) మరణానంతరమోక్షం అనిచెప్పి, స్వేచ్ఛ అనేదానికి వ్యక్తిస్వేచ్ఛ (యథేచ్ఛ, స్వైరం) అని చెప్పినందువల్ల ఆయా సూత్రాలకు తాత్విక విలువలు తరిగిపోయినై.

జీవన్ముక్తి (స్వేచ్ఛ, మోక్షం) అనే దానిని సమిష్టి సమస్యగానే శంకరుడు చెప్పాడు. ఆయన తాత్విక సూత్రం ప్రకారం జీవుడు సమిష్టి జీవుడేగనుక జీవుని (మానవుని) సమస్యకూడా సమిష్టిగానే వుంటుందని వారి అభిప్రాయం గదా? ఆ సమిష్టి తాత్విక సూత్రాన్ని కాదని జీవుడు వైయక్తిక జీవుడని ఆ జీవుని సమస్యలు వ్యక్తిగతంగానే చెప్పి పరిష్కారం కూడా వ్యక్తిగతంగానే (వ్యక్తిచే చేయబడిన వైదిక కర్మల ఫలితాలు ఆ వ్యక్తికే చెందుతై అని) చెప్పిన మధ్వాచారి తాత్విక సూత్రాల ఆధారంగానే కదా ఈ వ్యవస్థ నడుస్తున్నది?

వ్యక్తి పూజలు, విగ్రహారాధనలు, యజ్ఞ యాగాది కర్మకాండద్వారా పొందే ఫలితాలు వ్యక్తిగతాలేకదా? ఆకాశాన్నంటే అరవై అంతస్తుల భవనాలమధ్య తాటిఆకుల కొంపలు వుండటం చూస్తూనే వున్నాం, ఆ భవనంలోను ఆ ఆకుల కొంపలలోను వున్నది ఒకేరకం మానవులుకాదా? అయినా కర్మఫలితం వారిద్దరినీ అలా వుంచిందని అనుకుని సరిపెట్టుకుని వుండటం లేదా? వేల సంవత్సరాల ఈ విచిత్రమైన వ్యవస్థను కాపాడుతూ వున్నది ఆ వ్యక్తి స్వేచ్ఛా తత్వమేకాదా? కాదని యెవరైనా అనగలరా? అనగలిగితే ఇదిలా యెందుకుండేది?

స్వేచ్ఛ (అన్నిరకాల యీతి బాధలనుండి విముక్తి) పొందాలి. సర్వకాల సర్వావస్థలయందు మానవుడు స్వేచ్ఛను అనుభవించాలి, దానిని కాదనలేము. అది మానవునికిగల సహజమైన హక్కు. కాని, అది ఈ సమాజంలో హరించబడింది. వ్యక్తిస్వేచ్ఛ పేరుతోనే దానిని వారు కాపాడుకుంటున్నారు. కొందరు వ్యక్తుల పేరుతోవున్న ఆ స్వేచ్ఛ మళ్లీ అందరి మానవుల అనుభవంలోకి రావాలి. అంటే స్వేచ్ఛ సమిష్టిది కావాలి. అది యెలా సాధ్యం అనేదే ఆలోచించాలి. పునారాలోచించాలి. అక్కడే మనం తప్పటడుగులు వేయకాదు. మానవుడికిగల సహజమైన ఈ స్వేచ్ఛ సంగతి మానవుడికి తెలియ చెప్పాలి. దానికి యే తాత్విక సూత్రం సరైనదనేది తాత్వికులు చర్చించాలి.

మానవుడు అంటే వ్యక్తిగత మానవుడు కాదు. స్వేచ్ఛ అంటే అది వ్యక్తి స్వేచ్ఛ అని కాదు. మానవుడు అంటే సమిష్టి మానవుడే. స్వేచ్ఛ అంటే సమిష్టి స్వేచ్ఛయే, ఆ స్థాయిలో గుర్తించి అర్థం చెప్పుకోవాలి. ఆ స్థాయిలో సమాజానికి అన్వయించి సమన్వయపరచి సాధించాలి. అదే వ్యావహారిక తాత్విక సమన్వయ మవుతుంది.

వ్యక్తిగత మానవుని స్వేచ్ఛను కోరడమంటే ఆ మధ్వాచారి చెప్పిన వ్యక్తి (వైయక్తిక) జీవుణ్ణి మళ్లీ తాత్వికంగా ప్రతిష్ఠించే ప్రయత్నమే అవుతుంది. అది తాత్విక తిరోగమనమే కాగలదు. ఆ విధమైన వ్యష్టి జీవుణ్ణి అనుభవంలోకి తీసుకురావడ మంటే స్వర్గ నరకాలు, బంధ మోక్షాలు,

కర్మ ఫలితాలు తాత్వికంగా అంగీకరించినట్లే అవుతుంది, వున్నవాటిని వున్నట్లే వుంచమనడమవుతుంది.

నానాత్వ భిన్నత్వాలకు ఏకత్వం భౌతిక తత్వశాస్త్రంద్వారా నిరూపించబడింది. అనేకంగా కనిపించే భిన్న జీవజాతుల మధ్య, జీవులమధ్య (జీవాత్మలమధ్య) ఏకత్వం (ఏకాత్మతత్వం) చెప్పింది అద్వైతం. కాని ఏకత్వంలో నుంచి (పరమాత్మలో నుంచి) జీవాత్మల అనేకత్వాన్ని భిన్నత్వాన్ని ప్రతిపాదించింది ద్వైతం. అందుచేత జీవులమధ్య ముఖ్యంగా మానవులమధ్య తారతమ్యాన్ని సృష్టించింది. ఫలితంగా సామరస్యాన్ని సహకారాన్ని నశింప జేసింది. అది మనిషిలో అసూయాద్వేషాలకు కారణమయింది.

అందుచేత తాత్వికంగా సమిష్టి తత్వాన్ని ప్రతిపాదించిన అద్వైతం భౌతిక తత్వశాస్త్రానికి దగ్గరవుతుందేగాని ద్వైతం ఏనాటికీకాదు. అది అన్ని విషయాలలోను భౌతిక వాదంతో బేధిస్తుంది. అందుచేత మనలను బాధిస్తుంది.

మన భారతదేశంలోని ముఖ్యమైన తత్వవేత్తల తాత్వికాంశాలను రెండు విధాలుగా విభజించి చెప్పవచ్చు. బుద్ధుడు, శంకరుడు, రామానుజుడు, మధ్వ, ఎమ్. ఎన్. రాయ్. ఈ అయిదుగురిని తీసుకుని వారి తాత్వికాంశాలను పరిశీలిద్దాం. బుద్ధుడు, ఎమ్ ఎన్. రాయ్ పూర్తిగా భౌతిక వాదులు. మధ్వ, రామానుజులు పూర్తిగా ఆధ్యాత్మిక భావవాదులు శంకరుడు పరస్పరమైన, విరుద్ధమైన ఆ రెండు సిద్ధాంతాలకు మధ్యే మార్గం చెప్పినవాడు. ఆయన సూత్రాలవల్ల భౌతిక తత్వశాస్త్రానికి (సమిష్టికి) సమన్వయం కుదురుతుందేగాని ఆధ్యాత్మిక భావవాదానికి కుదరదు, అలా కుదర్చాలని చేసిన దానిఫలితమే ఈ వైరుధ్యాల తాత్వికాంశాలకు మూలం.

ఇక రామానుజుడు, మధ్వ చెప్పింది పూర్తిగా వైయక్తిక (వ్యక్తిగత) తత్వం. బుద్ధుడు, ఎమ్ ఎన్. రాయ్ చెప్పింది పైదానికి విరుద్ధ

మైన సమిష్టి తత్వం. అది తాత్వికంగాను, వ్యావహారికంగాను కూడా నిర్ద్వంద్వంగా చెప్పబడిన విషయం. ఇకపోతే శంకరుడు చెప్పింది తాత్వికంగా సమిష్టి (జీవుడు) తత్వంకాగా దానిని వ్యావహారికంగా సమన్వయం చేసి చెప్పవచ్చును. అందువల్ల వైరుధ్యం యే విధంగాను వుండదు.

అందుచేత బుద్ధుడు చెప్పిన నిర్వాణం, శంకరుడు చెప్పిన జీవన్ముక్తి, ఎమ్. ఎన్. రాయ్ చెప్పిన స్వేచ్ఛ (వ్యక్తి స్వేచ్ఛకాదు) ఒకే తాత్విక సూత్రంమీద ఆధారపడినవి కావడంచేత అవి ఒకే తాత్విక స్థాయి కలిగివున్నవనేది నా అభిప్రాయం. ఆ కారణంగా వాటిని సామాజిక పరంగా సమన్వయం చేసి ఆలోచించి నప్పుడు సమిష్టి వ్యవస్థనే సమర్థించుతూ వున్నై. వ్యష్టి (వ్యక్తి) వ్యవస్థ అనేది కానేకాదు.

నేను ఉపోద్ఘాతంలో చెప్పినట్లు వ్యక్తి స్వేచ్ఛ అనేపేరుతో మధ్వాచారి చెప్పిన (వైయక్తిక) ద్వైత స్థాయికి, ఎమ్. ఎన్. రాయ్ స్వేచ్ఛా తత్వాన్ని దిగజార్చ వద్దని మనవి. అందుచేత స్వేచ్ఛ అనేది ఉత్తమమైనది గనుక అధమమైన వ్యక్తి స్వేచ్ఛ అనేది మన భావంనుంచి (భాషనుంచి కూడా) తొలగించడం మంచిది. ఈ విషయంలో విజ్ఞులెంత వరకు సమ్మతిస్తారో తెలియదు. అది వారి, వారి ప్రాజ్ఞత, విజ్ఞత మీద ఆధారపడి వుంటుంది. ప్రజ్ఞతో వాదనను ప్రతిపాదించ వచ్చునేమో కాని అది జ్ఞానమనిపించుకోదు. కారణం అది తాత్విక సమన్వయానికి సరిపోదు కనుక.

మానవ సమాజం యేర్పడి నప్పటినుండి నేటివరకు యేర్పడుతూ వచ్చిన అనేక వ్యవస్థలకు కారణం వైయక్తిక (వ్యక్తిగత) తాత్విక సూత్రం మీదనే గదా ఆధారపడి దశల వారీగా మారుతూ వచ్చింది! బానిస వ్యవస్థ, రాచరికపు వ్యవస్థ, జమీందారీ భూస్వామ్య వ్యవస్థ, ధనిక పెట్టుబడిదారీ వ్యవస్థలకు తాత్విక పునాదులు వైయక్తిక (వ్యక్తిగత) అధికృత అనే భావంనుండి ఏర్పడినవే. పురుషాధిక్యతా భావంకూడా ఆ తాత్విక పునాదిమీద ఏర్పడినదే కదా! అందుకే మానవులంతా సమానం అనే తాత్విక సూత్రాలపై ఆధారపడిన సమ సమాజం కావాలంటున్నాం. అది సమిష్టి సూత్రంమీద ఆధారపడి వుంటుంది.

సమిష్టి దృష్టితో సమసమాజాశయంతో కమ్యూనిష్టు దేశాల్లో పరిశ్రమలను, పంట పొలాలను సమాజపరం చేశారు. అందువల్ల అక్కడ ఉత్పత్తి దెబ్బతిన్నదనీ సంపదను సమిష్టి చేయడమే అందుకు కారణమనీ వ్యాఖ్యానిస్తూ వార్తలు మోసుకువస్తూ వుంటారు ఆ వ్యవస్థపై ద్వేషం వున్న వ్యక్తులు. అయితే కావచ్చు, కాదనం. కొన్ని వేల సంవత్సరాల వ్యక్తి స్వామ్య వ్యవస్థకు అలవాటుపడి (అది యెంత దుష్ఫలితాల నిచ్చినా) అదే బాగున్నదనే మనస్తత్వం నరనరాల పట్టి పీడిస్తూ వుండటం అందుకు కారణం. ఆ భావంనుండి నెమ్మదిగా సమిష్టి భావం అలవరచుకునే వరకు అటువంటి పరిస్థితులు వుంటే వుండవచ్చు, కాదనం.

అయితే అక్కడ ఉత్పత్తి యెంత జరిగిందనేదికాదు ముఖ్యం, అది యెలా వినియోగం జరిగిందనేదే మనకు ముఖ్యం. ఉత్పత్తి తరిగినంత మాత్రంచేత అక్కడ ఆకలి చావులు లేవుకదా? ఉన్నదేదో అందరు అనుభవించారు. అందరు ఆనందంగా జీవించారు. కాని, వ్యక్తిస్వామ్య వ్యవస్థ వున్న దేశాల్లో ఉత్పత్తి అధికంగా జరిగివుంటే జరిగి వుండవచ్చు. అక్కడ జరిగిందేమిటి? ఫలితమేమిటి? ఒకప్రక్క తిండిలేక జనం చస్తూ వున్నా గిట్టుబాటు ధరలు రావనే వ్యాపార మనస్తత్వంతోను, వ్యక్తి స్వార్థంతోను కొన్ని వేల టన్నుల ఆహార ధాన్యాలను సముద్రంలో పారబోసిన సంగతి మరువగలమా? వారికి కావలసింది లాభమే (ధనమే) కనుక ఆ విధంగా చేయగలిగారు. గోడవున్లల్లో నిల్వవుంచిన ధాన్యాలు మగ్గి, బూజుపట్టి, పురుగులుపడి పనికిరాకుండా పోయేదాకా అట్టిపెట్టి చివరకు పెంటకుప్పల్లో పారబోసిన సందర్భాలు యెన్నిలేవు? ఈ విషయాలెందుకు ఆలోచించరు?

రెండవ ప్రపంచ యుద్ధానంతరం బెంగాలు, రాయలసీమ లాంటి ప్రదేశాలలో లక్షలాది ప్రజా సామాన్యం ఆకలి మంటల్లో మలమలమాడి, మగ్గి, బుగ్గిపోయిన సందర్భాలు మరచిపోగలమా? వీటికి కారణం ఆహార ధాన్యాలు లేకపోవడమా? అంతులేని వ్యక్తి స్వార్థమా? అనేది ఆలోచించినప్పుడు అర్థం కాగలదు వ్యష్టి స్వామ్యంలో వ్యక్తికివున్న స్వేచ్ఛ

యేమిటని. ఒక వ్యక్తిని దోచుకుని ఒక వ్యక్తి మిగుల్చుకునేదే దాని నీతి అందామా? అదేవ్యక్తి స్వేచ్ఛకు నిదర్శనమా?

సంపద వుంటేనే చాలదు. అది యెలా వినియోగించుకోవాలనేది కూడా తెలియాలి. సహజమైన సంపద మన కెంతో వున్నది. కాని, దానిని సద్వినియోగం చేసుకునే సమిష్టి పథకం మనకు లేదు. ఎవరికి అందింది వారు స్వాహాచేస్తూ అందులో పోటీపడుతూ వుండటమే నీతిగా చెప్పుకుంటున్నాం. మనకు ఎన్నో జీవనదులున్నా ఆ నదీజలాలను సద్వినియోగం చేసుకోవాలనే సమిష్టి ఆలోచనలేదు. అందువల్ల ఆ నదీజలాలు సముద్రం పాలైనా యిష్టపడతాం కాని అందరికోసం అనేది మాత్రం అంగీకరించం. అటువంటి పథకం యేదైనా వస్తే దానిని వ్యతిరేకిస్తూ వుంటాం. ఇదంతా వ్యక్తి స్వామ్యంలో వుండే స్వార్థంతో కూడిన అసూయాద్వేషాలు అంతరంలో దాగివుండి సమయం వచ్చినప్పుడు అలా వ్యవహరించేలాగా చేస్తూవుంటై. వాదంలో న్యాయం లేకపోయినా వ్యక్తి స్వేచ్ఛ పేరుతో వాదిస్తూ వుంటాం.

గంగా—కావేరి పథకం వున్నది. గంగను కావేరితో కలిపితే వాటి జల సంపద మనకెంతో సంపదను పెంచుతుంది. కాని, దానిని అమలు జరిపే సమిష్టి ఆలోచనలు చేయం. విజయవాడ ప్రక్కనే కృష్ణానది ప్రవహిస్తూ వున్నది. కాని, విజయవాడ నగర పౌరులకు మంచినీరు కరువే, మద్రాసుకు కృష్ణానది నుండి మంచినీరు అడిగితే ఇవ్వడానికి వీలులేదని అనడానికి అందరూ కలుస్తారు. ఆ నది నీరు యెంతో సముద్రంలో కలిసి పోతూవున్నది. కాని, దానిని సద్వినియోగం చేసుకోవడానికి మనసు అంగీకరించదు. ఇటువంటి అనేక విషయాలకు అంతరంలో దాగివున్న వ్యక్తి స్వామ్యతత్వం కారణం. అది అన్ని రంగాలలోను వ్యక్తిని సంకుచిత పరుస్తూ వుంటుంది.

ఇలా అన్ని రంగాలలోను అనర్థకంగావున్న ఈ వ్యష్టి స్వామ్య వ్యవస్థనుండి నూతన సమిష్టి వ్యవస్థ కోసం ఆలోచనలు చేసిన తత్వవేత్తలలో ముఖ్యుడు కారల్‌మార్క్సు. సమష్టి సమాజంలో అందరికి అన్ని

విధాలా స్వేచ్ఛ అనేది ముఖ్యసూత్రం. అందరికి పని. అందరికి తిండి అలాగే అందరికి అన్ని విధాలా అవకాశం. అందువల్ల అందరికి అన్ని విధాలా యీతి బాధలనుండి విముక్తి అంటే అందరికి సమానమైన స్వేచ్ఛ అనేది దాని ప్రధాన సూత్రం. తద్వారా అందరు స్వేచ్ఛతో వ్యక్తిత్వాలు గల వ్యక్తులుగా సమిష్టి జీవనం సాగించవచ్చు ననేది ఆ నూతన ప్రణాళిక ఆశయం.

భౌతికతత్వ శాస్త్రాధారంగా ఆలోచించి తదనుగుణమైన సామాజిక వ్యవస్థను నిర్మించాలనేది ఆ ప్రణాళిక ప్రధాన ఆశయం. అందులో కొన్ని లోపాలు వుండవచ్చు. వాటిని కాలానుగుణంగా మార్పుచేసుకోవచ్చు. అటువంటి మార్పులు అవసరాన్ని బట్టి లెనిన్ కొంతవరకు చేశాడు. మావో తన ఆచరణలో వచ్చిన అనుభవంతో కొన్ని మార్పులు చేశాడు. మరికొన్ని మార్పులు ఎమ్. ఎన్. రాయ్ ప్రవేశపెట్టాడు వాటిని అమలుజరుపు కోవడంలో వచ్చే యిబ్బందుల దృష్ట్యా మరికొన్ని మార్పులు మనం చేసు కోవచ్చు. అభ్యంతరం యేమి వుండదు, వుండనక్కరలేదు. కాని, ప్రధాన మైన సమిష్టితత్వం కాదని సహకారతత్వం కావాలని అనడంలో ఆంతర్యం అర్థం కావడంలేదు. అలాగే సమిష్టి స్వేచ్ఛ అనేదానినుండి వ్యక్తి స్వేచ్ఛ అనేదికూడా అర్థరహితం. అనర్థ కారణం.

అన్ని విషయాలనుండి మానవుడు స్వేచ్ఛ ననుభవించాలి అనేది ప్రధానసూత్రంగా వుండగా ప్రత్యేకించి వ్యక్తి స్వేచ్ఛ అనేది ప్రవేశ పెట్ట డంలో అర్థంలేదు. అది మళ్ళీ మానవులమధ్య వేర్పాటు తత్వం, వ్యక్తిలో ఆధిక్యతా భావం చోటుచేసుకునే అవకాశం వున్నది. అది తాత్వికంగా ద్వైత బుద్ధిని ప్రతిపాదిస్తుంది. అది తాత్విక తిరోగమన మవుతుంది. అది పనికిరాదని ఒకసారి పారవైచిన పదార్థం లాంటిది. (కుళ్ళి కంపుకొట్టిన పండులాంటిది) అంటువంటి దానికోసం మళ్ళీ చేయిజాచడం, అన్వేషించ డం అసహ్యం. అందుచేత విడవతగింది విడవడం, పూనతగింది పూనడం తాత్వికులకు మంచి లక్షణం.

ఇంతకు ముందు యెన్నో విషయాలు చర్చించుకున్నాం. ఇంకా యెన్నో విషయాలు చర్చించవలసినవి వున్నై. కాని, గ్రంథ విస్తరణ

కాకూడదనే ఉద్దేశంతో ఈ విషయాన్ని యింతటితో ఆపుతున్నాను. పైన చర్చించిన విషయాలను గురించి తాత్విక, వ్యావహారిక సమన్వయం కోసం ఆలోచించిన విషయాలు మళ్ళీ ఆలోచించవలసిన అవసరం యెంతైనా వున్నది. ఆలోచన, పునరాలోచన కూడా అవసరమే ననేది నా అభిప్రాయం. ఆలోచించేటప్పుడు నా ఆలోచన, నీ ఆలోచన అనే భావంతో కాక మన ఆలోచన అనేది దృష్టిలో వుంచుకుంటే సమన్వయం కుదరకపోదు. సమన్వయం కుదిరితే సమస్యకు పరిష్కారం కుదిరినట్లే. సమస్య అందరిది కనుక అందరూ ఆలోచించాలి. అలా ఆలోచించిన విషయాలు ఆచరణలోకి వచ్చినప్పుడు అందరికీ సుఖశాంతులు అందగలవు. అదే మన అందరి ఆశయం గదా?

శంకరుడు పూర్తి చేయని తాత్విక సమన్వయ భాగాన్ని పూర్తి చేయడానికే ఈ చలమడు వచ్చాడు అనేవారు అన్నగారు. చలమడు పూర్తి చేయని విషయాన్ని (సమన్వయంతో ఆచరణ భాగాన్ని) ఈ కృష్ణుడు పూర్తి చేస్తాడు అని నేననేవాడినని ముందే చెప్పానుగదా. వారు లేకపోవడంతో తాత్విక జగత్తుకు తీరనిలోటు ఏర్పడిం దనిపించింది నాకు.

తాత్వికంగా యేర్పడిన ఆ లోటుని పూర్తి చేయడం నా బాధ్యతగా గుర్తించాను. అలా గుర్తించిన నేను నా కర్తవ్యంగా ఈ పని చేశాను (అన్నగారితో నా పరిచయం వ్రాశాను) జగత్ సత్యం - బ్రహ్మమిధ్య అనే పుస్తకం వ్రాయడానికి ప్రత్యక్షంగాగాని, పరోక్షంగాగాని వారు కారకులు ప్రేరకులు అనే విషయాన్ని అందరికి తెలియ జేయడానికి నేను ఆనందిస్తున్నాను. ఆ పుస్తకాన్ని త్వరలో అచ్చువేయించి మీకందించగలను.

నాకు అక్కగారు, గురువుగారు అయిన రాజరత్నమ్మగారు నాకు తాత్విక విషయాలు బోధించేటప్పుడు గాని వ్యావహారిక విషయాలు తెలియజెప్పేటప్పుడుగాని నేను పరాకులో వుండకుండా చూచుకుంటూ తాను చిరాకు చెందకుండా వుంటూ వుండటం చేతనే నేనీమాత్రం జ్ఞానం సంపాదించానని అనుకుంటున్నాను.

ప్రతిదానికి చిరాకుచెందే గురువులవల్ల శిష్యులు తప్పనిసరిగా పరాకు పొందక తప్పదు. ఎంత చెప్పినా పరాకుగానే వింటూవుండే శిష్యునివల్ల యే గురువైనా చిరాకు చెందకుండా వుండలేడు. అందువల్ల గురువుకి చిరాకు, శిష్యునికి పరాకు తగదు. అయితే అదెలాసాధ్యం అని అడుగుతారేమో! ఎలా సాధ్యమో నేను చెప్పలేను. కాని మా యిద్దరికి మాత్రం అది సాధ్యపడింది. అందుకే నన్నింతటివాణ్ణి చేయగలిగారు మా గురువుగారు. అందుకే వారిని గురించి ఈ మాటలు వ్రాయవలసి వచ్చింది.

నేను వారివద్ద విన్నది తక్కువే అయినా వారు చెప్పే పద్ధతిలో చెప్పింది చాలా యెక్కువగా అర్ధమయ్యే పద్ధతివల్ల నేను చాలా యెక్కువగా తెలుసుకో గలిగాననే సంతృప్తి నాకున్నది. అద్వైత్వం పూర్తిగా తెలుసుకోవడం అంత సులభమైన పనికాదు. అది అంతులేని వాద ప్రతివాదనలను అభివృద్ధి చేసుకున్నది కావడంచేత యెంత తెలిసినా యింకా తెలియవలసింది వుంటూనే వుంటుందని పిస్తుంది. అయినా ముఖ్యసూత్రాలు అర్ధమైతే భౌతిక తత్వశాస్త్రంతో సమన్వయ పరచి మరికొంత అభివృద్ధి చేసుకోవచ్చును. అలా అభివృద్ధి చేసుకోవడంలో బోధనా పద్ధతులు కొత్త దారులు త్రొక్కి బోధ వినసొంపు అవుతుంది. అందువల్ల వినేవారికి విసుగు పుట్టక విషయ అవగాహన సులభమవుతుంది.

మా అన్న చలమయ్యగారు (వేదాంత విద్యా విశారద) సదానంద అనే సార్ధక నామంతో వ్యవహరించారు. వారు యిప్పుడులేరు 16-11-85 తరువాత వారు మనమధ్య లేరు. కావ్య రూపంలోని శరీరం లేకపోయినా జ్ఞాన రూపమైన వారి స్వరూపం మనమధ్య వుంటూనే వుంటుంది.

వారి జ్ఞాపకార్ధం వారిని గురించిన నా జ్ఞాపకాలు ఈ పరిచయుంద్వారా మీకు పరిచయుం చేశాను. ఈ పరిచయుంవల్ల వారి జ్ఞానమార్గం మనందరికి మార్గమై మనలను పరిపూర్ణ జ్ఞానంవైపుకు నడిపించ గలదని ఆశిద్దాం.

"త్వమేవాహమ్" అని వారు పదేపదే అంటూ వుండేవారు. ఆ అద్వైత వాక్యం మన మనసుల్లో సర్వకాల సర్వావస్థల యందు వుండి మనలను ఆచరణకు ముందుకు తీసుకు వెళ్ళగలదని ఆశిస్తున్నాను.

# 'మహా వాక్యాలు' నుండి

1) అర్థము వ్యర్థము జేయ న
వర్థకములు జుట్టుకొనుచు నానా విధముల్
అర్థమ్ము లేనిమాటల
నర్థములకు దారిజూపు అజ్ఞనిని వాసా.

2) కాసులేకయున్న కలియుగమే లేదు
పోజులేకయున్న ప్రొద్దుబోదు
దాసులైనవాడు ధైర్యము జచ్చురా
చెప్పనేంవేరె శ్రీనివాస.

3) పొట్టకూటికొరకు పొద్దస్తమానము
మండుటెండలోన మండి మండి
రెక్క విరుచుకున్న తొక్కలు నిండవు
దీని భావమేమి శ్రీనివాస.

4) ఊరిలోని వాని కుండ నిల్లునులేదు
ఊపరులేని బొమ్మ కుండె నిల్లు
ఎంత ఘోరమోరి ఎవరికి జెప్పేది
చెప్పవేమి నీవు శ్రీనివాస.

గుత్తా శ్రీనివాసరావు.

అనుబంధం - 1

# గుత్తావారి ఆదర్శ కుటుంబం

గుత్తా చిననరసయ్య, లలితమ్మగార్ల సంతానం- చలమయ్య, రామానుజయ్య, వీరరాఘవయ్య, సుబ్రహ్మణ్యం, శ్రీ ని వా స రా వు, రాధాకృష్ణ, రాజరత్నమ్మ, సరస్వతి, సరోజిని. రాజకీయ (స్వాతంత్య్ర) పోరాటాలకు, సాంఘిక సంస్కరణలకు ముందడుగు వేసిన కుటుంబం.

వ్యష్టి సత్యాగ్రహం, ఉప్పు సత్యాగ్రహం, క్విట్ ఇండియా పోరాటాలలో జైళ్ళకువెళ్ళి ఆర్థిక, శారీరక బాధలకు గురికావలసి వచ్చింది ఈ కుటుంబం. చలమయ్య, రామానుజయ్య, వీరరాఘవయ్య, సుందరమ్మ (చలమయ్యగారి సతీమణి) అనేకసార్లు జైళ్ళకువెళ్లి శిక్షలననుభవించారు. సుబ్రహ్మణ్యం, శ్రీనివాసరావు, రాధాకృష్ణ ఆ పోరాటాలలో పాల్గొన్న కారణంగా అనేకసార్లు అరెస్టు చేయబడి సబ్‌జైళ్ళలో వుంచబడి మైనర్లు అనే కారణంగా విడుదల చేయబడుతూ వచ్చారు.

## సాంఘిక సంస్కరణలు

పురోహిత వర్గాన్ని యెదిరించి స్వసంఘ పౌరోహిత్యంతో ప్రారంభమైన సాంఘిక సంస్కరణల చరిత్ర. 1938 వ సంవత్సరంలో సోదరి సరస్వతి వివాహం స్వసంఘ పౌరోహిత్యంతో, హరిజన సోదరుల మేళ వాద్య కచేరీతో, సహపంక్తి భోజనాలతో జరిపించబడింది. 1944 వ సం॥లో సరోజిని (సోదరి)కి ముహూర్తం చూడకుండ, పౌరోహిత్యం లేకుండ, తాళి బొట్టు కట్టకుండ, వైదిక మత ఆచార సంప్రదాయాలకు స్వస్తిచెప్పి చేయబడిన సంస్కరణ వివాహం, యలమంచిలి వెంకటప్పయ్యగారి ఆధ్వర్యంలో జరిగింది.

1945 వ సం॥లో సుబ్రహ్మణ్యం- కులాలు కల్పితమని, అవి మానవత్వానికి మచ్చలాంటివని, వాటిని యెదిరించి చేసిన కులాంతర (బి. సి.) వివాహం, జగద్గురు బ్రహ్మనందగిరి స్వామీజీ ఆధ్వర్యంలో జరిగింది.

1949 వ సం॥లో శ్రీనివాసరావు- కులభేదాన్నే కాక భాషా భేదం కూడా పాటించక (తమిళనాడు) చేసుకున్న కులాంతర (ఎస్. సి.) వివాహం, ప్రముఖ ద్రవిడ కజగం నాయకుని ఆధ్వర్యంలో జరిగింది.

1950 వ సం॥లో రాధాకృష్ణ - కులాంతర (బి. సి.) సంస్కరణ వివాహం, మిక్కిలినేని రాధాకృష్ణగారి అధ్వర్యంలో జరిగింది.

## చలమయ్యగారి సంతానం

1941 వ సం॥లో స్వరాజ్యం - సంస్కరణ వివాహం, మాకినేని బసవ పున్నయ్యగారి అధ్వర్యంలో జరిగింది.

1952 వ సం॥లో భానుమతి - సంస్కరణ వివాహం, యలమంచిలి వెంకటప్పయ్యగారి అధ్వర్యంలో జరిగింది.

1960 వ సం॥ లో నరసింహారావు - సంస్కరణ వివాహం, జగద్గురు బ్రిహ్మానందగిరి స్వామీజీ అధ్వర్యంలో జరిగింది.

## రామానుజయ్యగారి సంతానం

1947 వ సం॥లో భారతి - ఆంధ్రరాష్ట్రంలోనే కాక మొత్తం భారత దేశంలోనే సంచలనం కలిగించిన చరిత్రాత్మకమైన వివాహం (యస్. సి). అవుల గోపాలకృష్ణమూర్తిగారి అధ్వర్యంలో గోపరాజు రామచంద్రరావు (గోరా) గారు చేయించారు.

1954 వ సం॥ లో సుశీల - సంస్కరణ వివాహం. పుచ్చలపల్లి సుందరయ్యగారి అధ్వర్యంలో జరిగింది.

1968 వ సం॥లో లలిత - సంస్కరణ వివాహం, డాక్టరు బి. వెంకట రావుగారి అధ్వర్యంలో కడియాల గోపాలరావుగారు చేయించారు.

1974 వ సం॥లో గ్రోమికో - సంస్కరణ వివాహం, ఎన్. అన్నయ్య గారి అధ్వర్యంలో జరిగింది.

## వీర రాఘవయ్యగారి సంతానం

1950 వ సం॥లో విజయలక్ష్మి - సంస్కరణ వివాహం, మద్రాసు మేయరు ఈతా సంబంధంగారి అధ్వర్యంలో జరిగింది.

1975 వ సం॥లో కరుణకుమారి - భాషాంతర, కులాంతర (బి. సి.) వివాహం, ఒక పత్రిముఖ డి. యమ్. కె. నాయకుని అధ్వర్యంలో జరిగింది,

1980 వ సం॥లో రాజరత్నం - సంస్కరణ వివాహం, కనక మేడల వేంకటేశ్వరరావుగారి అధ్వర్యంలో జరిగింది.

## సుబ్రహ్మణ్యంగారి సంతానం

1965 వ సం॥లో జగదీశ్ చంద్రబోస్ - సంస్కరణ వివాహం, యల మంచిలి వెంకటప్పయ్యగారి అధ్వర్యంలో జరిగింది.

1972 వ సం॥లో జ్యోత్స్న - కులాంతర వివాహం (యస్. సి.), ముఖ్యమంత్రి జలగం వెంగళరావుగారి అధ్వర్యంలో జరిగింది.

1978 వ సం॥లో నిర్మల - కులాంతర వివాహం (బి. సి.) గాంధి గారి ఆశ్రమం సేవాగ్రామ్ ఆశ్రమ కార్యదర్శి అధ్వర్యంలో జరిగింది.

1982 వ సం॥లో ఉదయకుమార్ - సంస్కరణ వివాహం, మోటూరి హనుమంతరావుగారి అధ్వర్యంలో జరిగింది.

1982 వ సం॥లో ఉషాకుమారి - కులాంతర వివాహం (బి. సి.) వార్ధా సేవాగ్రామ్ ప్రముఖ సంస్కరణవాది సాధూ చరణ్‌గారి అధ్వర్యంలో జరిగింది.

1982 వ సం॥లో క్రాంతికుమార్ - భాషాంతర, దేశాంతర (చైనా) వివాహం, నాగపూర్ ఆర్య సమాజ్ ప్రముఖుల అధ్వర్యంలో జరిగింది.

## శ్రీనివాసరావుగారి సంతానం

1970 వ సం॥లో కలం - భాషాంతర, కులాంతర (బి. సి.) వివాహం ఆరుద్రగారి అధ్వర్యంలో రామలక్ష్మిగారు చేయించారు.

1979 వ సం॥ లో హలం - కులమతాలేకాక, దేశభేదం (జాతీయ తత్వం) నవ్య మానవతకు తగదని జరిపించిన దేశాంతర (చైనా) వివాహం, రావిపూడి వెంకటాద్రిగారి అధ్వర్యంలో లవణంగారు (కూరగాయల దండలతో) జరిపించిన వివాహం.

1980 వ సం॥లో బలం - సంస్కరణ వివాహం, కొండవీటి వేంకట కవిగారి అధ్వర్యంలో వెనిగళ్ళ సుబ్బారావుగారు చేయించారు.

1981 వ సం॥లో సమరసం - సంస్కరణ వివాహం, మాలతీ చందూరుగారి అధ్వర్యంలో గుత్తా రాధాకృష్ణగారు జరిపించారు.

# రాధాకృష్ణగారి సంతానం

1971 వ సం॥లో సంఘమిత్ర - సాంఘికంగా సమాజంలో స్త్రీలకు జరిగిన అన్యాయాలను యెదిరించి పోరాడిన రాజారామ్ మోహనరాయ్, కందుకూరి వీరేశలింగం గార్ల ఆశయాల ననుసరించి జరిపించిన (వితంతు) వివాహం, ప్రఖ్యాత నవలా రచయిత సంస్కరణాభిలాషి కనకమేడల వెంకటేశ్వరరావుగారి ఆధ్వర్యంలో గుత్తా చలమయ్యగారు జరిపించారు.

1978 వ సం॥లో బుడిన్ని - సంస్కరణ వివాహం, కొసరాజు రాఘవయ్యగారి ఆధ్వర్యంలో కొండవీటి వేంకట కవిగారు జరిపించారు.

1982 వ సం॥లో లలిత - భాషాంతర, కులాంతర సంస్కరణ వివాహం, ప్రముఖ నాస్తికులు లెక్చరర్ నన్నన్‌గారి ఆధ్వర్యంలో మద్రాసు మాజీ మేయరు ఊరా సంబంధంగారు జరిపించారు.

ఈ కుటుంబంలో గుత్తా రాధాకృష్ణగారి కుమార్తె గీతాంజలి భాషాంతర, కులాంతర వివాహం 1984 ఫిబ్రవరి 26న ఆంధ్రప్రదేశ్ హేతువాద సంఘ అధ్యక్షులు ఎస్. వి. రావుగారి ఆధ్వర్యంలో హేతువాద సంఘ ప్రధాన కార్యదర్శి కత్తి పద్మారావుగారు జరిపించనున్నారు. ఆ సందర్భంగా ఈ ఆదర్శ కుటుంబాన్ని పరిచయం చేయటం మన కర్తవ్యంగా భావించాం.

దేశసమైక్యతకు, సమాజ ప్రగతికి సాంఘిక కట్టుబాట్లను యెదిరించి ఈ రకమైన సంస్కరణ వివాహాలు విరివిగా చేసుకోవటం అత్యంత అవసరమనే విషయాన్ని ఆంధ్రప్రదేశ్ హేతువాద సంఘం బలమైన ప్రచారం చేస్తూవున్నది. అందుచేత కుల, మత, భాషాభేదం పాటించని వివాహాలు చేసుకుని సాంఘికప్రగతిని సాధించాలని హేతువాద సంఘం కోరుతున్నది.

సిద్ధాంతం ఆచరణకు పట్టుగొమ్మ, ఆచరణ సిద్ధాంతానికి ఊపిరి. ఆచరణ రహితమైన శుష్క వాగ్దానాలతోకాక గుత్తా రాధాకృష్ణ (భౌతికహిత) గారు, వారి కుటుంబం ఆచరణాత్మకంగా ముందుకు పోతూ హేతువాద ఉద్యమానికి ప్రేరణగా ఆచరణాత్మక జీవితాదర్శం కలిగివున్నందుకు ఆనందంతో అభినందిస్తున్నాం. అది దృష్టిలో వుంచుకుని ఈ ఆదర్శ కుటుంబాన్ని పరిచయం చేయడమైనది.

-ఆంధ్రప్రదేశ్ హేతువాద సంఘం. (2-2-84)

## అనుబంధం - 2

# ఎమ్. ఎన్. రాయ్

ఇది ఎమ్. ఎన్. రాయ్ శత జయంతి సంవత్సరం. ఆ సందర్భంగా దేశవ్యాప్తంగా కార్యక్రమాలు ఏర్పాటు చేయబడినవి. ఈ కార్యక్రమాలు రెండు విధాలుగా విభజించి చూడవచ్చు. ఆ కార్యక్రమాలను నిర్వహించే వారు ఆయన భావాలకు వారసులుగా కొందరు, ఆయనకు వ్యక్తి ఆరాధకులు (భక్తులు)గా కొందరు ఆ కార్యక్రమాలను నిర్వహిస్తున్నారు. ఆయనకు భావ అనుయాయులైనవారు ఆయన భావాలకు ప్రచారం ఇస్తున్నారు. ఆయనకు భక్తులైనవారు ఆ కార్యక్రమాలను దైవ ఉత్సవాల స్థాయిలో జరుపుతున్నారు.

మార్క్స్ శత వర్థంతి (చనిపోయి నూరు సంవత్సరాలు) నాటికి మార్క్స్ సిద్ధాంతాలలో తప్పులు, దోషాలు వెదకిన రాయ్ అనుయాయులు రాయ్ శత జయంతి (పుట్టి నూరు సంవత్సరాలు) నాటికే రాయ్ సిద్ధాంతాలకు కాలదోషం పట్టించారు (ఆచరణ లేమి కారణంగా). ఆయన అనుయాయులు (రాడికల్ హ్యూమనిస్టులు) ఆయనను ఒక గొప్పవ్యక్తిగా చెప్పుకుని వ్యక్తి ఆరాధనకు దిగి ఆయన సిద్ధాంత వారసులు కాలేక పోయారు. అందుచేతనే రాయ్ శత జయంతి కార్యక్రమాలు దైవ ఉత్సవాల స్థాయికి దిగజార్చారు అంటున్నాను. సిద్ధాంతాన్ని అర్థం చేసుకుని ఆ సిద్ధాంతాన్ని ప్రచారం చేయాలనే తపనతో కృషి చేస్తున్నవారు లేక పోలేదు. కాని, వారు చాలా కొద్దిమంది మాత్రమే వున్నారు.

అటువంటివారు సభలు, చర్చలు ఏర్పాటుచేసి ప్రచారం చేస్తూ వున్నారు. వారిని అభినందించవలసిందే. మిగిలినవారు శత జయంతి కార్యక్రమాలను దైవ ఉత్సవాల స్థాయిలో జరుపుకుంటున్నారు. వారిని అభిశంసిస్తున్నాము. కారణం వారు సిద్ధాంత అనుయాయులు కారు. సిద్ధాంతాలకు కాలదోషం పట్టించగల శిష్యబృందం మాత్రమే. ఆ కారణంగా ఆయన సిద్ధాంతాలను హత్యచేసిన గౌరవం వారు దక్కించుకున్నారు.

చరిత్రలో తత్వవేత్తలను మానసికంగాను, శారీరకంగాను మరియు సిద్ధాంత పరంగాను హత్య చేసినవారు వారి శిష్యబృందమేననేది అందరెరిగిన సత్యమే. అదే రాయ్ విషయంలోను సత్యమైనది. సిద్ధాంతాలకు కాలదోషం పట్టేది అవి ఆచరించనప్పుడు, ఆ చ ర ణ కు పనికిరానప్పుడు మాత్రమే. అందుచేత సిద్ధాంతాలను అర్థం చేసుకున్న మేరకు ఆచరిస్తూ ఆచరణలో వచ్చిన అనుభవంతో వాటిని సవరించుకుంటూ ఆ సిద్ధాంతాలకు ఊపిరి పోయవలసి వుంటుంది. ఆ బాధ్యత అయా తత్వవేత్తల అనుయాయులపై వుంటుంది కనుక ఈ శత జయంతి సందర్భంగా ఆ విధమైన చైతన్యాన్ని కలిగించగల కార్యక్రమాలు తీసుకుంటారని ఆశిద్దాం. మనిషి ఆలోచించటమే చాలదు, పునరాలోచన(విచక్షణ) కూడా అవసరమే. అప్పుడే నిజమైన ఆలోచన అవుతుంది. అలా కానప్పుడు రాయ్ శత జయంతితోనే మరుగునపడి పోతాడు. ఆయన సిద్ధాంతాలకు మరపు తెర పడుతుంది.

రాయ్ గొప్ప తత్వవేత్త. ఆయన తాత్వికాంశాలను ప్రజలలోకి తీసుకుపోయి ప్రచారం చేయవలసిన బాధ్యత ఆయన అనుయాయులపై వున్నది. అందుకు కొంత ధనం కావాలి, మరికొంత శ్రమచేయాలి. అవి రెండు కరువై పోయినవి వారికి. అందుకు కారణం వారికి ధనం లేకపోవడంకాదు; ఉన్న ధనాన్ని అందుకు(ప్రచారానికి)ఖర్చు పెట్టాలనే మనఃపక్వత లేకపోవటమే అందుకు కారణం. శ్రమించి తద్వారా సిద్ధాంత ప్రచారం చేయలేని శారీరక బలహీనత, మానసిక అలసత్వం, అలక్ష్యం అందుకు కారణం. అందుచేత శారీరకంగా బలంవున్నా బలహీనులే. ధనంవున్నా దరిద్రులే. ధనానికి ప్రాధాన్యం లేదని చెప్పినవారే దానికి బానిసలైనారు. శ్రమకు విలువలేదని చెప్పినవారే దానికి దాసులైనారు. అందుచేత అవి రెండు వారికి కరువై రాయ్ భావాలు ప్రచారం చేయలేని దరిద్రులైనారు, నిస్పృహాయులైనారు.

సిద్ధాంతాలు యెంత గొప్పవైనా అవి ఆచరించనప్పుడు, ఆచరణకు పనికిరానప్పుడు అవి కాలదోషం పట్టి కాలగతిలో కలిసిపోతూ వుంటై. కాని, వారనేదేమంటే వర్తమాన కాలంలో ఆచరించటానికి ఉపకరించని సిద్ధాం

తాలు భవిష్యత్ కాలంలో ఉపయోగ పడగలవని. కాని, భవిష్యత్ కాలం వర్తమాన కాలంలోకి వచ్చేటప్పటికి ఆ సిద్ధాంతాలకు కాలదోషం పడుతుంది, వారే కాలదోషం పట్టిస్తారు. (ఎప్పటి కప్పుడు కొత్త సిద్ధాంతం చెప్పడమే మా పని. ఆచరించటం మా పని కాదని వారి అభిప్రాయం) అందుచేత వారి సిద్ధాంతంపై వారికే నమ్మకం లేదన్నమాట.

కమ్యూనిష్టు దేశాల్లో సామ్యవాద వ్యవస్థలో భద్రత వున్నది, స్వేచ్ఛలేదు. ప్రజాస్వామిక దేశాల్లో స్వేచ్ఛా వ్యవస్థలో స్వేచ్ఛ వున్నది, భద్రతలేదు. అందుచేత భద్రత, స్వేచ్ఛ వుండే వ్యవస్థ కావాలని ఆశించాడు రాయ్. ఆశయం మంచిదే, కాని దాని సాధనకు మార్గాలేమిటి? అందుకు రాయ్ చెప్పిన మార్గాలను ఎంతవరకు అనుసరించి కృషి చేస్తున్నారు ఆయన అనుయాయులమని చెప్పుకుంటున్న వారు? లేక కొత్త మార్గాలకోసం అన్వేషణ చేస్తున్నారా? అనేది అర్థం కావాలికదా.

కమ్యూనిజం (సమసమాజం) పై వ్యతిరేకతతో రాడికల్ హ్యూమనిష్టులైన వారే అధికులుగా వున్నారుగాని రాయ్ చెప్పినట్లు కమ్యూనిజం కంటే ఉత్తమమైన వ్యవస్థకోసం తపించి కృషిచేసే వ్యక్తులు లేరు. శైవులు, వైష్ణవులు వైషమ్యాలతో ఒకరినొకరు ద్వేషించుకుని దూషించుకున్నట్లే వీరుకూడా దూషణలకు దిగారేగాని ఒక పద్ధతిలో ఒక మంచికోసం సమన్వయ పూరిత ఆలోచన చేస్తున్నట్లు కనబడదు. సమన్వయ రహిత ద్వేషపూరిత వ్రాతలు, కూతలు పనికిరావు. అది మానసిక వికాసానికి నిదర్శనలకాదు, మానసిక వైకల్య ప్రదర్శనం అవుతుందేగాని.

రాయ్ చెప్పిన (నిర్వచించిన) 22 సూత్రాలలోని కొన్ని ముఖ్యమైన సూత్రాలను ఇక్కడ ఉదాహరిస్తున్నాను :

మెదడొక ఉత్పత్తి సాధనం. అది అత్యంత విప్లవాత్మకమైన సరుకుని (భావాలను) ఉత్పత్తి చేస్తుంది. (15 వ సూత్రం)

భౌతికావసరాలు ఇతోధికంగా తృప్తిపరచబడితేతప్ప సమాజంలోని వ్యక్తిగత సభ్యుల వైజ్ఞానిక, కళాత్మక మానవశక్తులు వికసించలేవు. ఇతో

ధికంగా పెరిగే జీవన ప్రమాణానికి హామీయిచ్చే ఆర్థిక పునర్నిర్మాణం రాడికల్ ప్రజాస్వామ్య రాజ్యానికి పునాది. ప్రజలను ఆర్థికంగా విముక్తుల్ని చేసినప్పుడే స్వేచ్ఛా లక్ష్యంవైపుకు పురోగమించగల్గుతాం (17వ సూత్రం). (ఎంత చక్కని నిర్వచనం ఇచ్చాడు రాయ్! కాని, దానిని యెంత చక్కగా నిరర్థక పరుస్తున్నారు వారి అనుయాయులు!)

నూతన స్వేచ్ఛా ప్రపంచాన్ని సృష్టించాలనే దృఢ సంకల్పంతో సంఘటితమైన స్వేచ్ఛా మానవుల సమిష్టి పోరాటాల (తత్వాల) ద్వారా రాడికల్ ప్రజాస్వామ్య ఆదర్శం సాధించబడుతుంది. (19 వ సూత్రం). (సమిష్టి అంటేనే విముఖత చూపుతారెందుకో మరి!)

రాడికల్ వాదం శాస్త్రాన్ని సమాజ నిర్మాణానికి చొప్పిస్తుంది. వ్యక్తిత్వాన్ని సమిష్టి జీవితంతో సమన్వయం చేస్తుంది. స్వేచ్ఛకు నైతిక, వైజ్ఞానిక విలువనిస్తుంది. (21 వ సూత్రం).

"మానవుడే అన్నిటికి ప్రమాణం" (ప్రోటోగరస్). "మానవుడే మానవజాతికి మూలం" (మార్క్స్) మానసిక విముక్తి పొందిన నైతిక మానవుల కామన్‌వెల్తుగా సౌభ్రాతృత్వ వ్యవస్థగా సమాజాన్ని పునర్నిర్మించాలని కోరుతుంది (22 వ సూత్రం). (అంటే సమిష్టి సూత్రాన్ని అంగీకరించినట్లే).

ఈ సూత్రాలను మనస్ఫూర్తిగా గుర్తించిన వారెందరున్నారు? గుర్తించిన ఆ సూత్రాల ఆశయం కోసం నిజాయితీగా కృషిచేసే వారెందరున్నారు? ఆంధ్రదేశంలో రాడికల్ హ్యూమనిష్టులు పరిమితంగానే వున్నారు, అట్టివారిలో పైన చెప్పిన స్థాయితో తాత్విక పరిజ్ఞానం యెంత మందికి వున్నది? నిజాయితీగా ఆశయంకోసం కృషి చేసేవారు వ్రేళ్ళపై లెక్కించ దగినవారు మాత్రమే వున్నారు. వారే నిజమైన రాయ్ అనుయాయులు. మిగిలిన వారందరు రాయ్‌కి శిష్యులే. ఈ శిష్యులు గురువుకి నామాలు పెట్టదగిన సమర్థులు, స్వార్థులు. అటువంటి వారివల్లనే రాయ్ సిద్ధాంతాలు హత్య చేయబడుతూవున్నై. ఆచరణ శూన్యులైన ఆ శిష్య బృందం సిద్ధాంతాలకు కాలదోషం పట్టించి వినోదిస్తూ వుంటారు. వ్యక్తి ఆరాధనతో తృప్తిపడుతూ వుంటారు. ఇది చరిత్ర సత్యం. కాదంటే పై సూత్రాలను అనుసరించటానికి ఎందరు ముందుకు వస్తారనేది ప్రశ్న.

ప్రపంచ మానవులంతా ఒక్కటని, ఆ మానవులంతా ఒకే కుటుంబంగా జీవించాలని అనుకుంటున్న కాలంలోకి మనంవచ్చాం. అందుకు కావలసిన తాత్విక సూత్రాలను శాస్త్రీయంగా రాబట్టాం. అందు కనుగుణమైన వ్యవస్థా నిర్మాణంకోసం ఆలోచిస్తున్నాం. అటువంటి తరుణంలో సమిష్టి ఆర్థిక విధానం తప్పని, సహకార ఆర్థిక విధానం సరైనదని ఆలోచించాడు రాయ్. ఆలోచించే స్వేచ్ఛ ఆయనకు వున్నదిగనుక అలా ఆలోచించాడు. ఆలోచించిన ఆ విషయం ఆచరించటం అనేసరికి అది సామాజికంగా మళ్ళీ సమిష్టిదే అవుతుంది. వ్యష్టిగా ఆలోచించటానికే వ్యక్తికి వీలున్నదికాని వ్యక్తిగా ఏ ఒక్క వ్యక్తి ఆచరించటానికి వీలులేదు. అందుచేత వ్యష్టితత్వం అలవరచుకున్న రాయ్ శిష్యబృందం దానికి వ్యష్టిగా ఆలోచించి సమిష్టిగా ఆచరించటమనేది మింగుడు పడని ముద్దగా మిగిలింది. వారు ఆచరణ శూన్యులు కావటానికి అదొక కారణం. అందుకే ఆలోచనకు పునరాలోచన కావాలంటున్నాను. అప్పుడే ఆలోచనలకు ఆచరణకు సమన్వయంకుదురుతుంది. లేకపోతే ఆలోచనలకు అర్థముండదు.

ఎమ్. ఎన్. రాయ్ సత్యాన్వేషి, స్వేచ్ఛా పిపాసి, తాత్విక పరిశీలనాశీలి. తన జిజ్ఞాసతో వ్యక్తిత్వాన్ని సంతరించుకున్న వ్యక్తి. ఈ లక్షణాలు ఎవరిలో వుంటవో ఆయన భౌతిక తత్వవేత్త కాగలడు. అటువంటి భౌతిక తత్వవేత్తగా గుర్తించదగిన వ్యక్తి రాయ్.

ఈనా తాత్విక పరిశీలనా పుస్తకం రాయ్ శత జయంతి (1987 వ సంవత్సరం) సందర్భంలో మీ ముందుంచటం నాకు కొంత సంతృప్తినిచ్చింది. భౌతిక తత్వవేత్తగా ఆయన యెడల నాకున్న గౌరవ కారణంగానే ఈ నాలుగు మాటలు వ్రాయటానికి ప్రేరణ కలిగింది. ఈ శత జయంతి సందర్భంగా వారికి ఇది నా చిరు కానుక.

మనిషి ఆలోచించటం యెంత అవసరమో ఆలోచనద్వారా వచ్చిన భావాలను తాను ఇతరులకు వ్యక్తపరచటమూ అంత అవసరమే. మనిషికి తెలియక పోవటం ఎంత తప్పో, తనకు తెలిసిన విషయాన్ని ఇతరులకు (తెలియని వారికి) తెలియ చెప్పక పోవటం అంతకంటే తప్పు. అలా తాను తెలుసుకున్న భావాల కనుగుణంగా నడుచుకోవటం అంతకన్నా

అవసరమే. ఈ వాస్తవాన్ని గుర్తించి ఈ శత జయంతి సందర్భంగా అలాంటి ఆలోచనలకు కార్యరూపం ఇవ్వగలరని ఆశిద్దాం.

యూరోపు దేశాల్లో రినైజాన్సు ఉద్యమం (భావవికాసోద్యమం) కాఫీ క్లబ్బుల్లో ప్రారంభమైనదని చెప్పుకుంటున్నాం. మరి మనం ఇక్కడ అట్టి భావవికాసోద్యమానికి ఏ విధమైన క్లబ్బులమీద ఆధారపడుతున్నాం? ఏ విధమైన క్లబ్బులు ప్రారంభించాం? ఉన్న క్లబ్బులే (పేకాట కేంద్రాలే) చాలుననుకుని వాటివెంట తిరుగుతున్నామా? అదేనా మన రినైజాన్సు ఉద్యమం? అక్కడ మనకు భావ వికాసం కలగదు, భావ వికారం మాత్రమే కలుగుతుంది, జరుగుతున్నదదే కదా.

వ్యష్టితత్వంలో అనైక్యతా భావం చోటు చేసుకుంటుంది. సహకార సద్భావాలకు చోటుండదు. అందువల్ల సమాజంలో సుఖ, శాంతులుండవు. సమిష్టితత్వంలో సమైక్యతా భావం వుంటుంది. ఆ కారణంగా సహకార సద్భావాలుంటై. తద్వారా సమాజంలో సుఖ, శాంతులుంటై. ఇది మన తాత్విక పరిశీలనా పర్యవసానానుభవం.

సమిష్టి అనే దానికి ఏవో అర్థాలు కల్పించుకుని దానికి దూరంగా వుంటూ దానికి భయపడుతూ వ్యష్టితత్వంతో జీవించాలనుకోవడం సన్యాసాశ్రమం ఆశ్రయించటం లాంటిదే. ఈనాటి మన కుటుంబ వ్యవస్థ సమిష్టి కాదా? దానిని కాదని కుటుంబ సభ్యులంతా వ్యష్టితత్వాన్ని అలవరచుకుంటే జరిగేది అరాచకమే. అటువంటి అరాచకపు వ్యవస్థను కాదుకదా మనం కోరుకునేది? వ్యష్టి తత్వం అలవరచుకుంటే నైతిక విలువలుండవు.

సమిష్టి స్వేచ్ఛలోనే వ్యక్తిస్వేచ్ఛ వుండాలికాని సమిష్టిని కాదనే వ్యక్తిస్వేచ్ఛ స్వేచ్ఛ అనబడదు. యథేచ్ఛగా వ్యవహరించటం అవుతుంది. స్వైరంతో సంచరించటంగా మారిపోయి మనం మళ్ళీ పశు పక్ష్యాదుల స్థాయికి దిగజారి పోతాం. అటువంటి ఆలోచనలు ఆదిమ మానవులు చేశారు. కాని నవ్యమానవులు చేయకూడదు అందుచేత ఎమ్. ఎన్. రాయ్ చెప్పిన నవ్యమానవ వాదంలో ఏ ముందో మరొకసారి మనం ఆలోచించుకోవాలి. అందుకే ఆలోచన, పునరాలోచన అవసరమంటున్నాను. అదే ఎమ్. ఎన్. రాయ్ శత జయంతి సందర్భంగా మనం చేయతగిన చేయవలసిన పని.